# నారాయణరెడ్డి సాహితీమూర్తి

రచన

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య



ప్రచురణ




రిజిష్టర్డ్ నెం 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

NARAYANAREDDY SAHITHEEMURTHY
A Study of the literary personality of Dr. C. Narayana Reddy
By Dr. TIRUMALA SRINIVASACHARYA



యువభారతి

ప్రచురణ : 80

ప్రథమ ముద్రణ : 13 డిసెంబరు 1981

ప్రతులు : 1,200

ముఖపత్ర రచన : శీలావీర్రాజు

అక్షరాలంకరణ : సుధామ

ముద్రణ : 'అవేర్' ప్రింటింగ్ ప్రెస్
2-2-1167/8/9, తిలక్‌నగర్,
హైదరాబాదు–500 044.

ముఖచిత్రముద్రణ : నందిని ఆర్ట్ ప్రింటర్స్
నారాయణగూడ, హైదరాబాదు



ప్రతులకు

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు–500 003

లేదా

యువభారతి కార్యాలయము

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాదు–500 001

వెల : రూ॥ 30/-

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
ఆర్థిక సహాయముతో ప్రచురితము




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదిహేడేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 79 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 7100 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 725 మంది, భారతీ భూషణులుగా 70 మంది చేరినారు.

ఉదాత్తభక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచినారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు
డిసెంబరు, 1981

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి

# మామాట

స్వాతంత్ర్య సముపార్జనానంతరం తెలుగు సాహిత్యంలో విశిష్ట కవితా స్రష్టలుగా, ప్రయోగశీలురుగా, సాహిత్యోద్యమ నిర్వాహకులుగా, పరిశోధకులుగా ప్రసిద్ధికెక్కిన వారిలో ఆచార్య నారాయణరెడ్డిగారు ఒకరు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో మాత్రాచ్ఛందస్సుల్లో సమగ్ర కావ్య రచనా నిర్మాణాన్ని చేపట్టి కృతకృత్యులైనారు శ్రీరెడ్డిగారు. శ్రవణ సుభగమైన శబ్దప్రయోగానికీ, రమణీయమూ, గంభీరమూ అయిన అర్థ స్ఫూర్తికి కాణాచి కాగలిగిన కవితా రచన చేసినవారు వెయ్యేళ్ల తెలుగు కవితలోనే అరుదు. శ్రీరెడ్డిగారు కావ్యరచనతోపాటు సహృదయవిమర్శనా పద్ధతిని అలవరచుకోవడంచేత ఆయన రచనల్లో సంయమం, స్పష్టత చోటు చేసుకున్నవి. ఖండకావ్యసంకలనాలు, సమగ్రకావ్యాలు, గేయనాటికలు, గద్యనాటికలు, సాహిత్యవ్యాసాలు, యాత్రా చరిత్రలు, పరిశోధనాత్మకమైన వ్యాసాలు, నిబద్ధ అనిబద్ధ గేయవిన్యాసాలు, చిత్రసాహితి ఇలా ఎన్నో ప్రక్రియలను తమ ప్రతిభాస్పర్శతో గుబాళింపచేసిన శ్రీరెడ్డిగారి ముప్పదేండ్ల సాహిత్య సృష్టిని సమీక్షించి ఆయన సాహితీమూర్తిని సందర్శించడానికి మిత్రులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారు 'నారాయణరెడ్డి సాహితీమూర్తి' అనే బృహత్ గ్రంథాన్ని రచించినారు. ఆచార్యులుగారు ఇంతవరకు ఉదయ రాగం, జీవనస్వరాలు, కిరణాలు-కెరటాలు అనే గేయకవితా సంకలనాలను ప్రచురించినారు. అసంఖ్యాకంగా సాహిత్యవ్యాసాలను పత్రికలలో ప్రకటించినారు. విశేషించి తెలుగులోని గేయనాటికలపై పరిశోధనచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి పిహెచ్. డి. పట్టాను సంపాదించుకున్నారు. హైదరాబాదు నగరంలోని సర్దార్ పటేల్ కళాశాలలో ప్రధానాంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. మా యువభారతికి ఉపాధ్యక్షులు. ఆచార్య నారాయణరెడ్డిగారికీ, నాకు అతి సన్నిహితులు. వీరిది కరీంనగరం జిల్లా సిరిసిల్ల తాలూకాలోని నారాయణపురం గ్రామం. యువభారతి ప్రచురిస్తున్న 'నందిని' త్రైమాసిక సాహిత్య సంచికకు సహ సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు.

"నారాయణరెడ్డి సాహితీమూర్తి" నారాయణరెడ్డి సాహిత్యాన్ని, వ్యక్తిత్వాన్ని పరిచయం చేస్తున్న గ్రంథం. రచనాప్రణాళికలో విస్తృతి ఉంది.

వైవిధ్యం ఉంది. విమర్శగ్రంథమే అయినా రమణీయ వాక్యవిన్యాసం, నూత్నపదబంధప్రయోగం ఈ రచనకు వచనకావ్యగౌరవాన్ని సంతరించి పెట్టగలిగిందంటే సాహసం అనిపించుకోదు. ఆచార్యగారు వాక్యాల్లోనూ ఒక తూగును, ఒక వింత సోయగాన్ని చాలా సందర్భాలలో శ్రవణపేయ మైన శబ్దాలంకారాలను ప్రయోగించినారు. పుస్తకంలోని ప్రకరణాలన్నింటిని సాధ్యమైనంతవరకు హేతుబద్ధమైన రీతిలో వింగడించి నామకరణం చేసినారు. ప్రచురితమైన ప్రతిరచననూ వ్యయప్రయాసలనోర్చి సమకూర్చుకొని వాటిలోని అందాలనూ విషయవిన్యాసాన్నీ పఠితలకు అందజేసినారు.

ఈ సమీక్షాత్మకమైన పుస్తకం చదివిన పాఠకులకు నారాయణరెడ్డి సాహిత్య లక్షణాలను గూర్చి నిర్దుష్టమైన అభిప్రాయాలు లభిస్తాయి. శ్రీరెడ్డి గారి సాహిత్యాన్ని అంచనా కట్టవలసివస్తే ఏ పద్ధతిని అవలంబించాలో ఈ పుస్తకం భంగ్యంతరంగా సూచిస్తున్నది. ఇతివృత్త సంవరణంలో, శబ్దాలం కారప్రయోగంలో, వ్యంగ్యస్ఫూర్తిలో శ్రీ రెడ్డిగారు సాధించిన సిద్ధులను ఈ పుస్తకం పరిచయం చేస్తున్నది. శబ్దార్థరహస్యాలను తెలుసుకున్న కవి శ్రవణ తర్పణగుణాన్ని కూడా వ్యంగ్యార్థప్రాంగణంలో నృత్యంచేయించ గలడన్న యాథార్థ్యాన్ని ఆచార్యులుగారు నిరూపించినారు. నిజానికి ఈ పుస్తకరచనకు ఉద్దేశ్యం కూడా ఇదే.

ఒక సుకవి రచనలనుగూర్చి పరిశీలనాత్మక గ్రంథాన్ని ప్రచురించ గలుగుతున్నందుకు మా కెంతో సంతోషంగా ఉన్నది. మా సంస్థ సభ్యులు డా. తిరుమల శ్రీనివాసాచార్యగారు ఈ పనికి పూనుకోవడం మరింత హర్షా నికి కారణమౌతున్నది. ఈ గ్రంథాన్ని ప్రచురించుకొనే అవకాశాన్ని కలిగించిన డా. తిరుమల శ్రీనివాసాచార్య గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఆయన సాహితీవ్యవసాయం ఇతోధికంగా వికాసాన్ని పొందుతూ ఉండాలని ఆకాంక్షిస్తున్నాను.

హైదరాబాదు — ఇరివెంటి కృష్ణమూర్తి
డిసెంబరు, 1981. — అధ్యక్షుడు.

# ధన్యవాదం

నారాయణరెడ్డి మహాకవి. అగ్రశ్రేణికి చెందిన సాహిత్యాచార్యుడు. కవిత్వంలోనూ జీవితంలోనూ మానవతనూ చైతన్యాన్నీ రసహృదయాన్నీ పండించుకున్న సాహితీమూర్తి. అనుక్షణం ఔచిత్యానికి ప్రాణంపోసే సమయస్ఫూర్తి. ఆధునికాంధ్ర సాహిత్యలోకంలో విభిన్నాంశాలకు సమన్వయం సాధించే సహృదయవిమర్శకుడు. శ్రావ్యగళంతో మన చెవులనూ ఉదాత్తభావాలతో మనలోని కవులనూ ఏకకాలంలో ఉయ్యాలలూపుతూనే ఉద్దీప్తం చేసే శబ్దరసధ్వనిమర్మజ్ఞుడు. ఇన్ని అభిజ్ఞతలు ఒక్క వ్యక్తిలో పుంజీభవించడం లోకంలో అసాధారణమే. అనన్యప్రతిభకు ఉదాహరణమే.

శ్రీ నారాయణరెడ్డిగారూ నేనూ ఒకే జిల్లావాళ్ళం. అది కరీంనగరం జిల్లా. ఒకే తాలూకా వాళ్ళం. అది సిరిసిల్ల తాలూకా. ఆయన పేరులో నారాయణ అని ఉంటే నా ఊరే నారాయణపురం. ఏమైనా నారాయణరెడ్డి గారితో నాకు ప్రత్యక్షంగా పరిచయం కలిగింది 1970లోనే. నా చిన్ననాడు —అంటే పాతికేళ్ళ క్రితం ఒకసారి సిరిసిల్లలో ఆతని కావ్యగానం విన్నాను మాధ్యమికపాఠశాలా విద్యార్థిగా. తరువాత మరచిపోయినాను బాల్యక్రీడగా. అనంతరం నా ఉన్నతపాఠశాలా విద్యాభ్యసనం మెదక్ జిల్లాలో జరిగింది. ఆ తరువాత ప్రవేశించినాను అధ్యాపకవృత్తిలో. అప్పుడప్పుడాతని చలనచిత్ర గీతికాపరిమళపవనాలు నాలో నిద్రించే రసమూర్తిని లేపేవి. అలా కొంత కాలం ప్రవహించింది. 1966లో కరీంనగరం ప్రభుత్వసాయంకళాశాలలో అధ్యాపకునిగా ఉన్న రోజుల్లో అధ్యయనం ఆరంభమైంది. నారాయణరెడ్డి సృజించిన కావ్యాలను దొరికినంతమేరకు కొని చదువడమారంభించినాను. అలా 1970 వరకు సాగించినాను. 1970లో నారాయణరెడ్డిగారు నా 'ఉదయ రాగము' కావ్యానికి 'ఉన్మీలనం' రూపంలో తమ శుభాకాంక్షలను అందజేసే సమయంలో వారితో నాకు ప్రత్యక్షపరిచయం ఏర్పడింది. అలా అంకురించిన ఆ పరిచయం 1970లో నేను హైద్రాబాదుకు చేరిన తరువాత క్రమంగా పల్లవించి కుట్మలించి కుసుమించింది. వారి సాహిత్యం పట్ల నాకున్న ఆదరాభిమానం వల్ల ప్రగాఢప్రణయం వల్ల ఆతని కావ్యసౌందర్యదర్శనాన్ని

సహృదయులకు అందించే ఆసక్తి వల్ల వారి కావ్యాలను సమగ్రంగా అనుశీలిస్తూ సమీక్షలు వ్రాసి చూపినాను 1973లో శ్రీ రెడ్డిగారికి. "అబ్బో చాలా ఉందే" అన్నారు. ఆ తరువాత నేను పిహెచ్.డి పట్టం కోసం పరిశోధన ప్రారంభించినాను వారి ఆశీస్సుతో. దానితో వారి కావ్యసమీక్షారచనావ్యాసంగం ఆగిపోయింది. కానీ వారు వ్రాస్తూనే పోయినారు అనేకంగా. 1978 లో వారి పర్యవేక్షణలోనే పిహెచ్.డి డిగ్రీ సాధించినాను. ఆమధ్య 1975 లో నారాయణరెడ్డిగారి ఒక కావ్యావిష్కరణసభలో సహృదయవిమర్శకులూ భాషాబంధువులూ శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ప్రసంగిస్తూ నారాయణరెడ్డి గారి పాతికేళ్ళ సాహిత్యజీవితాన్ని సమగ్రంగా అనుశీలించే ఒక గ్రంథం వెలువడితే బాగుంటుందని తమ హృదయాన్ని ఆవిష్కరించినారు. వారి మాటలు నన్ను మరింత ప్రోత్సహించినాయి. అందుకు వారికి నా హృదయాంజలి. అప్పుడు చూచుకున్నాను నా రచన ఎక్కడాగిందో. మళ్లీ కలమందుకొని 1979 వరకు శ్రీ రెడ్డిగారు సృజించిన అన్ని కృతులను గూర్చి వ్రాసినాను. ఇక వ్రాతప్రతిని ముద్రణకు ఇద్దామనుకున్న సందర్భంలో వారి 'విశ్వంభర', 'సమీక్షణం', 'పాశ్చాత్యదేశాల్లో 50 రోజులు' ప్రత్యక్షమైనాయి. మళ్లీ వాటిని సమీక్షించి వ్రాసినాను. ఇలా ఇప్పటికి అంటె నవంబరు 1981 నాటికి నేను వ్రాయవలసిన వారి గ్రంథ సమీక్షలన్నీ పూర్తి అయినవని అనుకున్న శుభసమయంలో ముద్రణను ఆరంభించి పూర్తిచేసి సహృదయుల ముందుంచుతున్నాను. ఇలా ఈ గ్రంథం కొన్ని యేళ్ళ తపఃఫలితం. ఇక దీని సార్థకత మీ సహృదయతకు కలిగించే సంతృప్తిని బట్టి ఉంటుంది.

ఈ గ్రంథరచనా సందర్భాలలో తమ కావ్యాలెన్నో నా కందించి, నేనడిగిన అనేక ప్రశ్నలకు సమాధానాలిచ్చి ఆత్మీయంగా ఆప్తంగా పలకరించి నన్ను ప్రోత్సహించిన ఆచార్య డా॥ సి. నారాయణరెడ్డి గారికి నా హార్దికధన్యవాదాలు.

ఈ గ్రంథ ప్రచురణకై ఆర్థికంగా సహాయం చేసి నన్ను వెన్నుదట్టిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నా అభ్యర్థనను మన్నించి ఈ గ్రంథాన్ని ఓపికతో సందర్శించి 'తిరుమలశ్రీనారాయణీయం' రూపంగా ఉపనిషత్ప్రాక్తంగా తమ ఆశీర

మృతాన్ని ప్రసాదించిన ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి కళాప్రపూర్ణ డా॥ దాశరథి గారికి నా నమస్సుమాంజలులు.

అర్ధరాత్రి వెళ్లినా ఆప్యాయంగా పలకరిస్తూ భాషాసాహిత్యసాధకుల బాధలను తొలగించే సహృదయ శిరోమణులు అగ్రస్థాయి విద్వద్విమర్శకులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు. విశేషించి మా 'యువభారతి' ప్రధాన సంపాదకులు వారు. నా ప్రార్థనను ఆలకించి ఎంతో శ్రమకోర్చి వారు 'నారాయణరెడ్డి సాహితీమూర్తి'కి సురభిళసువర్ణపీఠికను సమకూర్చినారు. అందుకు వారికి నా హార్దికాభివందనాలు.

నారాయణరెడ్డి కలంలో ప్రాణం పోసుకున్న ప్రతికవితకు ప్రథమ శ్రోతలు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. నా రచనలకు కూడా వారు శ్రోతలే. అంతేకాదు. నా కలం దారితప్పినప్పుడల్లా జాగ్రత్తగా సవరించే ఆత్మీయులు వారు. మహాకవిగా నారాయణరెడ్డి హృదయాన్నీ అధ్యయనశీలిగా నా హృదయాన్నీ ఎరిగిన సహృదయ మిత్రులువారు. అక్షరస్నేహ చిహ్నంగా ఈ గ్రంథం వారికి అంకితం. అందుకు సమ్మతించినందుకు వారికి నా మనోంజలి.

ఈ బృహద్గ్రంథాన్ని సంస్థప్రచురణగా వెలువరించటానికి సూత్రప్రాయంగా మైత్రీమధురంగా అంగీకరించిన 'యువభారతి' సంస్థకు కృతజ్ఞుణ్ని. గ్రంథముద్రణవ్యవహారంలో విశేషంగా సహకారం అందించిన మిత్రులు కోశాధికారి శ్రీ వంగపల్లి విశ్వనాథం గారికీ, ప్రచురణ కార్యాన్ని దక్షతతో పర్యవేక్షించిన కార్యదర్శి శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారికీ నా హార్దికధన్యవాదాలు.

ఈ గ్రంథానికి ముఖపత్ర రూపాన్ని ఎంతో అందంగా నిర్మించిన సహృదయ కళామూర్తి కవిమిత్రులూ శ్రీ శీలా వీర్రాజుగారికి నా హార్దిక కృతజ్ఞతలు.

గ్రంథంలోని ప్రక్రియా-పుస్తక శీర్షికలకై తమ కుంచెతో అందమైన అక్షరాలను అలంకరించి పెక్కు సందర్భాలలో ఎదురైన చిక్కుల్ని తొలగించి సుధామధురహృదయంతో తమ కళానైపుణ్యాన్ని అందించి ఆదుకున్న ఆప్తులు శ్రీ 'సుధామ' గారికి నా స్నేహార్ద్ర కృతజ్ఞతలు.

రేయింబవళ్లు ముద్రణాలయంలో ప్రూఫులతో పోటీపడి మనోజ్ఞంగా పుస్తకం వెలువడడంలో మనసా సహకరించినవారు సహృదయ కవి మిత్రులు శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు, శ్రీ కుమారస్వామినాయుడు గారలు. వీరుభయులకూ హార్దికధన్యవాదాలు.

ఇంకా పరోక్షంగా నాకు సహకరించిన యువభారతి సభ్యులందరికీ నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ నిర్మాణసందర్భంలో పుస్తకసేకరణలో తమ అమోఘ స్నేహంతో సాయం చేసినవారు సహృదయ కవి మిత్రులు శ్రీ ఎం. కె. రాము గారు. వారికి నా ధన్యవాదాలు.

ఈ రచనలో నాకు ఎదురైన ఎన్నో సమస్యలను అమృతహృదయంతో పరిష్కరించి నన్ను ఆశీర్వదించిన మా అన్నగారు శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యుల వారికి సభక్తి ప్రణామాలు.

వెండి కాగితాన్ని సకాలంలో అందించి సహకరించిన హిందుస్తాన్ పేపర్ కార్పొరేషన్ వారికి, ప్రత్యేకించి శ్రీ లతీఫ్‌ఖాన్, శ్రీ వి. ఆర్. కులకర్ణి గారలకు నా వందనాలు.

ఈ గ్రంథాన్ని ఇంత అందంగా శుభ్రంగా సకాలంలో ముద్రించి అందించిన వారు AWARE PRINTING PRESS నిర్వాహకులూ సహృదయులూ శ్రీ వాసిలి వసంత్ కుమార్, శ్రీ దీవి జగదీశ్‌కృష్ణ గారలు. వారి సహకారానికి నా ధన్యవాదాలు.

బ్లాకులను అందంగా తయారుచేసి అందించిన మోహన్ ప్రాసెస్ వారికి, ముఖచిత్రాన్ని ముద్దుగా ముద్రించి యిచ్చిన నందిని ఆర్ట్ ప్రింటర్స్ అధినేతలు శ్రీ నారాయణగారికి నా కృతజ్ఞతలు.

విధేయుడు

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**

# తిరుమల శ్రీనారాయణీయం

## డా॥ దాశరథి

ఒక కవి కవిత్వం ఎట్లావుందో చెప్పాలన్నా కవితాధోరణిలోనే చెప్ప వలసి వుంటుంది.

కవిత్వం అంటే ఏమిటో చెప్పాలన్నా కవితారీతిలోనే చెప్పాలి.

కవి అంటే యెవరు ? అన్నదానికి సమాధానం చెప్పాలన్నా కవితా రీతియే శరణ్యం.

ఆకాశంలోని చంద్రుడు అలా అలా ఎక్కిపోతున్నట్లుంటుంది కవి త్వం– అన్నారొకాయన. కాదనగలమా ?

నారాయణరెడ్డి కవిత్వాన్ని గురించి చెప్పండి ? అని ఎవరైనా నిలదీసి అడిగారనుకోండి. తడుముకోకుండా నేను చెప్పగలిగి ఉండాలి.

పాలసంద్రం పొంగి నింగినంటినట్లు
పండువెన్నెల నింగినిదిగి నేలవాలినట్లు

ఇలా కొన్ని ఉపమానాలు ఆధారంగా అతని కవితాస్వరూపాన్ని గురించి చెప్పగలను.

కవిని కవే అర్థం చేసుకోగలడు అనే సూక్తి వుంది. "కవిరేవ విజానాతి...." అది సత్యం.

అందుకే డా॥ తిరుమల శ్రీనివాసాచార్య స్వయంగా కవి గనుక నారాయణరెడ్డి సాహితీమూర్తిని తాను సాక్షాత్కరింపజేసుకుని మనకు సాక్షాత్కరింపజేశాడు.

కాళిదాసుకు మల్లినాథుని వంటివాడు కాదు తిరుమల శ్రీనివాసాచార్య. పౌండు[1]కు ఇలియట్[2] వంటివాడు.

---

1. EZRA POUND
2. T. S. ELIOT

కాళిదాసు కవితనే మల్లినాథుడు ఎరుగును. కాళిదాసు వ్యక్తిత్వం మల్లినాథుడికి తెలియదు. నారాయణరెడ్డితో డా॥తిరుమల శ్రీనివాసాచార్యకు అతి సన్నిహిత వ్యక్తిగత పరిచితి వుంది. ఇదో ప్రత్యేకత. అందుకే సమకాలీను లైన కవులు, తమకు తెలిసిన కవులను గురించి వ్రాయడంలో ఒక ప్రత్యే కత కనపడుతుంది. అట్లా అని సమకాలీనులే కవులను గురించి విధిగా వ్రాయనక్కరలేదు. ఇదొక సదవకాశం అని మాత్రమే నేను భావి స్తున్నాను.

నారాయణరెడ్డి శృంగార, కరుణ రసాల పోహళింపుతో తన కవితా రచన ప్రారంభించాడు. వీటికి మాధ్యమంగా మాత్రాఛందస్సు అతనికి అద్భు తంగా తోడ్పడింది. గేయరచన వందల ఏండ్లుగా తెలుగు దేశంలో ఉన్నా, గేయప్రబంధాలు వ్రాసినవాడు నారాయణరెడ్డి ఒక్కడే అని చెప్పవచ్చు. కర్పూరవసంతరాయలు, నాగార్జున సాగరం, విశ్వనాథనాయడు వంటి కథా కావ్యాలతో నారాయణరెడ్డి గేయానికి ఇదివరకులేని విశిష్ఠపీఠం వేశాడు

వీరరసావేశం విశ్వనాథనాయడులో సాక్షాత్కరించినా వచన కవితా ప్రక్రియను చేపట్టి, మానవతావాదప్రబోధానికి నారాయణరెడ్డి పూనుకోగానే, శాంతరసం అతన్ని ఆవేశించింది. ఇది అతని పతాక. తిరుమల శ్రీనివాసా చార్య అన్నట్లు "ఇజాల బుజాలు అతడు ఎన్నడూ తడుముకోలేదు."

"నవ్వని పువ్వు" నుంచి "విశ్వంభర" దాకా 1949 నుంచి నేటిదాకా అతనిలోని క్రమపరిణామాన్ని దగ్గరగా చూస్తున్న వాణ్ణి నేను. కనుక తిరుమల శ్రీనివాసాచార్య ప్రయత్నంలోని వైశిష్ట్యాన్ని మరింతగా అర్థం చేసుకోగలిగాను.

తన ప్రతి మాటను పాటగా భాసింపచేశాడు నారాయణరెడ్డి. అదీ అతని ప్రతిభ.

"రాస్తూ రాస్తూ పోతాను సి
రా ఇంకే వరకు
పోతూ పోతూ రాస్తాను వ
పువు వాడే వరకు"

అన్నాడు నారాయణరెడ్డి తన "ఇంటిపేరు చైతన్యం"లో. వపువు వాడు తుంది, పువువాడుతుంది. పువు వాడేవరకు పరిమళించాలి. కవి వపువు వాడే వరకు రచించాలి. అది చేస్తున్నాడు నారాయణరెడ్డి.

అతనిది సుందర, సుకుమారమైన హృదయం. బాలమలయానిలవీచి కలకు సైతం పలికే విపంచి అతని హృదయం. కనుక గతం, వర్త మానం, భవితవ్యం సైతం అతన్నికదలించాయి. ఆ కదలికే పుంఖాను పుంఖంగా వెలువడిన అతని రచనలకు ఆధారం.

"నారాయణరెడ్డి మనస్సు సదా సదాలోచనామయం" అన్నారు తిరుమల శ్రీనివాసచార్య. అది యథార్థం. అంతర్ముఖత్వం, బహిర్ముఖత్వం–రెండూ నారాయణరెడ్డిలో వున్నాయి.

"సగటు మనిషి ధర్మాత్మకు ప్రతీక"యైన చిలకను గూర్చి (మనిషీ-చిలక) తిరుమల శ్రీనివాసాచార్య అద్భుతంగా వ్యాఖ్యానించాడు. కవి హృద యాన్ని ప్రగాఢంగా అర్థం చేసుకున్న వాడే అలా వ్రాయగలడు.

కవిత్వం వట్టి భాషకాదు.

భాష కవిత్వానికి ముడిసరుకు మాత్రమే. అందుకే నారాయణరెడ్డి వాడిన భాషలో భాషాతీతమైన దివ్యభావసౌందర్యం గోచరిస్తుంది. అతని కవితల్లో రాళ్లు, బోళ్ళు, కూలిన గోడలు, కాలిన మేడలు కనిపించవు.

అవి చెక్కిన వజ్రాల్లాగా, పాలరాతి ప్రతిమల్లాగా, రామప్ప గుడిలోని సాలభంజికల్లాగా, పండిన హృదయంలాగా, స్వచ్ఛశరత్కాలనదీసలిలం లాగా, ముసిరే గాఢాంధకారంలో పూర్ణ చంద్రోదయం లాగా సాక్షాత్కరి స్తాయి.

ఒక దీపం నుంచి ఎన్నో దీపాలు వెలిగినట్లు, లేదా శ్రీనివాసాచార్య అన్నట్లు, హిమాలయం నుండి వెలువడిన వివిధ సరిత్తులవలె "ఉదయం నా హృదయం"లో నుండి "మార్పు నా తీర్పు" "తేజస్సు నా తపస్సు" వంటి సంపుటులు వచ్చాయి. వలయం నుంచి వలయం, ఆ వలయంలో నుంచి మరో వలయం ఉద్భవించడం, మహా వలయం కావడం నారాయణరెడ్డి కవితావికాసానికి ఉదాహృతిగా చెప్పవచ్చు కూడా. ప్రణవంలో నుంచి

ప్రపంచంలాగా, "ఒకటి"లో నుంచి "కోటి"లాగా, నారాయణరెడ్డి ఏకకవితలో నుంచి అనేక కావ్యాలు ఉద్భవిస్తాయి. అనేక కావ్యాలు ఏక కావ్యంలో ఇమిడి పోతాయి. మధ్యాద్గామిత్వం, మధ్యగామిత్వం (Centrifugalism and centripatalism in one) నారాయణరెడ్డి కవితలోని విశేషం. ఈ వైశిష్ట్యాన్ని విశ్లేషించి ఆతని సాహితీవిరాణ్మూర్తిని సాక్షాత్కరింపజేశాడు డా. తిరుమల శ్రీనివాసాచార్య ఈ గ్రంథంలో.

ఇది విమర్శకాదు, సమీక్షకాదు, సమాలోచనం కాదు—సదవగాహనం ఇది.

డా. తిరుమల శ్రీనివాసాచార్యలో కవిత్వం, పాండిత్యం ఇలియట్‌లో లాగా కలగలిసి పోయాయి. కనుకనే ఉత్తమ కవితవ్రాస్తూ, సదవగాహనను సద్విమర్శనూ అలవరుచుకున్నాడు.

"నా తరంలోని ప్రతి కవీ ఇలియట్ విమర్శనాచ్ఛాయలో పెరిగాడు" అన్నాడు కవి కారల్ షాపిరో[1]. అందుకే—నారాయణరెడ్డి సాహితీమూర్తిని సాక్షాత్కరింపజేయడానికి కవికాని విమర్శకుడు కాకుండా, కవి తిరుమల శ్రీనివాసాచార్య పూనుకున్నందుకు హర్షించాను.

డా. తిరుమల శ్రీనివాసాచార్య-నారాయణరెడ్డి సాహితిని విభజించిన రీతి—ప్రక్రియాక్రమ విభజన—సమంజసంగా ఉంది.

తెలంగాణా సాహిత్యోద్యమంలో క్రమశిక్షణ గల సైనికునివలె పని చేసినప్పుడు, పృథక్త్వావాదాన్ని నిర్భయంగా ఖండించి కలాన్ని, గళాన్ని మేళవించి జనాన్ని ప్రబోధించినప్పుడు, దానవతా విలయతాండవాన్ని తిరస్కరించి మానవతామహనీయ రూపానికి హారతులెత్తినప్పుడూ నారాయణరెడ్డిలో అనంతచైతన్యాన్ని నేను కళ్లారా చూశాను. అతను నిష్క్రియావాది కాదు. గజదంత గోపురంలో కాపురం చేస్తూ, ప్రజావిప్లవాలను కలలు కంటూ కలంతో బొమ్మలు గీస్తూ కూర్చునే కవికాడు నారాయణరెడ్డి. జీవితంలో అరాచకం, రాతలో విప్లవం అతనికి గిట్టదు. క్రమశిక్షణ లేనివాడు విప్లవవాది కాలేడు. విప్లవం కావాలని పాపులారిటీ కోసం అరవడం వేరు, విప్లవ జీవితం గడపడంవేరు. ఈ వ్యాఘాతం చాలామంది కవుల్లో చూశాను.

---

1. KARL SHAPIRO

స్పానిష్ విప్లవంలో ప్రాణాలు బలిచేసిన లోర్కా[1] వంటిమహాకవులు లోకానికి కావాలి.

స్వదేశ, పరదేశ భేదం లేకుండా బ్రిటన్ నుంచి స్పెయిన్ వెళ్ళి బలి అయిపోయిన కాడ్వెల్[2] వంటి రచయితలు ప్రపంచానికి కావాలి.

"గుండె గొంతుకలో కొట్లాడి" నప్పుడు కవిత పొటమరిస్తుంది. విర హం, వేదన, విప్లవం వంటి భావాలు ఉద్భవిస్తాయి. అవి శబ్దాలను వెతు క్కుంటాయి, ఛందస్సుల్ని వెతుక్కుంటాయి. శక్తిమంతమైన శబ్దం శతాబ్దా లను దాటి జీవిస్తుంది. నిజానికి దానికి జననమేగాని మరణం లేదు.

లోర్కా ఒకచోట ఒక శబ్దాన్ని వాడాడు. అదే Duande[3]. దానికి అర్థం చెప్పలేం. అది ఒకఅనుభూతి. అది ఒక ఆవేశం. అదొక ఉద్వేగం. అదొక ఉన్మాదం. అదొక ఆక్రోశం. అది లేనినాడు కవిత ప్రవహించని నదిలా వర్షించని మేఘంగా జయించని వీరుడిలా వికసించని ముకుళంలా ద్రవించని హృదయంలా చెమ్మగిల్లని నయనంలా— చప్పబడి పోతుంది.

నారాయణరెడ్డిలోని ఆ Duandeనీ, రసావేశాన్నీ మూర్తిమంతం చేసి చూపడానికి తిరుమలశ్రీనివాసాచార్య ప్రయత్నించాడు. ఆ రసావేశం "జలపా తం"లో "ఉదయం నా హృదయం"లో "విశ్వంభర"లో జడధిలో బడబవలె అంతర్నిహితమై వుంది. రూపంలేని పరమాత్మకు రూపం కల్పించడం ఎంత దుస్సాధ్యమో ఒక కవి సాహితీమూర్తిని దర్శింపజేయడం అంత దుస్సాధ్యమే. కాని అసాధ్యం మాత్రం కాదు. అది కొందరు ప్రతిభా శాలురకే సాధ్యం.

డా. తిరుమల శ్రీనివాసాచార్య "అంబరాలను చుంబించే అంతరాలను స్పృశించే" మహా గీతానికి రూపకల్పన చేశాడు. అపురూపమైన ఆ రూపా నికి, ఆ సాహితీమూర్తి స్వాగతం.

---

1. Garcia Lorca
2. Christopher Caudwel
3. నిఘంటువుకు అందని అనేకార్థబోధకమైన స్పెనిష్ శబ్దం.

యువభారతీయులకు రమారమి రెండు దశాబ్దాలుగా అధ్యక్షుడు, గ్రంథప్రచురణరంగంలో, సభానిర్వహణలో నూతన ప్రక్రియను ప్రవేశ పెట్టి అందరికీ తలలో నాల్కగా మెలగే మా ఆప్తమిత్రుడు (నారాయణ రెడ్డికీ, తిరుమల శ్రీనివాసాచార్యకూ) అంతరంగబంధువు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి, స్వాతంత్ర్యసమరయోధుడు, సహృదయుడు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తికి ఈ అమూల్యగ్రంథం అంకితంకావడం నన్ను ఆనందపరవశుణ్ణి చేసింది. విజ్ఞానతృష్ణ మూర్తీభవించిన కృష్ణమూర్తికి అభినందనలు.

# మనిషికి పెట్టిన నగిషీ

డా॥ సి. నారాయణరెడ్డిగారి వివిధ సాహిత్యప్రక్రియలమీద విశ్వవిద్యాలయాలలో సిద్ధాంతవ్యాసాలు వస్తున్న తరుణంలో యువభారతివారు నారాయణరెడ్డి సాహితీవ్యక్తిత్వం మీద గ్రంథం వెలువరించటం సాహసమైనా సముచితంగా ఉంది. డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు నారాయణరెడ్డిగారి సాహిత్యాన్ని ఈగ్రంథంకోసమే చదివి వ్రాసినవారు కారు. పది పదిహేనేళ్ళుగా నారాయణరెడ్డిగారి సాహిత్యాన్ని సన్నిహితంగా, లోతుగా అనుసరిస్తూ, అనుశీలిస్తూ, అధ్యయనం చేస్తున్నవారు. ఒకదశాబ్దం ఒక సాహితీవ్యక్తిత్వాన్ని పరిశీలించిన పరిశ్రమఫలితం ఈగ్రంథరచనం. డిగ్రీలకోసం కాకుండా సాహితీపిపాసతో సమున్మీలించిన వాఙ్మయరసోల్లాసం ఈవివేచనవికాసం. స్నేహరుచితో వెలిగే స్నిగ్ధవిమర్శప్రకాశం!

నారాయణరెడ్డిగారి సాహిత్యంమీద వచ్చిన సిద్ధాంతవ్యాసాలు ఇంకా ప్రచురితం కాలేదు. అందువల్ల ఈగ్రంథం మొదట వెలుగు చూచిన నారాయణరెడ్డిగారి సమగ్రసాహిత్యానుశీలనం. దీన్ని మొదటిసారి ప్రచురించే గౌరవం యువభారతికి దక్కటం అభినందనీయం. నారాయణరెడ్డిగారితో ఆత్మీయతను పెంచుకున్న మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు. వీరిరువురితో సాహిత్యబాంధవ్యం కలుపుకున్న సౌజన్యమూర్తి డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు. ఈగ్రంథం ఇరివెంటివారికి అంకితం కావటం బంగారానికి తావి అబ్బటం. ఈముప్వురితో స్నేహాన్ని పచరించే నేను ముందుమాట వ్రాయటం నా అదృష్టం.యువభారతి ప్రచురణల ప్రధానసంపాదకుడుగా నాకర్తవ్యం. సమకాలీన మహాకవి సాహితీవ్యక్తిత్వాన్ని సమగ్రంగా సమీక్షించే గ్రంథాన్ని యువభారతి ప్రచురించటంకూడా ఇదే ప్రథమం. సామాన్యసాహితీలోకానికి అందుబాటులో ఉండి, వారిచేత చదివించి, సమాజంలో సముచిత సాహిత్యప్రమాణాల ప్రయోగాల పరిజ్ఞానాన్ని పెంపొందింపజేసే యువభారతి సాహిత్యకార్యక్రమాలలో ఈరచనం ఒక సోపానం కావటం ముదావహం! సహృదయులందరిచేత సముత్సాహంగా చదివింపజేయగలిగే సరసమైన

సాహిత్యవివేచనం ఈ గ్రంథం! ప్రయోజనం సాధించే ప్రయోగం! కవికీ, గ్రంథకర్తకూ, స్వీకర్తకూ నా అభినందనలు ! ! !

కవిత్వం ఊపిరిపీలుస్తున్నట్లనిపిస్తుంది కవిగా నారాయణరెడ్డి మాట్లాడు తుంటే. కృష్ణుడు వేణువు మ్రోగిస్తున్నట్లుంటుంది గీతిని విరచిస్తుంటే. మట్టిని సైతం మాణిక్యం చేస్తున్నట్లుంటుంది వచనరచన సాగిస్తుంటే; మని షిలో మానవత స్పందిస్తున్నట్లుంటుంది మధురకవిత వినిపిస్తుంటే. కవితకు నవత కల్పించటం నారాయణరెడ్డిగారి కవితావ్యక్తిత్వం !

కవి ప్రకృతివైపు చూస్తే ప్రణయగీతి పాడతాడు; భావంవైపు పరు గెత్తితే ప్రగతిగీతి వినిపిస్తాడు; వస్తువు నెన్నుకొంటే వైదగ్ధ్యాన్ని ప్రకటి స్తాడు; వర్ణన నెన్నుకొంటే వైవిధ్యాన్ని ప్రదర్శిస్తాడు; శిల్పాన్ని ఆరాధిస్తే చిత్రాలను రూపిస్తాడు; చమత్కారాన్ని చిలికిస్తే శబ్దబంధాలను అలంకరిస్తాడు; వాస్తవాన్ని దర్శిస్తే వచనరచన సాగిస్తాడు; సంఘర్షణను సమీక్షిస్తే సమరగీతి నినదిస్తాడు; పెరుగుదల ఆగిపోతే తిరుగుబాటు చేస్తాడు; వెలుగుబాట కన పడకపోతే విప్లవశంఖం పూరిస్తాడు. కవిగా నారాయణరెడ్డిగారిలో ఈ కాంతి కిరణాలన్నీ హరివిల్లులా విరిసి, ఆధునికతను అందగింప జేస్తున్నాయి.

కాలంవెంట నడవటం, కలాన్ని కళామయంగా నడపటం, సంప్రదా యంలోని స్తబ్ధతను నిరసించటం, క్రొత్తదనంలోని ఉత్తమగుణాన్ని కవితా హృదయానికి హత్తుకోవటం, ప్రయోగాన్ని ప్రయోజనం తెలిసి ప్రయోగించ టం, ఉక్తిశక్తితో వస్తుశక్తిని ఉన్మీలింప చేయటం, నారాయణరెడ్డిగారి కవి తకు ఉగ్గుతో వచ్చిన విద్యలు. వారికి నాదహృదయం తెలుసు; శబ్దసంయోజ నం తెలుసు; అర్థశక్తి తెలుసు. పద్యం వ్రాసినా, గేయం రచించినా, వచన గీతం చిత్రించినా, ప్రకృతికి తగిన ఆకృతినీ, నిర్మితికి తగిన నిర్వహణాన్నీ, అభివ్యక్తికి తగిన అలంకృతినీ, శీలానికి తగిన శైలినీ కూర్చటంలో వారిది అందె వేసిన చేయి.

ప్రతిభావంతులైన నారాయణరెడ్డిగారు ప్రగతినీ, పరిణామాన్నీ కోరు తారు. ఎప్పుడూ ఎడతెరిపి లేకుండా ఎదుగుతున్న వ్యక్తిత్వం వారిది. వెన్నెల వాడ నుండి విశ్వంభరదాకా ఇప్పటికి సాగింది వారి ప్రస్థానం. రచనలో రస లోకాన్ని దర్శించటం వారి ఆత్మలక్షణం. "Sublimity is the echo

of a great soul" అన్న లాంగినస్ సూక్తి నారాయణరెడ్డిగారిపట్ల ముమ్మాటికి సత్యం.

సమకాలీనసాహిత్యంలో ప్రయోగాలు సాగిస్తున్న కవుల్లో ముఖ్యంగా రెండు తెగలవారు కనపడతారు. ఒకతెగవారు కవితతో పఠితలోని హేతువును మేల్కొల్పి సామాజికస్పృహను జ్ఞానరేఖగా సమున్మీలింపచేయాలని ప్రయత్నిస్తారు. మరొకతెగవారు హేతుబద్ధమైన సామాజికస్థితిగతులను కళామయం చేసి, రమణీయతాభివ్యక్తిని సంతరించి, కవితతో రసభావమజ్జనోన్మజ్జనత్వాన్ని పఠితకు కల్పించాలని యత్నిస్తారు. ఈరెండుతెగలవారూ తమతమ వైఖరులను కవితాస్వభావాలుగానే పేర్కొంటున్నారు. అయితే సాహిత్య విమర్శకు డీరెండుతెగలనూ అనుశీలిస్తున్నప్పుడు మొదటితెగవారు కవులు చేసే పనికంటె విమర్శకులకర్తవ్యాన్నే అధికంగా సాగిస్తున్నారని తెలుసుకొని కవితకు ఉపశ్రుతిగా తనవిమర్శను సాగిస్తాడు. మరి రెండవతెగను అనుశీలిస్తున్నప్పుడు అభివ్యక్తివలన పఠిత కందే అనుభూతిని అన్వేషించి, దానివిలువను వివేచించటానికి పూనుకుంటాడు. మొదటితెగలో కవితకంటె విమర్శ విస్తరంగా కనపడుతుంది; రెండవతెగలో విమర్శ కవితామయమై రమణీయాకృతితో రసలోకాన్ని అందిస్తుంది. కవితను విప్పి చెప్పే పని రెండవతెగలో ఉన్నంత మొదటితెగలో లేదు. హేతువు చెప్పటం శాస్త్రధర్మం; అనుభూతి నందించటం కవితాధర్మం; కవితలో అనుభూతి నందింపగల ఆర్జవాన్ని హేతుబద్ధంగా నిరూపించటం విమర్శధర్మం. అందువల్ల సాహిత్యవిమర్శకులు సాహిత్యానుశీలానికి పూనుకున్నప్పుడు - డి. హెచ్. లారెన్స్ లాగా— "The touch stone is emotion, not reason. We judge a work of art by its effect on our sense and vital emotion and nothing else"— అని భావిస్తారు. హృదయగ్రంథిభేదనం చేసి, రసాభ్యుదయోల్లాసాన్ని రవళింపచేసే రచనలోని శక్తియుక్తులను సమన్వయాత్మకంగా సమీక్షించటమే సాహిత్యవిమర్శకుల కర్తవ్యం. ఈమార్గంలో నడిచింది ఈగ్రంథంలోని నారాయణరెడ్డిగారి సాహిత్యానుశీలనం.

నేటి సాహిత్యవిమర్శప్రక్రియల్లో పరిశోధన ఒకవైపు, సమీక్ష మరోవైపు తమతమ శాఖావిస్తృతులను సారిస్తున్నవి. ఒక్కొక్కసారి సోపపత్తి

కమూ, సప్రమాణమూ అయిన సమీక్షకూడా పరిశోధన అనిపించుకొంటున్నది. సమీక్ష సర్వప్రక్రియాసామాన్యంగా నేడు సాగుతోంది. డా॥ శ్రీనివాసాచార్యు లీ గ్రంథంలో సహృదయసమీక్షను సరళసుందరంగా నిర్వహించారు.

'రెవ్యూ' అనే ఆంగ్లసాహిత్యవిమర్శప్రక్రియకు సమాంతరంగా తెలుగులో సమీక్షాశబ్దాన్ని వాడుతున్నాము. అయితే యేరెండుభాషాసాహిత్యాల్లో ఉండే సాహిత్యశాస్త్రపదజాలానికీ ఒకేస్వభావమూ, ఒకేనిర్వచనమూ, ఒకే పరిధీ సర్వత్రా ఉండటం సాధ్యంకాదు. ఆయాసాహిత్యక్షేత్రాల స్వరూప స్వభావాలను బట్టీ, సంప్రదాయపరిణామ చైతన్యాలనుబట్టీ ఆయాప్రక్రియలకూ, పారిభాషిక పదాలకూ ప్రవృత్తులను పరిధులనూ ఆయావిమర్శకులచేత సంభావింపబడుతూ ఉండటం సహజం. ఆంగ్లసాహిత్యంలో 'రెవ్యూ' పదం - కవి లేక రచయిత తనరచనంలో ప్రపంచించే దృక్పథాన్ని విమర్శకుడు పునఃపరిశీలించి తనదైనదృక్పథంతో అనుశీలించటం అనే అర్థంలో వాడబడుతూంది. ఆఅర్థాన్నే తూచా తప్పకుండా సమీక్షకు చెప్పుకుంటే అవ్యాప్తిదోషం ఏర్పడుతుంది. సమ్యక్‌దృష్టితో చేసే కావ్యగుణదోషప్రశంస సమీక్ష. ఇందులో ఆంగ్లంలోని 'రెవ్యూ' చేసేపనీ, 'అప్రీసియేషన్' చేసే పనీ, 'ఇంటర్‌ప్రెటేషన్' చేసేపనీ తెలుగులో సమీక్ష చేస్తుంది. అంటే కవితలో కానవచ్చే కవియొక్క సాహిత్యదృక్పథాన్ని విమర్శకుడు ప్రామాణిక కవిత్వతత్త్వవివేచనంతో పునర్విమర్శించి గుణదోషాలను వింగడించి వివరించటం; కవితలోని శిల్పరమణీయకత్వాలను సహృదయలోచనంతో పఠితకు పరిచయం చేసి కవితాభిరుచిని ద్విగుణీకృతం చేయటం; కావ్యార్థాలలోని వివిధాంశాలకు సమన్వయదృక్పథంలో ఏకవాక్యతను సంపదింపచేసి కావ్యతత్త్వాభివ్యక్తిని సహృదయవేద్యంగా సమర్పించటం అనే మూడుగుణాలు సమీక్ష అనేప్రక్రియకు సహజలక్షణాలుగా తెలుగులో సంభావించటం జరుగుతోంది. డా॥ శ్రీనివాసాచార్యులు సమీక్షాప్రవృత్తిని ఈగ్రంథరచనంలో ముమ్మూర్తులా మూర్తికట్టించి, తాత్పర్యంగా నారాయణరెడ్డిగారి సాహితీమూర్తిని సహృదయలోకానికి ప్రత్యక్షీకరింప యత్నించారు.

"గమ్య మేదన్న జిజ్ఞాసయే నీ కుంటె
ప్రతిమైలురాయిపై వ్రాసి వున్నది చూడు"

అన్న నారాయణరెడ్డిగారి సూక్తి ఈసమీక్షకు ప్రగతిపథాన్ని చూపించేశక్తి. డా॥నారాయణరెడ్డిగారి ప్రతిరచనా ఒకమైలురాయి అయితే దానిసమీక్ష వారి సాహిత్యగమ్యాన్ని నిర్దేశించే అక్షరపతాక. డా॥ శ్రీనివాసాచార్య నారాయణ రెడ్డిగారి కావ్యాలనూ, రచనలనూ సమగ్రంగా సేకరించి, ప్రక్రియాపరంగా విశ్లేషించి, కాలక్రమవికాసాన్ని అనుసరించి అనుసంధించి, అనుశీలించి, యీగ్రంథాన్ని సంపుటీకరించారు. ప్రచురణకర్తలను, కృతిభర్తలను, సమస్యలను వదిలిపెట్టకుండా పేర్కొని పఠితకు కావలసిన వివరాలను సమకూర్చటంలో జాగరూకత వహించారు. రెడ్డిగారిజీవితంతో చనలకు సంబంధం ఉంది; సమకాలీన సమస్యల ప్రభావంతో, వివిధసిద్ధాంతరాద్ధాంతాలపట్ల రెడ్డిగారి కున్న ప్రత్యయంతో, వారి రచనలకు సంబంధం ఉంది. సమాజజీవితం - వ్యక్తిజీవితం - కావ్యజీవితం ఈమూడూ అన్నివేళల్లో త్రివేణీసంగమంలా సమన్వయం చెంది చరిత్రలోని పరిణామాన్ని చిత్రీకరిస్తుంటాయి. వీనిని అనుశీలించేటప్పుడు నారాయణరెడ్డిసాహిత్యమూర్తిని సమాజపరిణామానికంటె భిన్నంగా వేరుపరిచి చూడలేము. నీరక్షీరన్యాయంగా ఉన్న ఆ సంశ్లిష్ట వ్యక్తిత్వాన్ని స్పష్టమైన విశేషపద్ధతితో వివేచించాలి. హెలెన్ గార్డ్‌నర్ అన్నట్లు— "The writer's personal history, like the presure of the age in which he lived, is a context which can help us to focus on the work as it is."

నారాయణరెడ్డిగారు మూడుదశాబ్దాలుగా రచన చేస్తున్నారు. భారత స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పరిస్థితులప్రభావమే వీరిమీద బలంగా కనపడుతుంది. స్వాతంత్ర్యోద్యమంలో పుట్టి ఆ తరువాతి దేశస్థితిగతుల్ని తనలో ప్రతిబింబించుకొన్న రచనలకంటె నారాయణరెడ్డిగారి రచనలు భిన్నంగా కనపడాలి; కనపడతాయి కూడా. భారతదేశంలో ఈమూడుదశాబ్దాల్లో ఎన్నో మార్పులు వచ్చాయి. రాజకీయవిప్లవాలకంటె సాంఘికఉద్యమాలు అధికంగా వచ్చాయి, వర్గపోరాటాలస్పృహ సమాజంలో హెచ్చింది; సమసమాజ నిర్మాణాకాంక్ష ప్రబలింది; విదేశాలదాడులు వచ్చాయి; విజయాలూ, అపజయాలూ, సంధులూ, రాయబారాలు జరిగాయి. అలీనవిధానంలో ప్రయోగాలు సాగాయి, పరిణామాలు వచ్చాయి. రాజకీయచైతన్యం సామాజికప్రధాన ప్రవృత్తిగా సాగింది. ప్రపంచదేశాలవిముక్తిపోరాటాల్లో భారతదేశం కీలక

పాత్ర నిర్వహించింది. ఇవన్నీ సాహిత్యాన్నీ, కళారంగాన్నీ ప్రభావితం చేశాయి. ఫలితంగా— కవుల్లో అభ్యుదయవాదులూ, విప్లవవాదులూ, జాతీయ వాదులూ ఏర్పడ్డారు. అభ్యుదయవాదుల్లో మానవతావాదమార్గం సాహిత్యంలో వివిధప్రయోగాలను సాగించింది. నారాయణరెడ్డిగారు ఆమార్గంలో తమ ప్రయోగాలు ప్రధానంగా నిర్వహించారు. చిత్రమేమిటంటే- నారాయణరెడ్డి గారి మానవతావాదం కవితలో స్ఫటికంలా భాసిస్తుంది. దానిలో వివిధవాదాల ప్రతిబింబాలూ కనపడతాయి. అయితే అవి దానిలోని ప్రతిబింబాలుగానే నిలుస్తాయి. ఉదాహరణకు— రెడ్డిగారికవితలో హేతువాదం, సౌందర్యవాదం, విప్లవవాదం, ఆశావాదం, అనుభూతివాదం, రీతివాదం, అలంకారవాదం, చమత్కారవాదం, ప్రతీకవాదం —ఇవన్నీ అవసరానికి అనువుగా నిలిచి అంతర్లక్షణాలుగా అలంకృతు లవుతున్నవి. వీటన్నింటికి మకుటంగా మానవతావాదం నిలుస్తుంది. అందుకే ఆయన్ను సామాన్యంగా అంటుంటారు ఏయిజాలకూ కట్టుబడరని. ఎవరికీ అందకుండా, ఎందులోనూ ఇరుక్కోకుండా ఎగిరెగిరి పోతారని. అలా రెక్కలతో ఎగిరి విహంగవీక్షణంతో సమకాలీనసాహితీపరిణామాలను సమీక్షిస్తూ తన మానవతావాదాన్ని మూర్తి కట్టించటమే వారి సాహితీవ్యక్తిత్వం. ఈసమీక్షాగ్రంథంలో అంతస్సూత్రంగా వ్యాఖ్యానింపబడిందికూడా ఈసత్యమే.

'శిశిరంనుంచి వసంతానికి
చీకటినుంచి ప్రభాతానికి
నిరాశనుంచి ఆశాశిఖరానికి
అశ్రుజలధినుంచి ఆనందతీరానికి
నడిపించే మార్పు
నే నిచ్చే తీర్పు'

అని తనధ్యేయాన్ని డా॥ సి. నారాయణరెడ్డిగారు పేర్కొన్నారు. సృజనాత్మకతను కోల్పోయిన సంప్రదాయంనుండి వినూత్నప్రయోగాన్ని విస్ఫులింగంలా ప్రజ్వలింపచేయటం, సమకాలీనప్రయోగాలలో మానవతను మంట కలిపే విధ్వంసకప్రవృత్తులను గర్హించి సమాజశ్రేయోభావనకు చింతను రేకెత్తింప చేయటం, సమాజంలో అవినీతిశక్తుల విలయతాండవాన్ని తప్పించుకోలేని మూగజీవుల ఆర్తనాదాలకు ఆశాగీతాలను ఆలపించి విని

పించటం, ఆర్తిని బడబాగ్నిగా భరించే వ్యథార్తజీవుల అంతర్వేదనాన్ని అశ్రుగీతాలుగా వినిపించటం, మానవాహంకారం సాగించే ప్రగతియాత్రలో ఆరనిమంటలా వెలుగును చిమ్మే అంతరాత్మచైతన్యాన్ని అంతర్ముఖంగా భావించి ప్రతీకాత్మకంగా ప్రపంచించటం —ఇవన్నీ డా॥ నారాయణరెడ్డిగారి కవితలో ప్రతిబింబించే మార్పులు- వినిపించే తీర్పులు. వీనిని డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు నేర్పుగా నిరూపించి సమీక్షించి కృతార్థులయ్యారు. మొత్తానికి వీరి విమర్శ దోషంపట్టని గుణసమీక్ష !

డా॥ నారాయణరెడ్డిగారి సాహితీమూర్తి ఒక చైతన్యశిఖరం. పూల పాటలు పాడుతూ నవ్వనిపువ్వుల్ని నవ్విస్తూ అజంతాసుందరులను కవ్వించి పగలే వెన్నెల కల్పించగలరు. వెన్నెలవాడను వెలయింపగలరు. జలపాతంలా దూకి విద్యుత్‌హరివిల్లులను సృష్టించి, దివ్వెలమువ్వలు మ్రోయించి, తేజస్సే నాతపస్సని ప్రకటింపగలరు; అక్షరాలగవాక్షాల్లోనుండి మధ్యతరగతిమంద హాసాన్ని దర్శించి, ఉదయం నాహృదయ మని ప్రకటింపగలరు. మంటలలో మానవున్ని చూచి, మృత్యువుతో ముఖాముఖి మాట్లాడి, మథనంలో అమృతాన్న సాధించి విశ్వగీతి వినిపించగలరు. విశ్వభూమికను వివేచించి విశ్వంభరాతత్త్వాన్ని వ్యాఖ్యానించ గలరు. రెడ్డిగారి ఖండకావ్యాలూ, గేయనాటికలూ వస్తువైవిధ్యంతోపాటు శిల్పవిన్యాసాన్నికూడా చిత్రీకరింపగలిగే కళామూర్తులు.

కథాగేయకావ్యకర్తగా డా॥ నారాయణరెడ్డిగారికి అఖండకీర్తి లభించింది. నాగార్జునసాగరం, స్వప్నభంగం, కర్పూరవసంతరాయలు, విశ్వనాథ నాయడు, జాతిరత్నం మొదలైనవి తెలుగులో మాయని మనోజ్ఞకళాఖండాలు. వారి ఋతుచక్రంలో తెలుగుఋతువులు ఆత్మాశ్రయకవితావగుంఠనాన్ని అలంకరించుకొని ముద్దులు మూట కట్టాయి. రామప్ప నాటిక భారతీయభాష లన్నిట్లో పరివర్తనం చెందింది; రాళ్లను కరిగించింది; ఒడళ్లను పులకింపచేసింది. వారి సమదర్శనం సూక్తిసుధాకరం. అనుసృజనసాహితి ముత్యాలపల్లకి, యాత్రాసాహితి అంతర్జాతీయస్నేహసౌరభాలకు అక్షరసుమాలమంజరి. వ్యాపసాహితి సమీక్షాసదస్సు. పరిశోధనసాహితి ప్రామాణికవిమర్శకు బంగరుగద్దె. గద్యంలో జాలువారిన రచన వారివిమర్శ. వారివ్యాఖ్యలు మందారమకరందాలు. వారి సినీగీతాలు కవితాజలధికి ఏతాలు. పట్టింది బంగా

రం చేయటం, ప్రయోగంలో పరిణతిని ప్రకటించటం వారినైజం. వారి విశ్వంభర మానవతావాదకవితలో వెలువడిన మహాకావ్యం. సమకాలీనుల్లో శ్రీనాథుడు డా॥ సి. నారాయణరెడ్డి !

> "ప్రకృతిలోని చలనశీలానికి
> పరిణామం మనిషి
> జగతిలోని భ్రమణగుణానికి
> ప్రతిరూపం మనిషి"

ఆమనిషికి పెట్టిన నగిషీ డా॥ నారాయణరెడ్డి కవితాకృషి !

హైదరాబాదు, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

8-12-1981

# అంకితం

## మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి

నారాయణరెడ్డి సాహి
తీరమ్యజగత్తునుగని
స్పందించిన నాదెందం
అందించిందీ గ్రంథం

ఆతని కవితానందన
మందున పూచినపువ్వుల
అందాల సుగంధాల మ
రందాలను ఈ పుస్తక
పాత్రికలో పదిలమ్ముగ
భద్రపరచియుంచినాను

నా జీవనప్రస్థానము
నందు ముళ్లు తొలగిస్తూ
విరులను పరచిన ఓ ఇరి
వెంటి కృష్ణమూర్తీ! నీ

లలిత సుధామయస్నేహం
లభియించుట నా భాగ్యం

నారాయణరెడ్డిహృదికి
నచ్చిన ఆప్తుడవీవు
అచ్చమైన మహాకవిని
మెచ్చెడి మిత్రుడ వీవు

నిన్నుగన్న నాహృదయం
మిన్నులందుకుంటుంది
నిన్నుగన్న నాభావం
వెన్నెలమయమవుతుంది
చెదరని రసహృదయాలకు
చిహ్నం మన అనుబంధం
అందుకె ఇరివెంటీ! మీ
కంకితమ్ము ఈ గ్రంథం.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య



డా॥ తిరుమల శ్రీనివాసాచార్య డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

# అనుక్రమణిక




## పూలపాటలు

ఒకనాటి బీజం కొన్నాళ్లకు మనం నమ్మలేని మహాభూజంగా రూపు దిద్దుకుంటుంది. ఈనాటి ఫలం నిన్నటి పల్లవదశను అనుభవించిందే. చిరు చిరు చినుకులు జీవనదిగా మారడానికి నిరంతర తపస్సు అత్యవసరం. విశ్వ రూప లక్షణాలు వామనావతారారంభంలోనే గోచరిస్తాయి. తరువాతి కాలాన వివిధ కవితా ప్రక్రియల్లో విలాసంగా విహరించిన డా॥ సి. నారాయణరెడ్డి నూనూగు మీసాల నూత్నయౌవనంలోనే కవితాసరస్వతిని ఆరాధింప నారంభించినాడు. పదిహేడు పద్దెనిమిది సంవత్సరాల తరుణవయస్సులోనే కవితారుణకాంతులలో గంతులేస్తూ గొంతువిప్పి పాడసాగినాడు. అలా లీలగా పాడినపాటలే 'పూలపాటలు'.[1]

---

1. పూలపాటలు - ప్రచురణ. రాజశ్రీ సాహిత్య కళాపీఠము - సికింద్రాబాదు (1952)

'పూలపాటలు' ఆరుగురు యువకవుల గీతికాసంపుటి. వారు — దాశరథి, బి. రామరాజు, సి. నారాయణరెడ్డి, చిల్లర భావనారాయణ, భాగి నారాయణమూర్తి, ఆకెళ్ల సుబ్రహ్మణ్యకవి. ఆనాటికే ఈ యువకవులు తెలంగాణా కవితారసికులకు చిరపరిచితులు. ప్రస్తుతం ఈ సంపుటిలోని నారాయణరెడ్డి పాటలను పరిశీలిస్తున్నాను.

పూలపాటల రచనాకాలాన నారాయణరెడ్డి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. చదువుతున్నాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయ 'తెలుగు విద్యార్థి సమితి' కార్యదర్శిగా ఉన్నాడు. తెలంగాణా రచయితల సంఘానికి మహాకవి దాశరథి అధ్యక్షుడుగాను, శ్రీ బి. రామరాజు కార్యదర్శిగాను సాహిత్యసేవ చేస్తున్న సమయమది. అప్పటికే దాశరథి 'అగ్నిధార' కురిసి 'రుద్రవీణ' మ్రోగించి మహాకవిగా మన్ననలందుకున్నారు. హృదయ తంత్రుల్ని కదిలించే మధురగీతాలను రచించి మనోహరంగా కూడా పాడగలరని యువకవులైన నారాయణరెడ్డికి అప్పటికే ప్రశంసలు వచ్చినవి.

"ఏ దేశమందైనను గద్యము కంటె పద్యమే ముందుద్భవించుననియు, పద్యములలో కూడ పదమే ముందు పుట్టుననియు విజ్ఞుల అభిప్రాయము"[1] అని డా॥ దివాకర్ల వేంకటావధానిగారన్నట్లు నారాయణరెడ్డి తన కవితాజీవితాన్ని పాటలతోనే ప్రారంభించినాడు. ఆతని 'పూలపాటలు' 'నవ్వని పువ్వు' ఈ సత్యమునే బలపరుస్తున్నవి. 'పూలపాటలు' సంపుటిలోని నలభైతొమ్మిది పాటలలో నారాయణరెడ్డివి పదమూడు. 'నా బ్రతుకు' అనే పాటలోని—

"నా బ్రతుకు తోటలో
ఆ వలపు బాటలో

పులకించి పోదువో యెలపూలపాటలో" వంటి చరణాలలో 'పూలపాట' సంపుటి పేరు కనపడుతుంది. పాట అనే శబ్దం మాత్రం చాలా చోట్ల ప్రయుక్తమైంది. దీనినిబట్టి చూడగా ఈ పాటలన్నీ ఒక ఉద్దేశంతో వ్రాయబడినట్టుగా గోచరిస్తవి. ఆత్మాశ్రయరీతిలో ప్రేయసియో ప్రియుడో పాడుకున్నట్లు కనపడుతున్నవి. విప్రలంభ శృంగారం ఈ పాటల్లో విరబూసి కని

1. 'ఆంధ్రవాఙ్మయ చరిత్రము'—పుట 124. (ఐదవ ముద్రణ-1967)

పిస్తుంది. రెండు మూడు పాటలలో వసంత శోభావర్ణనమున్నా దానిని ప్రణయానికి ఉద్దీపనంగానే గ్రహించినాడు నారాయణరెడ్డి. ఈ పాటలలో భావ కవిత్వచ్ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తవి.

'ఆపవే కోయిలా' అనే పాటలోని—

"భావ వీధులలోన పయనించి పయనించి
రాలిపోయిన హృదిని గాలించు నీ పాట .... ॥ఆపవే॥
నిండువానలనాడె యెండిపోయిన నాదు
తలపుటేరుల తుంపరలు జిమ్ము నీపాట .... ॥ఆపవే॥

వంటి చరణాలు మధురభావ మనోజ్ఞ కిరణాలు. అలాగే 'కొసరు తేటులు' అనే పాటలోని—

"క్రీగంట జూచేవు కిలకిలా నవ్వేవు
ప్రణయ మంత్రమ్మూద కనులెత్తి జేసేవు
కనులెత్తి గానీయకా
గైకోవె నా కానుకా
కొసరు తేటులపైన కాసంత దయలేక
కనుము కోసితి బాల కమనీయ కమలాల
కినుక నాపై బూనకా
గైకోవె నా కానుకా" — వంటి పాదాలు భావదీప్తి స్ఫోరకాలు.

ఈ పాటలలో ఖండత్ర్యస్రగతులు చోటు చేసుకున్నవి. అందులోనూ ఖండగతిలో సాగినవే అనేకం. దీనివల్ల నారాయణరెడ్డికి ఖండగతిపై మక్కువ ఎక్కువని తెలుస్తుంది. అంకురప్రాయంలో నున్న ఈ మక్కువ 'నాగార్జున సాగరము' కావ్యంలో మారాకులను హత్తుకున్నది. కాబట్టియే "వీరి ధారా బలమంతయు ఖండగతియందే యెక్కువ కానవచ్చుచున్నది"[1] అని అన్నారు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు. "ప్రతి శబ్దం తూచి తూచి పడుతుంది"[2] అని తరువాతి కాలాన నారాయణరెడ్డి గేయనాటిక

---

1. 'నాగార్జునసాగరము' - 'మంగళాశాశనము' - పుట - 6 (ద్వితీయ ముద్రణ - 1961)

2. 'నవ్వనిపువ్వు' నాటికల సంపుటిలో దాశరథి 'అవతారిక' పుట (vi) ప్రచురణ : రాజశ్రీ సాహిత్య కళాపీఠము - సికింద్రాబాదు (1953)

లను గూర్చి వెలిబుచ్చిన శ్రీ దాశరథిగారి అభిప్రాయాల మేడలకు ఈ పాటలలో పునాదులు కన్పడుతున్నవి. యతులూ, ప్రాసలూ, అనుప్రాసలూ, అంత్యప్రాసలూ సహజధోరణిలో ఈ కవి రచనలో ఆయా స్థలాలలో సముచితంగా వచ్చి కూర్చుంటాయి. 'మధుమాసం' అనే పాట శబ్దాలంకారానికి చక్కని తార్కాణం. 'నా మానసాన' అనే పాట మంజుల శైలీ పై చిత్రీసుందరియే పాడిన కమ్మని పాట. మచ్చుకు అందలి చివరి చరణాలు—

"వాదు వీణాగాన నాదమ్ము వినగ
పరుగుదీయు చకోరి మరలునో యేమొ
మరలి వెన్నలద్రావ మరచునోయేమొ
మరచి చూచుచు నన్ను మరపించునేమొ"—

నిజంగా నారాయణరెడ్డి 'ప్రకృతియే పులకింప' కవితా వీణను పలికింప గలడనుటకు ఈ గీతిక ఒక సూచిక. 'నా జీవితానంద' అనే పాటలోని తెలుగుమాటల పోహళింపులో సంస్కృతపద సంయోజనలో నవ్యతా భరితమైన కామనీయకం నయనపర్వంగా ఉన్నది. 'చినుకులు' అనే గేయం సూక్తిప్రాయం. ఈ గీతంలోని 'మాధురీమహిమ', 'మంజులత్వమ్ము', 'చల్లందనమ్ము', 'మెత్తందనమ్ము' నారాయణరెడ్డి కవితాగుణాలుగా పదపదాన ప్రత్యక్షమవుతాయి.

ఈ పాటలలోని మాధుర్యగుణానికి అలరి వీనిలో 'నా జీవితానంద' 'ఆపవేకోయిలా' మున్నగు కొన్ని పాటలను ఆకాశవాణి-హైదరాబాదు కేంద్రం వారు రికార్డుచేసి లలితసంగీతవిభాగంలో అప్పుడప్పుడు వినిపిస్తున్నట్లు జ్ఞాపకం. మొత్తంమీద నారాయణరెడ్డి భవిష్యత్కవితాకల్పభూజానికి బీజం ఈ పాటల్లో సూక్ష్మాతిసూక్ష్మంగా కనిపిస్తుంది.

  




# నవ్వని పువ్వు

'నవ్వని పువ్వు' నారాయణరెడ్డి ప్రథమగేయనాటికల సంపుటి. దీనిని 'రాజశ్రీ సాహిత్య కళాపీఠం - సికింద్రాబాదు' వారు 1953లో ప్రచురించినారు. "కాల సమాధిలో కన్నుమూసిన కన్నతల్లికి" ఈ సంపుటిని అంకితం చేసినాడు నారాయణరెడ్డి. ఈ సంపుటిలో నాలుగు నాటికలున్నవి. అవి- నవ్వని పువ్వు, వలపురేడు, దగ్ధశాంతి, భిన్నస్వరాలు అనేవి.

## నవ్వని పువ్వు:

నారాయణరెడ్డి ప్రథమగేయనాటిక ఈ 'నవ్వని పువ్వు'. ఇందలి పాత్రలు- కవి, మొగ్గ, తీగ, తుమ్మెద, పవనుడు.

కపట ప్రణయాన్ని చూపి అమాయికల జీవితాలతో చెలగాటలాడే కామాంధులను దృష్టిలో ఉంచుకొని ప్రతీకాత్మకంగా ఇతివృత్తాన్ని నిర్వహించినాడు నారాయణరెడ్డి. ఒక తుమ్మెద మొగ్గను (నవ్వని పువ్వును) కవ్వించి నవ్వించ యత్నించంగా ఆ మొగ్గకు తల్లియైన తీగ తన బిడ్డను కాపాడుకొనగలగడం ఈ నాటికలోని ఇతివృత్తం.

మధుపం, గంధవహుడు, మొగ్గ, పువ్వు, తీగ అనే శబ్దాలలోని పొడిపొడి అర్థాలను గ్రహించి, వాటి సంబంధాన్ని ఊహించి, ప్రతిభతో ప్రాణంపోసి, పాత్రలను చేసి, వాటిలో లోకజ్ఞతతో ప్రాపంచికమానవ స్వభావాలను నింపినాడు నారాయణరెడ్డి. నాలుగు పాత్రల మధ్య నలిగి పోకుండ జాగ్రత్తగా మొగ్గను కాపాడి 'నవ్వని పువ్వు'ను సార్థకంచేసినాడు. ఈ నాటికలో కవిపాత్ర ప్రబోధానికి ప్రతీకాత్మకంగా కల్పింపబడిందే. ఈ నాటికలోని— " చివురుటాకులలోన

రవలరేకులలోన
మంచుముత్యాలుంచి
మంచిమధువులనించి
ఉదయభామకరాల
సుధలుజారేవేళ
ప్రకృతిలక్ష్మిదివ్య
పాదపూజలుచేసి
ఎన్నొనోములునోచి
ఎన్నొబాములుసైచి
నిన్నుగనెనీతల్లి
నిండుమమతలవెల్లి

జీవనాడులలోని
శీతాంబువులుపోసి
పాలవెన్నెలలోని
పచ్చిమీగడదీసి
తనమేనిపొత్తిలనే

నునుపాన్పుగాజేసి
ఎంతోగారాబుగా
ఎంతెంతో డాబుగా
కడుపారపోషించె
మనసారప్రేమించె

ఓ చిన్నిమొగ్గా!
ఓ కన్నెమొగ్గా! "

వంటిపంక్తులు అక్షర రమ్యతకూ అర్థ సౌందర్యానికీ భావగాంభీర్యానికీ ఉదాహృతులుగా పేర్కొనవచ్చు. తన పాపను సుకుమారంగా పోషించుకునే ఒక మాతృమూర్తిని పై పంక్తులలో బొమ్మగీసి చూపినాడు నారాయణరెడ్డి.

బహుజనాదరణాన్ని పొందిన ఈ నాటిక ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ప్రసారమైనది. ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళాకళాశాల వారు దీనిని ప్రదర్శించినారు. కవియేగాక నారాయణరెడ్డి మధురగాయకుడు కూడా. ఆతడు రసహృదయుల కోరిక మేరకు అనేకసభావేదికలపై ఈ నాటికను గానం చేసినాడు.

వలపు రేడు :

'నవ్వనిపువ్వు' గేయనాటికల సంపుటిలోని రెండవనాటిక. 'వలపు రేడు.

రేయి, కలువ, తార, చంద్రుడు ఇందలి పాత్రలు.

చంద్రునికినీ రేయి, కలువ, తారలకునూ మధ్యగల ప్రణయమూ, రేయి, కలువ, తారలకు నడుమ చెలరేగిన సవతిపోరాటమూ ఈ నాటికలోని ఇతివృత్తం.

తారాపతి, రేరేడు, కలువల చెలికాడు అనీ చంద్రశబ్దానికి ఉన్న ప్రసిద్ధ పర్యాయపదాలలోని పరమార్థాన్ని గ్రహించి, రమణీయంగా చంద్రునికి ముగ్గురు భార్యలను కల్పించి, వారికి కలహాలు కలిగించి. కడకు ఒక్కచోట చేర్చి నాటికను రక్తికట్టించినాడు నారాయణరెడ్డి. లోకంలో కనిపించే సపత్నుల ఈర్ష్యాద్వేషాలను సహజ సుందరంగా చిత్రిస్తూనే చివరకు—

"తార నా ప్రణయ శో
భారాణి దివిలోన
కలువ నా వలపు వ
న్నెలరాణి భువిలోన
రేయి నా ప్రియరాణి
దివిలోన భువిలోన
ముగురు నా నవప్రేమ
మూర్తులే యౌతారు
కలకాల మిటులెనను

వలపించిపోతారు"—వంటి చరణాలద్వారా సపత్నులకు సహన మవసరమనే సందేశాన్ని అందించినాడు నారాయణరెడ్డి. భిన్నభిన్న వ్యక్తుల హృదయసీమలలో ప్రతిఫలించే ప్రేమ ఆయా వ్యక్తులకు వేర్వేరున్నట్లు కనిపిస్తుందేగాని నిజానికి స్వచ్ఛమైన ప్రేమ ఒక్కటిగానే, అందరికీ సమానంగానే ప్రసరిస్తుందనే యాథార్థ్యాన్ని ఈ నాటిక వ్యంజిస్తున్నది. స్వార్థ దృష్టి కారణంగా ఆ ప్రేమ కేవలం తమకే చెందాలనే భ్రాంతికి గురి ఔతుంటారు కొందరు. విశ్వాత్మక ప్రేమకు అధినాథుడు కాబట్టియే చంద్రుడు 'వలపురేడు' అనిపించుకున్నాడు.

ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారమైనది.

## దగ్ధశాంతి

'నవ్వని పువ్వు' సంపుటిలోని మూడవనాటిక 'దగ్ధశాంతి'. అభ్యుదయకవియైన నారాయణరెడ్డి ఈ నాటికద్వారా యుద్ధవైముఖ్యాన్నీ, శాంతి ప్రియత్వాన్నీ ప్రబోధించినాడు. ఈ నాటికలోని పాత్రలు-శాంతి, మానవుడు, దానవత, అపరిచిత కంఠాలు.

శాంతిని నిర్మూలించే దానవతాశక్తుల విజృంభణాన్ని మానవుడెదుర్కొనలేని విపత్కరపరిస్థితి ఈ నాటికలోని ఇతివృత్తం.

ఈ నాటికలోని గేయాలు కవితావేశంతో కదనుత్రొక్కినవి. ఉదాహరణానికి-'దానవత' పలికిన—

"పచ్చని జీవనవాటుల
ప్రళయాగ్నుల కురిపించీ
వెచ్చని శాంతికపోతీ
పక్షాలను తెగద్రుంచీ
భూవక్షంలో విషఝురి
పొంగులు పారిన్నాడే
నరరుధిర స్రోతస్విని
పరుగులు తీసిన్నాడే
నశియించును విశ్వశాంతి
నా కపుడే మనశ్శాంతి"— అనే మాటలనూ,

లోకంలో క
ల్లోలం లేపీ
మానవతా మం
దారం నలిపీ
ప్రపంచశాంతిని
భగ్నంచేసే
ప్రఫుల్ల కాంతికి
బాటలుమూసే
దానవతా! నీ
దారుణకాండలు
సహించలేమిక
వహించలేమిక" — అంటూ 'మానవుడు' పల్కిన మాటలనూ పేర్కొనవచ్చు. ఈ నాటికకు ఆద్యంతాలలో 'అపరిచితకంఠాలు' ప్రయోగించి భయంకర సమరఘోషను సృష్టించినాడు నారాయణరెడ్డి.

"ప్రపంచమును నిముషములో భస్మీపటల మొనర్చునంతటి పటుతరమైన మారణాయుధాలతో క్రీడలాడు అగ్రరాజ్యముల ధోరణిని అభ్యుదయ కవులు సంహింపలేకపోయిరి. యుద్ధ వ్యతిరేకతను పాటలలో గేయనాటిక

లలో ప్రకటించిరి"[1] అనే నారాయణరెడ్డి సిద్ధాంతగ్రంథంలోని మాటలకు చక్కని ఉదాహరణం ఈ 'దగ్ధశాంతి'. ఈ నాటికలోని

"సమరఘోష సమరఘోష
దానవతా వికటహేష
చీకటి గుండెల జ్వలియించే
కోష్ణరుధిర పిపాస
దారుణ సామ్రాజ్యాంధుల
ఆరని మారణ దురాశ

సమరఘోష సమరఘోష"— వంటి చరణాలలోని ఘో, ధి, ధు వంటి ఒత్తు అక్షరాల ప్రయోగం, సమర, రుధిర, దారుణ, ఆరని, మారణ, దురాశ అనే శబ్దాలందలి రేఫపునరావృత్తి, ఘోష, హేష, దురాశ అనే శబ్దాలలోని శషవర్ణ బాహుళ్యం, వికట, చీకటి, కోష్ణ అనే పదాలలోని పరుషాక్షర సమ్మేళనం భీకరరణవిధ్వంసాన్ని ఘోషిస్తూ విలయవాతావరణాన్ని వ్యంజింపజేస్తూ బీభత్సరసాన్ని ఆవిష్కరిస్తున్నవి. రసానుగుణపద ప్రయోగ దక్షత నారాయణరెడ్డి కలానికి సహజంగా అలవడిందే

విశ్వశాంతి పరిరక్షణం మానవుని కర్తవ్యమని ప్రబోధించే ప్రయోజనాత్మకమైన నాటిక 'దగ్ధశాంతి'.

## భిన్నస్వరాలు:

కవిత్వాది కళలన్నీ శ్రామికవర్గ చైతన్య చిత్రణంకై అంకితం కావాలనే అభ్యుదయకవితాప్రబోధ దృక్పథానికి రూపకల్పనం ఈ 'భిన్నస్వరాలు' నాటిక. ఇందలి పాత్రలు - కళాజీవి, ప్రణయిని, అనాథ, లోకం.

ఒక యువకళాజీవి క్షణికాలైన 'అల్పకామినీ సుఖాల' నాశింపక, 'శ్రమజీవుల మోడుబ్రతుకులను' చిత్రించడమే తన కళాప్రయోజనమని గ్రహించి అందుకు పూనుకోవటమే ఈ నాటికలోని ఇతివృత్తం.

'లోకం'నోట నాటిక ఆద్యంతాలలో—

"జీవన సంధ్యాగీతం

---

1 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు పుట 603 ప్రథమ ముద్రణ జనవరి 1967.

భిన్నస్వర సంకేతం

.... .... .... .... ....

కామినీ దృగంతాలు స్వర్గలో

కాలమాట మరపించూ

పేదవాని కన్నీటిమంటలో

రాతిగుండె ద్రవియించూ"— అనే గీతాన్ని పలికించి నాటికలోని విషయాన్ని కవితాత్మకంగా సూచించినాడు నారాయణరెడ్డి. అతడు 'ప్రణయిని' పాత్రతో భావకవిత్వలక్షణాన్నీ 'అనాథ' పాత్రతో అభ్యుదయ కవితాలక్షణాన్నీ ధ్వనింపజేసినాడు.

ఈ నాటికలోని గేయాలు ఒకచోట లలితసుందరంగానూ మరొకచోట వేడిగానూ వేగంగానూ నడిచినవి.

"ాటుకక్రమింగిన కారుమబ్బులో

వెలుగు నురుగు పారాడూ

పాలవన్నె శంపా పథాలలో

ిలినీడ నడయాడూ"-

"నా కనుల వెలిగించు

నవదీపకళికా!

నా భావి జీవనా

నందాలమొలకా!

నీ విలోకనవాహి

నీ తరంగాలలో

కనులారా గాంతు మో

హనజీవ లాస్యాలు

నీ దరస్మిత వల్ల

కీ నిక్వణాలలో

ఆలింతు నానా క

ళా లలిత భాష్యాలు" వంటి పంక్తులు ఈ నాటికలోని కవితా సౌందర్యానికి నిదర్శనాలు.

# అజంతాసుందరి

నారాయణరెడ్డి సహృదయలోకానికి అందించిన రెండవ గేయ నాటికల సంపుటి 'అజంతా సుందరి'. 'అరుణశ్రీ గ్రంథమాల' సికింద్రాబాదు వారిచే 1955లో ఇది ప్రచురితమైనది. ఈ సంపుటిని నారాయణరెడ్డి తన "ఆప్తమిత్రుడు, కళాకారుడు శ్రీసోమవరం రామమూర్తి మాతృదేవి స్మృత్యంకం"గా సమర్పించినాడు. ఈ సంపుటిలో అజంతా సుందరి, సుగాత్రి, ఋతువుల రాణి అనే మూడు నాటికలున్నవి. శ్రీసోమవరం రామమూర్తిగారు చిత్రించిన చిత్రాలు ఈ సంపుటికి మరింత ఆకర్షణను సంపాదించిపెట్టినవి.

## అజంతా సుందరి

కాల్పనికేతివృత్తం గలిగిన ఈ నాటికలో కళాకారుని జీవనం చిత్రింపబడినది. ఇందులో పాత్రలు రెండే- శిల్పి, శైలబాల.

తాను చెక్కిన ఒక అప్సరస్సుందరీప్రతిమయే స్వప్నంలో సజీవంగా సాక్షాత్కరించగా శిల్పి ఆమెపట్ల మోహపరవశుడు కావటమూ ఆమె అతనికి కళాపారమ్యాన్ని ప్రబోధించి అందకుండ పోవడమూ ఈ నాటికలోని ఇతివృత్తం.

కళ స్వప్రయోజనానికి సాధనం అనే భ్రమకు ఇతివృత్తంలోని స్వప్నం సంకేతం. శిల్పికి స్వప్నభంగం కావడం భ్రమావరణం తొలగిపోవడానికి సంకేతం. ఒక కళాకారుని 'భ్రాంతి'నీ ఆతనిలోని 'ప్రణయ సమ్మోహము'నూ, 'సౌందర్య దాహము'నూ ఈ నాటికలో కమనీయంగా చిత్రించినాడు నారాయణరెడ్డి.

శిల్పి శైలబాలను ఉల్లాసంతో వర్ణించే సందర్భంలోని——

"ఓ అజంతా సుందరీ!
ఓ దిగంత మనోహరీ!

నాలోనిభావసం
ధ్యాశోణిమలమాపి
విందుపున్నమల సం
దించినవిభావరీ?
..... ..... ..... ..... .....
నీ మేఖలాకింకి
ణీ మంజుల ధ్వనులు
నా శిలామయ జీవ
నమునకుపసేచనులు
..... ..... ..... ..... ..... ..... "

"నారాతి బ్రతుకు మం
దారాలు పూచినది "
"అంబరగంగా ఫేనస
మన్వితమ్మౌ నీ దేహము
సందర్శన మాత్రమ్మున
కందిపోవుగాదె చెలీ!" ....వంటి చరణాలూ,

శైలబాల, శిల్పితో పలికే సన్నివేశంలో....

"శిలలలో విమల చం
చలలు నిల్పిన శిల్పి
రాలలో నందన వ
నాలు నాటిన శిల్పి" ....వంటి చరణాలూ

నారాయణరెడ్డి కవితాస్ఫూర్తికి ఉదాహరణాలు.

ఈ నాటికలో 'నేపథ్యకంఠం' ప్రయోగించి సన్నివేశ పరిచయంతో పాటు సందేశాన్ని నిర్వహించినాడు నారాయణరెడ్డి.

"నిగ్రహము లేకున్న
నీ కళార్చనసున్న
సంయోగమేలేని
సౌందర్యమే మిన్న

సృష్టియే తనకుసం
తుష్టిని ప్రసాదించు
ప్రతిఫలము నాశించి
బ్రతుకడు కళాజీవి" అనే పలుకులే ఈ నాటిక కళా ప్రపంచానికి ఇచ్చే సందేశం.

## సుగాత్రి

'అజంతా సుందరి' సంపుటిలోని రెండవ నాటిక 'సుగాత్రి'. పింగళి సూరన కళాపూర్ణోదయకావ్యంలోని సుగాత్రీ శాలీనుల కథను అనుసరించి ఈ నాటికను రచించినాడు నారాయణరెడ్డి. మూడు దృశ్యాలున్న ఈ నాటిక లోని పాత్రలు— సుగాత్రి, శాలీనుడు, సుగాత్రి చెలికత్తెలు.

ఈ నాటికలో 'వాయుగానం' ప్రవేశపెట్టి నారాయణరెడ్డి కథా గమనాన్ని, వర్ణనలనూ నిర్వహించినాడు. ఇందలి వర్ణనలు సంయమనంతో సంక్షిప్త సుందరంగా సాగినవి. ప్రియుడు తనను పల్కరింపకపోగా మరలి పోతున్న సుగాత్రి—

"చండీశ్వరుని తపము
నుండి త్రిప్పగ లేక
తిరిగిపోయెడు పార్వ
తి విధాన" ఉన్నదట!

నగలు పారవేసి నడుముకు పయ్యెద బిగించిన సుగాత్రి—

"నీలజలధరావగుంఠ
నాలు దాటి వెలివచ్చిన
పూర్ణ చంద్రబింబమువలె" కనిపించింది.

శోభనం నాటి తొలిరేయిని—

"ప్రణయ తంత్రులు మ్రోయు
ప్రథమ సంగమ వేళ"గా
"మదనుడు శరమ్ములకు

పదును పెట్టెడు వేళ"గా
"....జీవిత చక్రములో
నిండు వసంతముగ"గా వర్ణించినతీరు శృంగార

రసమధురం.

ఈ నాటికలో నవనవలాడే సూక్తులను పొదిగినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు—

"రస హృదయమ్ముండు నౌర
రాతిబొమ్మలోనైన"
"కాముకులు పఠియింప
గాలేని కావ్యమ్ము
సహజ సౌందర్యమే
సర్వదా సేవ్యమ్ము"....వంటి వాటిని పేర్కొనవచ్చు.

ఈ నాటికలోని సంభాషణలు శాలీనుని సౌందర్యాదర్శంవలె సహజ రమ్యం.

ప్రసార ప్రదర్శనా సౌలభ్యాలను సంతరించుకున్న నాటిక ఇది.

## ఋతువుల రాణి :

'అజంతా సుందరి' సంపుటిలోని మూడవ నాటిక 'ఋతువుల రాణి'. రెండు రంగాలుగా సాగిన ఈ నాటికలోని పాత్రలు మాధవుడు, ఋతువుల రాణి, శిశిరుడు.

శిశిర ఋతువు తరువాత వసంతం వస్తుంది. ఇది ప్రకృతి సత్యం. ఈ సత్యం ధ్వనించేటట్లు ఒక కథ అల్లినాడు నారాయణరెడ్డి. తన ప్రేయసి అయిన ఋతువులరాణిని మాధవుడు శిశిరుని బారినుండి కాపాడుకోవటం ఈ నాటికలోని ఇతివృత్తం.

వసంతర్తువునకు ప్రతినిధి అయిన మాధవుని నాయకునిగానూ వాసంతప్రకృతిని నాయికగానూ శిశిరర్తువును ప్రతినాయకునిగానూ సృజించి కమనీయంగా ఈ నాటికను నిర్మించినాడు నారాయణరెడ్డి.

ఈ వాటికలోని.... "శిశిర నగ్నలతావళికి
ఘుసృణాంబర విన్యాసం
చివికిన రసహృదయాలకు
నవయౌవన సందేశం" .... అనే మధుమాసవర్ణనం

హృద్యం. వసంతభామినిని మాధవుని 'నీల నిశా జీవిత సౌదామని' అని వర్ణించిన సరణి రమ్యం. ఇందులోని భావ చిత్రం తటిత్తులా తళుక్కు మంటున్నది. ఋతువుల రాణి—

"కొలనులోని అం
చలా
మొయిలులోని మిం
చులా".... ఉన్నదట. రెండే రెండు ఉపమానాలతో

ఆకాశాన్నీ అవనినీ ఏక సూత్రంలో బిగించే కవితాశక్తి ఇది. పంచదార గొంతులు, మావిమోవి, చేదు చూపులు పూలచేలము అనేవి రమణీయ పదబంధాలు.

"కొలనులోని అం
చలా
మొయిలులోని మిం
చులా
అయారె! ఒయార
మవర్ణనీయం
వసంత లతాంగి
వరాల ప్రాయం"

చక్కగా అలంకరించుకొని ఋతువులరాణి తన ప్రియుడైన మాధవుని చేర బోతుండగా మార్గమధ్యంలో ప్రతి నాయకుడు శిశిరుడు ఆమె సౌందర్యాన్ని చూసి మోహితుడై వర్ణించిన సందర్భంలోనివి పై పంక్తులు. వీటిలో మొదటి రెండు పంక్తులు త్ర్యస్రగతిలో సాగగా, తరువాతి నాలుగు చరణాలూ చతురస్రగతిలో నడిచినవి. గతిలోని ఈ మార్పునకు కారణం శిశిరుని మనస్సులో క్షణక్షణం ప్రవర్ధమాన మవుతున్న మోహస్థితే; పారవశ్య

గతే. చివరి నాలుగు పంక్తుల్లోని జగణబాహుళ్యం శిశిరుని ఎడదకడలిలో ఎగిరిపడే మోహతరంగాలను స్ఫురింప జేస్తున్నది.

నాటికకు ఆద్యంతాలలో ఉన్న 'బృందగీతి' వసంతర్తు పరిచయంతో పాటు ఇందలి శృంగారరసాన్ని సూచిస్తున్నది. వాయువుతో నాయిక నాయకునికి సందేశం పంపడం ఔచితీభాసురం. దానివలన సందేశం వాయువేగంతో చేరుననీ, వసంతునకు గంధవహుఁడు ఆప్తుడనీ, ఆతడు మహాబలుడు కావున సందేశానికి భంగం వాటిల్లదనీ ఊహించేటట్లు చేసినాడు నారాయణరెడ్డి.

అంత్యప్రాసల అందాలతో మధురభావ సుగంధాలతో సాగిన ఈ నాటికలోని గేయాలు నాటికను కవితాసంవాసితం చేస్తున్నవి.

దృశ్యకళారూపమైన గేయనాటికా ప్రక్రియలో (పద్య గద్య విరహితాలైన గేయనాటికలలో) ఋతువులను పాత్రలుగా సృష్టించి, కథా సంభాషణాంతర్భాగాలుగా ఋతువుల స్వభావ విశేషాలను సంక్షిప్తంగా ఔచితీ దృష్టితో వర్ణించే సంవిధానానికి ఆద్యుడు నారాయణరెడ్డి. ఆతని ఈ 'ఋతువులరాణి' ఆ ధోరణిలో సాగిన ప్రథమ గేయనాటిక. ఇందులో ఋతువులన్నీగాక శిశిరవసంతర్తువులు మాత్రమే పాత్రలుగానూ, హేమంతం నామ మాత్రంగానూ పేర్కొనబడినవి. ఇది ఈ నాటిక ప్రత్యేకత.

# వెన్నెలవాడ

'వెన్నెలవాడ' నారాయణరెడ్డి మూడవ గేయనాటికల సంపుటి. ఇది 1959లో ముద్రితం. ఇందులో గతంలో ప్రచురితమైన నవ్వనిపువ్వు, అజంతా సుందరి నాటికలతోపాటు వెన్నెలవాడ, దివ్వెలసంగీతం, సంక్రాంతి, గోకులవిహారం, మనిషి-యంత్రం అనే నాటికలున్నవి. ఈ సంపుటిని తనకు ఆప్తమిత్రులూ, సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకులూ శ్రీ బి. ఎన్. రెడ్డి గారికి అంకితం చేసినాడు నారాయణరెడ్డి.

# వెన్నెలవాడ

వెన్నెలవాడ బహుళప్రచారం పొందిన రచన. ఈ నాటికలోని పాత్రలు - కలువలు, కలువలరాణి, చంద్రుడు.

చంద్రకిరణస్పర్శతో కలువలు వికసిస్తాయనే కవి సమయమాధారంగా ఈ నాటికలోని కథను అల్లినాడు నారాయణరెడ్డి. శరదృతువులోని ఒక రాత్రి వేళ కలువలరాణికి తన వలపు నందించటానికి బయలుదేరిన చంద్రునికి మేఘుడు అవరోధం కల్పించగా కలువలరాణి వాయువును ప్రార్థించి, మేఘుని తొలగింపజేసి, ఆతనితో ఆనందం అనుభవించటం ఈ నాటికలోని ఇతి వృత్తం.

ఈ నాటికకు ఆది మధ్యాంతాలలో వాయుగానాన్ని నేపథ్యగానాన్ని ఉపయోగించి, సన్నివేశపరిచయాన్నీ కథాగమనాన్నీ నిర్వహించినాడు నారాయణరెడ్డి.

సందర్భోచితంగా సంక్షిప్త వర్ణనలు గావించి నాటికను కవితాపరిమళంతో గుబాళింపజేసినాడు ఈ కవి.

"మత్తేభాల విధమ్ముగ
మల్లాడిన మబ్బుగములు
భుజగమ్ముల చందమ్మున
బుసకొట్టిన కొసమెరుపులు
తలలువంచి ఎటకో పరు
వులు తీసిన శుభసమయం" – అనే శరదాగమన వర్ణనం

సహృదయుల హృదయాలలో వెన్నెలవాడలను పరుస్తుంది. మేఘంనుంచి విముక్తుడైన రాకాచంద్రుడు–

"అప్పుడప్పుడె రచిత
మైనట్టి చెంగల్వ
పూల గుచ్ఛము లీల
పొలిచె"నట. ఇందలి ఉపమానం ఉల్లంలో పరిమళతరంగాలను లేపుతుంది.

ఈ నాటికలోని గేయాలు సంగీత నృత్యానుకూలములై నారాయణరెడ్డి కవితాహృదయాన్ని ఆవిష్కరిస్తున్నవి. ఉదాహరణకు - కలువలు, కలువల రాణి చంద్రుని స్పృశించి కిలకిలనవ్వే సందర్భంలోని–

"వెన్నెలదొరా చిన్నెలదొరా
వన్నెల కలువల కన్నెలదొరా
గుండెలలో దాగుండిన ప్రేమల
దండలన్ని నీకొరకే
పెదవుల లోపల ఒదిగిన నవ్వుల
సుధలన్నీ నీ కొరకే
నీ నునువెల్గుల చేతులలో బం
దీనై పోదునురా
నీ వెన్నెల సామ్రాజ్యంలో రా
ణీనై పోదునురా" వంటి గేయఖండికలను పేర్కొనవచ్చు.

ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ప్రసారితమైన ఈ నాటిక తెలంగాణా రచయితల సంఘవార్షికోత్సవాలలోనూ ఆంధ్రాభ్యుదయోత్స వాలలోనూ బందరు మున్నగు ప్రాంతాలలోనూ ప్రదర్శితమై విశేషప్రచార ప్రశంసల నందుకున్నది. "శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారి సంగీత దర్శ కత్వం, కుమారి యం. జానకీరాణిగారి నృత్యదర్శకత్వం, శ్రీ చిత్తరంజన్ ప్రభృతుల గాంధర్వం సమష్టిగా రూపొంది ఈ వెన్నెలవాడకు అపూర్వ విజయాన్ని చేకూర్చినవ"ని 'మున్నుడి'లో తెలిపినాడు నారాయణరెడ్డి.

# దివ్వెల సంగీతం

ఈ నాటిక ద్వారా నారాయణరెడ్డి సమతను ప్రబోధించినాడు. ప్రియుడు, ప్రేయసి, తారలు, దివ్వెలు ఈ నాటికలోని పాత్రలు. ఇందులో దివ్వెల సన్నివేశంతోపాటు ప్రేయసీప్రియుల శృంగార సన్నివేశ మొకదానిని హృద్యంగా కల్పించి నాటకీయతకు అవకాశాన్ని కలిగించినాడు నారాయణ రెడ్డి.

దీపావళివేళ మింటవెలిగే తారలు నేలపైనగల మట్టిదివ్వెలనూ తారా జువ్వలనూ వెక్కిరించగా, దివ్వెలుకూడా తారలను ధిక్కరిస్తాయి. ఈ విధంగా పరస్పరం తారలూ దివ్వెలూ కలహించుకునే దృశ్యాన్ని ప్రేయసీ ప్రియులు తిలకిస్తారు. ఆ సమయంలో 'వాయుగానం' వినిపించిన—

"ఆకాశమే అమావాస్య
చుక్కలే దివ్వియలూ
ఆకృతులే వేరువేరు
ఆత్మమాత్ర మొకటే" — అనే సందేశాన్ని విని, వారిలో 'యౌవనదీపమాల' వెలుగగా ప్రేయసీ ప్రియులు నిష్క్రమిస్తారు. ఇవి ఈ నాటికలోని సన్నివేశాలు.

ఈ నాటికలో తారలను వర్ణించిన తీరు హృదయంగమం. తారలు—
మింటి శిరసుపై ఒంటిగమెరిసే
శాశ్వత తేజస్సౌధము జేర్చగ
వెలసిన పూవుల దారుల"ట.

ఈ నాటికలో 'వాయుగానం' ప్రవేశపెట్టి, తన్మూలంగా తారల దివ్వెల కలహాన్ని పరిష్కరించి వాటికి సందేశము నందించినాడు నారాయణరెడ్డి 'వాయుగానం'లోని వచస్సులే ఈ నాటికలోని ప్రబోధం.

# సంక్రాంతి

సంక్రాంతి సంబరాలను సాంసారిక జీవితంతో మేళవించి లలిత శృంగారహాస్యతరంగితంగా నారాయణరెడ్డి ఈ నాటికను నిర్మించినాడు. మూర్తి, లక్ష్మి, లత, గంగెద్దులవాడు ఈ నాటికలోని పాత్రలు.

లక్ష్మి-మూర్తి ఆలుమగలు. లత మూర్తి చెల్లెలు. ఈ ముగ్గురి మధ్య తీవెలుసాగిన సంభాషణం రమణీయం.

ఈ నాటికలోని — "సెవగపూవు చిన్నది ప
చ్చని పైటను సవరించెను

గుమ్మడిపూ ముత్తైదువ
గుండెనిండుగా నవ్వేను" — వంటి పంక్తులు సంక్రాంతి ప్రకృతిని మనోహరంగా వర్ణిస్తున్నవి. లక్ష్మి కపోలఫలకాలు— "తొలిసందెవోలె తళుక్కులు" చిలుకుతున్నవట. అరుణోదయంలాంటి అందమైన ఉపమానం.

ఈ నాటికకు ఆద్యంతాలలో వాయుగానం, మధ్య చందమామ గొబ్బిళ్ల బృందగానం ప్రయుక్తములైనవి. ఈ నాటిక ఆకాశవాణి హైద్రాబాదు కేంద్రం నుంచి ప్రసారితమైనది.

# గోకుల విహారం

ఈ నాటికకు మాతృక పోతన భాగవతమునందలి దశమస్కంధం. గోపికలు, గోపకులు, యశోద, కృష్ణుడు, రాధ ఈ నాటికలోని పాత్రలు.

శ్రీకృష్ణుని జననోత్సవం, ఆతని దుడుకుచేష్టలు, యశోద మందలింపులు, యమునాతీరంలో రాధాగోపికల కృష్ణాన్వేషణం, వారి విరహం, చివరకు శ్రీకృష్ణుడు రాధాదులను ఏలుకోవటం అన్నీ కళ్లకు గట్టినట్లు చకచకా నడిచినవి ఈ నాటికలో.

యమునాతీరంలోని గోపికలలాగా మెరుస్తున్నవి ఈ నాటికలలోని వర్ణనలు. ఉదాహరణానికి కొన్ని— కృష్ణుడవతరించిన వేళ—

"బాలచంద్రుని గన్న
పాలసంద్రము వోలె
భానుమూర్తిని గన్న
పద్మాకరము వోలె"—

గోకులం ఉప్పొంగినదట. ఆ చిన్నికన్నయ్య కన్ను విప్పినవేళ—

"తల్లిగోవులు పాల
జల్లులను కురిసినవి
పిల్లలేగలు పొంగి
క్రేళ్లురికి మసలినవి

కోడెగిత్తలు మూపు
జాడించి యెగిసినవి" —

ఇందలి చివరి రెండు పంక్తులు సహజమధురములు. శ్రీకృష్ణుని దుడుకు చేష్టలను యశోదతో చెప్పుతూ ఒకగోపిక—

"లేదో యశోదమ్మ!
నీదాపునే యున్న
నల్లనయ్యను తెలుసు
కొన్న తెల్లమ్మగును"—

అని అంటుంది. 'తెల్లమ్మగును' అనే ప్రయోగం చమత్కార గర్భితం.

నాటికాంతంలో ఉన్న-" లేలెమ్మొ రాధికా!
రారమ్మొ రాధికా!
ప్రణయకింకిణులు మ్రోగే
అమృత నాట్యవేదికా!
రారండీ నా వరాల గోపికలారా!
ఆరిపోని చిరస్నేహదీపికలారా!
మన ప్రేమలు పూలగుండె
లను లేచు పరిమళమ్ములు
ఆకార విరహితమ్ములు
అనుభవైక వేద్యములు" -

అనే పాట ఈనాటికలోని రచనాసౌందర్యానికి నిదర్శనం.

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారితమైన ఈ నాటిక ప్రదర్శనానుకూలం.

# మనిషి - యంత్రం

నారాయణరెడ్డి గేయనాటికలన్నింటిలో వచనకవిత కలసిన ఒకేఒక్క నాటిక ఈ 'మనిషి-యంత్రం'. మిగిలినవన్నీ గేయైకములు లేదా గేయ-వచన మిశ్రితాలు. ఈ నాటిక ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంనుంచి ప్రసారమైనది.

మనిషి యంత్రానికి బానిసకాకూడదని ప్రబోధిస్తున్నదీ నాటిక. పక్షులు, మానవుడు, యంత్రం, పుష్పం ఈ నాటికలోని పాత్రలు.

తనకు బానిసగా భావించిన మానవునిపై యంత్రం దాడివెడలి తనకు అడ్డువచ్చిన పుష్పాన్ని నలిపివేయగా మానవుడు నిస్సహాయుడై నిలిచిపోయిన విషాదగాథ ఈ నాటికలోని ఇతివృత్తం.

నాటికాద్యంతాలలో వినిపించే పక్షులగానం నాటికా కథాపరిణామాన్ని సూచిస్తూ సందేశాన్ని కవితామయంగా వ్యాఖ్యానిస్తున్నది.

"యంత్రం ఒక మదపుటేనుగైతే
నీవు మావటీడవు కావాలి
యంత్రం ఒక వారిధియైపోతే
నీవొక వారధియై నిల్వాలి

అణుగోళమ్ములను పిండి
అమృతం ఒలికించాలి
కర్మాగారమ్ములందు
కళలను పలికించాలి
పూలలోని అమాయికత
ఆలంబము కావాలి
అమృతాంశుని త్యాగశీల
మాదర్శము కావాలి"—

అనే పంక్తులు సందేశగర్భితాలు. ఈ నాటికలో 'ఆటంబాంబు', ట్రాక్టర్లు, ఆటమిక్ రియాక్టర్లు, హెలికాప్టర్లు, మార్జిన్, ఫ్యాక్టరీలు వంటి ఆంగ్లపదాలను వస్తు-పాత్ర-సన్నివేశముల ఔచిత్యాన్ని దృష్టియం దుంచుకొని ప్రయోగించి నాడు నారాయణరెడ్డి. ఈ నాటిక కవితాత్మకంగా సాగింది.

# తరతరాల తెలుగువెలుగు

1975 ఉగాది ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రత్యేక ప్రదర్శనార్థం నారాయణరెడ్డి "తరతరాల తెలుగువెలుగు" అనే ఈ 'నృత్య గేయ రూపకము'ను రచించినాడు. ఈ రూపక రచనకు ప్రేరణను కలిగించినవారు నాటి విద్యాశాఖామాత్యులు శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు, సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు. ఈ నాటికకు దర్శకత్వం వహించినవారు భరత కళాప్రపూర్ణ శ్రీ నటరాజ రామకృష్ణగారు, సంగీత దర్శకత్వం నిర్వహించినవారు శ్రీ పి. రాధాకృష్ణగారు. అసంఖ్యాక ప్రేక్షకులను అలరించిన ఈ నాటికను 'స్పందన సాహితీ సమాఖ్య' మచిలీపట్టణంవారు ప్రచురించి ఆంధ్రులకందించినారు 1975 నవంబరులో.

'తరతరాల తెలుగువెలుగు' నాటిక గేయ పద్య గద్యాత్మకంగా నడిచింది. ఐతరేయ బ్రాహ్మణముల కాలంనుంచి ఆంధ్ర ప్రదేశావతరణం వరకూ గల 'ఆంధ్ర పురారమ్య చరిత్ర' సంస్కృతులకు సంబంధించిన సముజ్జ్వల ఘట్టాల కవితాత్మక చిత్రణమే ఈ నాటికలోని ఇతివృత్తం.

కథాగానాలతో, సంధివచనాలతో, బుర్రకథలతో, జావళులతో, పూర్వకవుల కమనీయ పద్యాలతో, పదకవుల సంకీర్తనాలతో, భామాకలాపాలతో ఈ రూపకం వివిధ విచిత్ర కళా సమ్మేళనానికి నిదర్శనంగా అగుపిస్తుంది. కథాగానం జరుగుతుండగా రంగస్థలంపై అభినయం సాగడం ఈ రూపక ప్రదర్శనంలోని ఒక విశేషం. రసానుగుణంగా ఈ నాటికలో గేయాలు భిన్న భిన్న గతుల్లో పరుగెత్తినవి. ఉదాహరణకు—

"పులిపులి బొబ్బిలి బెబ్బులి
కణకణమండే నిప్పుల పిడికిలి
పటపట పటపట పండ్లుకొరికెరా
ఛటఛట ఛటఛట ముందుకురికెరా" వంటి పంక్తులు రౌద్ర

రసానుకూలంగా తరగెత్తినవి. ఈ పంక్తుల్లో లఘ్వక్షర సమ్మేళనంచేత ఏర్పడిన ద్రుతలయ రౌద్రరస పోషణకు దోహదం చేస్తున్నది. బొబ్బిలియుద్ధం

బుర్రకథలోని పై పంక్తులు తీంర్డించిన తాంర్ర పాపయ్య రౌర్రాన్నీ పౌరుషాన్నీ ప్రకటిస్తున్నవి.

"ఎక్కడరా ఓ హైదర్-నీదో
క్షుక్కచావురా గద్దార్!"

వంటి పంక్తుల్లోని ఉర్దూపదప్రయోగం రసపాత్రౌచిత్యాలను దృష్టియందుంచుకొనే చేసినాడు నారాయణరెడ్డి.

ఈ నాటికలోని గేయాలేకాదు - సంధివచనాలుకూడా అంత్యప్రాసల అందాలను, కవితా సుగంధాలను వెదజల్లేవే. విరజిమ్మేవే.

"కలమును ఖడ్గముగా ఝళిపించిన
కందుకూరి సంస్కరణ రణంలో-
వాడుకభాషను నిలబెట్టగ పో
రాడిన గిడుగు మహోద్యమ ధృతిలో-
ప్రజల భాషలో సజీవ కవితలు
పలికించిన గురజాడ జాడలో-
రాష్ట్రిస్తుతికై నాందిపలికిన
రాయప్రోలు రసార్ద్రగీతిలో-"

"తెల్లదొరల గడగడలాడించిన
అల్లూరి విప్లవాగ్నికీలలో-
రామదండు నడిపించిన స్వేచ్ఛా
రథి దుగ్గిరాల కార్యదీక్షలో-
సింగంలా శత్రుల కెదురొడ్డిన
టంగుటూరి గర్జారవమ్ములా-
ఆంధ్రరాష్ట్రిమును సాధించిన మన
అమరజీవి ఆత్మార్పణమ్ములో"

తెలుగుజాతి చైతన్యపాఠాలు నేర్చుకున్నదని ఎంతో చక్కగా చెప్పినాడు నారాయణరెడ్డి.

"ఇదేఇదే తెలుగునేల - నవకాంతులు
వెదజల్లే దీపమాల!
గోదావరీనదీ
స్వాదు తరంగాలతో
కృష్ణవేణి కేలు కలిపి ఆడింది-
తుంగభద్ర జలతరంగ
రంగముపైన
మంజీర మహోదార మధుగీతం పాడింది"

అనే దీపనృత్యగేయంలోని గోదావరీ కష్ణవేణీ మంజీరా నదుల సమైక్యం కోస్తా, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల సమైక్యాన్నీ, మహాంధ్ర రాష్ట్రావతరణాన్నీ ధ్వనింపజేస్తున్నది. తెలుగుల సమైక్యాన్నీ, అభ్యుదయాన్నీ ఈ నాటికలో ఆకాంక్షించినాడు నారాయణరెడ్డి. ఆంధ్రజాతి వైభవగానంతో ఆరంభమైన ఈ నాటిక ఆంధ్రప్రదేశ సమైక్య ప్రగతి ప్రస్తుతితో సమాప్తమయినది.

ఆంధ్రప్రదేశావతరణ దినోత్సవం (1-11-1975) సందర్భంగా ఈ రూపకం ఆకాశవాణిలో కూడా ప్రసారితమైనది.

ప్రపంచ మహాసభల సందర్భంగా జరిగిన ఈ రూపక ప్రయోగంలో నారాయణరెడ్డి స్వయంగా వ్యాఖ్యానాన్ని నిర్వహించి సహృదయులను రంజింపజేసినాడు.




# జలపాతం

నారాయణరెడ్డి 1948లో 1949లో ఆ తర్వాతనూ రచించిన కావ్య ఖండికలను 'జలపాతం' అనే పేర అరుణశ్రీ గ్రంథమాల - సికింద్రాబాదు వారు 1953 అక్టోబరులో ప్రచురించి సాహిత్యజగత్తునకు కానుకగా సమర్పించినారు. ఆనాడు ఈ గ్రంథమాల నిర్వాహకులు ఈనాటి ప్రసిద్ధ చిత్రకళాకారులైన శ్రీ మడిపడగ బలరామాచార్యులుగారు. నారాయణరెడ్డి ఈ రచనాకాలంలో ఎం.ఏ. అధ్యయనం చేస్తూ ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనం, డా॥ దివాకర్ల వేంకటావధానిగార వంటి సాహిత్యగురువుల సన్నిధిలో రసరహస్యాలను జిజ్ఞాసువై గ్రహిస్తున్నాడు. మరోవైపు తెలంగాణా రచయితల సంఘంవంటి సాహిత్య సంస్థలతోనూ, శ్రీ దాశరథి, కాళోజి, రామరాజు, వరదాచార్య, పల్లా దుర్గయ్య, ఆళ్వారుస్వాముల వంటి రసమూర్తులైన కవులతోనూ, శ్రీ బలరామాచార్యుల వంటి కవిమిత్రులతోనూ సాహిత్యాభిమానులతోనూ సన్నిహిత సంబంధం గలిగి తెలంగాణాలో కవిత్వాన్ని

ఉద్యమరూపంలో ప్రవహింపజేస్తున్న కవులలో ఒకడుగా కదంతొక్కుతున్నాడు. అప్పటికే శ్రీ దాశరథిని నారాయణరెడ్డిని తెలంగాణా కవిలోకం తన నయనయుగళంగా భావించింది. ఆనాటికే శ్రీ దాశరథి మహాకవిగా— "దాశరథియే తెలంగాణము - తెలంగాణమే దాశరథి" అన్నంతగా ప్రఖ్యాతిని సంపాదించుకున్నాడు. శ్రీ దాశరథి అన్నివిధాలా నారాయణరెడ్డికి అండగా ఆదర్శంగా నిలబడిన వ్యక్తి. కాబట్టియే నారాయణరెడ్డి తనలో 'పొదుకున్న సాహిత్యానికి చిహ్నంగా' ఈ 'జలపాతం' కావ్యాన్ని ఆ మహాకవికి అంకితమిచ్చినాడు.

ఈ 'జలపాతం' కావ్యసంపుటిలో ముప్పైతొమ్మిది ఖండికలున్నవి. ఇవి గణబద్ధ ఛందస్సులోనూ మాత్రాచ్ఛందస్సులోనూ వచనగేయ రీతిలోనూ నడిచినవి. వీటిలో విరహవేదనలు గల్గిన పద్యాలూ, కల్పనా చిత్రణా ప్రధానంగానున్న రచనలూ ఉన్నవి.

ఈ సంపుటిలోని 'నివేదన' అనే మొదటి ఖండికలోని చివరి పద్యంలోని— "'జలపాతమ్ము'లవోలె దూకుదము విశ్వశ్రీసాహితీ శృంగముల్" అనే పాదంలోనూ, సంపుటిలోని చివరి ఖండిక 'రాష్ట్రావతరణం'లోని— " 'జలపాతం'వోలె తెలుగు జాతినేడు ప్రవహించెను" అనే చరణాల్లోనూ 'జలపాతం' అని ప్రయోగింపబడింది. ఆద్యంత శీర్షికలలో కావ్యనామ ముండటం ఒక విశేషం,

'నివేదన'లోని ఒక పద్యంలో శ్రీ దాశరథిగారి కవితాశక్తిని ఇలా ప్రశంసించినాడు—

"దాశరథీ! మనోజ్ఞకవితాశరథీ! శరదిందు చంద్రికా
పేశల కావ్యఖండముల పిండిన నీ కలమందునన్ మహో
గ్రాశనిపాతముల్ వెలయునౌర! మహేశుని కంటిలో సుధా
రాశి తరంగముల్ కటు హాలాహల కీలలు పొంగినట్లుగా"

దాశరథి తనకు చేసిన సహాయాన్ని నారాయణరెడ్డి ఇలా తెలుపుకున్నాడు—

"నా తరుణ కావ్యలతికలానాడు పైకి
ప్రాకలేక దిక్కులు సూడ; నీ కరాలు

సాచి లేతరేకులకు కెంజాయలద్ది
మించు పందిళ్లపైకి ప్రాకించినావు."

ఒక పద్యంలో కాలసమాధిలో కన్నుమూసిన తన మాతృమూర్తిని తలంచుకుని నారాయణరెడ్డి బాధపడ్డాడు. ఎన్ని బాధలున్నా— "నిత్యమొక పద్య మాలికను సంధానించి శాంతించెద" నన్నాడు. అంతటి కవితా తపస్వి నారాయణరెడ్డి. చెడును నిరసిస్తూ 'తమ్ముడా' అని మనసారా పిల్చు 'తెల్గన్నలు' అందరూ తనకు అన్నలౌతారన్నాడు. దాశరథికీ తనకూగల స్నేహబంధాన్ని పురస్కరించుకుని ఈ విధంగా అన్నాడు—

"కలకాలమ్ములు నీవునేనిటులె స్నిగ్ధస్నేహబంధాల బ
ద్ధులమై యుందము; ఏకగీతి నిరుగొంతుల్ విప్పి విన్పింత; మాం
ధ్రుల చైతన్య విపంచికావళులు విద్యున్నాదముల్ సేయగా
జలపాతమ్ములవోలె దూకుదము విష్వక్సాహితీశృంగముల్"

ఈ సంపుటిలో సూర్యోదయ, వర్షర్తు, వసంతర్తు, స్త్రీ సౌందర్య విరహవేదనా సంబంధములైన వర్ణనలు పద్యాల్లో ఉన్నవి. ఈ వర్ణనలలో ప్రబంధ కవుల, భావకవుల, అభ్యుదయకవుల ఛాయలు స్ఫుటరేఖలతో కనపడుతున్నవి. శ్రీనాథుడు, శ్రీశ్రీ, దాశరథి కవుల ప్రభావం నారాయణరెడ్డిపై ఉన్నది. అయిననూ నారాయణరెడ్డి తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొనుటకు ప్రయత్నించినాడు.

'మరీచికలు' శీర్షికలో విరహబాధను గూర్చి వర్ణిస్తూ చెప్పిన—
"చలువ వెన్నెలలో; మందమలయ వాయు
వీచికలలోన విహరింప వెడలిపోతి
చలువ వెన్నెల వేడిగా; మలయమృదుల
వాయువులు వాడిగా హృదికోయదొడగె"

అనే పద్యంలో ప్రబంధ కవితాచ్ఛాయలు కనపడతాయి. 'ఆర్తి' కవితలో 'విధురజీవి వెతలు' వర్ణింపబడినవి. అందులోని

"నను విషాదాంత నాటక నాయకుడని
పరిహసించి లోకంబు సంబరముజెందు

నా విషాదనిశావేది నాట్యమాడు

మెరుపు తీగెల ఆనంద మెరుగలేక"

అనే పద్యంలో భావకవుల ప్రణయతత్త్వంలోని ఆత్మాశ్రయరీతి, అందలి విషాదస్థితి మెరుపుల్లా స్ఫురిస్తాయి.

నారాయణరెడ్డికి అభ్యుదయకవిత్వంతో అపార పరిచయమున్నట్లు ఈ సంపుటిలోని కొన్ని ఖండికల ద్వారా తెలుస్తుంది. అభ్యుదయ కవితా ప్రభావం నారాయణరెడ్డిపై ఉన్నది. 'ఉదయధ్వజం' అనే ఖండికలో సూర్యోదయాన్ని వర్ణిస్తూ చెప్పిన—

"కరకు రాచరికమ్మును తరిమివేయ

శ్రామికులు లేవనెత్తిన క్రాంతి వైజ

యంతివోలిక; నైశికాంధ్యమ్మడంప

ప్రాగ్ధరణి సాచె ఉదయసూర్యధ్వజమ్ము"

అనే పద్యంలో అరుణ పతాకాన్ని సూచించి శ్రామికవర్గ చైతన్యాన్ని ధ్వనింపజేసినాడు. అదే విధంగా 'ఉగాది'లో 'అరుణ పుష్పాలకీలలు' 'అమల సమతా పతాకమ్ము'లుగా నున్నవని అన్నాడు.

"...............తరుణీకుచాలు నొవ్వ

పువ్వు విలుకాడు బాణాలు రువ్వినట్లు"

ఊష్మంతో 'ఉడికిపోవు మల్లె మొగలపైన' వడగళ్లు రాలినాయని వర్షావతరణమును శృంగార రేఖలతో చిత్రిస్తూనే - మరో పద్యంలో—

"మేడలోని ధనస్వామి, నీడలేని

తాడితప్రాణి స్నేహసూత్రాలలోన

ముడివడు" నట్లుగా వర్షంలో గగనభూతలాలైక్యమై పోయినవని వర్ణించి సమతాభావాన్ని వ్యంజింపజేసినాడు నారాయణరెడ్డి.

తొలినాళ్లలో శ్రీశ్రీ గారి ప్రభావంతో నారాయణరెడ్డి అభ్యుదయ గేయాలు రచించినట్లు ఈ సంపుటివల్ల తెలుస్తుంది. ఇందలి 'మానవతా' అనే దీర్ఘవచన గేయాన్ని చదువుతున్నప్పుడు శ్రీశ్రీ 'కవితా ఓ కవితా' అనే ఖండిక మదిలో కదలుతుంది. నారాయణరెడ్డికి గల ఐతిహాసిక పరిజ్ఞానానికీ, సాంఘిక శాస్త్రాధ్యయనానికీ, నిశిత పరిశీలనాశక్తికీ విశ్వమానవదృక్పథానికీ ఈ కవిత ఆదర్శం. ఇందులో

"మనిషి మనిషిని మనస్సు మనస్సును
పరస్పరంగా పరిశీలించుకున్ననాడే"
"అణుజాలంనుండి అమృతం పిండిన్నాడే"

మానవతకు విముక్తి అని ప్రబోధించినాడు కవి.

మారణాయుధాలతో క్రీడలాడే అగ్రరాజ్యాల రణదాహాన్ని అభ్యుదయ కవి నారాయణరెడ్డి నిరసిస్తూ—

"అమృతం పండించే 'అణు'బీజాలనుండి
విషపూరిత మృత్యుసస్యాలను మొలిపిస్తున్న
శాస్త్రజ్ఞులారా !
పరమాణువుల రగిల్చి
చరిత్రను పొగచూరనీయకండి !"

అని శాస్త్రజ్ఞులను హెచ్చరించినాడు.

యుద్ధోన్మాదుల నుద్దేశించి—

"గుండెలు పగిలిన నగరాల ఆర్తఘోష
ఇంకా వింటూనేఉన్నాం—
పచ్చని భూమితల్లి వక్షస్థలి పుచ్చిపోతుండగా
ఇకమీదట చూడలేం—"

అని దైన్యాన్నీ, దారుణవేదననూ ప్రకటించినాడు. ఈ కవి యుద్ధవిముఖతకూ శాంతిప్రియతకూ ఎత్తినపతాక ఈ ఖండిక.

"వల్లకాడు స్మృతికిరాగానే
త్రుళ్ళిపడుతావెందుకు ?
సమతాపాఠం నేర్చుకోవాలంటే
శ్మశానమే సహజకావ్యం సుమా !"

వంటి పంక్తులవల్ల తరుణవయస్సులోనే నారాయణరెడ్డి బ్రతుకులోతులను ఎలా స్పృశించినాడో తెలుస్తుంది.

నిశ్శబ్దత సంఘంలో అసాధ్యమన్నాడీ కవి.

"ప్రాతస్సంధ్యా నేత్రం
ప్రసవించే పర్యంతం
నిశితనిశా నిస్త్రింశం
నీడల్లో నిలిచేమా ?"

అని ఎదురుతిరిగి వేకువజామున వెలుగందించటానికి వేరే కావలసిన పని లేదని—"నిశలో ఉష వెల్గింపగ నిల్వండి జనుల్లారా !" అని విప్లవశంఖమెత్తి నాడు నారాయణరెడ్డి. విప్లవ ప్రబోధం అభ్యుదయ కవితాధోరణులలో ఒకటి కదా ! నిశ నిస్తబ్ధతకూ నైరాశ్యానికీ ప్రతీక. దీన్నిచీల్చుకొని ఉషోదయానికి అంకురార్పణ చేసినవాడే నిజంగా వీరుడు. వేకువజామున వెలుగందించేవాడు నారాయణరెడ్డి దృష్టిలో సామాన్యాతి సామాన్యుడు. కనుకనే—

"తెలంగాణమ్ము తనుఃకవాటముల బందీయైన నిశ్శబ్ద రా
త్రులలో మేల్కొని 'కోటితమ్ము'లను మేల్కొల్పన్ మహోల్లాసము
జ్వల కాంతిస్ఫురదగ్నిగీతికలు అభ్రమ్మంటగా పాడి తె
గ్గలలో వెల్గుల నాటినట్టి కవితాలోకప్రభానీరధి"

అయిన దాశరథికి తన ఈ జలపాతం కావ్యాన్ని అంకితం చేసినాడు.

'యుగప్రగతి' అనే ఖండికలోని—

"భూరివృక్షం జారిపడ్డపుడే
లేతమొక్క పైకిలేస్తుంది
పసిడిమేడ ప్రక్కకొరిగినపుడే
అడుసుగుడిసె నడువనేరుస్తుంది"

వంటి పంక్తులలో వర్గసంఘర్షణను తన ప్రకృతి పరిశీలనా నైశిత్యంతో కవితాత్మకంగా చిత్రించినాడు నారాయణరెడ్డి.

"ప్రియాంగనా గాఢపరిష్వంగంలో
పీయూష వల్లకీ వల్లికల
మ్రోయిస్తున్నప్పుడు—
అంగార గీతికాప్రసక్తి
అసలే వుండదు
ప్రపంచదిశా కుహరకుడ్యాల్లో
ప్రళయహేషా ఘోషలు
ప్రతిరణిస్తున్నప్పుడు—
విరహ 'ప్ర-బంధా'ల ముళ్లు
విప్పుతూ కూర్చోలేం" ('ప్రస్తావనరానేరాదు'-లో)

మానవ హృదయం కేవలం ప్రణయానికో ప్రళయానికో కట్టుబడి ఉండడం

అసాధ్యం. నిజానికి ఈ రెంటికి సమన్వయమున్నప్పుడే సమగ్రజీవితం రూపుదిద్దుకుంటుంది. కాలాన్నీ, కాలం విలువనూ, వ్యక్తినీ, ప్రపంచాన్నీ సందర్శించి, కలిగిన అనుభూతులను అభివ్యక్తం చేయగలగటం ఉత్తమ కవితా లక్షణం. పై పంక్తుల్లో నారాయణరెడ్డి పరస్పరవిరుద్ధంగా కనిపించే అంగార శృంగారాలకు సమపాళంగా స్థానం కల్పించి వెలుగునీడల మేలి కలయికవల్ల ఆకృతి ఏర్పడుతుందని నిరూపించగలిగాడు. సమకాలిక సామాజిక పరిస్థితులను అవగాహన చేసికొని తదనుగుణంగా హృదయ స్పందనం పొంది కవితావిష్కృతికి ఉద్యమించటం సత్కవిలక్షణమని ఈ ఖండికలో వ్యంజించినాడు నారాయణరెడ్డి.

విజ్ఞానయాత్రా సందర్భంగా సహవిద్యార్థులతో కలసి ఎల్లోరా గుహలను సందర్శించినప్పుడు నారాయణరెడ్డి డెందం స్పందించింది. ఆ స్పందనమే ఈ కావ్యంలోని 'ఎల్లోరాగుహలు' అనే కవితగా పెల్లుబికినట్లు నారాయణరెడ్డి గారికినీ నాకునూ ఆప్తమిత్రులైన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు తెలిపినారు.

"సీమంతంగలవారికి 'సీమంతిని' అని వాడుక—
పురుషుడికే సీమంతముంటే...." వంటి హాస్యస్ఫోరకాలైన

పంక్తులూ,

"మూతిముడుచు కున్న పువ్వు మోమెవ్వడు చూస్తాడు?
విరగనవ్వు పూలతోనే సరసాలాడును తుమ్మెద,"

వంటి సూక్తులూ ఈ సంపుటిలో కనిపిస్తాయి.

"గతం పూడ్చివేసి భావి
గతులను నిర్మించలేవు
గతగర్భం త్రవ్వుకుంటె
రతనాలు లభిస్తాయట!"

వంటి పంక్తులు గతాగతాలకు సేతువులై ఈ కవి సమన్వయశీలతను ప్రత్యక్షంచేస్తాయి.

1953లో పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్రనిర్మాణానికై ఆత్మార్పణచేసిన సందర్భంగా ఆంధ్రరాష్ట్రమంతటా చెలరేగిన అలజడిని పురస్కరించుకొని—

"విరుచుకుపడు ప్రజావాహిని
కెదురీతలు వ్యథావ్యథా
శివమెత్తిన ప్రళయాగ్నులపై
చిరుతుంపర వృథావృథా"

అని ప్రత్యేకాంధ్రరాష్ట్రవాంఛాపాంచజన్యాన్ని పూరించినాడు నారాయణ రెడ్డి. ఆంధ్రరాష్ట్రావతరణ సందర్భంగా—

"సిందూరంవోలె తెలుగు
సీమనేడు విలసించెను
మందారంవోలె తెలుగు
మాట నేడు వికసించెను."

అని ఆనందభరితుడై పాడినాడు నారాయణరెడ్డి.

'నిప్పుచెక్కిళ్లు', 'అంగారశయ్యలు', 'అశ్రుతంత్రులు'వంటి చక్కని పదబంధాలు ఈసంపుటిలో కనిపిస్తాయి. హృదయతంత్రులను మీటే భావచిత్రాలెన్నో కనులముందు కదలిసాగుతాయి. ఇంగ్లీషు ఉర్దూపదాలు భావానుగుణంగా తెలుగుపదాలతో కలిసి కాపురం చేసిన వీ సంపుటిలో.

భావకవితాధోరణికి సంబంధించిన పద్యగేయాల సమ్మేళనం, భావ మున్నంతవరకే పాదం సాగి ఆగడం, తేటగీతి పద్యాల జాతర మున్నగునవి ఇందులో అగుపడతాయి.

"బ్రతుకును పాటగా మలచి పాడగనెంచిన" నవీన గేయకవియైనా ఆనాడు నారాయణరెడ్డి—

"....................హార్దవేదనా
గానతరంగశీకరవికస్వరసుస్వరకావ్యధార ప
ద్యానకు నవ్యగీతమున కంతరమున్"

కనదని గ్రహించిన ప్రతిభాశాలి. పద్యాన్ని ప్రౌఢంగా ధారామధురంగా, గేయాన్ని మధురమంజులంగా, వచనకవితను రుచిరశబ్దార్థప్రచురంగా నడిపిన బహుముఖీనప్రజ్ఞాధుని.

"ఏనాడూ మేడిపండునుగాను
ఈనాటికీ అద్దంలా వున్నాను"

అని వినిర్మలాత్మవిశ్వాసంతో చెప్పుకోగలిగిన నారాయణరెడ్డి జలపాతం వలెనే విష్వక్సాహితీశృంగాలు దూకి జలపాతోద్భూతసంగీతంచేత రసిక లోకాన్ని రంజింపజేసినాడు.

## నారాయణరెడ్డి గేయాలు

పర్వతశృంగాలనుండి ప్రచండోద్వేగంతో ప్రవహిస్తున్న జలపాతం లాంటి నారాయణరెడ్డి 1953-55 మధ్య రచించిన గేయాలు 'నారాయణరెడ్డి గేయాలు'గా 1955లో రూపుదిద్దుకున్నవి. ఈ గేయాలు రచిస్తూనే 1954లో ఈతడు 'విశ్వగీతి' నాలపించినాడు. ఇదివరకే ఈతని కమనీయకవిత 'అజంతాసుందరి'యై రసికలోకాన్ని రంజింపజేసింది. మరోవైపు 'నాగార్జున సాగరము' వంటి గేయకథాకావ్యరచనచేసి స్వీయవ్యక్తిత్వానికి బంగారు బాటలు వేసికొనడమారంభించినాడు కవి.

'నారాయణరెడ్డి గేయాలు' సంపుటిలో ముప్పైతొమ్మిది కవితా ఖండికలున్నవి. "ఈ గేయసంపుటిలో గమనించదగినది వైవిధ్యం. విభిన్న మానసిక స్థితిగతుల్లో, వివిధ ఛందోరీతుల్లో ఉబికివచ్చిన గేయాలివి. పరిమిత మాత్రలతో పరుగుతీసిన గీతాలూ, కళ్లెం తెంపుకుని కదనుతొక్కిన వచన గేయాలూ ఈ సంపుటిలో ఉన్నవి"[1] - అనే నారాయణరెడ్డి మాటలు అక్షర సత్యాలు.

భావకవిత్వ, అభ్యుదయ కవిత్వ, అధివాస్తవిక కవిత్వసారాన్ని ఆస్వాదించిన నారాయణరెడ్డి వాస్తవికతనూ కాల్పనికతనూ సమానాభినివేశంతో చిత్రించిన రీతి ఈ సంపుటిలో గోచరిస్తుంది.

---

1. 'నారాయణరెడ్డి గేయాలు' - 'నా మాట'లో. మూడవ ముద్రణ (1970) ప్రచురణ - కొండా శంకరయ్య, మహంకాళివీధి, సికింద్రాబాదు.

"జీవరహితంగా తోచే శిలాగళాంతరాల్లో నీరవంగా వినిపించే నిగూఢ నిస్వనాలకు 'ట్యూన్ల'ను సమకూర్చే మ్యూజిష్యను"–అయిన నారాయణరెడ్డి చక్కని భావాలకు చిక్కని భాషను కూర్చినాడు. ప్రతిభతో సమాంతరంగా రసాలంకారపాండితీశౌండీర్యాన్ని పెంచుకుంటున్న ఈతని భావప్రపంచ సౌందర్యాన్ని సందర్శిద్దాం. ఈ సంపుటిలో మొదటిగేయం - 'యౌవనం'. యౌవనంలోనున్న నారాయణరెడ్డి సహజరమ్యంగా దీనిని చిత్రిస్తూ–

"యౌవనము జీవిత
స్యందనాగ్ర పతాక
యౌవనము ప్రణయవని
లో వసంతుని రాక"

అని అన్నాడు యౌవనము రాగానే యువకులకు 'కోరమీసాల క్రొంగోరికలు' చివురించునట. 'కోరమీసాల క్రొంగోరికలు' చక్కని ప్రయోగం.

"మిసిమి జవ్వనము తొ
ణ్కిసలాడు దంపతుల
కారు ఋతువులు అపూ
ర్వానంద హేతువులు"

అగునని సున్నితంగా చెప్పినాడు.

"గుండెలదరెడు మబ్బు
దండుల మహోర్భటులు
సళ్లిన కవుంగిళ్ల
ముళ్లనేక మొనర్చు"నట!

శృంగారభావన మెరపుతీవలా స్ఫురిస్తుందీ చరణాలలో.

'హేమంత విరహిణి'తో–

"నేటి చలివేళ న
న్నేల విదలించితివి
జాణతనమా సఖీ!"–

అని అనునయంగా పలుకుతూ–

"ఊదినప్పుడె మండు
బూదికుంపటి కన్న
కలకాలముండు కౌ
గిలి కాదటే మిన్న"—

అని హేమంత విరహిణికే గిలిగింతలు కలిగేలా అన్నాడు.

"మన మనసునందు వె
చ్చని ప్రణయ దీపికలు
మండినన్నాళు హే
మంతమె వసంతమ్మ"—

అని ప్రణయ సందేశమిచ్చినాడు కవి. ఈ చరణాలు చదువుతుంటే ఈతని 'జలపాతం'లోని "కాంతతోడి హేమంతమె మధుమాసం" వంటి మాటలు చప్పున స్ఫురిస్తాయి. ఒకే భావాన్ని ఇలా రకరకాలుగా చెప్పేనేర్పు నారాయణ రెడ్డికి వెన్నతో పెట్టిన విద్య.

వ్రాసిన పాదాలనే మళ్లీ వ్రాసి భావతీవ్రతను కలిగిస్తాడు నారాయణ రెడ్డి. ఉదాహరణకు 'మదనోల్బణం'లోని—

"ప్రావృషేణ్య పయోద
భారమోర్వగ లేక
గగనభామిని నడుము
బిగిదప్పి యల్లాడె
గగనభామిని నడుము
బిగిదప్పి యల్లాడె
విరహవేదనలు ని
ద్దురలేచి పొరలాడె"

వంటి చరణాలను పేర్కొనవచ్చు. ఇందలి పాదాల పునరావృత్తి గాన సందర్భంలో మాధురి నొలికిస్తుంది. ప్రబంధకవి నందితిమ్మన శృంగార రసాధినేతఅయిన శ్రీకృష్ణుని నోటపలికించిన "నను భవదీయ దాసుని" అనే పద్యం ఎంత హృద్యంగా ఉందో ఈ సంపుటిలోని 'మిసిమివలపు' అనే ఖండికలోని—

"కీల్జడ వ్రేటులతో పరి
ఖిన్నడ గాలేను గాని
జడలోపలి పూలు జారి
పడుట చూడలేను సఖీ!"—

అనే చరణాలు అంత రసరమ్యంగా ఉన్నవి.

ఈ సంపుటిలోని చాలా గీతికలు ఆత్మాశ్రయరీతిలో సాగినవి.

"నా మీదపడు నిరా
శా మేఘముల జోప
కోమలీ! నీ పైట
కొసలే సమర్థములు"—

అని 'భావకవి ఆవేదన'ను ప్రకటించగలిగినట్లే 'అభ్యుదయకవి అన్వేషణ'ను ఆవిష్కరించగల సమర్థుడు నారాయణరెడ్డి.

"పలాశ పతాకను ధరించి
విలాసంగా నడిచివచ్చే
విప్లవకారుని కోసం"—

అన్నప్పుడు అరుణపతాకం మన కనులముందు మెరుస్తుంది.

"టిక్కెట్టులేక లభియించే
టీక లేక అనుభవించే
చక్కని సౌఖ్యంకోసం"
"ఆడవేషం వడ్డించని
అమృతంలాంటి రసంకోసం
ఆలోచనల ఆజ్యంతో
యజ్ఞం చేస్తున్నాడీకవి"—

అని అన్నప్పుడు అనవసరమైన క్లిష్ట శబ్దార్భటినీ, పొల్లు పదాల పొల్లింతలనూ, అలంకారాల ఆడంబరాన్నీ నిరసించి సూటిగా గుండెకు తాకునట్లు చెప్పే అభ్యుదయకవి అగుపిస్తాడు. మొదట్లో నారాయణరెడ్డి శ్రీశ్రీ ప్రభావంతో రచనలు చేసినాడు. సోమసుందర్, దాశరథి మున్నగువారివలె సమాజంలోని ఆకలి, దారిద్ర్యం వంటి అంటువ్యాధుల నిర్మూలనం కావాలని, సరిక్రొత్త సమాజం మొలకెత్తవలెనని ఆశాసంగీతమాలపించినాడు.

"మతాలకై మరణించు అ
మాయకు లెవరుండబోరు
గతానికై విలపించే
మృతభావులు కానరారు"

వంటి చరణాలు ఇందుకు ఉదాహరణాలు. ఈవిషయాన్ని అతడే తన సిద్ధాంత గ్రంథంలో తెలియజేసినాడు.[1]

నారాయణరెడ్డి సంస్కృతకావ్యాలను ఎంత నిశితంగా రసహృదయంతో పరిశీలించినాడో ఈ సంపుటిలోని 'మేఘసందేశం' అనే గేయం చదివినవారికి తెలుస్తుంది.

'ప్రకృతిలోని ప్రణయిని' అనే గేయం కవితాసరస్వతి కెత్తిన మణిదీపం. ఇందులో భావం, భాష, రచన త్రివేణీసంగమంలా కలిసిపోయినవి. ఉదాహరణకు ఒకటి—

"చుక్కలతో ఒక్కసారి
సూచింతును నా కన్నియ
నల్లని వాల్జడసందుల
మల్లియలై మొలవాలని."

నవ్వును మెరపులతో, ముంగురులను మబ్బులతో, నడుమును శూన్యంతో పోలికచెప్పే పద్ధతి సంప్రదాయసిద్ధంగా ఉన్నా నారాయణరెడ్డి చెప్పడంలో నవ్యతనూ చమత్కృతినీ ప్రదర్శించినాడు. ప్రతిభ చేయించిన పని అది. కనపడనివాటిని ఉపమానసామాగ్రిగా గ్రహించటంలోకూడా ఈకవి ప్రత్యేకత కనిపిస్తుంది.

'కష్టాలవలె ముసురు కారుమబ్బులు', 'దుఃఖాలవలె జారు తుహినధారలు', 'పళువాంఛవలె రేగు శిశిరానిలము', 'పిరికితనం వారసత్వంలా' వంటివి వాటిలో కొన్ని. "పిడుగుపిండులను కురిపించని జలధరాలు, మంచు కోతలులేని మంజుహేమంతాలు, శైశిరభయంలేని శాశ్వతవసంతాలు కాపురమ్మున్నలోకమ్ములో నివసింప"కోరుకుంటాడు నారాయణరెడ్డి. ఆ నివా

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు : ప్రయోగములు పుట. 606— ప్రథమముద్రణ. జనవరి 1967.

సానంద మందరికీ అందాలనే విశ్వశ్రేయోభిలాషి నారాయణరెడ్డి. 'కన్ను మూసిన చిరువన్నె పూవును జూచి' జాలిపడడమేగాక—

"ప్రాఙ్నగాగ్రమునందు పొడిచిన
బాలసూర్యుని కంటిసెగలకు
భగ్గుమనెడు తమిస్రముస్ గన
పాపమ"-ను నంతటి వింత జాలిగలవాడీకవి.

"ఎంత చిన్నగాలికైన
ఎండుటాకులే మ్రోగును
పచ్చని ఆకులు ఝుంఝూ
పవనానికి మాట్లాడవు"

వంటి గంభీరార్థ ప్రతిపాదకములైన సూక్తులెన్నో ఈ సంపుటిలో చోటుచేసుకున్నవి.

'సమకాలీన సమాజంలో రగిలే సెగలనూ పొగలనూ వెలిగ్రక్కే' గేయా లిందులో ఉన్నవి. ఉదాహరణకు-

"శాంతిప్రసూనాలు
జాలువారిన ఆకు
పచ్చని ధరామంట
పమున చిచ్చులురేగె".

ఈ సంపుటిలో 'మెత్తని సూదులు, కొరడా కొసల' వంటి గేయాలున్నవి.

నారాయణరెడ్డి కవితలో మెరుపుబొమ్మలు ఎలా మెరుస్తాయో చూడండి.

"పాతదనం మంచులాగా
గోతాలకొద్ది నిండితే
కొత్తదనం కొరివిలాగా
గ్రుడ్లు తెరిస్తే గమ్మత్"

'శోకఃశ్లోకత్వమాగతః' అనే సుదీర్ఘగీతంలో కవి విశ్వరూపాన్నీ, కవితా స్వరూపాన్నీ, కవి హృదయాన్నీ అతని కర్తవ్యాన్నీ నిర్దేశించి చూపినాడు నారాయణరెడ్డి

"పరులబాధ తనబాధగ
పంచుకొన్నవాడే కవి
పరులసుఖంలో శిరస్సు
పైకెత్తినవాడే కవి"—

అని కవికి ఉండవలసిన లక్షణాన్ని చెప్పినాడు.

శ్రీశ్రీగారు— 'కుక్కపిల్లా,
అగ్గిపుల్లా,
సబ్బుబిళ్లా—
హీనంగా చూడకుదేన్నీ !
కవితామయమేనోయ్ అన్నీ !"— అని చెప్పితే

నారాయణరెడ్డి—
"పచ్చపూలు గచ్చపొదలు
జిల్లేడులు పల్లేరులు
కవికలం సోకితేనే
కల్పవృక్షాలవుతాయి"-- అన్నాడు.

"దాస్యపు నల్లమందునమిలి, తరాలకొద్ది గురకతీస్తున్న, తమోవాసుల జాడ్యకుడ్యాలను, పగులగొట్టే వజ్రహస్తం"- "ఇదే కవితా స్వరూపం ఇదే కవి విశ్వరూపం"- అని కవితా ప్రయోజనం చెప్పినాడు ఈ కవి. ప్రతి మనిషీ 'ఆత్మశోధన' చేసుకోవాలంటాడితడు. గర్వం ఏకోశానా పనికిరాదని వివిన్నదృష్టాంతాలద్వారా విశదం చేసినాడు. ఈతని కలంలో గళంలో సంప్రదాయబలం అతివేలంగా ఉంది. 'సూదిని రెండుగచీల్చే సునిశితఫక్కీలో' ఈకవి వ్రాయగలడు.

"పెద్దపెద్ద బొమ్మల్ని చూసి
అద్దుకోకు కళ్ళకు
సన్నని అక్షరాల్లోవున్న
సంగతుల్ని మనోగతంచేయి"—

అని ఉపదేశించినాడు.

"చంద్రుని మచ్చను చూడడం
అందరికీ చేతనవును
వెన్నెలల మాహాత్మ్యం
వివరించేవాళ్లు —"

కావాలన్నాడు. నిజమైన కవులు "మత్సరాల పొగతాకని మతాల మత్తు సోకని' 'స్ఫటికపట్టికావిరచిత సౌధం'లో ఉంటారనీ, వాళ్ళు అగస్త్యునివంటి వారనీ, 'పసిడిగిన్నెలో విషాన్ని' అందించేవారు కారనీ, 'మట్టిచిప్పలో మంచినీళ్ళిస్తారనీ' ఉదాత్తంగా చెప్పినాడు. "రాసక్రీడలు రావు వాళ్ళకి ప్రాసక్రీడలుతప్ప" వంటి చరణాలలో శ్రీశ్రీని, "వాళ్ళు వాయించరు తెగిన తంబురాల్ని రుద్రవీణలుతప్ప" అనేపంక్తుల్లో దాశరథినీ గౌరవభావంతో స్ఫురింపజేసి చివరకు —"వాళ్ళు జలపాతస్నాతులు సమతా విద్యుద్దాతలు" అనే పంక్తుల్లో జలపాత కర్తయైన తననూ స్ఫురింపజేసినాడు నారాయణరెడ్డి.

'హాలాహలజ్వాలజ్వాలలమృత కళికలుగా' మారువరకు 'సముద్ర మథనోద్యమము' కొనసాగింతునని ఈ కవి కంకణం ధరించినాడు.

ఈ సంపుటిలోని గేయాలు ఖండ, చతురస్ర, త్రస్యగతులలో నడచినవి. వచన కవితలలోకూడా మాత్రాచ్ఛందోగంధమున్నవి లేకపోలేదు.

'ప్రకృతి లక్ష్మీహస్తపల్లవానీత మధుపాత్ర రూపమ్మొ', 'శిశిర విషమారుతవిశీర్ణవృక్షాంగన'—వంటి దీర్ఘ సంస్కృత సమాస సుమగుచ్ఛాలు అక్కడక్కడా పరిమళిస్తుంటాయి. శిష్టవ్యావహారిక భాష ఈ గేయాల్లో చోటు చేసుకున్నది. యతియో ప్రాసయతియో ఆదిప్రాసమో అంత్యప్రాసమో తప్పనిసరిగా ఈ గేయాల్లో కనిపిస్తుంది.

"రేపటి ఉదయం నాలో
లోపల గుసగుసలాడెను
మనిషీ నీ భవిష్యత్తు
మహోజ్వలంగా వుందని"—

అనే పాదాల్లోని 'మనిషి' నారాయణరెడ్డియేనేమో అనిపిస్తుంది. రేపటి ఉదయం చెప్పినసంగతి యీకవి జీవితంలో నిజమయిందనిపిస్తుంది. ఆతనికున్న ఔజ్జ్వల్యం లోకానికి తెలియదా ! ఈ గేయం ఈతని క్రాంతదర్శిత్వమునూ

ఆత్మవిశ్వాసమునూ పట్టి చూపుతున్నది. 'జలపాతం'లో కన్న ఈ సంపుటిలో యీకవి భావనాశక్తి ఎన్నోరెట్లు మిన్నగా కనిపిస్తుంది, యీ సంపుటి ఇప్పటికి మూడు ముద్రణలందుకోగల్గడమే సాహిత్యజగత్తులో దీనికిగల స్థానాన్ని చెప్పకచెప్పుతున్నది.

"చుట్టూ పసివాళ్ళ కేకలు
చుట్టంవచ్చే కబురుచెప్పే కాకులు
ప్రియురాళ్ళు విసిరే చూపులరాళ్ళు
వేదాంతం వడ్డించే ముసలివాళ్ళు
అన్నీ ఓకంట కనిపెడుతూ"—

'చుట్టూ ప్రపంచం ఉన్నా' శూన్యంలో నిలబడే శక్తిమంతుడు కనుకనే నారాయణరెడ్డి లేఖినీముఖాన అమృతకావ్యాలవతరించినవి.

యీ గేయసంకలనంలో వస్తుసంవరణం, వైవిధ్యం పదసంయోజనం, అర్థగాంభీర్యం, భావశబలత లోకాలోకన సామర్థ్యం ప్రౌఢమను సంతరించుకున్నవి. చాపల్యంతో చేసే శబ్దచమత్కారం ఛందస్సంబంధమైన లౌల్యం ఈగీతాల్లో మచ్చుకైనా కనిపించదు. శబ్దపరిమితినీ అర్థవిస్తృతినీ సునిశితంగా గ్రహించి శ్రవణపేయమూహృదయసంవేద్యమూ అయినరీతిని అలవరచుకున్న అరుదైన కవిగా నారాయణరెడ్డి యీగేయాల్లో సాక్షాత్కరిస్తాడు.

## దివ్వెలమువ్వలు

'నారాయణరెడ్డి గేయాలు' తర్వాత ప్రచురితమైన కవితాసంపుటి 'దివ్వెల మువ్వలు'. ఇందులో జూన్ 1954 నుండి 21 నవంబరు 1958 వరకు వ్రాసిన ఖండికలున్నవి. ఈ సంపుటి మొదటిసారిగా 1959లో ముద్రితం. ఈ రెండు సంపుటులమధ్య కరిగిన కాలంలో నారాయణరెడ్డి చేతులు ముడుచుకుని కూర్చోలేదు. అలా కూర్చునే స్వభావం కాదు అతనిది. నిరంతరం స్పందించే డెందం నిర్మాణాత్మక కృషిని సాగించే శేముషి

వారిది. అందువలననే స్వప్నభంగం, కర్పూర వసంతరాయలు అనే కథా ప్రధానమైన కమనీయ గేయకావ్యాలు 'రామప్ప', రేడియోరూపకం, 'వెన్నెల వాడ' గేయనాటిక వంటివి పుంఖానుపుంఖంగా వెడలి సాహిత్యజగత్తులో నారాయణరెడ్డికి నిస్తులప్రశస్తిని సంపాదించి పెట్టినవి.

'దివ్వెలమువ్వలు' సంపుటిని 'సంగీతసాహిత్యాలు మూర్తీభవించిన పుంభావసరస్వతి' శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి అంకితమిచ్చి నారాయణరెడ్డి ఔచిత్యాన్ని ప్రదర్శించినాడు.

ఈసంపుటిలోని ముప్పై కవితాఖండికలలో పద్యాలు, గేయాలు, వచన కవితలు కన్పిస్తవి. మొదటిగేయం 'దివ్వెలమువ్వలు'. వత్సరానికొక్క మారు వచ్చి కవి శరీరసిదాపథాలలో 'చిత్రమైన కాంతిలహరి'ని ప్రవహింప జేసి 'దివ్వెలమువ్వలతో నర్తించు జగన్మోహిని' - 'ఆత్మకు మాత్రమె' కన్పించే ఒక 'అక్షరవాహిని' నిత్యం ప్రత్యక్షమైనట్లయితే 'మాయాంధ మ్మైన' తనబ్రతుకు మహితకాంతిగోళ మవుతుందని గాఢమైన వేదనతోడి ఆశాభావాన్ని ప్రకటించినాడు. ఆ జగన్మోహిని కవితా దేవత యేమో; ఏమైనా దివ్యమనోజ్ఞకవితతో ఈ సంపుటి ఆరంభంకావడం మంగళప్రదం.

గతంతో నాకేంపని అని కళ్లుమూసి కూర్చుండేవాడు కాదు నారాయణ రెడ్డి. 'చెదలుదిన్న హృదయం' 'మసిబట్టిన మనస్సు'కాదు ఆతనిది. గగన విశాలత, సముద్రగంభీరత ఆతనికవితలో అగుపిస్తుంది. ప్రతిభ ఎక్కడున్నా దానిని నిండుమనస్సుతో గుర్తించి స్తుతించే విశాలమనస్కత ఈ కవిది. అందుకే ఈ సంపుటిలో త్యాగధనులు సారస్వతమూర్తులు సంఘసేవా పరాయణులైన ఊర్మిళ, సురవరం ప్రతాపరెడ్డి, విశ్వదాత, విశ్వనాథ వంటి ప్రసిద్ధవ్యక్తులను గూర్చి వ్రాసిన మంజుల కవితా మణిహారతులు కన్పిస్తాయి.

ఊర్మిళను 'మనస్సన్యాసినీ!' అని సంబోధించి— "నినగాక మొన్న ఒల్లెను గట్టుకొనుదానవు" అని తెలంగాణా పలుకుబడిలో సహజరమ్యంగా వర్ణించినాడు. "కష్టానుభవముల నాగటిచాళ్ళు పడకముందే యింత శమము"ను పండించుకున్న ఊర్మిళనుగూర్చి వ్రాసే లేఖిని "మహీరసములోకాదు— కన్నీటి ముక్కలు" వేయవలసిందేనని ఆర్ద్రుడై పల్కినాడు కవి. స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డి స్మృతికి 'అక్షరాంజలి'ని సమర్పిస్తూ వారికి "ఊసర

వెన్నెల పాత్రకు అనుగుణమ్మగు రాజకీయము" అచ్చిరాలేదన్నాడు. "విశ్వనాథ కులాబ్ధివిధుడు, ఆంధ్ర సారస్వతోద్యాన వనమధుడు" అయిన విశ్వనాథ సత్యనారాయణగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భంలో కవితా గానం చేస్తూ—

"పడతి కిన్నెరసాని
తడలలో; ఆమె క్రో
న్నడలలో; ఆమె ని
ల్కడలలో, సుడులలో"—

విశ్వనాథగారి "కడలేని సుంత తడబడబోని' 'కైత నడబెడంగులె కానుపించు' 'తెన్గుపెడదల నుయాలలూగించు"నని ప్రశంసించినాడు. విశ్వనాథ కల్పనాశక్తియే 'కిన్నెరసాని పాటలు'గా రూపుదిద్దుకున్నదన్నాడు. ఇందలి రచన నిజంగానే ఊయలలూగిస్తుంది. ప్రసిద్ధ కవిసమయాలను గ్రహించినా ప్రతిభామృత స్పర్శచే కవితకు ప్రాణం పోస్తాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు— యశఃస్నాత విశ్వదాత స్మృతికి అక్షరాంజలి నివేదిస్తూ పలికిన

"నేడు వికసించి మర్నాడు వాడెడు మల్లె
పూలు నీ శాశ్వత యశోలాంఛనము లౌనః"

వంటి పంక్తులటువంటివి.

ఈ కావ్యంలోని సంస్కారధార, మనోమధనం, యజ్ఞఫలం, ఇది హైదరాబాదు, ఆశయసిద్ధి అనే కవితలు ఆంధ్రప్రదేశావతరణకు సంబంధించినవి. ఆంధ్రప్రదేశ్ అవతరిస్తుందనగా నారాయణరెడ్డి 'మానసదుగ్ధ సాగరోర్ములలో' 'త్రికోటి కచ్ఛపులు మహతులు' గొంతులు సవరించుకున్నాయి. ఆనందంలో ఆవేశంతో తానే 'సమీచీన మహోరేఖ'గా 'ప్రాచీనాంధ్ర పతాక'గా, 'నన్నయప్రసున్న కథా గీతి'గా 'కవిబ్రహ్మ కావ్య రీతి'గా రుద్రమ ఖడ్గద్యుతిగా, కాపయ్య హుంకృతిగా, శ్రీనాథ పద్య ఝంకృతిగా, పోతన్న సుధాస్నాత కృతిగా, కృష్ణదేవరాయ భువనవిజయ భవనగోపురంగా, తంజాపురాంధ్ర శారదా స్వర్ణమంజీర స్వరంగా అర్వాచీనాంధ్ర కవీణ్ణికరవచోముకురంగా రూపుదాల్చినట్లు భావిస్తూ చిట్టచివరకు—

"ఐతి సుమా నేనే నా
గార్జున సాగరమైతిని"

అన్నాడు. 'తెల్గులవాణి', 'ఉర్దూబాణీ' ముక్తాప్రవాళముల వలె కలిసిపోయిన హైదరాబాదునకు ఆంధ్రుల నాహ్వానించినాడు. 'తెల్గుల సంస్కృతి యొకండె' అన్నాడు—

"తమ్మిపూవులను, తుమ్మపూల నొక
దండలోని కెక్కించీ
వీధి మానిసికి సౌధవాసికీ
భేదభావమును త్రుంచీ
తెల్గువారు మనగల్గినప్పుడే"

ఆంధ్రదేశం వెలుగుతుందంటూ సమైక్యదృక్పథంతో వెల్గునెన్నుడుల పేర్చి కూర్చి తెల్గుతమ్ములకు పాటలు వినిపించినాడు నారాయణరెడ్డి. స్వాతంత్ర్య మన్నా, స్వాతంత్ర్య వీరులన్నా ఈ కవికి ఎనలేని అభిమానం. ఈ సంపుటి లోని 'ఒక శతాబ్ది', 'ఆగస్టు వెలుగు' అనే కవితలు అందుకు ఉదాహర ణాలు. స్వాంతంలో శతచైత్ర రథాలు విరియగా స్వాతంత్ర్య తేజోమూర్తిని స్తుతించినాడు ఈ కవి.

నారాయణరెడ్డిలో దర్శన వర్ణనాశక్తులు సమపాళ్లల్లో ఉన్నవి. స్త్రీ-సూర్య - సముద్ర - వసంత - వర్షర్తు వర్ణనలీ సంపుటిని అలంకరిస్తున్నవి.

"అబ్బే స్త్రీ అనగా శ్రీ
హరిహరులకు సంకేతం"

అంటూ స్త్రీ హృదయాన్ని తెలుసుకోవడం కష్టమనే సంగతిని—

"మగువముక్కు సంపెంగపువ్వని
మాటబొమ్మలెన్ని కట్టినా
ఆవిడ మనస్సులో విరిసే
తావిని పీల్చడం కష్టం"

వంటి చరణాలలో పరిమళింపజేసినాడు.

సంఘం సరోవరమైనప్పుడు కవి పద్మంలా భాసిస్తాడు. కవి రచనల్లో ఏదోఒకవిధంగా సమకాలిక సాంఘిక స్థితిగతులు చోటుచేసుకుంటాయి. ఒక్కొక్కసారి కవి ఉద్దేశపూర్వకంగా కూడా వస్తువర్ణనలో సంఘాన్ని

ఓంఓంపజేస్తాడు. మచ్చుకు - ఈ సంపుటిలోని సూర్యవర్ణనలో సమాజంలో సాగుతున్న సమ్మెల ప్రభావం ప్రవేశించింది ఇలా—

"తానుపడిన శ్రమకు ధరణి
తగినఫలిత మివ్వకున్న
ఒకనాటికి సమ్మెచేయ
ని కూలీడ"ట సూర్యుడు!

"పుడమిని పరిమళప్లుతముగ నొనర్చు
విరులకారుల రాకలబ్బురము గాదు
ఎడదను పరిమళాల ముంచెత్తునట్టి
పూలనెల పుల్కరింత యపూర్వమౌను"—

అంటూ 'సురభిళాత్మ'లో వసంతర్తు వర్ణన చేస్తూనే సందేశమందించినాడు కవి. ఈ ఖండికలోని పద్యాలు చక్కని ధారాశుద్ధికి ఆస్పదంగా సాగినవి.

నారాయణరెడ్డి పద్యాలలో తేటగీతులెక్కువ. సీసపద్యాలు చాలా తక్కువ. ఎంత తక్కువో అంతచక్కగా చుక్కల్లా ఉంటాయి. ఉదాహరణకు— 'వర్షాసుందరి'లో మేఘమాలను వర్ణించిన సందర్భంలోని—

"కాదమలేగలకు పాల్గుడపగా పరుగెత్తు
నిండుపొదుగుల ఆలతండలట్లు
పరవాహినుల బదాబద లొనర్పగ సాగు
శరసముద్ధుర యోధవరులయట్లు
నిజమహోన్నతకుంభ నిక్షిప్తదానాంబు
గంభీర మత్తేభగణములట్లు
తొడిమవీడని పూల బిడియంపుబరువుతో
అడుగుమోపెడు కన్నెపడుచులట్లు
విరహిణీపాండురకపోల వీధులందు
జీరువారు నీలాలకశ్రేణులట్లు
సరసగమనాలతోడ నాషాఢమాస
వేళలందు కాదంబినుల్ వెడలెనవిగో"

అనే పద్యాన్ని చూడవచ్చు. ఇక్షుఖండాలవంటి మధుర భావచిత్రాల రుచులను ఈ రచనలో చవిచూడవచ్చు.

నారాయణరెడ్డి సామ్యవేది. వాననీరు—

"........మిట్టలన్ పల్లములను
ఏకవర్ణమ్ములోన చిత్రించి, సామ్య
వాదపాఠము నేర్పెనట !"

అందరికి రసప్రదమైన వసంతకాలమిష్టమైతే నారాయణరెడ్డికి వానకారు సుఖప్రదంగా కనబడుతుంది. అందుకు కారణం ఇది—

"......................................................మావులన్
పికములు గూసినంత శ్రుతిపేయత గల్గునె ? ఎత్తు మంచెలన్
చికిలి వయస్సు గుబ్బెతలు చేసెడు అల్లరి చేష్టలన్ వినా"

మబ్బులకూ కాపుమగువలకూ ఎక్కువ తేడా లేదన్నాడు. ఇర్వురూ మొత్తముపై 'పయోభరసమున్మిషితాంగులు' గదా ! ఇలా పద్యరచనలో కూడా నారాయణరెడ్డి చేయితిరిగిన చేయికనిపిస్తుంది.

నారాయణరెడ్డికి అంతర్జాతీయ దృష్టి మిక్కుటంగా ఉంది. భూగోళంలో ఎక్కడ భగ్గుమని జ్వాలలు లేచినా ఈతని నవనాడులలో గుండెగోళంలో వేడి విద్యుత్తులా ప్రవహిస్తుంది. అది లేఖినీముఖాన మళ్ళీ ప్రవహిస్తుంది. అంతర్జాతీయ సమస్యలన్నింటిని ఒకకంట కనిపెడుతూనే ఉంటాడు. ఈ కావ్యంలోని 'జ్వాలాముఖి' 'ఉదయోన్మాదులు' వంటి ఖండికలు ఇతనికి గల అంతర్జాతీయ చైతన్యపుష్టమైన దృష్టికి నిదర్శనాలు. ఈ ఖండికల్లో ఆవేశం చెలియలికట్టలు దాటింది. జనహృదయాన్ని 'జ్వాలాముఖి'తో 'బడబాశిఖి'తో 'ఈనిన బెబ్బులి'తో పోల్చినాడు కవి. 'జ్వాలాముఖి'- ఇరాకులో జరిగిన విప్లవానికి సంబంధించింది.

"నెత్తురు లొల్కిన నేలలు
అత్తరులను చిల్కునులే"—

అని పలికిన ఆశావాది ఈ కవి. 'ఉదయోన్మాదులు' ఖండిక గోవా విముక్తి కోసం జైత్రయాత్ర సాగించిన భారతవీరుల నుద్దేశించి రచింపబడినది.

నారాయణరెడ్డికి విశేషమైన ఉర్దూభాషా పరిజ్ఞానం ఉన్నది.

ఈ సంపుటిలోని 'కవి' అనే ఖండిక ఇందుకు నిదర్శనం. ఇది స్వర్గీయ మఖ్దూమ్ మొహియొద్దీన్ 'షాయర్' గీతానికి అనువాదం.

నారాయణరెడ్డి దృష్టి విశ్వజనీనమైనది. ఈతని చూపులో వసుధ 'పసిపాప విసిరిన బంతి'. మనుషులందరు అన్నదమ్ములు, సమతాస్నేహ సౌభ్రాత్ర భావాలూ, మానవతాదృష్టి, సంస్కరణోత్కంఠ ఈ కవి రచనల్లో చాలాచోట్ల కనిపిస్తాయి. మానవుని దేవతగామార్చే మార్గం కనుగొనమంటాడీ కవి.

"పాపము పోలిక గుట్టలు
గా పుట్టలుగా పెరిగిన
జిఘాంసు నేలమట్టమై
జిజీవిష చివుర్చునాడు"—

గానీ మానవరూపం సార్థకం కాదంటాడీతడు.

నారాయణరెడ్డి రచనలో జగత్కల్యాణకాంక్ష నిండుగా కనిపిస్తుంది, అందుకే—

"నాచుట్టు భ్రమించెడు అం
ధలోకమును వెల్గించగ
బ్రతుకును కర్పూరమువలె అ
ర్పణసేయుట ప్రియము నాకు"

అని పలికి— "కాలమొక యెడారైతే ఖర్జూరముగా"మారాలని ఉపకారభావాన్నీ త్యాగభావాన్నీ సమీకరించుకున్న ఉపదేశం చేసినాడు.

"తొలిమబ్బు రాచకన్నెల కొప్పులూపి రా
ల్తును చుక్కలనెడు మల్లెలను
మెఱుపు దొరసానులను వెరపింతు దోతునని
మేని జల్తారుటొల్లెలను
పారిజాతాంగనల పట్టితెచ్చి పలాశ
వీరులకు పెండ్లి సేయింతు"—

వంటి శృంగారభావ మంజరులను వెదజల్లుతూ నారాయణరెడ్డి—

"ఏదో వెల్గుకరళ్ళు ద్రొక్కినటులై ఏదో మహాసౌరభే
యీ దుగ్ధమ్ము మరుంగు లెత్తినటులై హృత్పీమహాంగర"గా

"సుధారసమునన్ శుచియైన వసంతరాగము"లకోసం నిరీక్షిస్తూ ఆశాజీవియై కవితాయాత్ర సాగిస్తున్నాడు.

ఈ సంపుటి ఉత్తమ భావసుమపుటి కాబట్టి 1959లో వెలువడిన ఉత్తమ కవితాసంపుటిగా దీనిని నవ్యసాహితీసమితి నిర్ణయించి బహూకరించింది. 1962లో ఈ సంపుటి ద్వితీయ ముద్రణ నందుకున్నది. ఇందలి కవితా ప్రాశస్త్యానికి ఈ సత్కారం ఈ సమాదరణం ఒక సంకేతంగా భావించవచ్చు.

మాత్రాచ్ఛందస్సుల్లో లాక్షణికులు సమ్మతించిన యతిప్రాసలను పాటిస్తూ సమకాలిక జీవితసమస్యలను సమైక్యభావాలను ప్రదీప్తం చేసే యత్నంలో కృతకృత్యుడై శ్రవణ హృదయ తర్పణలకు సమర్థమైన గేయ ఖండికల నందించినాడు నారాయణరెడ్డి ఈ సంకలనంలో.

పురాణగాథలను స్ఫురణకు తెచ్చే ఉపమానాలనెన్నింటినో అత్యాధునికమైన భావాలను సువ్యక్తం చేయడానికి ప్రయోగించడం ఈ దివ్వెలమువ్వల్లో విశేషంగా కనిపిస్తుంది.

ప్రాచీనార్వాచీన భాషాసాహిత్యాల అధ్యయనం పట్ల నారాయణరెడ్డికి అభినివేశం, అభిమానం ఈ కవితాసంకలనంలో ప్రతిబింబిస్తున్నవి. ఆంధ్ర ప్రజావళి సమైక్యంగా సుఖసంతోషాలతో అభ్యుదయపథంలో ఉద్గమించడం నారాయణరెడ్డి మహత్వాకాంక్ష. అది ఈ సంకలనంలోని పలుకైతల్లో స్పందిస్తున్నది.

# అక్షరాల గవాక్షాలు

దివ్వెల మువ్వల ఘలంఘలలు వినిపించి మధురభావ మహిత కవితా కాంతిగోళాలు చూపించిన నారాయణరెడ్డి, మరో ఆరేళ్ల తరువాత ఒక కవితా సంపుటిని సహృదయ లోకానికి కాన్కగా నందించినాడు. ఆ సంపుటియే 'అక్షరాల గవాక్షాలు'. ఈ ఆరువసంతాలలో అప్పుడప్పుడు గుప్పున తావులీనే భావాలు గుండెలో గుసగుసలాడగా అంతరంగపుటంతఃపురాల్లో వానికి రమణీయాంబరాలు తొడగి, రంగులువేసి, రమ్యాలంకరణలుకైసేసి రోజూ రోజూ వచ్చే తాజానడకల నాజూకులు పరిచయంచేసి బయటనున్న రసరాజ్య రాజధాని వీధులలో మెల్లగాదింపి చల్లగా అక్షరగవాక్షాలగుండా మానవునిలోని, వారి మనసులలోని మలుపులనూ మార్పులనూ వీక్షించినాడు నారాయణరెడ్డి.

'అక్షరాలగవాక్షాలు' అనే ఈ కవితాసంపుటి 1965లో ముద్రితం. ఈ కాలంనాటికి నారాయణరెడ్డి డా॥ నారాయణరెడ్డి అయినాడు. ఈ సంపుటి చేసుకున్న అదృష్టమిది. విశ్వనాథనాయడు, సమదర్శనం, ఆధునికాంధ్ర కవిత్వము అనే పరిశోధన గ్రంథం, ఋతుచక్రం వంటి ప్రశస్తరచనలు కవి ఈ ఆరేళ్ళ అనంతకృషి ఫలితాలు. కవితాసేద్యం చేస్తున్న కర్షకుడు నారాయణరెడ్డి. మరో విశేషమేమిటంటే సాహిత్యకవియైన నారాయణరెడ్డి 'సినిమా'కవిగా మనముందు కనబడడం ఆదినుండీ అక్షరాలనే నమ్ముకున్న నారాయణరెడ్డి దీనివల్ల ఆబాలగోపాలానికి ఆనందం కలిగించే వాడయినాడు. అయితే అక్షరాల గవాక్షాలనుండి చూస్తున్న నారాయణరెడ్డికి విశ్వమెలా భాసించిందో చూడవలసి యున్నది.

ఈ కావ్యంలో యాభై నాలుగు ఖండికలున్నవి. ఇందలి చివరి ఖండిక అక్షరాల గవాక్షాలు. ఈ సంపుటికీపేరే ఉంచబడింది. 'మానవగీతం'లాంటి గేయకవితలూ 'మనశ్శైశవం' లాంటి పద్యకవితలూ, 'మాట్లాడే స్మృతులు' వంటి వచన కవితలూ ఇందులో ఉన్నాయి. నాటి పద్యానికి నేటి వచన కవితకూ మధ్య నిలబడి ముచ్చటగా మూడింటిని సమదర్శనంతో సమా దరిస్తున్న కవి నారాయణరెడ్డి.

"నేను దానవుని సైతము
నిర్జించిన మానవుడను
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను"

అని పలికిన నారాయణరెడ్డి ఈ సంపుటికి 'మానవగీతం'తో శ్రీకారం చుట్టినాడు. నరుడు 'సురలకన్న కరుణాత్ముడ'నీ 'మందిరమెరుగని దేవుడ'నీ వేయిగళాలతో చాటినాడు.

"చెమటను తడిసిన మట్టిని
శ్రీగంధముగా ధరింతు
ఊర్పులనొదిగిన స్వరమును
ఓంకారముగా స్మరింతు"—

అని శ్రామికులనూ దీనులనూ గౌరవించినాడు.

"అణువులు పగిలించువాడు
ఆత్మలు రగిలించువాడు
మానవుడా, కాదు; రంగు
మార్చుకొన్న దానవుండ"

నీ మారణాయుధ నిర్మాణాన్ని నిరసించినాడు. 'నిరంకుశాః కవయః' అనే సూక్తిసారాన్ని-

"పరిమళాల నెవడాపును?
పైరగాలి నెవడాపును?
ఎవడాపును మానవతా
రవి రుక్కును, కవి వాక్కును?"

అనే గీతికలో ఉదాహరణ రమ్యంగా ప్రకటించినాడు.

ప్రతి కవితలోని పలుకులో భావనలో నారాయణరెడ్డి ముద్ర కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. 'మనశ్శైశవం' అనే ఖండిక పద్యాలలో నడిచినది. 'పమ్మదద్విరేఫ రూపాంతరమ్మై'న నారాయణరెడ్డి హృదయంలో శిశుత రపీభవించగా సాగిన కవిత ఇది.

"ఒక శరత్తొ కవర్షర్తు వొక వసంత
మను వివేచనీయావస్థ నతిగమించు
శబలిత మృదూహసంపుటి శైశవమ్ము
నను రసైక దృశాభిరమ్యునిగ జేసె"

అనడంలో శిశుతాప్రాశస్త్యం వ్యక్తమౌతున్నది. ఈ కవిత భావసుందరమై అనుభూతి తంత్రులను మీటుతున్నది.

చిరకాలంనుండి సుఖాలకు మరిగి పరవశుడై ఉన్న అసమాన్యజీవి ఒక్కమాటు ప్రుశ్నిపడి చేసుకున్న ఆత్మవిమర్శను 'విషపానం'లో చక్కగా వ్యక్తీకరించినాడు నారాయణరెడ్డి. "కవిత్వం అంటే భావమూ, అభివ్యక్తీ రెండూ, కాని ఏ ఒక్కటీకాదు. అందువల్లనే ఏ గొప్ప కవిత్వంలోనూ రూపాన్ని తొలగించి చూస్తే మిగిలేది కవిత్వంకాదు"[1] అనే శ్రీ సుప్రసన్న గారిమాటలు ఈ సందర్భంలో గుర్తుకు వస్తున్నవి. భావాలూ వాటి అభివ్యక్తీ ఈ రెంటి మనోజ్ఞ సమ్మేళనం నారాయణరెడ్డి కవితలో సమపాళ్ళల్లో కనిపిస్తాయి.

"చివరికొక చలికారు చిక్కెనని ఉప్పొంగ
అది జంట కౌగిళ్ళయందే నలిగిపోయె"

అని 'శిశిరవేదన'లోకూడా శృంగారపు పూలవాసనలు విరజిమ్మతాడు నారాయణరెడ్డి. 'ఎడారి'ని చిత్రించినా, 'కన్నీటి తెరలు' వర్ణించినా కల్పనలో లోపం రానివ్వడు. ఈతని దృష్టిలో—

"నిండు వసంతమ్ములోన
పండుటాకులొక అందము".

శరత్తులో నింగి "పరమ సాత్వికుని అంతఃకరణము"ను పోలియున్నదని వర్ణించినప్పుడు వాల్మీకి జ్ఞాపకం వస్తాడు.

"నట్టనడిమి చీకట్లో
చిట్టిదివ్వె వెలిగించి

---

1. సాహిత్యవివేచన - పుట 4, ప్రచురణ ; సాహితీబంధు బృందం - వరంగల్లు; తొలిముద్రణ : (1971)

శిఖరంపై గురివుంచీ
చెకచెకా నడవాలని"—

నలుగురు కోరేది ఇదేఅని ఈ కవికి తెలుసు. అందుకే ఋతువులు తమ గతులు మార్చుకున్నా—

"బ్రతుకులో విజయదశమీ
పర్వచంద్రికలు నిల్పెద"

అని ప్రతిన చేసినాడు నారాయణరెడ్డి.

ఈ కవితాసంపుటిలో జీవితానికి చాలా దగ్గరగా ఉండి, గుండెకు హత్తుకొనిపోయే ఉపమానాలంకారాలు చాలా కనిపిస్తాయి. గతంలోని స్మృతులు 'పాతచుట్టాల్లాగా' 'తునిగిపోయిన కలల్లోని చిత్రాల్లాగా' ఉన్నాయంటాడు. ఇంకా—

"చేదుజ్ఞాపకాలవ్వీ
అరుస్తున్నాయి పొగగొట్టాల్లా వికవికనవ్వి"
"గానుగెద్దులా అస్తమానం తిరగడమేనా
సానరాయిలా రోజంతా అరగడమేనా"

వంటివి మరికొన్ని ఉపమానాలంకారాలు.

ఈ సంపుటిలోని చివరిపుటల్లో వచనకవితలు వరుసగా కనిపిస్తాయి. 'అజ్ఞాతవాసం' అనే వచనకవిత ఒక కథలాగా చకచకా సాగింది. నారాయణరెడ్డి వచనకవితా రచనలో ఇది ఒకమలుపుగా భావించవచ్చు. ఈ సంవిధానం తర్వాతి కవితాసంపుటులలో పరిణతినందుకున్నది. విరాటపర్వంలోని కీచకవధ ఈ ఖండంలోని ఇతివృత్తం. ఇందలి— "రెంటికీ జరిగిన పడిలేని పురంలో" అనే పంక్తిని చదువుతున్నప్పుడు తిక్కన స్ఫురిస్తాడు.

'అక్షరాల గవాక్షాలు' అనే కవితలోని - మేఘాల మెరుపుల వర్ణనలు సుందరంగా ఉన్నవి. ఎన్‌జీవోలు— "మానెనుబట్టి వత్తిని వేసుకున్న పరమ సాధువు"లని చమత్కారంగా వర్ణించినాడు కవి. ఒకేభావాన్ని రకరకాలుగా వ్యక్తం చేసేశక్తి నారాయణరెడ్డిలో పురివిప్పి కనిపిస్తుంది. విషాదతిమిరంలో తళుక్కుమని రసరేఖతో చిన్నప్పటి ఆనందాన్ని—

మంచము పట్టని వాకిలి
మహాకాశమై రహించె"
'కంకరనేలలు పచ్చని
కలలపాన్పులుగ మారెను'
"కోటికాంతికళికలిరుల
కొమ్మలపై విరబూచె"

వంటి పంక్తులలో రకరకాలుగా వ్యక్తంచేసినాడు.

'నాదపరిమళం' కవితా తత్త్వాన్ని ప్రదర్శిస్తుంది.

""స్నేహరసము నందించెడు
జీవినౌసట మసిముద్రలు
నిలువెల్ల విషము దాచెడు
ఖలునికేవెలు మణిముద్రలు"

వంటి చరణాలలో సంఘంలోని మోసాన్ని కృతఘ్నతనూ హైన్యాన్నీ ఎత్తి చూపినాడు కవి.

"పడతుల విగ్గుసిగల మడతల్లోంచి
ప్లాస్టిక్ మొగ్గలు పలకరిస్తున్నాయి
విలాసినుల నీలికళ్ళజోళ్లలోంచి
చిలిపిచూపులు ఫిల్టరవుతున్నాయి"

వంటి పంక్తులలో సంఘంలో అనుదినమూ ప్రబలిపోతున్న వింతవింత వేషాల కృత్రిమతను వివరించినాడు.

సమాజంలోని చైతన్యతరంగాన్నీ తేజశ్శృంగాన్నీ స్వామ్యాన్నీ వ్యంగ్యంగా చిత్రించినాడు నారాయణరెడ్డి. ఇందుకు ఉదాహరణగా—

"బురదలోన బ్రతికెడు కు
మ్మరి పురుగులుగూడ నేడు
తుమ్మెదలై గులాబీలతో
వియ్యమ్మందుకొనెను".—

వంటి పంక్తులను గమనించవచ్చు.

విశ్వంలో వెలుస్తున్న యుద్ధవైముఖ్యాన్నీ, శాంతిప్రియత్వాన్నీ—

"ప్రాణాలుండగనే పంత
లాగల్లా, డేగల్లా
రక్కకతిను దుశ్శక్తుల
ముక్కు మొండివడుతున్నది
బిక్కవడ్డ కపోతాల
రెక్కల్లో వజ్రశక్తి మెరుస్తుంది"

అనే పంక్తులు ప్రకటిస్తాయి.

కామరాజనాడార్, పానమామలై వరదాచార్యులను గూర్చిన ప్రశంసా కవితలీ సంపుటిలో ఉన్నవి. నారాయణరెడ్డి కందుకూరి, గురజాడ, గిడుగు, గోపీచంద్ వంటి భాషాసేవకుల, పరోపకారపరాయణుల, సంఘసంస్కర్తల స్మృతికి రసాంజలి ఘటించినాడు. కెనడీ హత్యనువిని కంటతడిపెట్టినాడు. నెహ్రూ మరణవార్తను విని—

"రగిలి రగిలి నాగుండియ
పగులనిమ్ము పగులనిమ్ము"

అని కన్నీళ్ళుగార్చినాడు. కవితాశ్రీకి వెల్గులమేడయైన గురజాడను ఆయన సృజించిన ముత్యాలసరం ఛందస్సులోనే స్తుతించినాడు.

"పలుగురాళ్లవాటు వారికి
జిలుగుపలుకు రుచించునా
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా"

అని గురజాడ ఎడగల గౌరవంతో ఆయన పంక్తులనే అనుసరించి వ్రాసినాడు.

"ఎందుకయ్యా బండ్లకొలదిగ
ఎదకదల్చని కావ్యరాసులు?
జాతినాడులలోన పారెడు
గీతి యొక్కటి చాలదా మరి!"

అన్న పంక్తులను గురజాడ మహితవ్యక్తిత్వ ప్రశంసాత్మకములుగానేకాక నారాయణరెడ్డి కవితావ్యక్తిత్వాన్ని చెప్పుకోవడానికి కూడా గ్రహించవచ్చు. ఎల్లకాలం సహృదయుల ఉల్లాలలో కాపురంచేసే కమనీయ పంక్తులివి.

1959లో భారతదేశపు సరిహద్దులపై చైనా తొలిసారిగా దాడిచేసి పుడు

"ఎవడురా నాతల్లి హిమగిరి కిరీటమ్ము
పై చేయిసాచ నుంకించె
ఎవడురా నా పువ్వుటెడదలో నిప్పురి
వ్వలు రాల్చగా సాహసించె"

అని సింహంలా వీరరసమూర్తియై హుంకరించినాడు నారాయణరెడ్డి. దేశభక్తికి నిధానమయిన కవిత ఇది.

సమకాలిక సంఘాన్ని సతమతం చేస్తున్న సమస్యలు ఈ ఖండికల్లో బింబిస్తాయి. ఉదాహరణకు ఈ చరణాలు చూడండి—

"పెరిగిపోయే ధరలు
అరిగిపోయే బియ్యం మరలు
ఫీజుల సమస్యా పూర్తికి
ఫౌజుల పరంపరలు
వరదుల్నే ధిక్కరించి
వరుస దప్పిన వరదలు
బ్రతుకనే చిక్కడపల్లిలో
ప్రతినిత్యం బురదలు".

నాడు కవి నివాసం చిక్కడపల్లి (హైదరాబాదు). ఈ సంపుటిలోని—

"ఎన్ని కాంగోలు-ఎన్ని క్యూబాలు
ఎన్నెన్ని సరికొత్త కొరియాలు
వజ్రగిరుల్లాంటి నమ్మకాలమీద
భయాల్ని వర్షించే అల్జీరియాలు"

వంటి పంక్తులు నారాయణరెడ్డి అంతర్జాతీయ సమస్యా పరిజ్ఞానానికి దీపికలు.

'క్షణకాలావధిక మనస్తర్పణ నిష్ణమ్ములు', 'ప్రణవాక్షర పద్మముఖ ప్రసరన్మృదు పరిమళమ్ము' —వంటి సుదీర్ఘ సంస్కృత సమాసాలూ, తుమ్మెద సుల్తానులు, వెన్నలదిండ్లు, కాంతిరాగము, పూల పెండ్లిపందిరి, పాలమబ్బు, పూలగూళ్ళు, చిగుళ్ళమంటలపల్లవి, వెన్నెలచిన్కులు, పిట్టకలం-వంటి అపురూపమైన పదబంధాలూ సంకలనం నిండా పరచుకొని ఉన్నాయి. ఇవి ఈ కవి వ్యుత్పత్తినీ, ఊహాశక్తినీ ప్రకటిస్తాయి.

భావానుగుణంగా మాత్రలు త్రుంచి పెంచి త్ర్యస్ర చతురస్ర మిశ్ర గతులలో వైవిధ్యవిలసనంతో రచన సాగించినాడు ఈ కవి. ఏ పాదమున కాపాదం కాకుండా ఒక పాదంలోనుండి మరో పాదంలోకి చొచ్చుకొనిపోయే 'గునుగుగేయాల' రచన చాలా కనిపిస్తుంది ఈతని కవితలలో. రెండు రెండు చరణాలకు యతియో ప్రాసయతియో అంత్యప్రాసయో తప్పనిసరిగా కనిపిస్తుంది. రచనలో 'పాలరెక్కల భావనా లలితమూర్తులు' కనిపిస్తాయి. ఈ సంపుటిలో శిష్టవ్యావహారిక భాష ప్రయుక్తమైనది. 'అర్థాలను గదినిడి వాహ్యాళికేగు'శబ్దాలు ఈతని రచనలో కానరావు. జాతీయములతో నుడికారపు సొంపులతో 'దీనిబోలిన వచస్సు నభస్సును మని' పించేలా రచన చేస్తాడు ఈ కవి.

భావాన్నీ, కవితాసారాన్నీ గుండెకు పట్టించే ప్రఖ్యాత కళాకారుడైన శ్రీబాపుగారి రేఖాచిత్రాలు ప్రతిశీర్షికకు ముందుండడం ఈ సంపుటిలోని మరో విశేషం.

ప్రతిక్షణం దీపశిఖా ప్రతినిధిగా జీవింపదలచుకున్న ఈ కవి "కటిక నేలను జీల్చి ఝటితిగా పొడుచుకొని-పైకి సాగెడుమొక్కవలె బ్రతుకులో నుండి– చిమ్ముకొనిపోయి రోచిర్మండలమ్ములో" అడుగిడదలచుకున్నాడు. గుండెను 'మధురవేణు దండంగా' మలచుకుంటూ, గుడ్లగూబలై మసలే చీకట్లను చుంచుదువ్వి వాటిని పుంస్కోకిలలుగా మార్చుకుంటూ ప్రయాణాన్ని సాగిస్తున్నాడు.

"చింతనా చేతనా రగులుతున్నంతసేపు
జీవితానికి వేకువే తప్ప లేదు మునిమాపు"

అని గ్రహించి, కుంపటిని రొమ్ముమీది నుండి దింపుకోకుండా, రూకనూ మూకనూ పట్టుకవ్రేలాడకుండా, మతినీ ధృతినీ నమ్ముకొని మరీ ముందుకు

సాగుతున్నాడు. సాహిత్యం మానవాభ్యుదయం కోసమని నమ్మిన ఈ కవి ఆశావాదియై సంఘానికి ఇలా ఉపదేశించినాడు–

"పడ్డపాట్లూ, పొరపడ్డచోట్లు
పదిలంగా నెమరువేసుకోవాలి"
"మల్లెలా జీవించే మహాయోగం లేకున్నా
ముల్లులా బతకటం పోవాలి"
"గొంగళీ పురుగులా ప్రాకడం మానేసి
కురంగంలా దూకడం నేర్వాలి"
"ఎవని నీడను వాడే ఎదుర్కోవాలి"
"కర్మను నిందించడం మానుకోవాలి
కర్తవ్యం ముప్పిరిగా పేనుకోవాలి"
"సన్నని ఆశల పల్లవి పల్లవించాలి
నున్నని పాటలదళాలు పరిమళించాలి"....

నారాయణరెడ్డి విశ్వాత్మకమైన కమనీయ కవితామూర్తిని దర్శింపజేసే మణి దర్పణం ఈ 'అక్షరాల గవాక్షాలు'.

## మధ్యతరగతి మందహాసం

'మధ్యతరగతి మందహాసం' అనే కవితాసంకలనం 1968 డిసెంబరులో ప్రచురితం. ఇందులో 1965 నుండి 1968 వరకు అప్పుడప్పుడు వ్రాసిన నలభై కవితాఖండికలున్నవి. ఈ సంపుటిని నారాయణరెడ్డి తనకు అత్యమిత్రులు శ్రీ అల్లాడి పెంటయ్యగారికి అంకితమిచ్చినాడు. ఈకవి కవిత ఒక మలుపు తిరిగిందని ఈ సంపుటిని చూచి చెప్పవచ్చును. ఇంతకుముందటి సంపుటులలో పద్యాలు వచనకవిత తక్కువగా ఉండి గేయాలు ఎక్కువగా ఉండేవి. ఈ కృతిలో పద్యాలు అసలే లేవు. మాత్రాబద్ధంగా నడిచే ఖండిక కూడా ఒకటే-చిట్టచివరిది. అది కూడా సగం మాత్రమే. దీనిని బట్టి యీకవి వచనకవితాసదనం వైపు వడివడిగా సాగిపోతున్నట్లు గమనించవచ్చు.

మానవతా ప్రబోధంకోసం అందరికీ అర్థం కావాలనే అభిప్రాయంతో 'ఉర్వి అనే వ్యాసపీఠం'పై కూర్చొని సంఘంలోని ఆధునిక సమస్యలకు దర్పణంగా యీ వచనకవితను వెలయించినాడు ఈ కవి.

ఈ సంపుటిలో 'మధ్య తరగతి మందహాసం' మొదటి కవిత. అదే పేరున ఈ సంపుటి వెలువడింది. పేరులోనే కవి ప్రతిభాకిరణం తళుక్కుమంటుంది. 'మందహాసానికి ఛందస్సుంటుందని' కనుక్కోగల్గిన అపురూపమయిన ప్రతిభ ఈ కవిది. 'వంచననుంచి మంచిని వేరుచేసే అంచ ముక్కును' గ్రహించగల దక్షుడు. 'ప్లాస్టిక్ నవ్వుల్లో దాగిన సృష్టిరహస్యాలు' పరికించగల, 'నైలాన్ బతుకుల్లో మూగిన జాలగాథలు' వడబోసే శక్తివంతుడు. ఎవ్వరికీ కనపడని 'తెల్లని పరిమళాలగరుత్తులు' చూపిస్తాడీ కవి. 'జాతి గళంలో హాలాహలం' మరగిన సవ్వడి వినగానే యీ కవి కలంలో కలకలం పెరుగుతుంది. వెంటనే గతాన్ని పరిశీలించి ప్రగతి పథంపైపు జనదృష్టిని మళ్లిస్తుంది. 'విత్తనంలో సత్తువ' ఉన్నది కాబట్టి యీ కవి మహా వృక్షంలా వ్యాపిస్తున్నాడు. ఏకంగా ప్రాకేగుణం ఉంది. అందుచేత 'అనేకంగా' అల్లుకొని పోతున్నాడు. 'వర్తమానం బాణంలా' దూసుకొని పోతున్నదని కనిపెట్టి అంతకుమించిన వేగంతో ముందుకు పరుగెత్తుతున్నాడు. ఈ కవి 'నాల్కకు తుప్పన్నది 'లేదు'. ఈయన వాక్కుకు 'ఇనుప పంజరం' లేదు. ఈతని అంతరంగం ఎల్లలనెరుగని విహంగం. ఈతని మనశ్శాల 'ఇరులులేని చంద్రశాల'. గగనమంత పెరగడం, కడలిలా కదలడం నేర్చుకున్నాడు. గతంలోకి కళ్లువిసురుతూ, కాలం ఎలా పయనిస్తుందో గమనిస్తూ మనస్సును వెండితెరగా మార్చుకుంటున్నాడు. 'ఆకుపచ్చని దరహాసాలతో లోకాన్ని మలాము' చేస్తున్నాడు. ఈతని గుండెలోని పంకల్పం' గాండీవమై మ్రోగుతుంటుంది. అందుకే 'నరాలు నమిలే చలిలో నడకలు' సాగించగలడు. 'మిన్నువిరిగి మీద' పడినా 'కన్నుతలుపు' మూయకుండా అర్ధరాత్రి 'హిమశైలాగ్రమ్మున' నిల్వగలడు. 'ధమనులపారెడు రక్తము హిమవర్షాపాతమ్మున' గడ్డకట్టినా జనరక్షాదీక్షను విడువలేనట్టివాడు. అందుకే 'వీధిమనిషి'ని మనువుగాభావించి అతనినే కవితావస్తువుగా స్వీకరించినాడు. 'గర్భగుళ్ళలాంటి ఆశయాల మరమత్తు'ను విరమించి 'ఆక్రుటిళ్ళలాంటి జీవితాల ఖిమ్మత్తు'ను అంచనా వేసినాడు.

"నిప్పులాంటి నిరుపేద సత్యానికి ఎప్పుడూలేనంత తుప్పు" పట్టడం, "ఒక్క పక్కమీద పడుకున్న న్యాయానికి ఒంటినిండా చెదలు" పట్టడం, 'మంచితొడుక్కునే పెళ్ళిదుస్తుల్ని లాక్కుని పంచన నడిబజార్లో' ఊరేగడం, 'వెయ్యికాళ్ళ జెర్రిలా', 'ఊడలమర్రిలా' చీకటి కదలడం, "హరిణశిశు గాత్రంలా హరితపత్రంలా" వేకువ బెదరడం నేటి సమాజంలో నారాయణ రెడ్డి చూచినాడు. చికాకులు, చిల్లర తగాదాలు, ఘెరావులు, ధర్నాలు, అలజడులు, ఆందోళనలు సంఘంలో ఎలా చెలరేగుతున్నాయో పరికించినాడు. అందులోనూ— "ఆకాశవాణి ఉచితంగా అందించే ధరల మరమరాలు తింటూ అందంగా" ఉబ్బిపోతున్న సగటుజీవులను, "కరువులతో అరువుల బరువులతో తరిగిపోతున్న ఉన్న కాస్త పరువులతో" వడలిపోయే సగటు జీవులను మన కళ్ళముందు నిల్పి మధ్యతరగతి మందహాసాన్ని చూపించినాడు. పరిస్థితిని పరికించడమేకాక పరిష్కారమార్గాన్ని చూపించే శక్తికూడా ఈ కవికి అపరిమితంగా ఉన్నది. 'అణ్వాస్త్రాలతోపాటు అంతరంగాలు' పెరగాలనీ, 'గ్రహాలతోపాటు ఆగ్రహాలు' గెలవాలనీ, 'పశుత్వానికి' గోరీ కట్టాలని 'నీతికి గోపురం' నిలబెట్టాలనీ, "తాబేళ్ళలా నడిచే వర్ష ప్రణాళికలు సెలయేళ్ళలా" పరుగుదీయాలనీ ఆకాంక్షించినాడు. "మనిషిలో పొంచివున్న తోడేలు మసియయ్యే" మంచిరోజులు వస్తాయనీ, "నరకలోక కంకాళవాటికలోనే నవనందనాలు" విరబూస్తాయనీ తన ప్రగాఢభావాన్ని వ్యక్తంచేసినాడు.

"జీసెస్ ప్రాకిన సిలువ పందిరిలోకి
బాపూ విడిచిన చివరి ఊపిరిలోకి"

మనం ప్రయాణం సాగించాలని నారాయణరెడ్డి తన పవిత్రధ్యేయాన్ని ప్రకటించాడు.

భవిష్యత్తును సూచించడంలోనే ఒక మహాకవి శక్తి బయటపడుతుంది. క్రాంతదర్శి అయిన కవికే అది సాధ్యమవుతుంది.

"నిద్రిస్తున్న యుగచైతన్యం
నిటలనేత్రం తెరుస్తున్నది"
"విశ్వం ప్రసవాస్తుని వెలిబూది అవుతుంది
విలయశిఖలో లలితావిర్భూతి కానుంది"

వంటి పంక్తులలో నూత్నసృష్టి జరుగుతుందని భవిష్యద్దర్శనం చేసినాడు నారాయణరెడ్డి.

రసానందం కలిగిస్తూనే సందేశాన్ని అందించడం నారాయణరెడ్డి గుణం. ఆ సందేశంకూడా ధ్వనిరమ్యంగా ఉంటుంది.

"చీకటిలా చిందులు తొక్కి—
లోకానికి మసిపూయడంకన్న
భ్రమిదలో కట్టువడివుండి
పసిడి వెలుగులందిచడం మిన్న"— అనీ
"జిల్లేడులాంటి ఉల్లం పెంచుకోండి
ఉమ్మెత్తలా ఉన్ముఖంగా ఉండండి"— అనీ
"అమృతం అందిస్తే అరనిముషం" ఆగాలనీ
"గరళం అగుపిస్తే గటగట" తాగాలనీ
"చీకట్లను శపించడం కట్టిపెట్టి
చిరుదివ్వె వెలిగించడం మంచిది"

అనీ ఈ సంపుటిద్వారా ఉపదేశమిచ్చినాడు నారాయణరెడ్డి.

మనదేశ రాజకీయ దుర్గతినే కాకుండా ప్రపంచ రాజకీయస్థితినీ ఈ సంపుటిలో అక్కడక్కడా రేఖామాత్రంగా సూచించినాడు నారాయణరెడ్డి.

ఈ కావ్యంలోని 'సన్నాజాజీపూలామాలా' అనే కవితను 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనే ఆలంకారికోక్తికి రమణీయలక్ష్యంగా గ్రహించవచ్చు. చిన్న సన్నివేశం తీసుకుని కరుణ జాలువారేలా అశ్రుజలపాతం ప్రవహించేలా రచించినాడు నారాయణరెడ్డి. ఈ సంపుటిలోని—

"ఆకాశం నల్లబల్లమీద
అదృశ్యహస్తం రాసిన అక్షరాలు చుక్కలు"

వంటి పంక్తులు నారాయణరెడ్డి దర్శనవర్ణనాశక్తికి నిదర్శనంగా భావించవచ్చు. 'చంద్రుని ఆత్మహత్య' అనే ఖండిక నారాయణరెడ్డి భావనాబలానికీ సంప్రదాయజ్ఞతకూ రచనారామణీయకానికీ చక్కని ఉదాహరణం. బావిలో బింబించిన చంద్రబింబాన్నిచూచి చంద్రుని ఆత్మహత్యగా భావించినాడు కవి. ఈ

కవితలో నరలోకం సురలోకం ముడివేయబడినాయి. బావిలో చంద్రునివలెనే యీ కవితలో సమకాలిక సాంఘికజీవనమూ ప్రజల మానసికస్థితీ బింబిస్తున్నాయి. మానవుడు చంద్రమండల ప్రవేశంకోసం చేసే ప్రయత్నంకూడా మూడు చరణాలలో ముచ్చటగా చెప్పినాడు నారాయణరెడ్డి.

నారాయణరెడ్డి యీ సంపుటిలో ప్రయోగించిన ఉపమాలంకారాలలో కొన్ని అత్యాధునికమైనవి ఉన్నవి. మచ్చుకు కొన్ని— 'తామ్రశాసనంలా మిగులు' 'మర్రిఊడల్లాదిగిన నిరాశలు' 'గుండెకాయలు విద్యుత్ప్రసారంలా హఠాత్తుగా' ఆగిపోవడం, ఊపిరులు 'కుళాయి నీళ్ళలో' అమాంతంగా తెగిపోవడం, సిమెంటుగోడల్లాంటి నిశ్శబ్దం, చిక్కడపల్లిలా క్రిక్కిరిసిన కాంక్షలు, 'పగిలిన అద్దాలశాలలాగా' అందంగాఉన్న జీవితం, "కోడిగుడ్డులా అగుపించవలసిన ముఖం", 'గ్రూపురాజకీయాల్లా కుళ్ళిన చీకటి గల్లీలు'. కళ్ళముందు కనిపించేవాటిని ఉపమలుగా ఉపయోగించుకోవడం, నల్గిన అన్యదేశపదాలను ప్రయోగించడం, వాటిలో సంఘదుర్గతినీ, అది అందుకోవలసిన ఉజ్వలస్థితినీ అతిరమ్యంగా చెప్పడం ఈ ఉపమాలంకార ప్రయోగంలోని ప్రత్యేకత.

ప్లాస్టిక్‌నవ్వులు, నైలాను బతుకులు, పడుచుచీకట్లు, వెన్నెలదుస్తులు వంటి చక్కని పదబంధాలు ఈ సంపుటిలో మెరుస్తున్నాయి.

అనవరతం అంతర్మథనంసాగించే నారాయణరెడ్డి మరోమలుపు తిరిగినాడు. గేయంలో పాటించిన యతినియతినీ అంత్యప్రాసనూ రెండురెండు పాదాలకు పాటిస్తూ వచనకవితలోకూడా తనముద్రను భద్రంగా నిలుపుకున్నాడు. యీ కవి దమ్మున్నవాడు ; ధ్వనిబలం ఉన్నవాడు. సత్త్వాన్ని పెంచుకుంటూ స్వత్త్వాన్ని పోషించుకుంటున్నవాడు. ఈ సంపుటిలోని వచనకవితల నడకలలో కొత్తపోకడలున్నాయి.

శీర్షికలముందున్న 'బాపు' రేఖాచిత్రాలు పాఠకుల హృదయఫలకంపై కవి ఊహించిన భావచిత్రాలను సృష్టిస్తూ రసానుభూతికి సహాయపడుతున్నాయి. కేవలం వాచ్యార్థాన్ని దృష్టిలో ఉంచుకొని సమకాలిక సామాజిక సమస్యలను ఏకరువుపెట్టడం కవిత్వం అనిపించుకోదు. కేవలం వస్తునివేదనం కవితకాదు. భావాలకూ పరిస్థితులకూ అనుభూతులకూ వాక్యాల ఉడు

పులు తొడగడంతో సరిపోదు. ఇది కవితారంగంలో బాహిరవేషం మాత్రమే. అచ్చమైన కవి నారాయణరెడ్డికి ఈ పరిజ్ఞానం విశేషంగా ఉన్నది. కనుకనే సమస్యాతోరణాలను చరణాల్లో ఇరికించి, వార్తాపత్రికాపంక్తులను కత్తిరించి వ్రాసినట్లుగా వ్రాయడం ఆయన చేయలేని పనుల్లో ఒకటి. యీ 'మధ్యతరగతి మందహాసం' సమకాలిక సాంఘిక సమస్యలకు పట్టిన ధ్వనిదర్పణం. వాచ్యార్థానికి దూరంగా లక్ష్యార్థానికి కొంచెం దగ్గరగా వ్యంగ్యార్థానికి మరింత చేరువగా భావాలను ప్రకటించడమే నారాయణరెడ్డి ప్రత్యేకత. యీ ప్రత్యేకత యీ సంకలనంలో అచ్చటచ్చటా కాదు— అంతటా అల్లుకున్నది.

# మరోహరివిల్లు

'మధ్యతరగతి మందహాసం' తరువాతి ఖండకావ్యం 'మరో హరివిల్లు'. ఇది 1969 డిసెంబరులో ముద్రితం. 1969లో వ్రాసిన నలుబై యొక్కటి ఖండికలిందులో ఉన్నవి. 'మధ్యతరగతి మందహాసం' సంపుటిలోని 'క్రాంతి దీపావళి' అనే ఖండికలో "మబ్బుపట్టిన జీవనగగనంలో మరో హరివిల్లు విచ్చిందని" అనే చరణంలో ఈ సంపుటిపేరు మొదటిసారిగా కనిపిస్తుంది. ఈ సంపుటిలోకూడా 'మరోహరివిల్లు'ను మొదట్లోనే పరిచయం చేసినాడు నారాయణరెడ్డి. ఇతని గుండె జడంగా సంఘానికి ఎడంగా ఉండేది కాదు. "సమస్యల శార్దూలాలు అరిచినప్పుడు, సంఘటనల సాలెగూళ్లు నోళ్ళుతెరిచినప్పుడు విభ్రాంతిలో వి[illegible]ంతిలో రకరకాలుగా శకల శకలాలుగా చెదిరిపడ్డ అనుభూతుల"ను అక్షరాకృతులలో 'శివమెత్తిన నవరీతుల'లో వ్యక్తం చేసినాడు ఈ కవి. ఈతని "మనస్సునచ్చుస్సులో పొడిచిన మాయని ఆశల హరివిల్లు" ఈ మరో హరివిల్లు.

నారాయణరెడ్డి పురోగామి. రాకెట్టు వేగంతో రమణీయంగా సాగిపోయే రసస్వామి. 'స్పందనం' ఆతని 'స్యందనం'. 'ఆలోచనం' ఆతని 'లోచనం'. 'మైత్రి' ఆతని 'వృత్తి'. 'ఆర్తి' ఆతని 'అంతరంగవర్తి'—

ఘాతాలు నిద్రపోతున్నా 'ఉల్కలా' మేల్కొని 'ఉల్లాసంతో హృల్లాసంతో' గీతాలు రచిస్తుంటాడు. 'స్వరాన్ని భావభాస్వరం' చేయడంలోనూ కృపాణంలో కృపను చిందించడంలోనూ శక్తీ, ఆసక్తీ ఉన్నవాడు. ఈతనిదృష్టిలో జీవితం 'కర్పూరం'; ఈతని సృష్టిలో భవితవ్యం 'కల్హారం'. ఈతడు 'ఆహుతికి పాఠాంతరంగా' ఉండి కుంపటికి 'అగ్గిపాటలు' నేర్పగలవాడు. చైతన్యపాఠాలు నేర్పుతూ 'సుపర్ణుని గరుత్తులా' డిల్లవడక సాగిపోతున్నది ఈతని గళం. జాతకం విస్మరించి జ్వాలను చుంబిస్తూ, అనుకున్న నగ్న సత్యాలకు అక్షరాకృతి కలిగిస్తూ క్షతిలేని సత్యంవైపు మృతిలేని స్వప్నం వైపు నడుస్తున్నది ఈతని కలం. పలాయన తత్త్వంతో ఈకవికి పొత్తు కుదురదు.

"జటిల సమస్యల కాకోలాన్ని
గటగటమని తాగేసి
నడిస్తే ప్రజ్వలిస్తాడు మనిషి
జడిస్తే అనుభవిస్తాడు నిశి"

అనే విశ్వాసం కలవాడు ఇంకా ఇతడు—

"రత్నంలాంటి కన్నుతో
సూత్నంగా చూడగల్గినవాడు
నికషంలాంటి పెన్నుతో
నిజాన్ని రాయగలిగినవాడు
మోడెందుకు పాడువడిందో
పాతర్లు తవ్వితీసి
అఖాతాల్లో మునకలేసి
హేతువుల సేతువులు
వేయగలిగిన వాడు"

గతానికి ఆగతానికి పూలవంతెనలాంటి వాడు. 'బీదాబిక్కీ పసి ముసలి' అనకుండా ఆబాలగోపాలానికి కవితామృతం పంచిపెడుతున్నాడు.

"సమాజమే సముద్రంగా
సంకల్పమే కవ్వంగా
ఆశయాల వాసుకిని చుట్టి
అంతు తేలేదాకా గిలకొట్టి"

తీసిన నవ్యామృతాన్ని కులగోత్రాల ప్రసక్తి లేకుండా అందరికీ ఆనందంగా పంచి పెడుతున్నాడు. సూటిగా వచ్చి త్రాగుతున్నారు సహృదయ పాఠకులు. ఇందులో సందేహం లేదు.

నారాయణరెడ్డి కవితలో నూటికి తొంబైపాళ్లు మానవతా ప్రబోధం కనిపిస్తుంది.

"మనిషి నశించినా
నశించదు మానవత్వం
అదే ఈ లోకానికి మణిసోపానం
అనంతంవైపు దాని ప్రస్థానం"

అని గానం చేసినాడు 'మానవుడు'లో. ఆది మానవుని దగ్గరినుండి ఆధునికుని వరకుగల ఇతిహాసాన్ని నారాయణరెడ్డి మహోదాత్తంగా చెప్పినాడు ఈ కవితలో.

"ప్రదర్శకులు విసిరిన రాళ్లదెబ్బలకు-పగిలిన అద్దాలశాలలాగా, ఉసిగొన్న ఉద్రేకాలకు గురియై - మసియైన మోటారు శకటాలలాగా - ఎంత అందంగా ఉంది జీవితం!" అని గతంలో జీవితాన్ని చిత్రించిన నారాయణరెడ్డి ఈ సంపుటిలో—

"జీవితం ఏం పసందుగా వుంది!
చితికిన పసికందులా వుంది"

అని అన్నాడు.

"జీవితం రసాలకిసలయం కాదు
జిల్లేడు కొమ్మ
వేధించినా క్షీరబాష్పాలిచ్చే
వెర్రిబాగులమ్మ"

వంటి మాటల్లో జీవితంలో ఉండవలసిన త్యాగప్రాధాన్యాన్ని ధ్వనిరమ్యంగా వ్యక్తం చేసినాడు.

నారాయణరెడ్డి రచనల్లో సమత సర్వత్రా గోచరిస్తుంది. సమైక్యం శతపత్రంలా విరిసి కనిపిస్తుంది. ఇందుకు ఉదాహరణంగా—

"విడిపోయిన హృదయాలకు
విరివంతెన వేయాలిక"
"తనయుల మెందరమైనా
తల్లినేల ఒకటే"

వంటి చరణాలను గ్రహించవచ్చు.

"కయ్యాని కెవడైన కాలుద్రవ్విననాడు
కాళియై కదనరంగాన దూకినజాతి
నెయ్యాని కెవరైన నిలిచి పిలిచిననాడు
కలహంసయై ముందు కదలి నడయాడు"—

అని మన వీరజాతిని ప్రశంసించినాడు నారాయణరెడ్డి. వెర్రితలలు వేస్తున్న రాజకీయ వాతావరణాన్ని చూచి—

"అనుకోలేదు
అంబరాల అంతుకనుక్కున్న
ఆశయాల గాలిపటం
చింతకొమ్మకు ఉరిపోసుకుంటుందని.
కోటి విద్యుత్తులు పండించే
చైతన్య మహాతరువు
కుక్కమూతి పిందెలు పెడుతుందని"

వంటి పంక్తులలో తన ఆవేదనను కావ్యబద్ధం చేసినాడు. తెలంగాణా ఆందోళనను 'అంతా ఒక పీడకల'గా భావించి సమైక్యసందేశాన్ని అందించగల్గిన మనీషి.

'వేదనలోనే పుట్టెను వేదమ్ములు నాదమ్ములు' అని గతంలో పలికిన నారాయణరెడ్డి ఈ సంపుటిలో—

"ఉలిదెబ్బలు తిన్న మొండి
శిలనిల్పును ప్రాణమ్మె"
"అశ్రుసి_క్త హృదయమె పర
మాత్మను సందర్శించును"--

అనే చరణాలలో వేదనవలన మనిషి పరిణతుడౌతాడని తెలిపినాడు. ఇలా ఏమి చెప్పినా ఎద కదిలేటట్లు చెప్పడం ఈతని సహజలక్షణం

మంచి మనసు మంచిని ఆదరిస్తుంది; అర్చిస్తుంది; మంచిని పెంచి దేశకల్యాణానికై మనుగడను మనసారా త్యాగంచేసిన మానవో_త్తములెందరికో స్తుతులూ నతులూ సమర్పిస్తాడు ఈ కవి. గాంధీని ప్రశంసించినాడు. ప్రఖ్యాత ఉర్దూకవి మఖ్దూం మొహియొద్దీన్ నిర్వాణ వా_ర్తను విని దుఃఖించినాడు. బుచ్చిబాబును స్మరించినాడు. మాడపాటి పితామహునికి గీతాత్మకమైన జోతలర్పించినాడు. జవహరుని సంస్తుతించినాడు. షష్టిపూ_ర్తి సందర్భంగా శ్రీశ్రీని ప్రశంసించినాడు. అమెరికా మిత్రులు చంద్రమండలపై చరణం మోపిన తరుణంలో హర్షంతో గీతాన్ని వర్షించినాడు. "చంద్రుని మంచిని పొగడుతూ సంఘంలోని వంచనను తెగడుతూ చంద్రునిలో సిగపట్లు-అగచాట్లు - సిండికేట్లు--ఇండికేట్లు లేవన్నాడు" సూక్ష్మంగా రాజకీయస్థితిని సూచించినాడు.

'అంతా ఒక పీడకల' ఖండికలో నాటకీయశైలీ చక్కని పదాల పొందికా కనిపిస్తుంది. కొన్ని కవితలు ప్రశ్నో_త్తరాల రూపంలో సాగినవి.

ఆంధ్ర ప్రదేశావతరణ దినోత్సవ సందర్భంగా-"చిక్కులెరుగనివాడు చిత్తాన పసివాడు" అని తెలుగు వాడిని మెచ్చుకున్నాడు.

ఈ సంపుటిలో సంక్రాంతి, ఉగాది పండుగలకు సంబంధించిన కృతులున్నవి. కొన్ని గుజరాతీ కవితలకు అనుసరణలున్నవి.

ఈ సంపుటిలో భావగర్జితములైనసూక్తులెన్నో ఉన్నవి ఉదాహరణకు-

"పాడువడ్డ గోరిపై
పల్లవించు గరికపోచ"
"గవ్వలు లెక్కించువాడు
మువ్వల విలువలెరుంగడు"-

అనే పంక్తులను చూడవచ్చును.

ఈ సంపుటిలో-

"ఒక్కణ్ని ఒకే ఒక్కణ్ని
ఊరి వెలుపలి కోవెలలాగా
నోరుతెరవని కోయిలలాగా"
"నరుడివేదన నరకంలాగా కరుస్తున్నది
"కాళ్లూ ఒళ్ళూ ముడుచుకుంది
కచ్ఛపంలా కాకిపిల్లలా"
"రబ్బరు చక్రాలక్రింద
రుబ్బిన పిండిలా నలిగే"-

వంటి చక్కని కొత్తకొత్త ఉపమాలంకారాలు కనిపిస్తాయి. కన్నీటి చిచ్చులు, వెల్తురుపువ్వు, సంక్రాంతిబంతివంటి రమ్యపదబంధాలున్నవీ సంపుటిలో.

ఈ సంకలనంలో మొదటి సగం కవితలు వచనకవితా ధోరణిలోనూ తరువాతి సగం మాత్రాచ్ఛందస్సరణిలోనూ సాగినవి.

"తెగిపోదురా రక్తబంధం
తునిగిపోదురా రాగబంధం"

అని సమైక్యసందేశమిచ్చినాడు ఈ కవి.

"అశక్తులకు
స్వశప్తులకు
విద్వేష కర్దము లిప్తులకు
లేదు సుగతి
లేదు ప్రగతి
లేనేలేదు లవలేశద్యుతి"

అని ఘంటా ఘోషంగా చెప్పినాడు. ఈ కవి ఆశావాది. మానవీయదృక్పథం మనసునిండా ఉన్నవాడు. పదాలకు చిత్రికలుపట్టి పసిడితునకలుచేసి ప్రయోగిస్తాడు. అందం ఉట్టిపడేటట్లు రచించడమన్నా, సుమ సుకుమారంగా భావాన్ని అలంకృతంచేసి అందించడమన్నా ఈ కవికి నల్లేరుపై బండినడక. రకరకాల భావాల రంగుల కిరణాలను ఈ 'మనో హరివిల్లు'లో మనం చూడగలుగుతాం. మనసారా ప్రమోదం పొందగలుగుతాం.

# మంటలూ మానవుడూ

మంటలనూ మధురిమలనూ అంటించి 'మరోహరివిల్లు'లో మనోజ్ఞంగా గానంచేసిన నారాయణరెడ్డి సమాజస్వాంతంలో దినందినం తీవ్రంగా ప్రజ్వలిస్తున్న మంటలనూ వాటికి ఆధారపీఠమైన మానవుని అంతరంగాన్నీ "మంటలూ మానవుడూ" అనే వచనకవితా సంపుటిలో మహోజ్వలంగా చిత్రించినాడు. ముప్పై ఖండికలున్న ఈ సంపుటి 1970 డిసెంబరులో ప్రచురితం. దీనిని తనకు ఆత్మీయులు శ్రీ అల్లారెడ్డి వెంకటకృష్ణారెడ్డిగారికి సౌహార్దచిహ్నంగా అంకితం చేసినాడు.

'మంటలూ మానవుడూ' ఉత్తమ వచనకవితాసంపుటి. ఈ కవి అమృత హృదయాన్నిధ్వనింపజేసే ఖండికలిందులో కనపడతాయి. మంటలు అగ్నిరూపం. మంటలు చైతన్యానికీ ధర్మాగ్రహానికీ ప్రతీక. బాధ, విప్లవం వీటివలన ధ్వనిస్తాయి. మానవుని అనంతజీవితయాత్రనూ ఆతని చైతన్యాన్నీ అభ్యుదయాన్నీ మానవతా దృక్పథాన్నీ ప్రతిసంపుటిలోనూ వ్యక్తంచేస్తూ వస్తున్న నారాయణరెడ్డి ఈ సంపుటికే "మానవుడు" అనేపదంచేర్చి మానవతామూర్తికి మకుటం పెట్టినాడు.

అందరిలో ఒకడిగా ఉంటూ అంతరంగాలలోకి చొచ్చుకొనివెళ్ళి వాటి స్థితిగతులనూ గమ్యాన్నీ వ్యక్తీకరించగల మహాకవి కావడంవలన నారాయణరెడ్డి డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారన్నట్లు "నేటి సామాజిక వ్యవస్థని, దాని దౌర్భాగ్యాన్ని అనితరసాధ్యమైన ధ్వనితో"[1] చిత్రించినారిందులో. ఈ సంపుటిలో 'మంటలూ; మానవుడూ' అనేది మొదటికవిత. అన్యాయాన్నీ అక్రమాన్నీ అసురతత్త్వాన్నీ అంతం చెయ్యడానికి సామాన్య ప్రజానీక హృదయాలలో అతివేలంగా చెలరేగే ఆగ్రహమే ఈ మంటలు. పాలకవర్గం లోని కుళ్ళు ఒళ్ళుపెంచినపుడల్లా మానవునిలో మంటలులేస్తాయి. ఫైరింజన్లతో చల్లారే మంటలుకావవి? కారణం అవి– 'మస్తకాల్లో మస్తిష్కాల్లో' 'పట్ట

---

1. 'మంటలూ మానవుడూ' 'ఆమోదం'లో పుట v. (ప్రచురణ ; డిసెంబరు 1970)

పగలు నిట్టనిలువునా ప్రజ్వలించేమంటలు'. తాత్కాలికంగా 'మంటలు కుప్ప గూలి' నా, 'గుప్పున చల్లారి'నా—

"మహోజ్జ్వలభావి చిరంజీవి
మానవుడు చల్లారలేడు"

అనే యాథార్థ్యాన్ని ఉగ్గడించినాడు.

"అనుదినం పెంచుకున్న తెలివేతెలివి" అని నారాయణరెడ్డికి తెలుసు.

"గణంకంటె గుణం ముఖ్యమని
రాశికంటె రమ్యత శ్రేష్ఠమని"

కూడా తెలుసు. "అభిరామమైన అనుభూతి"తో ఆత్మతంత్రిని రవళింపజేస్తా డీకవి. ఈతడు "తొలిచూలున పుట్టిన సత్యం తురాయి అంచులు ముట్టిన ముత్యం". ఆలోచనా ఆలాపనా ఈతని వ్యక్తిత్వ విశేషం. గిరులు గీసు కోవడం యీకవికి చేతకాదు. 'అలసిన గుండెల డప్పుల చప్పుడు'— 'వాడినదండల ఆవిరితావులు' గ్రహించే శక్తి కలవాడు. అందాలలతాంతాలను ఆవిష్కరించే లతికల బతుకుల ఆర్తిమూర్తులకు వెలకట్టడం బాగా తెలిసిన వాడు. 'తారకలూ బృందారకులూ' చైతన్యసీమలో మేల్కొని ఉన్నారని గట్టిగా తెలిసిన నారాయణరెడ్డి చైతన్యానికి సౌజన్యాన్ని సంఘటించాలని వాంఛిస్తాడు. "అధరానికి లేని ఆలోచన హృదయానికి ఉంటుందని మధువుకు లేని ఆలాపన మధుపానికి ఉంటుందని" అని అనుశీలించిన ప్రతిభా మూర్తి యీ మహాకవి. "మానును ప్రసవించలేని" విత్తనాలు, "మౌన గర్భాన్ని చీల్చలేని" గీతాలు, "దుఃఖాన్ని దిగమ్రింగుకోలేని" సుఖాలు, "అహాన్ని సమర్థించుకోలేని" ఆవేశాలు పనికిరావని తెలిసిన ప్రజ్ఞాచక్షువు. పొట్లనూ చీవాట్లనూ లెక్కచేయక 'మెట్లెక్కిపోతున్న జ్వాలిక' ఈతని కవిత్వం.

'పరమహంసలారా' అనే కవితలో ఉగాదిపండుగ లక్షణాలను మానవుని స్వరూప స్వభావాలకు అన్వయిస్తూ మానవుని ప్రస్తుత దౌర్భాగ్యస్థితినీ ఆతని కృత్రిమతనూ ఎత్తిచూపినాడు నారాయణరెడ్డి. ఈనాటి మానవుని 'ఉల్లాసం' అరువుతెచ్చుకున్నది; ఆతని 'దరహాసం' అతికించుకున్నది

అన్నాడు. 'వంతెనకింది నీళ్ళలా' వలసపోవలసిన పనిలేదంటూ 'రామభద్రులు' 'అపరరుద్రులు' మనిషి అంతరంగంలోనే నెలకొని ఉన్నారనీ, దాగియున్న శక్తిని ఉపయోగించాలనీ ప్రజలను ప్రబోధించినాడు. 'తాండవించే నందికేశ్వరులు'గా, 'పటలెత్తేకేసరులు'గా నరులు భావించాలనీ, "రవ్వలాంటి నిప్పురవ్వలాంటి నవ్వులు" కావాలనీ, "కిరణాల్లాంటి కొరడాల్లాంటి చురుకుచూపులు" ఉండాలనీ "సెలయేళ్ళలా" దూకే ఆలోచనలుండాలనీ ఈకవి వాంఛ.

వచనాకవితలో చేయితిరిగిన నారాయణరెడ్డి మధ్యతరగతి మందహాసంలోకంటె ఈ సంపుటిలో మరీ ముందుకు పోగలిగినాడు, ఈతని కవితలలో శబ్దశక్తి ప్రజ్వలిస్తుంది.

ఈ సంపుటిలో కొన్నికవితలు కథాకథనధోరణిలో నడిచినవి. చివరిదాకా పాఠకుని ఉత్సుకతతో చదివించే గుణం వీటిలో విస్తృతంగా ఉంది. "అనగనగా ఒక రాజుగారు" అనేఖండిక అలాంటిదే. ఇందులో నిరంకుశపాలకుల మనస్తత్వాన్ని చిత్రిస్తూ చిట్టచివరకు పీడిత ప్రజానీకం ఎలా విజృంభిస్తుందో వ్యక్తంచేసినాడు. "చెట్టు చైతన్యానికి చిహ్నం". రాజుగారిచే నరకబడ్డ ఆ చెట్టు "కొమ్మలు గొడ్డళ్ళుగా రెమ్మలు కొడవళ్లుగా ఆకులు బాకులుగా పూలు ఖడ్గాలుగా" చివరకు తానే ఒక "నవవిప్లవవిరాట్టుగా" విక్రమించి "పాపాల భూపాలుణ్ని పాతాళానికి విసిరికొట్టింది" అని ధ్వనివైభవంతో ఒక చక్కని చైతన్యపాఠాన్ని సంఘానికి నేర్పినాడు నారాయణరెడ్డి. "ఇది ఉత్తమ ధ్వనికావ్యం" అన్న డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారిమాట అత్యుక్తికాదు. "మూడు శిఖరాలూ - మూడు తలకాయలూ" అనే ఖండిక కూడా అలాంటిదే. ఇందులోని "పర్వతగర్భం" ప్రజా హృదయానికి, "జ్వాలాద్రవం" ప్రజాశక్తికి ప్రతీకలు. "లక్షరూపాయల బహుమతి" అనే కవిత ప్రతిఒక్కరిలో ఒక రక్కసి ఉన్నాడని చెపుతుంది.

"ప్రజా చైతన్యం ట్రాక్టర్" ప్రగమిస్తున్న "ఈ రోజున మొత్తం సొత్తును గుత్తగా దాచుకున్న ఊడలమర్రికి తావులేదు"–"మర్రిచెట్టు కోట కట్టినచోట మొలకుళ్లు తలలెత్తుతాయి" వంటి పంక్తులలో పశువుగా పరిక్రమిస్తున్న సమతాభావాన్ని వెలిబుచ్చినాడు నారాయణరెడ్డి. "అందరూ పంచు

కున్న కలిమేకలిమి"— "అన్ని నొసళ్ళకు కావాలిపొద్దు అన్ని నోళ్ళకు అందాలి ముద్దు" అనే చరణాలు వైభవాన్నేబలపరుస్తున్నవి. "ఇద్దరూ ఒకటే" అనే ఖండికలోని 'ఆ మరొకడు' "పెంటూఫోర్" ఉద్యోగధర్మం నిర్వహించి "గంటగంటకూ ఆయుస్సును హవిస్సులా" సమర్పించే అధ్యాపకుడు నారాయణరెడ్డియేమో అనిపిస్తుంది.

ఆధునిక రాజకీయ వాతావరణం, పార్టీలు చేస్తున్నపని "జోడెద్దుల కుమ్ములాట" లో చూపబడినది. పార్టీలు పరస్పరం పోట్లాడుకుని ప్రజల ఆశయాలను ఆస్తిపాస్తులను బజారుపాలు చేస్తున్నట్లు వాస్తవికతాసుందరంగా చెప్పినాడు, "చీకటిచదువు" అనే ఖండిక సాయుధ విప్లవభావాన్ని వ్యంజింపజేస్తున్నది. "నీకూ నాకూ ఏంపోలిక" అన్న ఖండికలో శ్రామికునికీ బేహారికీ గల భేదాన్ని స్పష్టంచేసినాడు నారాయణరెడ్డి.

"శ్రమజీవి చెమటబిందువులో
ఆణిముత్యమూ ఉంది
అగ్నిగోళమూ ఉంది"

అని శ్రమజీవసౌందర్యాన్ని దర్శిస్తూనే సామ్యవాదతత్వాంచలాలను సందర్శింపజేస్తాడు ఈ కవి.

నారాయణరెడ్డి అనేక కవితలలో జీవితాన్ని వ్యంగ్యంగా నిర్వచిస్తాడు-

"నెమిలి పింఛంలా విప్పుకున్నదే
నిజమైన జీవితం
కాకి తోకలా ముడుచుకున్నది
కళేబర సమ్మితం"

అని అన్నాడు. మరొకచోట-

"బ్రతుకంటే ఉద్దీప్తచైతన్యం
జలవిద్యుత్తుతో దాని బాంధవ్యం
బ్రతుకంటే వర్షామేఘం
బీళ్ళతో ఏళ్ళతో దాని అనుబంధం"

అన్నాడు దీనిని ఈ కవి ఇచ్చే సందేశంగా భావించవచ్చు.

'చిరునవ్వు' కవిత చిరునవ్వు తెప్పిస్తుంది.

"అంతుపట్టని చిరునవ్వులుంటాయని
అసలు చిరునవ్వుకే ఎసరుపెట్టరాదు"

అని అన్నాడు.

"సహనాన్ని జడత అనుకుని
మౌనాన్ని మగత అనుకుని
జ్వాలాగిరితో చెరలాడితే
చావుదెబ్బ తీస్తుంది"

అని హెచ్చరించినాడు. ఈ సంపుటిలో 'ఇంకిపోయిన బావీ', 'ఆకాశం ప్రసవించింది' 'అరిచే నక్కను అరవనీ' అనే ఖండికలు సమకాలిక సమాజంలోని భిన్న భిన్నరంగాల్లో చెలరేగుతున్న కుమ్ములాటలకూ నానాటికీ దిగజారిపోతున్న విలువలకూ పట్టిన ధ్వనిదర్పణాలు. ఈ కవితలలో తోచే వ్యక్తులు ఆత్మీయులైన కవులే కానక్కరలేదు; ప్రజలకు ఆరాధ్యులైన నాయకులే కానక్కరలేదు; భక్తులకు స్వర్గద్వారాలు తెరచిచూపించే మహా మహిమోపేతులే కావచ్చు—ఇందులో ఎవరిని ఊహించి ఈ కవితలు చదివినా వాటిలో ఇమిడిపోతారు. ఇలా కవి వాక్కులో ఇంతవేడి ఇంతవాడి ఉండడానికి అవకాశముంటుందని నిరూపించినాడు ఈ కవి.

నారాయణరెడ్డి గొప్ప ఆశావాది. ఈ సంపుటిలో ఆతని ఆశావాదాలు ఆయా కవితలలో గోచరిస్తాయి. ఉదాహరణకు-

"మనిషిని నిశినుంచి విడగొట్టి
మాయని వేకువకు జేకొట్టి
జగతికి సుగతి చూపేరోజు
ప్రగతి చేసేరోజు
రేపో మాపో రాకపోదు"
"రానున్న ప్రభాతం రాకతప్పదు
రక్తి శక్తి సత్యమూర్తికాన్ని
ప్రసవించక తప్పదు; నవధర్మం
ప్రభవించక తప్పదు."-

అనే పంక్తులను గ్రహించవచ్చు.

ఈ సంపుటిలోని 'పరమహంసలారా', 'అనగనగా ఒకరాజుగారు' 'కొత్త ముఖంతొడుక్కో' 'జోడెద్దుల కుమ్ములాట' అనే ఖండికలలో కావ్యాత్మమైన ధ్వని విరిసికొని ఉన్నది. ఈ కవితలలోని ప్రతి పంక్తిలో, పంక్తిలోని ప్రతి పదంలో ఉక్తివైచిత్రి ఉట్టిపడుతుంది. క్రమాలంకార ప్రయోగం ఈ రచనలలో చాలాచోట్ల కనపడుతుంది. ఈ అలంకారం కవితలలో భావైక్యాన్ని పోషిస్తున్నది. ఉదాహరణకు-

"రాకాసురులను తరిమికొట్టే
రామభద్రులున్నారని
అంధకాసురులను మట్టుపెట్టే
అపరరుద్రులున్నారని"

అని వ్రాసి కొన్ని పంక్తులైన తరువాత-

"పర్ణశాలలో కోదండం దాచిపెట్టి
ఫాలంలో అగ్ని నేత్రం పాతిపెట్టి"

అని వ్రాస్తాడు. రామభద్రుని కోదండం, అపరరుద్రుని అగ్నినేత్రం అని క్రమంగా అన్వయం కుదురుతుంది. అలాగే-

"చిచ్చుబుడ్డీ పేలుతుంది
చిచ్చరకన్నూ పేలుతుంది
ఎండుగడ్డీ మండుతుంది
బడబాగ్నీ మండుతుంది"

అనే పంక్తులను

"జాతర చూపేదొకటి
చైతన్యం రేపేదొకటి
క్షణమాత్రం ఒకటి
అనంతకాలం సందీప్తం ఒకటి"

అనే పంక్తులతో క్రమంగా కలుపుకోవాలి.

పోలికలు చెప్పడంలో, అందులోనూ కొత్త పోలికలు చెప్పడంలో నారాయణరెడ్డి అంతులేని ఉత్సాహాన్ని కనపరుస్తాడు - "మహోద్యమంవంటి మనిషి" "వలసపోతున్నారు మీరు పంతెనకింది నీళ్లలా", "పేడితనం కనవులా చిమ్మేసి" వంటి వెన్నింటినో ఈ సంపుటివాటికలో నుంచి ఏర్చి కూర్చవచ్చు.

నారాయణరెడ్డి అధ్యాపకవృత్తిలో ఉన్నందుచేతనూ వ్యాకరణచ్ఛద శాస్త్రాలతో విశేషపరిచయ మున్నందువలననూ ఆతని రచనలలో కూడా శాస్త్ర పదాలు దొరలి భావాలను ప్రదీప్తం చేస్తాయి. తార్కాణమునకు-

"ఛందోబద్ధంగా చేతులూపుకుంటూ
వ్యాకరణ సిద్ధంగా పదాలేసుకుంటూ"
"వక్రాలూ వక్రతమాలూ
దానికి అత్యంత ప్రియతమాలు
ఓష్ఠ్యాలంటే ఓకిలిస్తుంది
దంత్యాలంటే గుటకలేస్తుంది
సరళాలంటే పెదవి విరుస్తుంది
పరుషాలంటే జబ్బచరుస్తుంది"
"దాని వ్యాకరణం
అజ్ఞానకరణం
దాని ఛందస్సు
అంధ తపస్సు"

నారాయణరెడ్డి నుడికారపుసొంపులు విశేషంగా చూపుతాడు. జాతీయాలను మిక్కుటంగా ప్రయోగిస్తాడు. చిన్న చిన్న పదాలు కలిపి చిత్రాతిచిత్రంగా ఒక భావానికి బొమ్మకట్టుతాడు. 'ఆలోచించు' అనుటకు బదులు 'బుర్రల బీళ్ళుదున్నే చేణివేళ్ళు' అనీ, 'చెప్పండి' అనుటకు 'కుత్తుకలముళ్లు విప్పిండి' అనీ వ్రాస్తాడు. 'అధికార్లు' అనుటకు బదులు గద్దెలకంటుకున్న తోలు బొమ్మలు' అని నవ్వువచ్చేటట్లువ్రాస్తాడు. ఈ కవిశబ్దాధికారం అలాంటిదిమరి.

ఈ సంపుటిలో 'వీధుల గోదావరులు,' 'కల్తీల సుల్తానులు', గాలి జవరాలు, మంటలగంటలు, పడుచుకళ్ళు, ధూమభామ, చిచ్చుపాప వంటి అందాల పదబంధాలు గుబాళిస్తాయి.

నారాయణరెడ్డి క్రాంతదర్శియై ఏ ఇజాలబుజాలు తడుముకోకుండా విశ్వజనీనమైన అనుభూతులను రసార్ద్రించేసి అధునాతన చేతనతో గాఢావేశంతో సమన్వయదృక్పథంతో వ్యంగ్యవిలాసంతో అసాధారణమైన ఉక్తివైచిత్రితో వ్యక్తం చేస్తాడు. ప్రతి వచనకవితలో ఒక అంశాన్ని ప్రవేశపెట్టి దానిని సమగ్ర సుందరంగా పోషిస్తాడు. వాడుకభాషలోని అర్థపరిణామాన్ని పరిశీలించి ప్రయోగిస్తాడు. మనతో మాటాడుతున్నట్లే సరళభాషలో శక్తిమంతంగా వ్రాస్తాడు. తెలుగువారికి సూటిగా సులభంగా తెలిసే తెలుగు మాటలను తెలుగునాల్కలపై నలిగిన సంస్కృతపదాలనూ, అందరికీ తెలిసి అభివ్యక్తీకరణకు అనువుగా నుండే అన్యదేశ్యాలనూ ప్రయోగించి కవితామృతాన్ని ప్రజలెక్కువ సంఖ్యలో ఆస్వాదించేటట్లు కవితలు వ్రాస్తున్నాడు.

నారాయణరెడ్డి ఖండకావ్యాలలో జలపాతం, దివ్వెలమువ్వలు, అక్షరాల గవాక్షాలు వరకు పద్యాలు విరళంగా సాగినవి. 'నారాయణరెడ్డిగేయాలు' మాత్రాచ్ఛందస్సులో నడిచే గేయాలు గలది. 'మధ్యతరగతి మందహాసం' కేవలం వచనకవితా సంపుటి అనడానికి వీలులేదు. అందులో చివరికొన్ని గీతాలు మాత్రాచ్ఛందస్సుల్లో ఉన్నాయి. 'మరో హరివిల్లు'లో సగం గేయాలున్నాయి. మాత్రాచ్ఛందస్సును మాస్టరు చేసిన నారాయణరెడ్డి మాత్రాచ్ఛందస్సును ఏమాత్రం ప్రయోగించని మొట్టమొదటి సంపూర్ణ వచనకవితా సంపుటి 'మంటలూ-మానవుడూ'.

ఈ కవితా సంకలనం కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతిని అందుకొని నారాయణరెడ్డి కవితకు యావద్భారత ప్రశస్తిని సంపాదించి పెట్టినది. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన హైదరాబాదులోని 'నవోదయం' అనే సాహితీ సాంస్కృతికసంస్థ ఈ కవితా సంకలన ప్రాశస్త్యాన్ని చాటుతూ 'చైతన్యశిఖరం' అనే సమీక్షా వ్యాససంకలనాన్ని ప్రచురించింది.[1]

---

1. 'చైతన్యశిఖరం' - ప్రచురణ : నవోదయం సాహితీ సాంస్కృతిక సమితి - హైదరాబాదు. ప్రథమముద్రణ - మార్చి 9, 1975. సంపాదకుడు : డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం.

# ముఖాముఖి

ఆధునిక సమస్యలకు అద్దంగా, అతిసామాన్యునికి అర్థమయ్యేలా వచనకవితను వ్రాస్తున్న నారాయణరెడ్డి 1971లో వ్రాసిన ఇరవైనాలుగు వచన కవితలను 'ముఖాముఖి' అనే సంపుటిగా ముద్రింపించినాడు. 'మంటలూ మానవుడూ' తర్వాత వచ్చిన వచన కవితాసంపుటి ఇది. మానవునిలోని మంటలు ఇంకా చల్లారలేదు. అందుకే 'ముఖాముఖి' - 'వచనకవితాశిఖి' జ్వాలా భయంకరంగా చైతన్యమార్గదర్శకంగా మండుతూనే ఉంది. ఆధునిక సమాజంలో స్వార్థం, ధౌర్త్యం, అవివేకం, అసహజత్వం, అజ్ఞానం ఎలా తాండవం చేస్తున్నాయో ఈ చీకట్లను, పొరపాట్లను సహించని సరికొత్త చైతన్య తరుణజ్వాలలు నడివీధిలో పడగెత్తి ధ్వాంతాన్ని ఎలా ధ్వంసం చేయబూనుకుంటున్నవో ఈ కవితలు చదివిన హృదయాలకు తెలుస్తుంది. బంగ్లాదేశ్ సమరాన్నీ, స్వాతంత్ర్య సిద్ధినీ చిత్రించే కవితలుకూడా ఈ సంపుటిలో చోటుచేసుకున్నవి.

ఈ సంపుటిలో 'ముఖాముఖి' మొట్టమొదటి కవిత.

"చిక్కిన ఫలితమంతా
ఒక్కడికే దక్కుతుంటే
ఊర్చిన ధాన్యమంతా
ఒక్కడే బొక్కుతుంటే"

సహనం నిప్పులు చిమ్ముతున్నదనీ, శాంతం నెత్తురు కక్కుతున్నదనీ, "ముచ్చులు కల్పించిన రివాజులు" చెరిగి పోతున్నవనీ, 'చేతనాజ్యోతులు' అవతరిస్తున్నవనీ ఈ కవిత ఘోషిస్తున్నది. ఈ కవితలోని నిచ్చెన, బొక్కెన అనే అల్ప పదాలలో అనల్పార్థాన్ని వ్యక్తం చేసినాడు నారాయణరెడ్డి.

నారాయణరెడ్డి ఆశావాది. చైతన్యశిఖలో "దూకి రెక్కలు మాడ్చుకొని చావో బ్రతుకో తేల్చుకొని మసియై గసియై పోవాలని, రసాంచలాలు చవి చూడాలని" ఆతడు గాఢంగా అభిలషిస్తాడు. కారుచీకటిని కడవరకు ఎది

రించాలనే మనస్సు ఆతనిది. అందుకే ఈనాటి 'విషమఘటికలను' 'విష ఘుటికలను' 'హాలాహలాన్ని' 'కోలాహలాన్ని' అదిమిపట్టి అణచిపెట్టి, రేపు ఉద్గమించబోతున్న 'ఒక సుధాస్రోతం' కోసం, ఉదయించబోతున్న 'ఒక సుప్రభాతం' కోసం ఎదురుచూడమని ఆశాకరదీపిక చూపుతున్నాడు కవి.

"అమావాస్య రాత్రిని
నిందించలేను
దాని గర్భంలో దాగిన
సహస్రకిరణపిండం కోసం
ప్రతిక్షణం
నా ప్రతీక్షణం"

అని ఆశావాదిత్వాన్ని చాటినాడు. ఈనాడు వినిపిస్తున్న "నిప్పుల ఉప్పెనల గుండెల చప్పుడు" రేపటి 'కొత్తజగతి'లోని 'కోట్లగొంతుల వజ్రగీతం' అని ఆతనికి గట్టిగా తెలుసు. ఆతని ఆశ అనుకున్నదానికంటె ముందే ఫలించినప్పుడు 'అర్ధరాత్రి పుట్టిన' ఉదయాన్ని, "వర్తమానంలో శిరసెత్తిన భావిని" "వేయిరేకుల విజ్ఞానరేఖ"గా, "విశ్వప్రగతికి శాశ్వతప్రతీక"గా భావించి దానిని రాకాసితత్త్వం నుండి రక్షించే గుండె ఆతనిది.

నారాయణరెడ్డి మానవునిగూర్చి, మానవతనుగురించి ఎన్నో ఖండికలు వ్రాసినాడు ఎన్ని వ్రాసినా రచనలో ఎన్నుకునే తెన్ను కొత్తకొత్తగా ఉంటుంది. ఈ సంపుటిలోని 'ఒకే ఒక్క దీపం' మనిషికి సంబంధించినదే. సూర్యుడు, చంద్రుడు, తారలు—

"ఇవేవీ అసలుదీపాలు కావు
వీటికి విక్రాంతి రూపాలులేవు"

అని వ్రాస్తూ— 'వీటిని మించిన దీపం' ఒకే ఒకటుంది. అది—

"నీతికి గోరీ కడితే
నిప్పులు కక్కుతుంది"

అనీ, 'కామందులను', 'కామాంధులను' 'రాబందులను'—

"తిప్పితిప్పి కొట్టాలని
తుప్పువదల గొట్టాలని"

ఆ దీపం 'ప్రతినచేస్తుంది'; 'ప్రతిఘటిస్తుంది', 'నిస్తైలంగా ప్రజ్వలిస్తుంది'; ఆ దీపం

"ఎక్కడో లేదు
మరేదీకాదు
మహోజ్జ్వల చైతన్యమూర్తి
మనిషే ఆ దీపం"—

అని అంటాడు. చిట్టచివరిదాకా ఆ దీపమేమిటో తెలియదు. పాఠకునిలో నవలవలె ఉత్కంఠను రేపుతూ ఒక్కబిగిని చదివిస్తుంది ఈ కవిత.

'స్వేచ్ఛాఫలం' అనే ఖండిక మానవుని స్వచ్ఛందతను చాటి చెప్పుతుంది.

"అచ్చమైన జీవితం
అనుకరణంలో లేదు
ప్రతిఘటనంలో వుంది
నిజమైన వ్యక్తిత్వం
భజనలో లేదు
సృజనలో వుంది"—

అని సూటిగా ఉపదేశాత్మకంగా అంటాడు 'ప్రతిఘటనం'లో. నారాయణరెడ్డి నలిగిన భావాన్నైనా తనకున్న సహజగ్రథన కౌశలంచేత నవనంగా చెప్పుతాడు. మహాకవి లక్షణమది.

"ఏమిటి చీకటి?"— అని ప్రశ్న
"అంతా తెలిసినవాని అవివేకం"— అని జవాబు
"ఏమిటి వెలుతురు?"— అని ప్రశ్న
"ఏమీ తెలియనివాని వివేకం"— అని సమాధానం.

అవివేకాన్ని చీకటిలో ఉతమించడం ప్రసిద్ధమైనా 'అంతా తెలిసినవాని' అనే దానితో కలిపి చాలా చక్కగా చమత్కారంగా చెప్పినాడు కవి.

ఈ సంపుటిలోని 'కొత్తరకం కోడిపుంజు' కవిత అవివేకికి ప్రతీక. అందుకే—

"ఏమిటీ రాత్రంతా అరుస్తున్నావు
మా బంగారు నిద్ర చెరుస్తున్నావు"

అని వివేకం గద్దించగానే—

"పుంజు బదులు చెప్పలేదు
ముడిచినతోక విప్పలేదు
రాలిన ఈకలు మాత్రం పుంజు
రహస్యాన్ని విప్పక తప్పలేదు".

ఈ కవితలో అనుప్రాసగంధం గుప్పున వాసిస్తుంది.

దేశదౌర్భాగ్యగతినీ దారిద్ర్యస్థితినీ 'నా దేశం కనిపించింది' అనే కవితలో నారాయణరెడ్డి ధ్వనిప్రధానంగా సూచించినాడు. ఈనాడు దేశం— "సుజల సుఫల సస్యశ్యామల"గా కనిపించడం లేదనీ—

"నిరుద్యోగుల నిట్టూర్పు సెగల్లో
సజలనయనాలలో
విఫల మనోరథాలతో
వీపుల కంటుకున్న డొక్కలలో
విరిగిపోయిన పసిరెక్కలలో"

దేశం కనిపిస్తుందని ఆవేదనను వ్యక్తం చేసినాడు. ఈ పంక్తులలో రుచిరార్థాలను పొదుగుకున్న చక్కని పదాలను ప్రయోగించడంలో కవి పాండిత్యాన్ని పులుముకున్న తన ప్రతిభను ప్రదర్శించినాడు.

నారాయణరెడ్డిది లోకోత్తరమైన కవితాభణితి. ఒక్కొక్క కవిత ఒక్కొక్క తీరు. ఈ సంపుటిలోని 'తొండరగండడు' ఒక విచిత్రమైన కథలాగా నడుస్తుంది. తొండరగండడు చిత్రమైన కొత్తపదబంధం. అమాయకులనూ అల్పజీవులనూ అంతంచేసే హంతకులకూ వంచకులకూ ముప్పు తప్పదనే సత్యాన్ని ఈ కవిత హృదయంగమంగా వెల్లడిస్తుంది.

ఈ కావ్యంలోని 'అనుక్షణం జాగరణం' అనే కవిత వచనకవితానందనంలో నూత్న వైవిధ్యపరిమళాలు గుప్పించే ప్రసూనం. ఇందలి మూడు

ప్రశ్నోత్తరాలలో వీరజవానుల విజయపరంపరలో, మనదేశరక్షకుల జీవిత క్షేమనైరంతర్యంలో నారాయణరెడ్డికి ఎంతటి ఆహ్లాదం, ఆకాంక్ష, అభిలాష ఉందో వ్యక్తమౌతుంది—

"ఏమండీ! కళ్లు ఎరుపెక్కాయి
ఔను ప్రేయసీ! ఎరుపెక్కాయి
నీకోసం వేచికాదు
నిదురకాచి కాదు
దివారాత్రాలు దేశాన్ని కొలుస్తూ
పిట్టల్లా సేబర్ జెట్టులు కూలుస్తూ
కణకణమండే వీరసైనికుల
కనుగుడ్లను తలచుకొని".—

అంతటి తాదాత్మ్యం నారాయణరెడ్డిది. అందుకే అలా వ్రాయగలిగినాడు. పాఠకుల హృదయంలో లయతరంగాలను సృజిస్తున్న వచనకవితాప్రయోగ మిది.

'ఎవరీ ఆర్తులు' అనే కవిత బంగ్లాదేశ శరణార్థుల దైన్యస్థితిని కళ్లకు కట్టినట్లు చిత్రిస్తుంది. బంగ్లాదేశవిజయాన్ని ఆకాంక్షించినాడు కవి. 'సమర సంక్రాంతి' బంగ్లాదేశ్ విజయాన్ని వర్ణిస్తుంది. బంగ్లాదేశీయులు జరిపిన రణం "వీరభారతచరిత్రలో ఎల్లకాలం గర్వకారణం; ఇదినేటి అపూర్వ సంక్రాంతి; విజయేందిర సాధించిన విక్రాంతి" అని యుద్ధవిజయాన్ని వర్ణించినాడు. 'విజయేందిర'లోని శ్లేషను పాఠకులే విశ్లేషించుకోవచ్చు.

గానుగెద్దులా గంగిరెద్దులా బ్రతకడం పనికిరాదనీ స్వేచ్ఛగా బ్రతకాలనీ ఉపదేశిస్తాడు నారాయణరెడ్డి. ఆ స్వేచ్ఛ-

"విత్తనాన్ని చీల్చిన మొక్కలో"
"విహాయసంలో పొడిచిన చుక్కలో"

ఉందని కవితాత్మకంగా అంటాడు.

"ముడుచుకు పడుకునే రోజులు
ముచ్చులు కల్పించిన రివాజులు
చెరిగిపోతున్నాయి బురుజుల్లా
బురుజుల కంటుకున్న బూజుల్లా"

"పడగెత్తిన చేతనాజ్యోతులు
నడివీధిలో పొడుచుకొస్తున్నాయ్
మృతవీరుల స్మారక చిహ్నాల్లా"
"శతఘ్నుల్లా పేలుతున్న సహస్ర సహస్ర కిరణాలు
తూర్పు పొలిమేరలో 'నాట్' విమానంలా"
దూసుకొస్తున్న మార్తాండబింబం"

వంటి చక్కని అత్యాధునికమైన ఉపమాలంకారాలు ఈతని ప్రతికవితా సంపుటిలోవలెనే ఇందులోనూ పొడకట్టుతాయి.

వెల్తురుబుల్లెట్లు, సన్నకారుజీవాలు, నిప్పుల ఉప్పెన నిప్పుటేరు. నాటుబాంబుల నర్తనశాల–వంటి సుందర పదబంధాలూ–

"విచ్చిన పద్మాలకే విలువలు
పచ్చని దేహాలకే పట్టువలువలు"

వంటి సూక్తిప్రాయములైన సుందరకవితాపంక్తులూ ఎన్నో ఈ సంపుటిలో కనిపించి పురివిప్పి ఆడుతున్న వచనకవితాశిఖిసౌందర్యాన్ని చూపిస్తూ పాఠకులడెందాలకు విందులు చేస్తాయి.

## మనిషీ-చిలక

సమకాలిక సమాజంలోని సంఘటనలనూ, దైనందినజీవితంలో సగటు మనిషికి ఎదురయ్యే చిక్కులనూ సందర్శిస్తూ స్పందిస్తూ మంచినీ చెడునూ వేరువేరుగా చూపుతూ అందరూ పచ్చగాఉండాలనే ప్రగాఢవాంఛను అందంగా సగటు మనిషికి కూడా సరికొత్తగా అందిస్తూ 1972లో తాను వ్రాసిన వచన కవితలను 'మనిషీ–చిలక' అనే గ్రంథంగా మలచి కావ్యజగత్తుకు కానుకగా ఇచ్చినాడు నారాయణరెడ్డి.

ఇరవైఎనిమిది కవితలున్న ఈ 'మనిషీ-చిలక' సంపుటిలో మొదటి కవిత 'మనిషీ-చిలక'. ఈ సంకలనంలో ఈ కవిత సుదీర్ఘమైనది. కథలాగా

నాటకంలాగా సాగిన ఈ విషాదాంతఖండికలోని నాయకుడు ఒక సగటుజీవి. "ఎన్నెన్ని ప్రభుత్వాలు మారుతూఉన్నా ఎదుగు బొదుగూలేని 'ఎన్జీవి'". యంత్రంలా పనిచేస్తూ "ఫస్టుతారీఖనే అమృతకలశం కోసం పడిగాపులుపడే" ఉద్యోగి. తనకెన్నెన్ని కోరికలున్నా తన ఉనికిని తెలిసికొని "ఒంటినీ ఊహా సంపుటినీ ఇరుకుగదిలో" ఇముడ్చుకునే స్వభావం ఆ మనిషిది. అతడొక చిలకను పెంచుకొని దానిని ఆప్యాయంగా చూచుకునేవాడు. ఇతరులకెవరికీ కనపడకుండా ఆత్మీయంగా దాచుకునేవాడు. ఆతడు తన 'గోడు చెప్పుకునేది' 'గుండె విప్పుకునేది' ఆ చిలకతోనే. నిండు నిజాలనూ నిర్మలధర్మాలనూ ఎత్తిచూపే ఆ చిలక బదులుపలికితేనే తప్ప ఆత్మతృప్తిలేదు ఆ 'హరిణ మనస్వి'కి అందుకే ఎప్పుడూ దానిని వెంటనుంచుకునేవాడతడు. ఆఫీసులో పక్కటేబిలుమీద అక్రమం పెరిగితే పసికట్టి అన్యాయమని అరుస్తూ ఆ మనిషికి చెప్పేది చిలక. సినీమావద్ద "బ్లాక్‌మార్కెట్‌లో వైట్ టికెట్ బలి అవుతున్న" దృశ్యాన్ని వేలెత్తిచూపేది ఆ చిలక. ఒకసారి ఆ మనిషిని పై ఆఫీసరు పిలువగా అతనివెంట వెళ్ళిన ఆ చిలక ఆఫీసరు అక్రమవ్యాపారాన్ని ఫోను మాటల ద్వారా విని "ధర్మపీఠానికే ఇంత ఖర్మపట్టిందా" అని ప్రతిఘటిస్తుంది. కనపడని చిలకమాటలు విన్న ఆసఫీరు మనిషిని కోపించి జాగ్రత్తగా మసలుకోకపోతే ఉద్యోగంనుండి ఊడబీకేస్తానని బెదిరించి హెచ్చరిస్తాడు. అపుడు కోపంతో మనిషి చిలకను గదిలో బంధించివెళ్ళిపోతాడు. ఒకరోజు ఆఫీసులో పక్కనున్న టేబిలు చేతినిండా పచ్చకాగితాలు పుచ్చుకుంటూ ఫైలును మాయంచెయ్యడానికి లక్షరూపాయల లంచానికి ఆశపడిన దృశ్యాన్ని చూచి మనిషి హోరెత్తిపోయి ఒకవైపు నోరెత్తలేక మరోవైపు ప్రాణాలను ఆపుకోలేక ఇంటికి పరుగెత్తి గదిలో బంధించిన చిలకను ఎదకు హత్తుకుంటాడు. వంచనలకు తలవంచనని, లంచాలకు చేయి దించనని ఆ చిలకతో చెప్పుకుంటాడు. ఆ చిలకగూడా "కంటిని మెరిపించేదంతా కనకం కాదని" ఉపదేశించగా కలత తీరిపోతుందామనిషికి. మరునాడు మనిషి చిలకతో ఆఫీసుకు వెళ్ళుతాడు. ఫైలును మాయం చేయడానికి లక్షరూపాయల లంచమివ్వజూచే తుచ్ఛుణ్ని చిలక సమాధానాల సాయంతో తిరస్కరిస్తాడు మనిషి. ఆ తరువాత ఆఫీసునుండిబయలుదేరి, గాంధీ మైదానంచేరి ఒక కపట స్వార్థనాయకుని ఉపన్యాసం వింటుండగా వెంటనే ఆ మనిషిలోని చిలక ఆ

నాయకుని కపటపు మాటలను ఖండిస్తూ ప్రతిఘటిస్తుంది. వాని కుళ్ళును బయటపెడుతుంది. కోపంతో నాయకుడా మనిషిని లాఠీలతో కొట్టిస్తాడు. మనిషి నెత్తుటిమడుగులో పడిపోతాడు. జనం చెదిరిపోతుంది. అక్రమం అధర్మం అంటూ అరుస్తుంది చిలక. మనిషి చనిపోతాడు. కాని చిలకమాత్రం చావదు. ఇదీకథ. ఈ ఖండికలోని చిలక సగటు మనిషి ధర్మాత్మకు ప్రతీక. ఈ కవితలోని "ఆత్మసౌందర్యాన్ని చిలకముక్కులో అవలోకించాడు మనిషి" "ఆతని ఊపిరి చిలక" "తన ఆత్మనే పంజరంలో బిగించినట్టు తప్పుకుంటున్నాడు" "ఆఫీసువెళ్ళాడు పునీతుడై ఆత్మశుకాన్వితుడై" అనే పంక్తులు ఈ అంశాన్ని సమర్థిస్తున్నాయి. ఇందలి మనిషి పంచేంద్రియాల సంపుటి అయిన శరీరానికి ప్రతీక. "పంచేంద్రియాల సంక్షోభంలో పట్టుతప్పిపోయే మనిషికి" అనే చరణం ఇందుకు పోషకం. ఆ మనిషికీ ఈ చిలకకూ గల అనుబంధం "అంగానికీ అంతరంగానికీ గల అవినాభావ సంబంధం". "ఊపిరి లేకుండే రూపంలేదు" అనే పంక్తులు దీనికి వ్యాఖ్యానం. సమకాలిక సమాజంలోని ఉన్నతాధికారుల అక్రమాలనూ ఉద్యోగుల లంచగొండితనాన్నీ వ్యాపారస్థులు చేసే బ్లాకుమార్కెట్లనూ కళ్ళకుకట్టినట్లుగా రమణీయంగా చిత్రిస్తూనే– "ఆత్మ సంపదను దిగమ్రింగే నడమంత్రపు సిరులు" వద్దనీ, ప్రతి మనిషీ అధర్మాన్ని ప్రతిఘటించి ధర్మ సంస్థాపన చేయాలని ఉపదేశిస్తున్నదీ కవిత. ఈ ఖండికలో చిట్టచివరకు కవి వ్యాఖ్యానించినట్లుగా– "విశాల విశ్వానికి ధర్మహృదయాన్ని వినిపించే" ఆ శుకవాణి "అభినవశుకవాణి" గా చిరంజీవిగా నిలుస్తుంది. చిలుకనోట పలికించిన మహాకవి వాక్కు మహర్షి వాక్కే కదా :

ఈ సంపుటిలోని "పాతికేళ్ల కథ" అనే కవిత కథాధోరణిలో నడిచిందే. మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఈ పాతికేళ్ళలో (1972 నాటికి) కాశ్మీరుపై పాకిస్తాన్ దాడులూ, నౌఖాళి కిరాతక కృత్యాలూ, చైనా పాకిస్తాన్ దురాక్రమణలూ మన తెలుగుదేశంలో దుమారం లేపిన తెలంగాణా-ఆంధ్ర ప్రత్యేకరాష్ట్రోద్యమాలూ వంటి దుస్సంఘటనల నెన్నింటినో మనం ఎదుర్కొన్నామనీ అయినా ఇంకా– "భాషల తగాదాలు - బార్డర్ల తగాదాలు - ఊళ్ళ తగాదాలు - చివరికి వాగునీళ్ళ తగాదాలు" మనలను వేధిస్తూనే ఉన్నాయనీ– ఈ మధ్యే చల్లనితల్లి రుద్రవాహినిగా పొంగి దొంగ రవాణా

దారులను నిర్బంధించి బ్లాకుమనీని పట్టుకున్నదనీ, లాండ్ సీలింగ్ చట్టాలను బిగించినదనీ ఇలా ఏన్నెన్నో విషయాలను, స్వాతంత్ర్యజీవిత సంఘటనలను స్వాతంత్ర్యం నోటనే పలికించినాడు నారాయణరెడ్డి. ఈ విధంగా ఈ కవిత భారతస్వాతంత్ర్యం ఆత్మకథ. నిజానికి మనకు వచ్చిన స్వాతంత్ర్యం బాహిరమైనది మాత్రమే. ఆంతరమైన స్వాతంత్ర్యం మళ్లీ రావాలనే అభిప్రాయాన్ని నారాయణరెడ్డి మరొక కవిత— "స్వాతంత్ర్యం రావాలి"లో వెలిబుచ్చినాడు. ఆ ఆంతరస్వాతంత్ర్యం ఎక్కడి నుంచి రావాలంటే—

"జాతి మెదడును కరిచిపట్టుకున్న
భూతదృక్కుల సంకెళ్ళనుంచి
తెల్లవాళ్లు వొదిలేసిన ముసుగుల్లో
నల్లబజార్లు నడుపుతున్న
నవనాయకమ్మన్యుల గుప్పిళ్ళనుంచి
వాగ్దానాల ఇంద్రధనుస్సులతో
సగటుమనిషిని సమ్మోహింపజేస్తున్న
వన్నెవన్నెల వలల కవుగిళ్ళనుంచి"-

అని అంటాడు.

రానున్న ఉజ్జ్వల భవిష్యత్తును హృదయనేత్రంతో దర్శిస్తూ సమకాలిక సమాజాన్ని జాగ్రత్త అని హెచ్చరిస్తాడు నారాయణరెడ్డి—'కో అన్నది కొత్తతరం' కవితలో.

"పదవులను భుజకీర్తులుగా కట్టుకొని
వీచే గాలినిబట్టి
వేసే తాళాన్నిబట్టి
గంగిరెద్దులా గంతులేసే
పాకశాసనులను
పగటి భాగోతులను
నడిబజారులో నిలదీసి
తొడుక్కున్న రంగుల అంగరఖా చించేసి
అసలురంగు బయటపెట్టే
అభినవతరం"

"కుత్సితాల పద్మవ్యూహాలను
ఆదిలోనే బద్దలుగొట్టే
అభిమన్యుల తరం"—

వస్తున్నదని వర్తమానానికి పాఠాలు చెపుతాడు.

ఈ సంపుటిలోని 'మధ్యాహ్నవేళ', 'అర్ధరాత్రి' అనే ఖండికలు వర్ణనాత్మకములు.

"మంచుకు చెమట పుడుతున్న
మధ్యాహ్నవేళ"
"తీసుకున్నదీ తిన్నదీ అరగక
తీపి మరిగిన తివాసీలు తేన్చేవేళ"

అని మధ్యాహ్నవేళను వర్ణిస్తూనే మనిషిని మరువలేదు. అర్ధరాత్రిలో "నగర జీవనం తలకెక్కిన ప్రవృద్ధ రాత్రిలో" గల్లీలగతి, విల్లాలశ్రుతి, బార్ల, కార్ల పైలాపచ్చీసు షికార్ల పూజార్ల స్థితిని వర్ణించినాడు. ఏది చెప్పినా సరి కొత్తగా చెపుతాడు నారాయణరెడ్డి. అందుకే ఆతని కవిత అందరినీ ఆకర్షిస్తుంది. ఈనాటి మామూలు మనిషి— "అద్దెకొంపే బృందావనిగా అనుభూతి చెందే వనమాలి"యట! భాష అనేది— "విశ్వాన్ని గదిలోకి పంపే వెంటిలేష"నట! "వేయిపడగలెత్తి నర్తించే ఇన్స్పిరేష"నట.

"వర్ణమాలలో ఒదిగిందీ వర్ణాతీతంగా ఎదిగిందీ భాషే" అన్న పంక్తులు సింధువంత అర్థాన్ని బిందువులో బిగిస్తున్నాయి.

ఈ సంపుటిలోని 'కో అన్నది కొత్తతరం', క్లోజ్ యువర్ షాప్.' అనే శీర్షికల పేర్లు కొత్తగాను, చాలా పదునుగాను కనిపిస్తాయి. 'పేరు ధర్మరాజు' ధర్మరాజు శీలాన్ని మధ్యమధ్య మధుర వ్యాఖ్యానంతో చిత్రించే 'స్కెచ్' లాంటి కవిత.

ఈ ఖండ కావ్యంలో—

"నాల్కను కరిగించేదంతా నవనీతంకాదు
నాసికను మురిపించేదంతా నవసౌరభంకాదు."
"రగ్గుల రుచిమరిగిన బ్రతుకు
నగ్నసత్యాన్ని భరించదు."

"తన శిశువును తానే తినే వ్యాఘ్రిలాగా
తన ఆకుల్ని తానే కొరికే శిశిరతరువులాగా
ఎవడి ఉన్మాదం వాడినే
గుప్తంగా కబళిస్తుంది"—

వంటి అర్థగౌరవాన్ని అందించే సూక్తులెన్నో ఉన్నాయి.

కొత్తకొత్త ఉపమానాలు నారాయణరెడ్డి కవితలో కొల్లలుగా జాలువారు తుంటాయి. 'తెరుచుకున్నఉగ్రాక్షిలా' పొద్దుపొడిచిందట! "విముక్తవాణిలా" స్వాతంత్ర్యం పుట్టిందట! అలాగే— "పాడువడ్డ ఖిల్లాలాంటి పరువు" "చిల్లరకొట్టులాంటి కవిత్వం".

మహాకవులు చిత్రకల్పనలు చేస్తుంటారు. నూత్నపదబంధాలు వేస్తుంటారు. నారాయణరెడ్డి ఈ కావ్యంలో "ఎన్జీవి" అనే సరికొత్త పద బంధాన్ని సృష్టించినాడు. ఎన్.జి.వో. అనే 'ఇంగ్లీషు' 'అబ్రివేషన్' ఈ కవి చేతిలోపడి ఇలా చిత్రంగా రూపుదాల్చింది. ఇందులో రెండు భాషలు గుండెలు కలుపుకున్నాయి. ఇంకా నైలాన్ చీకటి, ఆటవెలది నాగరికత, కోటగోడ సహనం, 'హక్కుల హుతభుక్కులు' 'భూతదృక్కులు' వంటి సుందర పదబంధాలే కాక 'కుత్సితాల ఈగిల్స్" అనే ఇంగ్లీషు పదంతోడి రూపకం ఇందులో కనిపిస్తుంది.

నారాయణరెడ్డిఉక్తి ఎప్పుడూ చమత్కృతిని గర్భీకరించుకొని ఉంటుంది. పంచవర్షప్రణాళిక అనడానికి బదులు 'అయిదు మెట్ల నిచ్చెన' అనీ, తెలంగాణా ఆంధ్ర మధ్య అనక వచ్చిండు వచ్చాడులమధ్య" అనీ, ఒకేరెక్క తలుపున్న బార్లు అనక 'ఒంటికంటితో చూస్తున్నబార్లు' అనీ అంటాడీకవి. యంత్రం చల్లబడడానికి నోరుతెరచిపెట్టిన కార్లు "ఊపిరి దుస్తులు ఆరేసుకున్న కార్లు"ట. ఎంతబాగా అన్నాడు ; "కాలం ప్రసవించిన క్యాలండర్లు" "గడియారం తొడుక్కున్న ముళ్ళు" అనే పంక్తుల్లోని 'ప్రసవించిన' తొడుక్కున్న' అనే క్రియలు భావాన్ని ఎంతో అందంగా ప్రకటిస్తున్నాయి.

ఈ సంపుటిలో కనిపించే 'నరపురుగు' 'ఏకైక హక్కు' అనే అరి సమాసాలు ఆయా సందర్భాలలో వ్యవహార ప్రాచుర్యాన్నిబట్టి తెలిసి ప్రయోగించినవే.

తనలో తాను తర్కించుకొని, మంచినీ చెడునూ విమర్శించుకొని అడుగడుగునా పాఠాలు నేర్పుతూ నేర్చుకుంటూ ఉండే వృత్తీ ప్రవృత్తీ నారాయణరెడ్డిది. ఈ సంపుటిలోని 'చిట్టి చెప్పిన పాఠం' అనే ఖండికలోని– "ఈ పాఠాలే నాకు బతుకుబాటలు" అనే పంక్తి అందుకు తార్కాణం.

'మనిషీ-చిలక' ఖండికలో చిలక స్వభావాన్ని గూర్చి చెప్పే "అది నేర్చుకున్నది హృదయధ్వని– దానికి చేతగానిది ప్రతిధ్వని" అనే పంక్తులు నారాయణరెడ్డి కవితా వ్యక్తిత్వానికి ఎత్తిన పతాకలు. ఈతని కవిత్వం కేవలం అంత్యప్రాసల కొలతలకు ఒదిగేది కాదు. కాలం గడిచినకొద్దీ పదును దేరుతున్నదది. సమాజానికి చైతన్యధారలుచూపుతూ "సరికొత్తగా బిరికత్తిగా" పుట్టుకొస్తున్నదది. అందుకే ఎక్కడ ఆగకుండా "ప్రత్యేకాకర్షణల పరిధుల్ని నిరవధికంగా నిర్గమించి "అంతుపట్టని వేదనాఘురితో అంతకుమించిన అలజడితో ముందుకు నడుస్తున్నది. అందుకే ఆ మహాకవి "కట్టెయ్ చిల్లరకొట్టులాంటి కవిత్వాన్ని" "ఎన్నాళ్ళని అంటిస్తావు- చల్లారిన వంటచెరుకులు– ఏరితెచ్చుకో ఇరమ్మదాగ్నిని– వెతికిపట్టుకో బడబాగ్నిని" అని చైతన్య స్ఫూర్తితో చెప్పగలుగుతున్నాడు. అందుకే ఆతని కవిత్వం "వేగుచుక్కలా విజ్ఞానం పొడిచే దిక్కులో– విశ్వోదయం సహస్రఫణాలెత్తే విమలప్రభాత రుక్కులో" నిలవగలుగుతున్నది. అందుకే ఆతని కవితలో నిత్యశోధనా సత్యసాధనా ఉభయధ్రువాల ఉద్వేల సంఘర్షణా కనిపిస్తున్నది.

ఆదినుండీ నారాయణరెడ్డి ఆశావాది–

"ఇంత చిమ్మచీకటి సంతలో
ఎలవెలుగుల తొలిరేక విరియనుందని"
"జడీభవించిన జీవితంలో
చైతన్యఋతువు మొలుస్తుందని"

నమ్మే ఉజ్జ్వలకవి. "అంధ తమస్సులో కోల్పడ్డ మనిషిని అపూర్వవ్యక్తిగా" శిల్పించాలనీ, "మనిషిని దేవతగా" మలచాలనీ ఆ మహాకవి ఆరాటం.

"మంచితనం పచ్చగా వుండాలి
మనిషితనం పచ్చగా వుండాలి
మంచినీ మనిషినీ కాజేసే
వంచన మాత్రం చచ్చుగా ఉండాలి"

అనేదే ఆతని ఆశయం. ఈ ఆశయసిద్ధికి ఒకవైపు ఉదాత్త త్యాగం, మరోవైపు ఉజ్జ్వల చైతన్యం ప్రతిమనిషికీ ఉండాలంటాడీకవి. 'త్యాగమాధురి'ని చవిచూచిన ఈ మహాకవి—

"కోరుకోవోయ్ మనిషీ
కొండవాగు అనురాగాన్ని
తానుచేరింది ఉప్పునీరైనా
తాదాత్మ్యం పొందాలని"

సందేశమిస్తూ ప్రతిమనిషిని 'కొబ్బరికాయ జీవితాన్ని', 'కొవ్వొత్తి ఆశయాన్ని', 'కారుమబ్బు హృదయాన్ని', 'కోడిపుంజు కర్తవ్యాన్ని', 'కోకిల రాగశీలాన్ని', 'కోటగోడ సహనాన్ని' కోరుకొమ్మంటాడు నారాయణరెడ్డి. అలాగే

"నెత్తికెక్కిన గంజాయి దమ్ము
మత్తును వొదిలించుకోలేకపోతే
నెత్తుటి మంటల్లో దూకి
కొత్త పుటక పుట్టవలసిందని"—

వ్రాస్తూ జాతిలో చైతన్యం నిండాలనే తన ప్రగాఢకాంక్షను ప్రకటిస్తాడు. ఈ విధంగా ఉదాత్తమైన భావాలను ఉజ్జ్వలమైన శైలిలో ప్రకటించడానికి ఒక మహాకవికి ఏకైకసాధనం భాష. నారాయణరెడ్డికి భాషపై అధికారమున్న దనడంకంటె ఆయనే భాష అనడం బాగుంటుంది. అందుకే ఆతనినోట—

"నాఇంటి వివృతగవాక్షం భాష
నాకంటి వినిర్మల కటాక్షం భాష

"భాషే నేను తెచ్చుకున్న తీయనివరం
భాషే నేను కట్టుకున్న జీవనగోపురం''

అనేమాటలు సహజంగా పలికినవి. ఆ తీయని వరంతో మానవత లక్ష్యంగా సాగిపోతున్నాడు ఈ సాహితీ యాత్రికుడు.

# ఉదయం నా హృదయం

కలంపట్టిన నాటి నుండి కవితాకిరణాలను నవ్యాతినవ్యంగా ప్రసరింపజేస్తూ జ్వలితచేతనతో "నవనాడుల సంస్పందనం లవమాత్రమైనా" ఆగకుండ 'ఒకేగతి'తో 'ఒకే ప్రగతి'తో నారాయణరెడ్డి 1973లో తాను వ్రాసి వివిధ పత్రికలలో ప్రచురించిన ముప్పై వచన కవితలను 'ఉదయం నా హృదయం' సంపుటిగా ప్రచురించినాడు. చీకటి తెరలు చించుకొని ఉదయం ఉబికినట్లే, తనువు పొరలు చీల్చుకొని ఈతని హృదయం ఉరికింది. ఫలితంగా 'ఉదయం నా హృదయం' ఉదయించింది. ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి తనకు ఆప్తమిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి అంకితమిచ్చినాడు.

ఈ సంపుటిలో కవితాఖండికల కన్న ముందుగా ఒక శీర్షికలేని కవిత కనిపిస్తుంది. ఈ కవితయే ఈ సంపుటి ప్రత్యేకత. ఈ కవితా రోచిర్మండలంలోని ఒక చరణకిరణమే 'ఉదయం నా హృదయం'. తన సాహిత్య వ్యక్తిత్వాలను గూర్చి నారాయణరెడ్డియే కవితారూపంలో వ్రాస్తే ఎలా ఉంటుందో అలా ఉంది ఈ కవిత. ఈ కావ్యంలోని ఖండికలన్నింటికి అఖండప్రతినిధిగా ఈ మహాకవి కవితాత్మకు ఏకైక ప్రతీకగా భాసిస్తున్నది ఈ కవిత.

నారాయణరెడ్డి ఎప్పుడూ 'కొత్త వెలుగు'నూ, 'కొత్త గాలి'నీ పడగెత్తిన చైతన్యం పరవళ్ళను కోరుకుంటాడు. అదే అచ్చమైన కవి లక్షణం. అందుకే ఆతడు తనకు "వడదెబ్బలు– నడి వేసవి పుట్టించే

ఆరికాలి బొబ్బలు– నిత్యరక్త జ్యోతి–నవ్యారుణగీతి" కావాలంటాడు. అందుకే "నా పేరు కవి– ఇంటి పేరు చైతన్యం" అన్నాడామహాకవి. ఆతని పేరేకాదు ఆతని గది– "చైతన్య జీవనది- ఆ గది కిటికీలు "సృష్టి తెరుచుకున్న రెండు కళ్ళు". ఆ గదిలో "మూడు రెక్కలతో మూల్గుతున్న పంఖా- స్వచ్ఛందశాద్వలాలలో లక్ష కాళ్ళతో దూకే ఆవేశాల జింక". అంతటి చైతన్యమూర్తి కాబట్టియే ఆతడు ఏకధాటిగా ఇన్నిన్ని కావ్యాలను సృష్టించ గలుగుతున్నాడు. నారాయణరెడ్డి అహర్నిశలు బాధల్లో వేదనల్లో అశ్రాంతంగా వ్రాస్తాడనడానికి ఒక సంఘటన. ఆతడొకసారి మదరాసులో స్నానపు గదిలో జారిపడి కాలి ఎముకకు ఫ్రాక్చర్ కాగా హైదరాబాదు చేరి తన ఇంటిలోనే చికిత్స పొందుతూ ప్రక్క కదల్పకుండా విధిలేక కుంటిగా ఒంటిగా పరుపుపైనే పడుకోవలసి వచ్చింది. కాలు కదలకున్నా ఆతని కలం మాత్రం ఆగలేదు. ద్విగుణీకృతావేశంతో ఎన్నో కవితలను సృష్టించింది. ఈ సంపుటిలోని 'ఎక్కడో? ఎప్పుడో?', 'కాలం వేసిన ప్రశ్న', 'ఉభయ పక్షాలు', 'త్రైలవర్ణచిత్రాలు', 'సగం చీకట్లో', 'చిరంజీవి లక్ష్యం', 'ఇవాళ ఎవరూ రాలేదు', 'ప్రకృతి + ప్రకృతి', 'రెండు ప్రశ్నలు' అనే తొమ్మిది ఖండికలు వరుసగా ఆ సమయంలో వ్రాసినవే.

వ్యక్తిగతమైన అనుభూతులను, అనుభవాలను మహాకవులు సాధారణీకరణశక్తిచేత విశ్వజనీనం చేస్తారు. ఈ సంపుటిలోని 'ఎక్కడో? ఎప్పుడో?' ఖండిక విశ్వజనీనతను సాధించినట్టిదే. ఈకవితలోని మనిషి నారాయణరెడ్డియే అయినా అలా జారిపడడం ప్రతివాడికి సాధారణమన్నట్లు వ్రాసినాడు. అందుకే అది సార్వజనీనం.

నారాయణరెడ్డి ఊరు 'సహజీవనం'. అందుకే తన మిత్రులు తన వద్దకు రానప్పుడు పడే ఆవేదనను ఆతని కవితలు నివేదిస్తాయి. ఈ సంపుటిలోని "ఇవాళ ఏవరూ రాలేదు" అనే ఖండిక ఇందుకు నిదర్శనం. నిజంగా సహజీవనం కాంక్షించే ఈ కవికి 'భయంకరశాపం తనవారి మధ్య ప్రవాసం - జీవితానికి మహేంద్రచాపం తోటి హృదయాల్లో నివాసం". తనవద్దకు వచ్చినవాళ్ళ "కణకణమండే కళ్ళనుచూసి కావ్యాలు" రాజేసుకుంటాడు ఈ కవి. "గలగల మోగే గర్జనలు విని గహనసమస్యలు"

షేపించుకుంటాడీ కవి. ఎప్పుడూ తన దగ్గరికి వచ్చేమిత్రులు రాకపోతే వాళ్ళంతా ఆపదలో ఉన్న జ్యోతిర్మూర్తులనూ త్యాగ శక్తులనూ రక్షించడానికి వెళ్లారో ఏమో అని భావిస్తూ ఆ భావన్ని ఇలా వ్యక్తం చేస్తాడు.

"రాహువు కోరల్లో చిక్కిన చంద్రాన్ని
రక్షించడానికి వెళ్లారో
చీకటి చెరలోపడ్డ సూర్యాన్ని
దూకించడానికే వెళ్లారో
చుక్కల దండులోచేరి
దిక్కుల అడవుల్లో దూరి
తూర్పుకోటపై ప్రభాతపతాక
ఎగరేసే తెగువలో ఉన్నారో
ఏమో? ఏమో?
అందుకేనేమో?
ఇవాళ ఎవరూ రాలేదు"—

అని అంటారు. హృదయంలో ఉదయాన్ని నింపుకున్న వాళ్లే ఇలా మానవాభ్యుదయాన్ని కాంక్షిస్తారు. మానవత్వమే ఇతివృత్తంగా వ్రాసే మహాకవి నారాయణరెడ్డి. అందుకే అలా భావించినాడు.

చైతన్యసౌజన్యాల సమ్యక్ సమ్మేళనం నారాయణరెడ్డి హృదయం. ఒకవైపు ఆతని కనుపాపల్లో చుక్కలు, కళ్లల్లో మేఘాలు, పెదవులపై పూర్ణ కౌముదీసరిత్తులు చోటుచేసుకుంటాయి. మరోవైపు ఆయన ఉక్కుచేతుల్లో కత్తులు ఉద్రేకంలో నిప్పులు, పిడికిట్లో శతఘ్నులు పదునుదేరుతుంటాయి. ఈ విధంగా ఆయన హృదయం ఉభయపక్షాలనూ గత ప్రశాంత పరిస్థితినీ ఆగామిచైతన్యవిప్లవాన్నీ ఆదరిస్తుంది; ఆహ్వానిస్తుంది. సాహిత్యదృష్టితో చెప్పాలంటే నారాయణరెడ్డి హృదయం శృంగార సౌందర్యనిధానమైన ప్రబంధకవిత్వాన్ని పరమాదర భావంతో పలకరిస్తూ చైతన్యశీలమైన అభ్యుదయ కవిత్వాన్ని ప్రసరిస్తుంది.

"మంచుకొండ ఒడిలో
నిద్రించే అగ్నిచేలుణ్ని
బడబాగ్ని బడిలో

పాతాలు నేర్చే ప్రహ్లాదుణ్ణి"
"ఇనబింబం నా శిరస్సు
ఇందుబింబం నా మనస్సు"—

అనే పంక్తులు ఆతని సమన్వయశీలాన్ని చాటిచెప్పే సరికొత్త కవితాసూక్తులు.

ఈ సంపుటిలోని 'ఒక తల్లి ఇద్దరు కొడుకులు' 'మళ్ళీ మళ్ళీ వస్తాను' అనే ఖండికలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోందోళనను చూచి ఈ కవి ఆవేదనతో వ్రాసినవే. ఆంధ్ర తెలంగాణా సమైక్యం కావాలన్నదే ఆదినుండీ ఈతని అభిలాష. కలిపికుట్టేదేగాని విడగొట్టేదిగాదు ఈ కవిభాష. అందుకే ఇందులో "నా వచనం బహువచనం" అనీ, "ముక్కోటి గుండెలు ముడివేసే సూత్రాన్ని" అనీ తనగూర్చి చెప్పుకున్నాడు. ఈ విధంగా ఈ సంపుటిలో చాలా ఖండికలు నారాయణరెడ్డి వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేస్తాయి.

చైతన్యమూర్తియైన నారాయణరెడ్డి ప్రజలను కూడా చైతన్యవంతులు కండని ప్రబోధిస్తాడు. "కుర్చీలో అతుక్కుపోయిన" మేధావిని "కొండ చరియలో ఇరుక్కుపోయిన" సంజీవిగా అభివర్ణిస్తూ ఆతనిని "ఊబిలో నుంచి - చుట్టూ పుట్టలా పెరిగిన సమాధినుంచి" రమ్మంటాడు. ప్రతి మనిషి వేళ్ళు 'కొరడాల్లాగా' కదలాలని, కాళ్ళు 'కిరణాల్లాగా' ఉరకాలని, చూపులు 'దావాగ్నుల్లాగా' సాగాలని, ఆలోచనలు 'శతఘ్నుల్లాగా మ్రోగాలని ప్రబోధిస్తాడు. పగ, పైత్యం, కసి, క్రౌర్యం, మదం, మౌఢ్యం, అహం అవహనం నిండిన కళ్ళు తనకు అక్కరలేదు ఇతరులకూ అక్కరలేదు అంటాడు. అందరు కలలను కంటె క్రాంతదర్శియైన నారాయణరెడ్డి "క్రాంతి గోళాలు" దర్శిస్తూ "ఈనాడు కావలసింది డోల ఊపడంకాదు నిద్రలేపడం" అనీ, "ఊపిరితిత్తుల్లో ఊదవలసింది అనిలం కాదు అనలం" అనీ— "అనుక్షణం జాగరణం— అహరహం సంఘర్షణం కావాలనీ ప్రగాఢంగా అభిలషిస్తూ ప్రబోధం చేస్తాడు. ఈ సంపుటిలోని "ఈగది కిటికీలు" 'నా కళ్ళు' అనే కవితలు సన్నివేశాన్ని పొదుగుకున్న సందేశంలా భాసిస్తాయి.

సమకాలికసమాజం నారాయణరెడ్డి రచనల్లో అద్దంలోవలె అగుపిస్తుంది. ఈ సంపుటిలోని 'పొగలోనుంచి', 'ఎక్కడున్నావు మానవతా', 'పగంలో ముగిసిన కవిత' అనే ఖండికలు అందుకు నిదర్శనాలు. కిరసనాయిలు కోసం, పాలకోసం మధ్యతరగతిమాతృమూర్తులు పడుతున్న

బాధలు చూడలేని, వారి కన్నీటిని తుడువలేని పాలనావ్యవస్థకు చెవులేకాని కళ్లులేవనీ, అందుకే దానిని "మాటలతో వినకపోతే మహాప్రళయం తప్ప దని" హెచ్చరిస్తూ కరఖడ్గాలు ధిక్కరిస్తున్నాయంటూ సాయుధవిప్లవశక్తుల విజృంభణాన్ని సూచించినాడు—'సగం ముగిసిన కవిత'లో. ఈ తరం సగటు మానవుడు పొగనూ, 'అంధత్వంలా ఆవరించే' పగనూ, నిషానూ నీడనూ, మధుపాల టక్కరితనాన్ని', 'మత్తేభాల తొక్కిడిగుణాన్ని' సహించలేడని అతనిని "సలసలకాగుతున్న సహ-దేవుని"గా చిత్రించినాడు.

ఈ కవి ఒకే భావాన్ని రకరకాలుగా ప్రకటించగలిగే ప్రతిభాసంప న్నుడు. 'మధ్యతరగతి మందహాసం' సంపుటిలోని 'హే భగవాన్' అనే కవితలో- "బియ్యంతో వియ్యమందుకునే పలుగురాళ్లు" అని వ్రాసిన ఈకవి ఇందులో- "ఉప్మారవ్వ ఇసుకరవ్వ సాధించిన సమైక్యత" అని అన్నాడు. అలాగే అందులో "పాలతో తాదాత్మ్యం చెందే పంపునీళ్ళు" అంటే ఇందులో- "బర్రెపాలు ఒర్రెనీళ్లూ సంపాదించిన సఖ్యత" అన్నాడు. దేని మెరుపు దానిదే.

వర్ణించే ప్రతిభకు వస్తువేదైనా ఫరవాలేదు. ఈ కావ్యంలోని 'రెక్కల పురుగు', 'గండుచీమలు', 'తైలవర్ణచిత్రాలు', 'కాలంమీద నేను' అనే శీర్షికలు వర్ణనాత్మకములు. 'రెక్కల పురుగు'- "పుండు నలిపినట్టు-పుర్రెలో జిర్ర తొలిచినట్టు" ఇటూ అటూ ఎడాపెడా ఎగురుతున్నదట. నారాయణరెడ్డి సూక్ష్మాంశాన్నికూడా ఎంతో సుందరంగా వర్ణిస్తాడు. గండుచీమలను "మరో రూపమెత్తిన షహర్షులు"గా వర్ణిస్తాడు. నిగ్రహంలో నిరుపమానాలైన, ఆగ్రహంలో అగ్రగణ్యాలైన ఆ గండుచీమల "తిరగడం అణువణువూ శోధించడ"మట. వాటి "ఆ రుచిమరగడం పరమాత్మను ఆస్వాదించడ"మట. "ఆ కుట్టడం అలిగితే శాపం పెట్టడ" మట. ఈతనిది ఎంతటి నిశితపరిశీ లనమో చూపడానికే ఈ పంక్తులు. 'తైలవర్ణచిత్రాలు' ఖండికలో అన్నీ సరికొత్త ఉపమానాలే. ఇవన్నీ నిజంగానే తైలవర్ణ (అక్షర) చిత్రాలే. ఈ వర్ణచిత్రాలన్నింటిని కలిపిచూస్తే వర్షం కురిసినప్పటి ప్రకృతిదృశ్యం మనో హరంగా కనిపిస్తుంది — "రెచ్చిపోతున్న వరదలు పిచ్చివాని వెకిలినవ్వుల్లా" ఉన్నవట. "వాణికిపోతున్న గాలి ఓడిపోయినవాని మనస్సులా" ఉన్నదట. 'కాలంమీద నేను' ఖండికలో తనకూ క్యాలెండరుకూ గల తారతమ్యాన్ని

చాలా చక్కగా వర్ణించినాడు ఈ కవి– "చచ్చేటట్టు నిల్చున్న గోడకు చావకుండా ఉరేసుకున్న"దట క్యాలెండరు. ఈతని చూపు "మేకుల్లో శోకించే ముప్పై అంకెలమీద - కలితీలేని నెత్తురుకక్కే ఆదివారాలమీద". నిలువుగా అడ్డంగా గీసిన గీతల్లోని అంకెలు మేకుల్లో శోకిస్తున్నాయనడం, ఎర్రని 'ఇంకు'లో ముద్రితమైన ఆదివారాలు "కలితీలేని నెత్తురు" కక్కుతున్నాయనడం అత్యాధునికంగానూ అతిమనోహరంగానూ ఉన్నది. ఈ కవితలో ఇద్దరంలేక 'రెండురం' అనడం ప్రాసచమత్కారం కోసం.

ఈ సంపుటిలోని 'నేను-అతడు' అనే కవితలో 'నేను' అంటే నారాయణరెడ్డి- అంటే కవి. 'అతడు' అంటే బ్రహ్మ. కవి గీతాలు సృష్టిస్తే బ్రహ్మ జీవితాలు సృష్టిస్తాడు. అయినా "గీతిక గొప్ప జాతకంకంటె-స్వరం గొప్ప భాస్వరంకంటె" అని ద్రష్టా కవిసృష్టి బ్రహ్మసృష్టికంటె విశిష్టమైనదని ధ్వనింపజేసినాడు. "నియతికృతి నియమరహితాం" అనే ప్రసిద్ధమైన ఆలంకారిక శ్లోకసారాన్ని చిన్నచిన్న మాటలతో సొంత గొంతుకతో వ్యాఖ్యానించినాడు.

ఈ కావ్యంలో 'నా/నా ముఖాలు', 'ఆత్మఘోష' అనే ఖండికలు ఉర్దూ కవితలకు అనుసరణాలు. వీటిలోనూ నారాయణరెడ్డి కవితాత్మశైలీ అచ్చంగా అగుపిస్తుంటాయి.

ఈ సంపుటిలోని 'ఆకృతులు; ఆ-కృతులు' అనే కవితయొక్క ఆకృతి కనులకూ మనసుకూ చిత్రమైన అనుభూతిని కల్గిస్తుంది. ఈ కవితను నిలువుగా చదువుకోవాలి. అందుకే మధ్య గీతలు గీసినాడు ఈ కవి, కవితా ముద్రణలో కొత్తతీరు ఇది. ఈ తీరు నిజానికి అంగానికి సంబంధించిందే. అజంతాకృతులన్నాడు వీటిని. ఇక అంతరంగమూ ఈతని కవితల్లో తళుక్కున మెరుస్తూ కనిపించే క్రమాలంకారశిల్పమే. ఈ కవితలో చెట్టుచేమా....చేయీ కాలూ" వంటివానిని చూడవచ్చు- ఇక "ఉక్తి యుక్తి" వంటివానిని మనస్సుతో చూడాలి. మొదటిరెండు "కనులు గీసుకున్న అజంతాకృతుల"ని, రెండవది- "మనసు పాడుకున్న రాగరాజకృతుల"ని క్రమాలంకారాన్ని చెప్పుకోవాలి. 'రాగరాజకృతుల' త్యాగరాజకృతులను చప్పున స్ఫురింపజేసే సరికొత్త పమాసం.

ఈ సంపుటిలో పడుచుసంధ్య. తెల్లటిచీకట్లు, అగ్నిరజం. సంజీవదేవుడు, ధాన్యజానకి వంటి నూతనపదబంధాలూ-"తోకలో మెరిసే మిణుగురు పురుగు తూర్పువెలుగు కానేరదు"- "అంతరంగం వళంతప్పితే అన్నీ మర్మస్పృక్కులే" వంటి సుందరసూక్తులెన్నో ఉన్నాయి.

మొత్తంమీద తేజస్సు తపస్సుగా, ఉదయం హృదయంగా తూర్పు ఊర్పుగా, మార్పు తీర్పుగా మహాకవి నారాయణరెడ్డి మహోన్నత సాహిత్య వ్యక్తిత్వాలను చాటిచెప్పుతూ. దీనితర్వాత వచ్చిన "మార్పు నా తీర్పు", "తేజస్సు నా తపస్సు", "ఇంటిపేరు చైతన్యం" వంటి కావ్యసరిత్తులకు ఈ 'ఉదయం నా హృదయం' ఒక హిమాలయంగా భాసిస్తున్నది.

# మార్పు నా తీర్పు

నిరంతరకవితాయౌవనంతో నిత్యపురోగమనంతో ఉదయంలా ఎదుగుతూ ఉదధిలా ఉప్పొంగుతూ అన్ని దిక్కులూ కలిపేసే ఆకాశంలా ఆవరిస్తూ కన్నీళ్లనూ నిట్టూర్పులనూ క్షుధనూ వ్యధనూ మృతినీ వికృతినీ బహిష్కరిస్తూ క్రాంతికారుడై మహోజ్జ్వల చైతన్యానికి వారసుడై మానవతను చాటుతూ సాహిత్యాన్ని సృష్టిస్తున్న నారాయణరెడ్డి 1974లో తాను ఆయా సందర్భాలలో వ్రాసిన ముప్ఫై కవితలను 'మార్పు నా తీర్పు' అనే సంపుటిగా ప్రచురించినాడు. 'మార్పు నా తీర్పు' అనే ఈ చక్కని శీర్షిక 'ఉదయం నా హృదయం' సంపుటిలో తన కవితావ్యక్తిత్వాన్ని చాటుతూ వ్రాసిన కవితలోని చివరి చరణం. ఈ సంపుటిలోని మొదటికవితకూడా ఇదే. ఈ సంకలనానికి తిలకం దిద్దడానికి ఈ కవితను వ్రాసినాడీకవి.

మార్పు రెండువైపులా ఉండవచ్చు. చీకటివైపు; వేకువవైపు; ఏదైనా మార్పే. వెలుగును కోరడమే మానవత. ఉదయమే తన హృదయంగా వ్రాసే నారాయణరెడ్డి మానవాళికి మంచినిపెంచి అభ్యుదయాన్ని అందించేమార్పునే అభిలషిస్తాడు, ఆహ్వానిస్తాడు అని నిస్సంకోచంగా చెప్పవచ్చు. అందుకే ఆతడు—

"శిశిరం నుంచి వసంతానికి
చీకటి నుంచి ప్రభాతానికి
నిరాశ నుంచి ఆశాశిఖరానికి
అశ్రుజలధి నుంచి ఆనందతీరానికి
నడిపించే మార్పు
నేనిచ్చే తీర్పు"—

అని తన తీర్పును విశ్వజనీనన్యాయమూర్తిలా ప్రకటించినాడు.

'మార్పు నా తీర్పు' అన్న శీర్షికకు అనుగుణంగా ఈ గ్రంథం రూపంలోనూ కవితల పరిమాణంలోనూ మార్పు కనిపిస్తుంది. ఇందలి చాలా ఖండికలు క్లుప్తంగా ధ్వనిగర్భితంగా సాగినవి. గుప్తత ఉన్నప్పుడు క్లుప్తత తప్పనిసరికదా! కాలం గడిచినాకొద్దీ నారాయణరెడ్డి కలం పదునుదేరుతున్నది. ఛెడీమనిపించే చెంపదెబ్బ చురుకు కవిత్వంలో కనిపిస్తున్నది. అనల్పార్థాన్ని అలతి అలతి పలుకులలో చెప్పయత్నిస్తున్నాడు. ప్రపంచమంతటి అర్థాన్ని పరమాణువులో బిగిస్తున్నాడు. వ్యాఖ్యానం మానుకుని వ్యాకరణసూత్రంలా వ్రాస్తున్నాడు. శబ్దాలను క్రమంగా కుదించి నగిషీపనిలా శిల్పిస్తున్నాడు. అందుకే రానురాను ఈతని కవితాఖండికల దైర్ఘ్యం పరిమాణం తగ్గుతున్నది. ఇది ఈతని కవితాజీవితంలో కనిపిస్తున్న పరిణామం. ఒకవేళ ఎక్కడైనా ఒకటో అరో దీర్ఘకవితలుంటే అవి ఆయా సందర్భాలనుబట్టి ఔచిత్యంకోసం వైశద్యంకోసం వ్రాసినట్టివే అని చెప్పాలి. మచ్చుకు ఈ సంపుటిలోని 'దేశం ముందడుగు వేయాలి' అనే కవిత అలాంటిదే. ఈ సంపుటిలో కనిపించే మరో మార్పు రెండు ఖండికలు మాత్రాచ్ఛందస్సులో ఉండడం. అవి 'ఉదయానికి ఉరి', 'చచ్చిన జీవితాలు—బతికివున్న శవాలు' అనేవి. ఈ రెండు కవితలూ త్రిశ్రగతిలో నడిచినవే. 'మరో హరివిల్లు' అనే ఖండకావ్యం తరువాత మాత్రాచ్ఛందస్సును మళ్ళీ ఈ సంపుటిలో నారాయణరెడ్డి చేపట్టినాడు. అందుకే ఈ కావ్యాన్ని 'మంటలూ మానవుడూ,' 'ముఖాముఖి,' 'మనిషీ—చిలక', 'ఉదయం నా హృదయం'వలె కేవలవచన కవితా సంపుటిగాగాక కవితాసంపుటిగా మాత్రం చెప్పవచ్చు. ఇవన్నీ ఈతని ఖండకావ్యాలను తులనాత్మక పరిశీలనతో చూడగా నాకుకనిపించిన మార్పులు.

ఈ కావ్యంలోని 'ఉదయానికి ఉరి', 'పసులపోశి', 'అ. భా. తో మహాసభ' అనే ఖండికలు ప్రత్యేకంగా పేర్కొన దగినవి.

'ఉదయానికి ఉరి' కవితలోని 'ఉదయం' ఒక వ్యక్తికీ విప్లవశక్తికీ ప్రతీక. ప్రజలన్యాయంకోసం ధర్మంకోసం వెలుగుకోసం 'బెబ్బులి'లా 'పెనుచిచ్చరపిడుగు'లా పోరాడిన ఉదయాన్ని కటకటాలలో బంధించి శిక్షవేసినారనీ, మరునాటి ఉదయం ఆ ఉదయాన్ని ఉరితీస్తారనీ – ఈ దుర్వార్తను ఆతని ప్రేయసి పత్రికలో చదువుకొని చెరసాలకువచ్చి ప్రియుని ఎదుట విలపిస్తూ తన గళాన్ని కడసారిగా ఆతని చేతులతో చుట్టివేసి మనసారా ఒకసారి పిలువుమనీ, తాను వాటిని మంగళసూత్రంగా వేదమంత్రంగా భావిస్తానని వేడుకోవడం—ఇందలి కథాంశం. హృదయాలను కరిగించే కరుణరసార్ద్ర సన్నివేశం. ఈ ఖండిక సమకాలికసాయుధవిప్లవశక్తుల పోరాటాన్ని ధ్వనింపజేస్తుంది ఈ కవితలోని—"ఉదయసూర్యబింబము నా నుదుటిపైన దిద్దుకొందు" అనే చిట్టచివరిపంక్తి ఆ ఉదయం ప్రియురాలికి ఇక వైధవ్యం రాదనే విషయాన్ని ధ్వనిరమ్యంగా సూచిస్తున్నది.

'పసులపోశి' అనే ఖండిక ఎద ఎదనూ ఊరించే వాత్సల్యరసామృత కుండిక. 'పసులపోశి' మాటలు ప్రాణం ఈ కవితకు. పోశి తన ఆత్మీయతను రంగరించి అంబలిగా సింతకాయ తొక్కుగా ఈ సినబాపుకు (సి. నారాయణరెడ్డికి) అంపించిన ఆ సన్నివేశాన్ని—ఆ "చెరిగిపోని బాల్య స్మృతి"ని చెప్పలేనంత మధురంగా చెప్పినాడు నారాయణరెడ్డి. నిజానికి పోశి పోసింది మామూలు అంబలికాదు - మనసులోని వాత్సల్యం. అందుకే అమ్మలా అంతకమ్మగా కవితగా జాలువారింది. బాంచెను, దొరా, దొరసాని, గులాపోల్ల, అసొంటోల్లు, సినబాపు, సింతకాయతొక్కు, రుసివంటి నిండుజీవంతో తొణికిసలాడే తెలంగాణా మాండలిక పదాలను పోశినోట పలికించటం వలన కవితకు సహజమాధురిని పులిమినట్లయినది.

ఇక 'అ. భా. తో. మహాసభ' అనే కవిత వాడిగా వేడిగా కొరడా చురకలువేసే వ్యంగ్యరచన. ఇందులో 'అ. భా. తో' అనేది-'అఖిల భారత తోడేళ్ళ' అనే దానికి సంక్షిప్తరూపం. తోడేళ్ళు వంచకులకు ప్రతీక. గొర్రెల్లాంటి ప్రజలను కాజేసే తోడేళ్ళవంటి వంచకులు "సకలభారత జనాభాలో సగానికిపైగా" ఉన్నారని సమకాలికసమాజదుర్గతిని ఘాటుగా

విమర్శిస్తున్నదీ రచన. ఆ తోడేళ్ళు 'ప్రభుత్వాలు ఒరిగినా' భద్రంగా ఉంటాయట. కాని వాని "దుస్తులువేరు ముస్తాబువేరు". "తెల్లటోపీ మల్లుధోతి-సిల్కులాల్చీ-టెర్లిన్ప్యాంటు-ఎప్పుడూ ఇంగ్లీషే అప్పుడప్పుడు హిందీ-మరీ విధిలేకపోతే మాండలిక భాష" అని తోడేళ్ళ వేషభాషలను వివరించినప్పుడు నవ్వొస్తుంది.

నారాయణరెడ్డి 'జ్వాలాశిశువు'గా, బల్లెం మీద బతుకుతున్న పులిగా చైతన్యంతో జాగరణంతో సాగిపోతూ తనవలె ఇతరులను కూడా "దమ్ముంటే—వేయగలిగే అమ్ముంటే" 'చైతన్యానికి పట్టిన' చీడనూ పీడనూ చీల్చండని ప్రబోధిస్తాడు. "తీరమదే కాసారమదే" కానీ "తరగకొత్త పరుగు కొత్త" అని సముద్రతీరాన్నీ కెరటాలనూ గూర్చి చెప్పినట్లే ఆది నుండి నారాయణరెడ్డి ధ్యేయమూ ఆశయమూ చైతన్య ప్రబోధమే; సౌజన్యపారమే. కానీ ఆ చెప్పేతీరూ, గుప్పేశబ్దాలజోరూ సరికొత్తగా ఉంటుంది. '[illegible]టిపాట'లో

"ఒదిగివుంటే నీరు నీరే
ఎదురు తిరిగితే అది నిప్పే
జాగ్రత్త మరి
జలం లాంటిదే
జనం"-

అని చల్లగా నీటిపాటను వినిపించి చివరకు నిప్పులాంటి సత్యంచెప్పి జాగ్రత్త అని సంఘాన్ని హెచ్చరిస్తున్నాడీ కవి. "పొంగింది నీరు....ఉగ్రపాదంలా", అరిచింది నీరు....డమరువులా" అనే పంక్తుల్లో ఎంతోధ్వని ఉంది. వేసిన ఉపమానక్రమం వలన ప్రశాంతంగా జీవించేప్రజలను కుత్సితమైన పన్నాగాలు ఇంద్రజాలాలు రెచ్చగొట్టితే వారిలో క్రోధం, తీక్ష్ణత, ప్రతిఘటనోగ్రత ప్రళయాగ్నిరూపం ధరిస్తుందనే అర్థం గర్భితమై ఉన్నది. 'ఉగ్ర' శబ్దానికి 'భయంకర' అనే అర్థంతో పాటు 'శివుడు' అనే అర్థం కూడా ఉన్నది. అందుకే వెంటనే "అరిచింది నీరు .... డమరువులా" అని డమరువు శబ్ద ప్రయోగం. ప్రౌఢకవి చేసేశబ్దప్రయోగమిట్టిది. ఈ కవితాఖండికరూపం నీరులాగే ఉంది కానీ ఇందులో ఆత్మ నిప్పులా ఉంది.

దాస్యంతో జడత్వంతో అజ్ఞానంతో అంధానుకరణంతో జీవితాలను ఈడ్చే మనుష్యులు బతికివున్న శవాలనీ వీరికన్న గతంలో ఉజ్జ్వలంగా వెల్గి

ఈనాడు కండలు కోల్పోయివున్న శిథిలాలే మేలని చెప్పుతూ మనుష్యులంతా ఊపిరి ఉన్నంతసేపు-- "కాలం కత్తెరకే లొంగని" కుత్తుకల్లాగా, "రంకె వేయు నందికేశ్వరుల"లాగా, "నర్తించే నాగుపడగల"లాగా బ్రతుకాలని ప్రబోధిస్తాడు నారాయణరెడ్డి 'చచ్చిన జీవితాలు-బతికివున్న శవాలు'లో. కుంభవర్షం, భానుబింబం మబ్బుల చీకట్ల 'ప్రసవ వేదన' ఫలితాలనీ, ఎప్పుడైనా వేదన తరువాతనే నవోదయమనీ ఉదయాన్ని సాధించాలని ఈ కవి ఉత్తేజపరుస్తాడు జనాన్ని 'ప్రసవవేదన' అనే ఖండికలో.

ఈ సంపుటిలో 'ఒకొక్క కెరటం', 'కాలం' అనే ఖండికలు వర్ణనాత్మకములు. 'ఒకొక్క కెరటం'లోని—

"తీరానికీ కెరటానికీ ఉన్న తేడా
జడ చైతన్యాలమధ్య జరిగే క్రీడ"

అనే పంక్తులు సూక్తుల్లా మెరుస్తున్నాయి. అలాగే 'విరిగిన హరివిల్లు' లోని—

"కలల్ని కనడానికి
లింగభేదం దేనికి"

అనే సూక్తి రమ్యవర్ణాలను చిమ్మి అంతరంగాన్ని ఆనందింప జేస్తుంది.

"దినందినం చచ్చిపుట్టే శిశువు"- అని వెలుగునకూ, "చల్లగా మండే చంద్రనిప్పుల కొలిమి" అని అగ్రువునకూ, "కాలం దుప్పటికి వేసిన ఆరు అతుకులు" అని ఋతువులకూ నారాయణరెడ్డి ఇచ్చిన నిర్వచనాలు చిత్తాలకు హత్తుకుంటాయి. 'నగరం పడిపోతున్నది' అనే కవిత ప్రజలలో చైతన్యవిప్లవం ప్రభవిస్తున్నదని ఘోషించగా, 'పూనాలో ఉగాది వచ్చుడి' జాతిసమైక్యాన్ని చాటుతుంది. ఈ కవితలోని-

"అసంఖ్యాక పత్రాలు - ఒకే నీరజం
అనేకభాషాప్రాంతాలు - ఒకే భారతం
రంగురంగుల రత్నాలు - ఒకే దండ
రకరకాల రాష్ట్రాలు - ఒకే జెండా"-

అనే పంక్తులు జెండాలవలె ఆడుతూ పాఠకుల గుండెల నాకర్షిస్తాయి.

మానవాభ్యుదయాన్నీ మానవాత్మ ఔజ్జ్వల్యాన్నీ కాంక్షించే ఈ మార్పూ ఈ మార్పునుకోరే నారాయణరెడ్డి తీర్పూ విశ్వజనీనం.

# తేజస్సు నా తపస్సు

సమకాలికప్రపంచంలో జరిగే ప్రతి సంఘటనకు స్పందిస్తూ సమాజంలోని 'విషమగతులకు' విరుగుడుగా, 'ప్రగతి శక్తులకు' బాసటగా, అనుక్షణం ఉజ్జీవించే తన ఆశమా అనవరతం ఉన్మేషించే తన ఆశయాన్ని శక్తిమంతమైన తన వ్యక్తిత్వాన్ని చిత్రిస్తూ రచనావ్యాసంగాన్ని కొనసాగించడమూ, ఆ విధంగా ఆయా సందర్భాలలో అల్లిన ఖండికలన్నింటిని ఆ సంవత్సరాంతంలో ఒక సంపుటిగా వెలువరించడమూ నారాయణరెడ్డిలో ఆదినుండీ అగుపించే ఒక ప్రత్యేకగుణం. ప్రతిఏటా ఒక కావ్యాన్ని అందించటం వీరి హృదయ లక్షణం. ఇది అందరికీ చేతనయ్యే పనికాదు. దృఢదీక్ష తపశ్శక్తి ఉంటేనేగాని ఈ కార్యం సాధ్యంకాదు. ఈతని జలపాతం మున్నగు ఖండకావ్యాలన్నీ ఈ విధంగా వెలువడినవే. అలా తాను 1975లో వివిధ సందర్భాలలో వ్రాసిన ముప్పైఎనిమిది వచన కవితలను ఈ కవి 'తేజస్సు నా తపస్సు' అనే సంపుటిగా అందించినాడు.

'తేజస్సు నా తపస్సు' అన్న మాటలో 'నా' అంటే కేవలం వ్యక్తిగా నారాయణరెడ్డి అనికాదు. అది ఆతని కవితాత్మగా గ్రహించాలి. నారాయణరెడ్డి హృదయం కవిత్వానికి పర్యాయం. ఆతడు 'నేను' అని వ్రాసినా 'నా' అని వ్రాసినా పలుకుతున్నది కవిత్వమే అని భావించాలి. కాబట్టి ఆతని 'హృదయం నా హృదయం' 'మార్పు నా తీర్పు' 'తేజస్సు నా తపస్సు' అనే పంక్తుల్లోని నా అనే పదానికి అర్థం ఇదే. ఈ దృష్టితోనే ఆతని కవిత్వం చదువాలి. అప్పుడే కవిత్వపరమార్థం తెలుస్తుంది. హృదయాన్ని సముజ్జ్వలకవితకు అంకితం చేసినప్పుడే కవి 'ఉదయం నా హృదయం' 'తేజస్సు నా తపస్సు' అని అనగలుగుతాడు.

'తేజస్సు నా తపస్సు' అనే ఈ ఖండకావ్యంలో మొట్టమొదటి కవిత ఇదే. చిట్టచివరిది 'ఓజస్సు నా ధనుస్సు'. ఈ రెండు శీర్షికలూ 'ఉదయం నా హృదయం' సంపుటిలో నారాయణరెడ్డి తన కవితావ్యక్తిత్వాలను గూర్చి వ్రాసిన కవితలోని రెండు పంక్తులు. ఇలా ఒకప్పుడు తాను వ్రాసిన కవిత

లోని రెండు చరణాలనే శీర్షికలుగా గ్రహించి రెండు కవితలల్లి వాటిని సంపుటికి ఆద్యంతాలుగా నిలపడంలోని ఔచిత్యం నారాయణరెడ్డి ఈ కావ్యానికి ఏకసూత్రతను సంఘటింపజేసి కావ్యశీర్షికను సముద్దీపింప జేయడమే.

ఈ సంపుటిలోని 'తేజస్సు నా తపస్సు' ఈకావ్యం కోసం ప్రత్యేకంగా వ్రాసిన దీర్ఘకవిత. నారాయణరెడ్డి కవితాతపస్వి. ఇది అక్షర సత్యం. అందుకే ఆతడు నాటినుండి ఈనాటి వరకూ ఇరవైయైదు సంవత్సరాలుగా నవనవంగా రసోజ్జ్వలంగా సాహిత్యాన్ని సృష్టించగలుగుతున్నాడు. 'కావ్యాగ్నుల'ల్లడమే ఆ తపస్వియాగం. ఆయన లక్ష్యం— "స్వీయశ్రేయం కాదు. జగదీయ ప్రేయం". అందుకే "ఎక్కడో ఒక చెమట చుక్కలో ఇనబింబం ప్రజ్వలిస్తే" ఈతని కంటికి అరుణోదయం. ప్రపంచంలో ఏమూలనైనా శ్రామికులూ కార్మికులూ నిరుపేదలూ నిరాశాహతులూ బాధపడినా బాగుపడినా వారితో తాదాత్మ్యాన్ని పొందుతూ ఆ అనుభూతులను కవితగా అల్లి అందరికీ వినిపించే అమృతహృదయం ఈకవిది. ఈతని తపస్సంతా సామ్యవేదాన్ని ఉద్ఘోషించాలనే; సౌమ్య జీవనాన్ని ప్రసరించాలనే; చేతనావిద్యుత్తులు ఉదయింపజేయాలనే; నజీవసంస్కృతిని పండించాలనే, ఉన్మత్తనాగరికతను పలికించాలనే; మట్టిని మాణిక్యం చేసే వర్తమాన ప్రగతిశక్తులకూ స్వేచ్ఛాప్రతిభాదీప్తులకూ ఉజ్జ్వలభవిష్యత్తును కలిగించాలనే; ధర్మబద్ధంగా విధిని నిర్వర్తించడంకూడా తపస్సే. అందుకే చెట్లూ, భూగోళం, అర్కమండలం, సముద్రజలం, గ్రహాలూ మహీధరాలూ పయోధరాలూ శరీరసమస్తావయవాలూ చేస్తున్నది తపస్సే అంటాడీకవి. ఇక ఈ తపస్సు "కౌటిల్యం కరిగేదాకా - జాటిల్యం చెరిగేదాకా - ధనస్వామ్యం విరిగేదాకా-జనస్వామ్యం పెరిగేదాకా" కొనసాగించాలంటాడు నారాయణరెడ్డి.

ఈ సంపుటిలోని కవితలు వస్త్వాశ్రయమైనా ఆత్మాశ్రయమైనా అవన్నీ సందేశబంధురమై ఈకవి చైతన్యదీప్తినీ శక్తినీ ప్రకటిస్తాయి. చైతన్యమూర్తీ ప్రగతిపథవర్తీ అయిన నారాయణరెడ్డి శబ్దం నిశ్శబ్దాన్ని చీలుస్తూ కాలాన్ని అతిగమిస్తూ అనవరతం అభినవసృష్టిని చేస్తున్నది. నిర్మించే ఆతని కలం, గర్జించే ఆతని గళం దినందినం పదును దేరుతూనే ఉన్నవి; ప్రజ్వలిస్తూనే ఉన్నవి. ఒకనాడు సుతిమెత్తగా శతపత్రసంగీతాన్ని వినిపించిన ఈతని కలం ఈనాడు "కారడవిలాంటి అంధకారాన్ని క్రకచంలా

చీల్చే" వజ్రసంగీతాన్ని వినిపిస్తున్నది. వెలుగునిచ్చే మార్పు ఈ కవి తీర్పు గదా : "రాత్రి కౌగిట్లో చల్లబడిన సూర్యుణ్ని రగుల్కొలిపేటందుకు" వెళు తున్నానని చెప్పగలిగినంత దీప్తచైతన్యం గలవాడీ కవి. అందుకే—

"మంచు ముద్దల్లో
మార్తాండబింబాలు ఉదయిస్తే
గులాబీ తీగల్లో
ప్రళయానలజ్వాలలు ప్రసవిస్తే
పిల్లగాలిలో
కల్లోలఝుంఝులు ప్రసరిస్తే
పిల్లనగ్రోవిలో
విప్లవశంఖాలు వినిపిస్తే"—

దానిని వికృతిగా గాక 'అసలైన ప్రకృతి'గా, అపశ్రుతిగా గాక 'ఆగామి యుగశ్రుతి'గా గ్రహించాలని, ఈ మార్పును జూచి మనిషి భయపడవద్దని ఆగామిచైతన్యానికి స్వాగతం పల్కాలని ప్రబోధిస్తాడు.

ఈ సంపుటిలోని 'తేజస్సు నా తపస్సు', 'తిరిగొచ్చిన పాటలు', ఊరంతా హోరు, త్రేతాగ్నులు, 'నా పాట, ఎంత ? ఎంతెంత ?' 'ప్రశ్నిస్తు న్నాను', 'ఓజస్సు నా ధనుస్సు' మున్నగు కవితలు ఆత్మాశ్రయరీతిలో సాగి ఈ మహాకవి యొక్క సముజ్జ్వలచైతన్యవ్యక్తిత్వాన్ని చాటుతున్నాయి. 'గుప్పిట్లో నిప్పులతో', 'క్షమించాలి తల్లీ'- ఖండికలు కవిసమాజంలో ఈకవి ప్రత్యేకతనూ కవితామార్గంలో పరికొత్తదనాన్ని ప్రదర్శించాలనే ఈతని గాఢాభిలాషను సూచిస్తున్నాయి.

ఈ కావ్యంలోని 'గుప్పిట్లో నిప్పులతో', 'దేశపటం', 'ప్రకృతి : ప్రగతి' వంటి కవితలలోని చివరి చరణాలు మెరుపుతీగల్లా మెరుస్తాయి. అందులోనూ 'దేశపటం' కవిత ఎంతబాగుందో చెప్పలేను. అన్ని కవితలొక ఎత్తు ఈ ఒక్క కవిత ఒక ఎత్తు. ఈ ఒక్క కవితలోనూ అన్ని చరణా లొక ఎత్తు; చివరి మూడు పంక్తులు ఒక ఎత్తు మన దేశపటాన్ని వర్ణిస్తూ నారాయణరెడ్డి— "సముద్రాలు కాళ్లు - చెట్లు చేతులు - నదులు నాడులు - కొండలు కండలు - విరులు ఆశలు - ఆవిరులు శ్వాసలు - అన్నీ ఉన్నాయి

బాగా ఆడుతున్నాయి" అని చెప్పి చివరకు—

"ఏదీ మరి గుండెకాయ?
ఆగండి
ఆస్పత్రిలో ఉంది"—

అంటాడు. ఇలా చిన్నపంక్తిలో బ్రహ్మాండమంతటి అర్థాన్ని పొదిగినాడు ఈ కవి. ఇట్టి కొసమెరుపు ఉర్దూ కవిత్వంలో ఉందని ఈ గ్రంథావిష్కరణసభలోనే చెప్పినారు ఉర్దూభాషాసాహిత్యాలతో విశేషపరిచయమున్న సాహితీవేత్తలు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు.



'రెక్కలమేడ', 'గాలినిబంధిస్తే' అనే ఖండికలు కథాధోరణిలోసాగి చక్కని సందేశాలనందించే ప్రతీకాత్మకరచనలు. 'రెక్కలమేడ' లోనిమేడ ధనికస్వార్థానికి ప్రతీక. అందుకే దీనిని "చంద్రుడిలోని కళంకంలా" ఉందని వర్ణించినాడు కవి. ఇక గుడిసెలు నిస్వార్థపుపేదలకు ప్రతీక. అందుకే అవి "తెగినవెన్నెల తీగల్లా" ఉన్నవని వర్ణించినాడు. 'రెక్కలమేడ' పరపీడనపరాయణమైన స్వార్థం నశిస్తుందని సందేశమిస్తే, ప్రజలను హింసించే ప్రభుత్వం పతనమౌతుందని గుణపాఠం చెపుతుంది— 'గాలిని బంధిస్తే' అనే కవిత. 1975లోని అత్యవసరపరిస్థితిని ధ్వనింపజేస్తూ వెలువడిన ఈరచన ఎందరో మేధావులనూ స్వేచ్ఛాప్రియులనూ కదిలించింది. నిగళాలకు కవితాగళం లొంగదనీ, నిష్ఠురవృత్తిని సహించదనీ సహజంగానే స్వేచ్ఛాప్రియుడైన నారాయణరెడ్డి ఈ కవితను వ్రాసి ప్రకటించినాడు.

"ఎండను మేస్తుంది
వెన్నెలను తాగుతుంది
గాలినికప్పుకుంటుంది
గగనంలో పడుకుంటుంది"



అంటూ కాలాన్నివర్ణించే పంక్తులు ('ఒకేపక్షి'-లో) అత్యాధునికంగా ఉన్నాయి. ఈతడు ఈ మధ్యే పెంచుకున్న చిన్నారికుక్కను (అల్‌సేషియన్ డాగ్‌ను) వర్ణించే—

"ధ్వనినిచూస్తుంది
రూపాన్నివింటుంది"
"పేరులోఅది 'రాజా'
తీరులోఅది ప్రజ".

అనే చరణాలు చక్కని భావప్రకాశాన్ని ఇచ్చేకిరణాలు.

ఈ కావ్యంలో 'అక్రమార్కుడు' అనే పదబంధం సరికొత్త ప్రయోగం. అక్రమఅర్కుడు అనే సాంస్కృతిక సమాసార్థమేగాక అక్రమంగా 'మార్కులు' వేయించుకోవాలనుకునేవాడు అనే అర్థాన్ని స్ఫురింపజేస్తుంది ఈ సరికొత్త పదబంధం.

"మంచులో తడిసిన ఇసుకే
మండుతుంది నిప్పులా-
నవ్వుతో విరిసినపెదవే
పొంగుతుంది ఉప్పెనలా"

వంటి సూక్తులూ "నిజంలా వికసించేనింగి"లో, "జాలిలా ద్రవించేగాలిలో", "ఎంత పాతగా ఉన్నావుగిరిలా" వంటి సరికొత్త ఉపమాలంకారాలు ఈ కావ్యానికి వింతకాంతిని సంతరిస్తున్నాయి.

క్రమాలంకారాన్ని ప్రయోగించి కవితకు నిండుదనాన్ని చేకూర్చి ఖండికను అనల్పసౌందర్యంతో భాసించే చక్కని ప్రతిమగా చెక్కుతాడు నారాయణరెడ్డి. ఈ సంపుటిలోని 'అయిదే అయిదు', 'ఘర్షణలో', 'అసలు దీపం', 'ఈ రాత్రి' వంటి ఖండికలలో ఈ అనల్ప శిల్పాన్ని సందర్శింపవచ్చు.

నారాయణరెడ్డి చేస్తున్నది కవితాతపస్సు. 'అకుంఠిత సంకల్పం' ఆతని ఓజస్సు; 'అక్షతలక్ష్యం' ఆతని ధనుస్సు. ఆతనికళ్ళు- "రాత్రి కడుపులోపడగొత్తే రక్తాంశువు"నే చూస్తాయి. ఆతనినాల్క- "కమ్మని బతుకునుపుక్కిలించే కటికచేదు"కావాలంటుంది. ఆతని ముక్కు-"నరాలతల లూపించేగుగ్గిలంపొగ"ను ఆఘ్రాణిస్తుంది. ఆతని చెవులు- "ఇరుకుసందుల్లో ఘూర్ణిల్లేరొద"నేవింటాయి. ఆతని త్వక్కు- "ఎటుతాకినా చుర్రుమనేవ్యథ"నే కోరుతుంది. ఇలా ఈ తపస్వి పంచేంద్రియాలు వంచనకు తలవంచక

వెర్రివికారాలకు లొంగక నవచేతనతో రవళిస్తూ ఔజ్జ్వల్యాన్నీ త్యాగాన్నీ ఆవేశాన్నీ ప్రతిఘటనచైతన్యాన్నీ ఆవేదననూ ఆహ్వానిస్తూ వాటినే ఘోషిస్తాయి.

నారాయణరెడ్డి ఖండికలలో 'త్రేతాగ్నులు'న్నాయి. ఒకటి- శిరస్సులో ఆలోచింపజేస్తుంది; ఒకటి వెన్నెముకలో మండి ఆవేదనను రగుల్కొల్పుతుంది. ఒకటి కాళ్లలో ప్రజ్వలించి చైతన్యంతో ముందుకునడుపుతుంది.

నారాయణరెడ్డి ఏకవిత వ్రాసినా అందలిప్రత్యక్షరమూ "అస్తమించని ప్రత్యూషం" కోసమే; "అవధిలేని క్రాంతిహాసం" కోసమే; "నిర్దుష్ట ధ్యేయం" కోసమే; "నివురుగప్పని న్యాయం" కోసమే. ఇదే ఆతని తేజస్సు. ఆతేజస్సే ఆతని తపస్సు.

కీ॥ శే॥ పింగళిలక్ష్మీకాంతముగారన్నట్లు "సుందరమైన రచనయు, సార్వజనీనప్రయోజనమునుకలిగి భావనాత్మకమైన ఆహ్లాదము నిచ్చుచు, కర్త యొక్క ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంథము కావ్యము. ఆ కావ్య జాలమే సాహిత్యము"[1]. ఇటువంటి సాహిత్యమును నారాయణరెడ్డి ఎంతో సృష్టించినాడు; సృష్టిస్తున్నాడు.

## ఇంటిపేరు చైతన్యం

1976లో భిన్నభిన్న సందర్భాలలో వ్రాసి ఆయా పత్రికలలో ప్రచురించిన ముప్పైఒక్క కవితలను నారాయణరెడ్డి ఒక్కచో చేర్చి ఆ సంవత్సరాంతంలో సంపుటిగా వెలువరించినాడు. అదే 'ఇంటిపేరు చైతన్యం.' నారాయణరెడ్డి ఇంటిపేరు 'సింగిరెడ్డి.' సింగిరెడ్డిలో రెడ్డిపదం సర్వసాధారణకుల వాచకం. ఇక 'సింగి' అనగా 'ఎఱుకుది' అని అర్థం. 'ఎఱుక' అనగా చైతన్యమే కదా!

1 సాహిత్యశిల్పసమీక్ష - పుటలు 5-6 ప్రథమముద్రణ-1966.

నారాయణరెడ్డి 1973లో 'ఉదయం నా హృదయం' సంపుటిలో తన కవితా వ్యక్తిత్వాలను గూర్చి రమణీయంగా వ్రాసిన ఒక కవితలోని ఒక పంక్తి 'ఇంటిపేరు చైతన్యం.' ఇప్పటికి ఆ కవితలోని నాలుగు పంక్తులు నాలుగు కావ్యాలుగా రూపుదిద్దుకున్నవి. అవి — ఉదయం నా హృదయం, మార్పు నా తీర్పు, తేజస్సు నా తపస్సు, ఇంటిపేరు చైతన్యం అనునవి. ఇలా కవితాపంక్తిని కావ్యనామంగా తీర్చటంకూడా ఒక విశేషంగా కనిపిస్తున్నది.

ఈ కావ్యసృష్టిలో సర్వత్రా నారాయణరెడ్డి కవితావ్యక్తిత్వాలూ, వాటికి అనుగుణమైన ప్రబోధమూ ఆకాశంలా అందలి తేజోరాశిలా వ్యాపించి ఉన్నవి. ఈ కావ్యంకోసం ప్రత్యేకించి వ్రాసిన సుదీర్ఘఖండిక 'ఇంటిపేరు చైతన్యం.' ఇది ఈ కావ్యానికి శ్రీకారంగా నిలిచి నారాయణరెడ్డి కవితా విరాణ్మూర్తినీ, ఆతని చైతన్యస్ఫూర్తినీ ప్రతిఫలింప జేసున్నది.

బీజరూపంలో పల్లవించి "రేకులై రెమ్మలై శాఖలై" "అఖిల భూద్యోమండలాంతర పరివ్యాప్తమై"న వెలుగే ఈ కవితామూర్తి ఇల్లు. అందుకే ఆ ఇంటికి 'చావుపుట్టువులు' లేవు. ఆ ఇంటికి 'పూవులూ ముళ్ళు' లేవు. "ఎన్నోకోట్ల ఉదయాల ఉదయాలకే పురుడు" పోయగలదు ఆ కవితామూర్తి కంటి వెలుగు. 'విశ్వంభరావధూపదములకు పారాణి' పూయగలదా మూర్తి శ్వాస. 'పదునాల్గు భువనాల కంఠాలు' శ్రుతి చేయగలదామూర్తి వాణి. 'శుష్క హృత్తీరాలకే సుధాద్వారాలు' తెరువగలదా మూర్తి రసన. 'చక్రాళి నవనాడులను మీటి' వాటికి రసానంద దృష్టిని ఇవ్వగలదా కవితామూర్తి స్పర్శ. ఆ కవితామూర్తి చేతులు కదిలితే 'సూర్యేందుచక్రాలు' కదలుతాయి. ఆ మూర్తి అడుగువేస్తే గ్రహాల చరణాలు పరుగెత్తుతాయి. ఇట్టి కవితామూర్తి హృదయం ఆకాశంలోకి ఎగిసి మొట్టమొదట చూసింది— "భగ్గుమని రగిలేటి కుంపట్ల కళ్లతో పాటలే మంటలుగ పాడుతూ" ఉన్న గంధర్వశప్తులను. వారి ఆకలియే 'కాకలి'గా. వారి నాదం 'ప్రళయ ఝంఝూ సముద్బోధము'గా, వారి శ్వాస 'ఉద్రిక్తజలధినిర్ఘోషము'గా ఆ హృదయానికి తోస్తుంది. ఈ గంధర్వ శప్తులు— దారిద్ర్య నిర్మూలన ధ్యేయంతో కలం పట్టుకొని, కన్ను మూసిన విప్లవ కవితామూర్తులేనేమో అనుకుంటాను. తర్వాత ఆ గగనాంచలాలలో పద్మాసనం వేసి, పంచేంద్రియాల వాకిళ్ళు మూసి పరమయోగినిలా

ఉన్న గాలిని చూసి గాలిలా తానుకూడా మౌనంగా తపస్సు చేస్తే మాటకూ పాటకూ స్వస్తి చెప్పవలసి వస్తుందని, అట్టి దివ్యవాతావరణం తన కిష్టంలేక ఆ కవితామూర్తి హృదయం అవనికి దూకి, కడలిలా పెల్లుబికి "కదనరంగం లోని కల్లోలితాత్మలను మథియించి తనకుతానే వేసుకున్న ప్రశ్నల కుంభ వృష్టిలో" తడుస్తూ చివరకు ఇల్లు చేరుకుంది. ఇలా ఇల్లు చేరుకున్న ఆ కవితా మూర్తి హృదయం, తన మహిత వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తూ తన "ఇంటిపేరు చైతన్యమని - తన కంఠమే పాంచజన్యమని" పలుకుతుంది. ఇంతటితో 'ఇంటిపేరు చైతన్యం' అన్న ఖండిక పూర్తి అవుతుంది. ఇలా ఈ కవితలో నారాయణరెడ్డి గగనాంచలాలను చుంబించే తన కవితా చైతన్యాన్ని కథాకథన ధోరణిలో కమనీయోక్తి మధురంగా వ్యక్తం చేసినాడు.

"రాస్తూ రాస్తూ పోతాను సి
రా ఇంకేవరకు
పోతూ పోతూ రాస్తాను ప
పువు వాడేవరకు"—

అన్న నారాయణరెడ్డి పంక్తులకు ఆతని కావ్యాలే అక్షర తార్కాణాలు. ఆతని అఖండకవితాసృష్టికి కారణం నిరంతరమథనం. అనంతవేదనానుభవం. అతడు తనను తానే 'చాపగా' చుట్టుకుంటాడు; 'నిప్పుల్లో నిలబెట్టు' కుంటాడు. ఫలితంగా ప్రతి పదరమణీయంగా ఆలోచనామృతాన్ని సృజి స్తాడు. అంతేగాని కమ్మగా భోజనం చేసి కాలక్షేపానికి కలంపట్టుకొని ఏదో ఒకటి గిలికే స్వభావం కాదు ఆతనిది. ఈ కావ్యంలోని 'అప్పుడు' అన్న ఖండిక ఈ సత్యాన్నే నిరూపిస్తుంది.

అన్నిరకాల మనుషులను తాను కలుసుకుంటున్నా నారాయణరెడ్డికి సత్యభాషులన్నా, ఇక్కట్టులను లెక్కించక మహోన్నత కార్యనిర్వహణలో లీనమైన చైతన్యమూర్తులన్నా, 'సరిపడని' దిక్కులమధ్య 'బేసిని శ్రుతిచేసే' సహజీవనులన్నా విశాలవినిర్మలహృదయులన్నా ఎక్కువ ఇష్టం. వారిని గూర్చి ఎన్నెన్నో విషయాలను తెలుసుకోవాలనే గుణం ఆతనిది. ఈ గుణా నికి ఈ కావ్యంలోని 'అభయం' అన్న కవిత అద్దం పట్టుతున్నది.

నారాయణరెడ్డిలో వినయమూ ఉన్నది; విజృంభణమూ ఉన్నది, సంప్రదాయమూ ఉన్నది, పంప్రశ్నమూ ఉన్నది. 'ఏటిపరుగులో' 'తోటి మనిషి' ఆరాటాన్ని, 'నీటిపిలుపులో' 'కోటికుపిత విద్యుత్తుల కూటమి'నీ భావించే చైతన్యమూ ఉన్నది. "ఎక్కడ కన్నీరుబుకునో" అక్కడ ఆవిరిలా— "ఎక్కడ ప్రాణం చిపుకునో" అక్కడ ఆయువులా అవతరించాలనే ఆదుకోవాలనే ఆదుర్దా ఉన్నది; ఆర్ద్రితా ఉన్నది. 'తొక్కుడువడే గడ్డిపోచల' మూల్గులను, 'చిక్కువడే జీవలతిక'ల ఏడ్పులను వేదనతో వినగలిగే చెవి ఈ కవిది. ఆర్తులతో త్యాగమూర్తులతో తాదాత్మ్యం చెందే పమభావనం ఉన్నది. వారి చిక్కులను తొలగించే ఉక్కుసామర్థ్యమూ ఉన్నది. మృత్యువును కూడా నిర్భయంగా ఆహ్వానించి దానిని తన ఎదలో శాశ్వతంగా బంధించే పత్తువ ఉన్నది. ఇలా ఇన్నిన్ని సుగుణాలు ఇతనిలో ఉన్నాయి కాబట్టియే ఈ కవి నిరాటంకంగా నిష్కళంకంగా ప్రగతిపథాన 'ఎల్లలులేని నవత'తో 'కల్లలు లేని కవిత'ను సృజిస్తూ సాగిపోతున్నాడు.

నారాయణరెడ్డి ఆశావాది. ఇతఃపూర్వం వెలువడిన ఖండకావ్యావాటి కలలో వలెనే ఈ సంపుటిలోనూ ఆశావాదం ప్రపుల్లమై పరిమళిస్తుంది. 'పగటు మనిషి' శష్పనలునిలా గాక దవానలునిగా కదలాలనీ, బృహన్నలునిలాగాక పురానరునిగా పరాక్రమించాలనీ, ఆతని ప్రతి అడుగులో 'విక్రాంతి సస్యాలు' మొలవాలనీ, ఆతని ప్రతి ఎలుగులో 'లక్షల చైతన్యాలు' పలుకాలనీ, మూకానుసరణాన్నీ ఘూకానుసరణాన్నీ త్రోసిరాజని ఆతడు 'హేతువాదగదాధరుడై' ఉజ్జ్వలించాలనీ, "ఉన్ముక్త మానవతా విహంగం ఉత్తాల గగనాల" నందుకోవాలని ఆశిస్తూ ఆ సుముహూర్తం కోసం ఆశతో నిరీక్షిస్తున్నాడు ఈ కవి. 'వేకువ ఉచ్ఛ్వాసంగా' 'చీకటి నిశ్వాసంగా' చేసికొని తన 'కాళ్లే రెక్కలుగా' 'కళ్లే చుక్కలుగా' మలచుకొని వేగంగా ఎగిరి నడుస్తూ, వెళ్ళి నడుస్తూ వెళ్లినచోటల్లా వెలుగులు నింపే అభ్యుదయమూర్తి; జ్యోతిస్ఫూర్తి— ఈకవి. తనవలెనే ప్రతివ్యక్తి జడతనూ నిరాశనూ వదలుకొని ప్రగతిమార్గగామి కావాలని ప్రబోధిస్తాడు. "గతబుద్ధుల రాతి చెవులు కరిగేదాకా", "మృతభావుల మోడు కనులు మెరిసేదాకా" తన ప్రబోధాన్ని ప్రతినిత్యం సాగిస్తానంటాడు. ఏమీ కృషి చేయకుండా ఊరికే నిట్టూరిస్తే లాభం

లేదని పరిశ్రమవలననే కొద్దోగొప్పో ప్రగతి సాధ్యమవుతుందని ఇలా ప్రబోధిస్తాడు—

"ఏదీ ఎవరెట్టు అందదు
లేదని నిట్టూరిస్తే
ఎదగలేవు బోడిగుట్ట
యెత్తైనా"
"పరుగే ఒక బీజం
ప్రగతి దాని భూజం
ప్రసవం ఒక మరణం
ఫలితం రవికిరణం"
"దేహాన్ని కలుపుకునే గుండెతో
దేశాన్ని కలుపుకోండి
పంచేంద్రియాల పరిష్వంగంలో
ప్రపంచాన్నే పొదుగుకోండి"—

వంటి పంక్తులు త్యాగశీలాన్నీ విశాలహృదయాన్నీ పరహిత దృక్పథాన్నీ ప్రపంచించే పతాకలు.

ఈ కావ్యంలోని 'సూరయ్య అస్తమయం' వర్ణనాత్మకమైన కవిత. ప్రచండంగా ప్రజ్వలించిన మధ్యాహ్నమార్తాండుడు సాయంకాలానికి అస్తమించిన సాధారణదృశ్యాన్ని కవితాత్మకంగా కథాకథనశైలీ రమ్యంగా చిత్రించినాడు నారాయణరెడ్డి. సాధారణీకరణం కోసం సూర్యుణ్ణి 'సూరయ్య' అనడం చమత్కారం. ఈ కవితలో కేకలు చూస్తున్నట్లు, అరుపులు కనిపిస్తున్నట్లు, మంటలు వినిపిస్తున్నట్లు, వీధులు నడుస్తున్నట్లు, వ్రాయడంవలన ఒకానొక నవ్యత భాసించింది. సూరయ్య అస్తమించగా వీధులన్నీ ఆగిపోయి—, "చుక్కల్లాంటి అక్షరాలతో - శోకసందేశాన్ని వ్రాసి - ఆకాశ పత్రికనిండ అచ్చేసి - ఆ రాత్రి మౌనం పాటించాయి"— వంటి పంక్తులు అలంకారరమణీయాలు. ఒక మహాత్ముడు పరమపదించినప్పుడు శోక సందేశాలు పంపి మౌనాన్నిపాటించే ఆధునికనాగరక సమాజసంప్రదాయం ఈ కవితలో చోటుచేసికొన్నది.

మహనీయు లెక్కడున్నా వారి ఆశయాలూ ఆదర్శాలూ విశ్వజనీనము లనే సత్యాన్ని వ్యంగ్యంగా భంగ్యంతరంగా ప్రపంచించే చక్కని కవిత— 'దత్తపుత్రిక'.

"గోడకు నొసలు
నొసటికి పేడ
పేడ వెనక చిత్రనేత
పైడి నవ్వు"—

అని సినిమా 'పోస్టరు'లో ఉన్న హీరో బొమ్మపై పేడ పడిన దృశ్యాన్ని సంక్షిప్తంగా వర్ణించడంలో నారాయణరెడ్డి ప్రదర్శించిన ప్రతిభ ప్రశంసనీయం.

నారాయణరెడ్డి ఒక భావాన్ని చిత్రంగా సంక్షిప్త మధురంగా ప్రకటిస్తాడు. గొంతు పలుకడం లేదు అనడానికి గొంతుకు గొళ్ళాలితనం అంటాడు. బుద్ధి పనిచేయడం లేదనడానికి బుద్ధికి చట్రాయితనం అంటాడు. అలాగే గాలి ఆడడంలేదేమి అనడానికి బదులు 'గాలికాళ్లు విరిగినట్టా' అని, చీకటి పడిందా అనడానికి 'వెలుతురు కళ్ళు మలగినట్టా' అనీ, వర్షాలు పడవా అనకుండ "నింగి పొలంలో నీలాలమబ్బుల - నాట్లువేసే నాథుడే లేనట్టా?" అంటాడు.

'నవచేతన' అనే ఖండిక ఈనాటి సమాజంలో సర్వరంగాలలో సమస్త వర్గాలలో విశృంఖలంగా ప్రబలుతున్న తిరుగుబాటు ధోరణిని ఇలా మనోజ్ఞంగా చిత్రిస్తున్నది—

"తిరుగుబాటు చేస్తున్నై
పరిమళాలు
ఎన్నాళ్లీ రేకుల్లో
ఇలా ఖైదు కావాలని"

ప్రసూనం ఉంటేనే పరిమళానికి అస్తిత్వం. లేకుంటేలేదు. ఇది సత్యం. కాని ఆ పరిమళాలు కోరకాలను చెరసాలలుగా భావించి తిరుగుబాటు చేస్తున్నా యనడంతో కవి ఉక్తివైచిత్రి తళుక్కుమంటుంది.

'మలేషియా మధురిమలు'లోని రబ్బరు చెట్లను వర్ణించేటప్పటి—

"మచ్చికతో పితికిన గో
మాత గుమ్మ పాలిచ్చును
చీల్చినగానీ రబ్బరు
చెలి చక్కని పాలిచ్చును"

అన్న చరణాలు హృదయంగమములు.

నారాయణరెడ్డి కాలక్రమేణా కవితలో సంక్షిప్తతను సాధిస్తున్నాడు. చిన్నచిన్న పదాలలో మిన్నులనంటే అర్థాన్ని పొదుగుతున్నాడు. అందుకే ఇటీవల వెలువడుతున్న కవితాఖండికలు చాలావరకు చిన్నవే. ఆణిముత్యాల్లా మెరిసే ఎన్నోసూక్తులు అనల్పార్థాన్ని గర్భీకరించుకున్నవే. ఉదాహరణానికి— రవీంద్రనాథ్‌టాగూర్, నజ్రుల్ ఇస్లామ్ మహాకవుల భిన్నమహోన్నత కవితా వ్యక్తిత్వాలను చిత్రించే ఈ నాలుగు పంక్తులను చూడవచ్చు—

"రవీంద్రుడు - నజ్రుల్
నజ్రుల్ - రవీంద్రుడు
కాకలి - ఆకలి
ఆగ్రహం - అర్చనం"

ఇంకా ఈ కావ్యంలో—

"స్వరియించే గళముంటే
విరచించే కలముంటే
ఉరికంబంపైన శిరము ఉరుమును కాదా
బరికత్తులలోన పదము పలుకును కాదా"
"కంటికి చూపే అందం
వింటికి తూపే అందం"
"నిన్ను మింగే తీపికన్న
నీవు మింగే చేదు మిన్న"
"వేయి కిరణాలా నాకు? ముక్కున
వేలేసుకున్నాడు రవి,

కోటి చరణాలేనా నావి? తనలో
గొణుక్కున్నాడు కవి"

వంటి ఖండికలు అందాలనే కాదు ఆలోచనలనూ కురుస్తున్నాయి.

"ఆవులిస్తూవున్న చమురు దీపంలాంటి చంద్రబింబం", "నత్తగుల్లల్లాంటి రిక్త ఊహలు", "గొర్రెలా తలవంచుకొని పోతూంది జాబిల్లి", "నగరం ప్రశాంతంగా ఉంది సగం మూసిన నేత్రంలా"— వంటి నూతనోపమాలంకారాలూ, 'పొద్దుటమ్ముల పొది' 'నీలాల మబ్బులనాట్లు' వంటి హృద్యాలైన రూపకాలూ ఈ సంపుటిని సమలంకరించినవి. ప్రతిస్వనించు, అలజడించు, స్వరియించువంటి క్రియారూపాలు ఈ కవి నవ్యతాప్రీతిని వ్యక్తం చేస్తున్నవి.

ఈ కావ్యానుశీలనంలో చిట్టచివరకు చెప్పుతున్నా, మొట్టమొదటనే పేర్కొనవలసిన అంశమొకటుంది. అదీ ఈ కావ్యంలోని మాకందాలను గూర్చి. నవతాన్వేషణపరుడైన నారాయణరెడ్డి కందపద్యంలో పొట్టిగాఉండే మొదటి మూడవ చరణాలను మొదటి రెండు చరణాలుగానూ, పొడుగ్గా ఉండే రెండవ నాల్గవ చరణాలను మూడవ నాల్గవ చరణాలుగానూ వ్రాసి సరికొత్త ఛందము నవతరింప జేసినాడు. తాను ఆశించిన 'గతిలో శ్రుతిలో' మార్పును సాధించినాడు. సహృదయుల ప్రశంసలందు కున్నాడు. కందం పాదులో పుట్టింది కాబట్టి దీనికి 'మాకందం' అని నామకరణం చేసినాడీకవి. దీనిని గూర్చి వ్రాస్తూ ఆతడు— "యతిప్రాసలు అవే - గణాలు అవే - అయితే బేసిలో జగణం వేసినా ఈ మాకందం అంగీకరిస్తుంది" అని అన్నాడు. కాని ఆతడు వ్రాసిన పదింటిలో బేసిలో జగణమున్న మాకందం లేదు. ఆతడు వేసిన కొన్ని జగణాలు లక్షణానుగుణంగా ఆరవ గణంగా వచ్చినవే గాని మరోచోట లేవు. ఇంకొక విశేషమేమిటంటే— తొమ్మిదవ మాకందం లోని—

"ఈ కాళ్లే రెక్కలుగా ఎగిరి నడుస్తా
నా కళ్లే చుక్కలుగా నవ్వుతు చూస్తా"

అనే పాదాల్లో ఆరవ గణం 'నల జ'లకు బదులు 'స' గణాలున్నవి. అలాగే చివరి మాకందంలోని—

"తోటి మనిషి ఆరాటం తోచెను నాలో
కోటి కుపితవిద్యుత్తుల కూటమి నాలో"

అనే మూడవ నాల్గవ పాదాలలో 'నల జ'లకు మారుగా ఆరవ గణాలు క్రమంగా 'గగ' 'భ' గణాలున్నవి. నారాయణరెడ్డి ఆరవ గణంగా వేసిన స, గగ, భ గణాలన్నీ నాలుగు మాత్రలవే కాబట్టి స్థూలంగా గతి కుంటుపడి నట్లనిపించటం లేదు. కాని కందపద్యగణాల ధోరణిలో చదివితే గతిలో సూక్ష్మంగా కొంత క్రమం తప్పినట్లనిపిస్తుంది. ఏమైనా మాకందాల గతీ, శ్రుతీ మధురంగా మనోజ్ఞంగా ఉందనడంలో సందేహం ఉండకూడదు.

ఈ కావ్యంలోని 'మచ్చలేని తూర్పు' 1976లో విధింపబడిన 'అత్యవసర పరిస్థితి'ని చిత్రిస్తూ అప్పటి కవుల "సగంతెగిన నాల్కలోంచి పొగలు కక్కే వాక్కుల" స్థితినీ 'గ్రహణం లాంటి' దుర్గతినీ చిత్రించగా, 'కన్నీటి పిడుగులు' అనే కవిత 'తీరాంధ్రధరణి'లో తీరని విఘాతాన్ని కలిగించిన 'పెను తుఫాను' బీభత్సాన్ని కన్నులముందు నిలుపుతున్నది.

'నత్తగుల్ల శుక్తి'గా, 'ఉత్తపుల్ల శక్తి'గా, ప్రతి గుడిసె 'రక్త ధ్వజం'గా, ప్రతి మనిషీ 'రగిలే నిజం'గా పరిణమించాలని ప్రగాఢంగా అభిలషిస్తూ స్వయంగా విశ్వాన్ని తన పరిష్వంగంలో పొదుగుకునే చైతన్యమూర్తియై ప్రజానీకాన్ని గూడా చైతన్యవంతులను చేయడానికి అహ ర్నిశలూ కలాన్నీ గళాన్నీ ప్రయోగిస్తున్న నారాయణరెడ్డి నారాయణరెడ్డి కాదు. ఆయన పేరే కవి. 'ఇంటిపేరు చైతన్యం'. చైతన్యానికి ప్రతీకగా నిలువగలిగినప్పుడే కవిత్వానికి విలువ ఉంటుంది. ఈ అంశాన్నే ఈ కావ్య శీర్షిక వ్యంజిస్తున్నది.

# మథనం

1978లో నారాయణరెడ్డి రసజ్ఞపాఠకులకు అందించిన కవితోపాయనం 'మథనం', 'మనోమథనం'[1], 'అంతర్మథనం'[2], 'ఇది మథనం అది ఉదయం'[3], అన్నశీర్షికలతో గతంలో కవితాఖండికలను అందించిన నారాయణ రెడ్డి ఈ కావ్యానికే 'మథనం' అని నామకరణం చేసినాడు. ఏడాదిపొడుగునా తాను వ్రాసిన కవితలన్నిటిని కలిపి ఆ సంవత్సరాంతంలో ఒక ఖండ కావ్యంగా ప్రచురించి సహృదయలోకానికి సమర్పించే సదభ్యాసమున్న నారాయణరెడ్డి, 1978లో కూడా వ్రాసిన కవితలను ఒక్కచోట కూర్చి 'మథనం' కావ్యంగా అందించినాడు. కాని ఈ కూర్చటంలో కొంత ప్రత్యేకతనూ నూత్నతనూ ప్రదర్శించినాడు. కవితలన్నింటినీ నాలుగు ప్రధాన భాగాలుగా వింగడించి ఒక్కొక్క భాగానికి ఒకపేరు పెట్టటమే అది. ఆ విధంగా పెట్టినపేర్లే 'మననం', 'జ్వలనం' 'ఉద్గమనం', 'ఉన్మీలనం' అనేవి. 'మననం'లో 16 కవితలూ. 'జ్వలనం'లో 15 కవితలూ, 'ఉద్గమనం'లో 13 కవితలూ, 'ఉన్మీలనం'లో 17 కవితలూ ఉన్నాయి. ఈ నాలుగూ నాల్గు ఖండకావ్యాలుగా అగుపిస్తాయి. కావున ఈ 'మథనం' కావ్యాన్ని నాల్గు ఖండకావ్యాల సంపుటిగ భావించవచ్చు.

ఈ కావ్యంలో మరో ప్రత్యేకత– ఇందలి కవితాఖండికలకు శీర్షికలు లేకపోవడం. ఖండిక సంఖ్యమాత్రమే సూచితం కావడం. అయితే ఈ ఖండికలు పత్రికల్లో ప్రచురితమైనప్పుడు శీర్షికలను నిలుపుకున్నవే. కావ్య ప్రచురణవేళ మాత్రమే శీర్షికలను తొలగించినాడు నవ్యతాప్రియుడైన నారాయణరెడ్డి. నిజానికి కవితకు శీర్షిక అవసరంలేదు. శీర్షిక ఉంచటం ఒక సంప్రదాయం. అది సహృదయులకోసం ఏర్పరచే బాహిరమైన సౌకర్యం మాత్రమే.

---

1. 'దివ్వెల మువ్వలు'లో (1959)
2. 'అక్షరాల గవాక్షాలు'లో (1965)
3. 'తేజస్సు నా తపస్సు'లో (1975)

కవితలోని సారాన్ని ఎలుగెత్తిచాటే పతాకంగా సాధారణంగా శీర్షిక ఉంటుంది. కాని కొన్ని శీర్షికలు అంతరమైన కవితాసారస్ఫూర్తిని అందించలేక అసమర్థంగా ఉంటాయి. మొత్తంమీద శీర్షిక ఉన్నా లేకున్నా సత్కవిత ఆస్వాదనీయమే అవుతుంది. ఈ పరమార్థాన్ని గ్రహించే నారాయణరెడ్డి శీర్షికలను తొలగించి మధ్యలో ఎక్కడ ఆపకుండ సహృదయులను సరాసరి కవిత్వంలోకే ప్రవేశింపజేసినాడు.

ఈ సంపుటిలోని మొదటి భాగమైన 'మననం'లో వరుసగా మొదటి పది కవితలూ మాత్రాచ్ఛందస్సులో నడిచినవి. ఇక ఈ కావ్యంలో మిగిలినవన్నీ వచన కవితలే. అందువల్ల ఈ 'మథనం' కావ్యం కేవలవచనకవితా సంపుటి మాత్రం కాదు.

ఈ కావ్యంలోని మూడవభాగం 'ఉద్గమనం', ఇందులో దాదాపు అన్ని కవితలూ ప్రతీకాత్మకంగా కథాకథనధోరణిలో సాగడం మరో విశేషం. ఈ కావ్యాన్ని అధ్యయనం చేస్తున్నప్పుడు ఇందలి మననం, జ్వలనం, ఉద్గమనం, ఉన్మీలనం అన్నపేర్లు సహృదయులను అంతర్ముఖులను చేస్తాయి. నామట్టుకు నాకు ఈ నాల్గింటిలో ఒక అంతస్సూత్రం అగుపిస్తున్నది. మననం అంటే చింతనం. జ్వలనం అనగా మంట, జ్వాల. ఉద్గమనం అంటే ఎగిసి రావటం, పైకి రావటం. ఉన్మీలనం అనగా వికసించటం. నారాయణరెడ్డి మనస్సు సదా సదాలోచనామయం. కవిత్వాన్ని ప్రధానసాధనంగా చేసికొని, మానవతను ప్రబోధిస్తున్న మహాకవి. నిరంతరం నిత్యనూతనంగా భావాలను ఆవిష్కరించాలనే, కవిత్వంలో నవ్యప్రయోగాలు చేయాలనే చింతనం ఎప్పుడూ జరుగుతుంటుందాతని మనస్సులో. ఈ నిరంతరమననం వల్ల— ఆలోచనల మథనంవల్ల సరికొత్త భావమొకటి ఉదయిస్తుంది. లోలోన ఉదయించిన ఆత్మభూతమైన ఈ భావం అక్షరాలను తొడుక్కొని అంతస్సును తోసుకుని ఉద్గమిస్తుంది. ఉద్గమించిన ఈ భావం జ్వాలలా కేవలం ఊర్ధ్వముఖంగా సాగితే విస్తృతి ఉండదు. అంతేకాదు. జ్వాలలా ఉంటే అది ప్రజాకల్యాణకారకం కాదు. అందువల్ల ఆ భావం జ్వాలారూపాన్ని ఉపసంహరించుకుని, శక్తిని సౌందర్యంగా మార్చుకుని శతపత్రంలా రూపుదిద్దుకుంటుంది. దశదిశలా ఉన్మీలనం చెందుతుంది.

దానితో సర్వాంగీణసౌందర్యాన్ని సంతరించుకున్న కవితామూర్తిగా సాక్షాత్కరించి సహృదయలోకానికి ఆస్వాదనీయమవుతుంది.

మననం, జ్వలనం, ఉద్గమనం, ఉన్మీలనం అన్న మాటలు నారాయణరెడ్డి కవితామూర్తి పొందిన క్రమదశలను సార్థకంగా సూచిస్తున్నాయి. ఈ నాల్గుదశలలోనూ మథనం అనివార్యం తరువాత వెలువడే ప్రతిబాహిరరూపానికి మొదట ప్రాణం పోసేది ఆంతరమైన మథనమేకదా! అంటే 'మథనం' పొందిన వివిధ దశావిశేషాలే మననం, జ్వలనం, ఉద్గమనం, ఉన్మీలనం అనేవి. అందుకే 'మథనం' అన్న ఈ కావ్యంలో ఈ నాలుగూ అనివార్యమైన భాగాలుగా శీర్షములెత్తినవని ఊహించవచ్చు.

ఈ నాల్గింటిని మనం మననం చేస్తూపోతే మరో అంశం స్ఫురిస్తుంది. ఉదయించిన జ్వలనం లాంటి సత్యం సుందరమైన కవిత్వం కావాలంటే దాని గమనం బహుముఖాలుగా సాగాలనీ, గమనంతో పాటు అది తన రూపాన్నీ మార్చుకోవాలనీ తెలుస్తుంది. అంటే జ్వాలలాంటి సత్యం శతపత్రంగా సహస్రదళపద్మంగా తన రూపు మార్చుకోవాలి. అలా రూపు మార్చుకున్నప్పుడే అది శివంకరమవుతుంది. ఇపుడిలా చెప్పవచ్చు. అగ్నిలాంటి సత్యం అరవిందం లాంటి కవిత్వమవుతున్నప్పుడు సత్యంలోని వేడిమీ వెలుగూ శక్తీ కవితారవిందంలో మధురమధువుగా మంజులవర్ణంగా మనోజ్ఞపరిమళంగా మారుతాయి. ఈ మధువర్ణపరిమళాలే కవిత్వంలోని రసాలంకారధ్వనులు. ఈ అరవిందం పైన వ్రాలే మిళిందబృందమే సహృదయలోకం. ఇలా మననం, జ్వలనం, ఉద్గమనం, ఉన్మీలనం అన్న నాలుగుమాటలవల్ల కవితాసత్యం సుందరమనీ శివమనీ ధ్వనిస్తున్నది. శివసుందరాలైన కవితాసత్యాలను సృష్టించి అందించటంలో ఆధునికకవిలోకంలో నారాయణరెడ్డి అగ్రగణ్యుడనటం స్వభావోక్తి. 'ఉన్మీలనం' అన్న శబ్దం వల్ల ఏ ఇజానికీ కట్టువడని నారాయణరెడ్డి స్వచ్ఛందవిశ్వతోముఖ కవితాస్ఫూర్తి ధ్వన్యమానమవుతున్నది.

నారాయణరెడ్డి ఖండకావ్యాలు చైతన్యమయమైన ఆతని వ్యక్తిత్వాన్నీ ప్రగాఢశక్తితో నిత్యనూతనంగా పరివర్తనం చెందుతూ ముందుకుసాగే ఆతని కవితామూర్తినీ అభివ్యక్తం చేస్తాయి. ఈ 'మథనం' కావ్యం కూడా ఆతని

వ క్తిత్వ కవిత్వాలను ఏకమచేయంగా సూచిస్తున్నది. 'పొంగిపడే వెల్లువతో' పోట్లాడేంతటి చైతన్యం నారాయణరెడ్డిది. ఈ చైతన్యం మంచితనంతో చేతులు కలుపుతుంది. అవసరమైతే ఆ 'మంచితనం మంటల్లో' మరణించినా భరిస్తూనే ఉంటుంది. ఆతడు 'అక్షరాలే కాళ్లుగా', 'ఆశయాలే మైలురాళ్ళ'గా చేసుకుని ప్రస్థానం సాగిస్తున్న సాహితీయాత్రికుడు. ఈ యాత్రికునికి గమనం అంటే ప్రియం. గమ్యం అంటే భయం. అయితే గమ్యం చేరు కుంటున్నానన్న సంతృప్తి మాత్రం కలుగుతుండాలి ఈతనికి. ఆతడు ఎన్నెన్ని ప్రగతి శిఖరాలందుకున్నా, ఇంతా తాను ఇవతలిగట్టునే ఉన్నట్టూ, 'తుఫానుల్లో' జీవిస్తూ ఆవలిగట్టు చేరుకోవాలనుకుంటున్నట్టూ తన కౌతుకాన్ని ప్రకటిస్తాడు. ఈతని తహతహ తపన ఇంతతీవ్రమైనది కావుననే నిత్యం ఈతడు 'గుప్పిళ్ళకొద్ది అక్షరాలు' విత్తనాల్లా వెదజల్లుతూ సహృదయ హృదయకేదారాలలో ఆనందాన్ని పండిస్తున్నాడు. ఆతని కావ్యాలు 'ఎండు టిసుకదిబ్బల్లో' కూడా రసగంగలను ప్రవహింపజేస్తున్నాయి.

నారాయణరెడ్డి కలం ఎంతటి కష్టమెదురైనా ఆగేదికాదు. ఎంతటిచలి ఉన్నా నరికొత్తమంట పదునుపెట్టుకుంటూనే ఉంటుందది. "కన్నీళ్ళను సుతి మెత్తని వేన్నీళ్లుగ మార్చుకుని కొడిగట్టిన గాయాలను" కడిగేసుకుంటూ, 'మతితప్పిన అరుపులు' శ్రుతులను ఛేదిస్తున్నా రోజూ ఒకగీతం తప్పకుండా సృష్టించే శీలం ఆ కలానిది. అది గతానికి 'శిలావిగ్రహం' నిర్మించి మరో నూతనచైతన్యంతో ఉదయిస్తుంది.

నారాయణరెడ్డి నమ్మకమంతా కృషిలోనే. ఆతడు విధినీ నిధినీ విశ్వ సించడు. సామాజికశ్రేయస్సు ఆతని ధ్యేయం. ప్రతివ్యక్తి చైతన్యంతో మంచికై కదలాలని ఆతని ఆశయం. జనం ఆతని 'జెండా'. జాగృతి ఆతని 'ఎజెండా', 'కత్తుల ఒత్తిడి'పై 'సంఘద్రోహుల తొక్కిడి'పై విజయాన్ని సాధించాలనీ, నీతికి నిలబడాలనీ, నిజాన్ని నిలబెట్టాలనీ, 'చైతన్యాన్ని కప్పే మంచు' చచ్చిపోవాలనీ, 'రక్తాన్ని రగిల్చే మించు' పుట్టిరావాలనీ ఈ కవి ప్రగాఢంగా అభిలషిస్తాడు. నడక ఒకరిది కులుకు మరొకరిది కావటం ఈతనికి ఇష్టముండదు. చీకట్లకు బలిమిపెరిగిపోతుంటే తన 'హృదయచ్ఛవి'తో ఆ చీకట్లను అడ్డుకుని వెలుగులను గెలిపించే కాంతికాముకుడు ఈ కవి. ఆతడు మంచికి చంద్రిక. చెడుకు చండిక. 'ఏసాగరాలనైనా' తనలో

అదుముకునే విశాలహృదయం ఈ కవిది. ఆతడు నిలిస్తే 'బడబానలం,' చలిస్తే 'మలయానిలం'.

నారాయణరెడ్డి మహాకవియే కాదు మహామేధావికూడా. చీకట్లో నీడను చూడగల ప్రతిభానేత్రం ఆతనిది. "వేషమేమొ వెన్నెలదీ — వెలుతురేమో సూర్యునిది" అని గ్రహించిన లోకజ్ఞుడు. ఆతనిలో వాల్మీకీ వ్యాసుడూ ఉభయులూ అగుపిస్తారు. ఆతని మనస్సు వాల్మీకి; ఆతని శిరస్సు వ్యాసర్షి. అందుకే ఆతడు విశ్వవిజ్ఞానాన్ని కవితాత్మకంగా ప్రకటించగలుగుతున్నాడు. ఆతని ఊహలూ భావాలూ అమృతంలా ఆత్మీయంగాఉంటున్నాయి అందరికీ. ఆతని గళం పలికినా కలం కదిలినా శబ్దాలు నృత్యం చేస్తాయి. అతడే శబ్దం, శబ్దమే ఆతడు అన్నా అత్యుక్తి కాదు.

నారాయణరెడ్డి సులభములైన సుందరములైన పదాలనే ప్రయోగిస్తాడు. వాటిని కలిపేతీరులో చమత్కారాన్ని సాధిస్తాడు. భావాన్ని మాత్రం ధ్వని సుందరంగా ప్రకటిస్తాడు. ఇది సాధారణంగా నారాయణరెడ్డి కవితాలక్షణం. పైకి కనిపించే ఆతని ఆ పదాల సౌలభ్యం దాటి, ఆ గ్రథనచమత్కారం దాటి లోపలికి వెళ్ళితే మనోజ్ఞమైన భావాలు గోచరిస్తాయి. శబ్దాన్ని దాటి భావాన్ని చేరాలంటే పాఠకులు సారమతులై ధ్వనిరహస్యజ్ఞులై ఉండక తప్పదు. చదివినవెంటనే కవిత్వం ప్రసన్నంగా అర్థం కావాలి. వెంటనే అందలి మూల భావం స్పష్టం కావాలి అనే నిర్దేశ సూత్రాలతో నారాయణరెడ్డి ఏకీభవించడు. అందుకు నిదర్శనం ఈ కావ్యం. ఒక కవితాఖండిక అందించే సందేశం మొత్తం మీద ధ్వనిగా ఉండాలనిఆశించే నారాయణరెడ్డి, మరింత లోతుల్లోకివెళ్లి కవితలోని ప్రతిపంక్తీ పంక్తిలోని ప్రతిశబ్దం ధ్వనిమంతంగా ఉండాలని ఆకాంక్షిస్తున్నాడు. ఆతని ఈ ఆకాంక్ష, భావపరిణామం ఈ కావ్యంలోని ప్రతిఖండికలో ప్రతిఫలిస్తున్నది. అందుకే 'మథనం' కావ్యం చదివే సహృదయులు భావామృతగ్రహణం కోసం మథనపడక తప్పదు. ఒక్కొక్క చరణాన్ని రెండు మూడుసార్లు చదువుతూ దానిని మననం చేయక తప్పదు. ఆ మననం ద్వారా జ్వలనమూ తప్పదు. జ్వలనంలో మునిగిపోకుండా ఉద్గమిస్తే కవి ప్రకటించిన సుందరభావోర్మిలనాన్ని అందుకుంటారు. ఇలా ఈ కావ్యం అడుగడుగునా నుడుగునుడుగునా

సహృదయ పాఠకులను ఆపుతుంది: ఆలోచింపజేస్తుంది. ఆలోచనామృతం సాహిత్యం అన్నసూక్తిని అన్వర్థం చేస్తుంది.

నారాయణరెడ్డి వచనకవిత్వంలో వైవిధ్యం పురివిప్పిన నెమలిలా భాసిస్తుంది. దీనివలన పాఠకులకు విసుగురాదు. ఆతని ఒక్కొక్క కవిత ఎత్తుగడ ఒక్కొక్కతీరు. ఉదాహరణకు ఈ కావ్యంలో 'జ్వలనం'లోని పన్నెండవ కవిత అపూర్వంగా ఉంది. ఇందలికొన్ని పంక్తులు ఇలా ఉన్నాయి—

"రక్తం బిందువులా
రాలితే తమస్సు
రగిలితే ఉషస్సు

రక్తి ఇందువులా
ఫలిస్తే చంద్రిక
జ్వలిస్తే చండిక"

సూక్తిప్రాయంగా కవితాత్మకంగా ఉన్న ఈ బిందువుల్లాంటి పంక్తులను సింధువంత వ్యాఖ్యానించవచ్చు. కవిత సంక్షిప్తంగా శక్తిమంతంగా ఉండాలన్న నారాయణరెడ్డి హృదయానికి ఇది ఆదర్శం. ఈ చిన్న పంక్తికలనూ అవి ప్రసరించే శక్తినీ చూస్తే 'క్యాప్స్యూల్', 'బుల్లెట్', 'బాంబూ బాకూ' జ్ఞాపకానికి వస్తాయి.

అనుప్రాసాభిలాషను వదలలేకున్నాడు నారాయణరెడ్డి అనీ, ముఖ్యంగా ఆతడు శబ్దాలంకారాలకు నిర్హేతుకమైనప్రాముఖ్యాన్ని కలిగిస్తుంటాడనీ, ఆతని కవిత జనప్రియం కావడానికి ఇదికూడా ఒక కారణమనీ కొందరు అనుకుంటూ ఉంటుంటారు. కేవలం శాబ్దికమైన అలంకృతి కవితకు అందాన్ని తెచ్చిపెట్టదు. కవితకు ఉత్తమత్వాన్ని ఆపాదించదు. శబ్దాలంకారాలు ప్రాయికంగా శ్రవణపర్వసంధాయకాలు. కానీ సిద్ధహస్తుడైన కవి శబ్దాలంకారాలను శ్రవణపేయతకోసం ప్రయోగించి రమణీయార్థ ప్రతిపాదనలో మాత్రం వ్యంగ్యాన్ని ఆశ్రయిస్తాడు. నారాయణరెడ్డి అనుప్రాసలవెనక ఈ రహస్యం ఉంది. 'చంద్రిక' - 'చండిక' అనడం ఎంత వినసొంపుగా ఉందో అంత

అర్థ గాంభీర్యాన్ని గర్భీకరించుకుని ఉంది. శబ్దార్థాలు కవితారంగంలో నిర్వహించే పాత్రను తలస్పర్శిగా అర్థంచేసుకోలేని జాతి ఒకటి పాఠకుల్లోఉంది. ఆ జాతికి నారాయణరెడ్డి శబ్దమే వినిపిస్తుంది; అర్థం అవగతంకాదు. అంటే వాళ్ళకు ఉన్నవి చెవులేకాని అంతస్సు లేదని అర్థం. అందమైన శబ్దాల కట్టడాలను కూల్చివేస్తే ఏమీ మిగలదు. అందుకే శబ్దాలంకారాలను అంటే— అనుప్రాసాదులను వాడే కవులస్థాయి అంత ఉన్నతమైనది కాదనీ నాటికీ నేటికీ సాహిత్యవివేచకుల అభిప్రాయం. నేటి తెలుగు కవితాలోకంలో అందమైన శబ్దాలను అందిస్తూనే అంతకంటె గభీరమైన అర్థాన్ని ప్రతిపాదించగల శబ్దయోజనారహస్యాన్ని తెలిసినవాడు నా ఎరుకలో నారాయణరెడ్డి ఒకడే. 1950కి పూర్వం కలం పట్టిన కొందరు ఆధునికకవులలో నారాయణరెడ్డి వంటివారు లేకపోలేదు.

పైన పేర్కొన్నటువంటి చిన్న పంక్తులు కొన్ని కలిస్తే 'మినీకవిత' అవుతుంది. మినీకవిత అంటే గోరంత కవిత ద్వారా కొండంత అర్థాన్ని ప్రసరించటం. ఇట్టి మినీకవితలు ఈ కావ్యంలో ఉన్నాయి. అవి వైవిధ్యాన్ని పులుముకున్నాయి. తార్కాణానికి కొన్ని. ఈ కావ్యంలోని రెండవభాగం— 'జ్వలనం'లోని పదమూడవ కవితలో ఉన్నవి కేవలం ఎనిమిది పంక్తికలే. పన్నెండవ కవితలో తొమ్మిది పంక్తికలే. అలాగే నాలుగవ భాగం 'ఉన్మీలనం'లోని పదిహేనవఖండికలో ఉన్నవి కేవలం పది పంక్తులే. ఐతేనేం ! అవి అణుశక్తిని గర్భీకరించుకున్నాయి.

ఈ కావ్యంలోని చాలా ఖండికలు ప్రతీకాత్మకంగా సాగినాయి. తాను చెప్పదలచుకున్న భావాలను ప్రతీకలద్వారా ధ్వనిరమ్యంగా ప్రకటిస్తాడు నారాయణరెడ్డి. ఈ కావ్యంనిండా ప్రతీకలే. ముఖ్యంగా మూడవ భాగం 'ఉద్గమనం'లోని కవితలన్నీ దాదాపుగా ప్రతీకాత్మకాలే. ఈ ప్రతీకలవల్ల సాధారణీకరణశక్తి ఏర్పడుతుంది. తద్వారా కవితకు విశ్వజనీనత సిద్ధిస్తుంది. ఉదాహరణకు కొన్ని— 'మననం'లో ఏడవకవితలోని చీకటి - అజ్ఞానానికీ పేదరికానికీ ప్రతీక. రాళ్లూ రప్పలు - శ్రామికులకు సంకేతం. కొరడా. అధికారానికి ప్రతీక. 'జ్వలనం' మొదటి కవితలోని రాజ్యం-ప్రభుత్వానికీ, రక్తం—నక్సలైట్ ఉద్యమానికి అంకితమైన యువక్రోధశక్తికీ ప్రతీకలు.

'జ్వలనం' ఆరవ కవితలోని ఫర్మానా-నిరంకుశ ప్రభువుకు సంకేతం. 'జ్వలనం' పన్నెండవ ఖండికలోని తమస్సు తిరోగతికీ నిరాశకూ; ఉషస్సు-ప్రగతికీ ప్రతీకలు. 'జ్వలనం'లో పదమూడవ కవితలోని-తేనెటీగలు—శ్రామికులకూ పేదలకూ, తేనెతెట్టె—దాచుకున్న ధనానికీ సంపాదించిన సిరికీ, రాయి-మానవునికీ, గుళ్లోని గుండ్రాయి-దేవునికీ ప్రతీకలు. 'ఉద్గమనం'లో రెండవకవితలోని కడ్డీవెల్తురు—సుఖియైన ధనవంతునికీ, రెక్కల పురుగులు-పేదరికంతో బాధపడుతూ విధిలేక ధనవంతులపై దాడిజరిపే విప్లవశక్తులకూ సంకేతాలు. 'ఉద్గమనం'లో మూడవ కవితలోని గేదెలూ-గోవులూ-చెప్పినట్టు వినే ఉపయోగకారులైన అమాయికులకూ, తుఫానులు-బలవంతులైన స్వేచ్ఛాపరులకూ ప్రతీకలు. 'ఉద్గమనం' ఆరవకవితలోని మృగాలు-దుష్ట పురుషులకు సంకేతం. 'ఉద్గమనం' తొమ్మిదవ కవితలోని పలుచనినాలుకలు ఎదిరించి మాట్లాడలేని శక్తిహీనులకూ, చలిచీమలు-సామాన్య ప్రజలకూ, బుసకొట్టేదర్పం-క్రూరదుష్ట ప్రభువుకూ ప్రతీకలు. 'ఉద్గమనం' పదవకవిత లోని పిడుగులు—విప్లవశక్తికి సంకేతం. 'ఉన్మీలనం, ఏడవకవితలోని గంగ డోళ్ళు-వ్యక్తిత్వంలేని ప్రజలకూ, మేకమెడచళ్లు-నిరుపయోగులైన జనులకూ సంకేతాలు. 'ఉన్మీలనం'లో పన్నెండవ కవితలోని కాహళ-విప్లవకవికీ, కోయిల-ప్రసన్న శృంగార కవికీ ప్రతీకలు.

ఈ కావ్యంలోని కొన్ని కవితలను కథాకథనశైలిలో సాగించినాడు. నారాయణరెడ్డి. 'మననం'లోని పన్నెండవకవిత, 'జ్వలనం'లో మూడవ ఆరవ కవితలూ, 'ఉద్గమనం'లో మూడవ కవిత అందుకు నిదర్శనములు.

కొన్ని ఖండికలను నారాయణరెడ్డి కొసమెరుపు విసురులతో ముగించినాడు. ఈ కొస మెరుపువల్ల కవిత ఆత్మను నింపుకుని తొణికిసలాడుతుంది. సహృదయుడు ఉత్కంఠతతో తనవైపు సాగేలా ఆకర్షిస్తుంది ఈ కొస మెరుపు. ఈ కావ్యంలో 'మననం' లోని పన్నెండవ, 'జ్వలనం'లోని పదునాలుగవ, 'ఉన్మీలనం'లోని పదమూడవ ఖండికలు కొసమెరుపులతో మిసమిసలాడుతున్నాయి. ఉదాహరణానికి 'ఉన్మీలనం'లోని కొసమెరుపు చూడండి-ఎలామెరుస్తుందో!

| | |
|---|---|
| "విత్తనం | జననం |
| మొలక | బాల్యం |

మొగ్గ | కౌమారం
పువ్వు | యవ్వనం
పండు | వార్ధక్యం
వట్టిమోడు | వల్లకాడు"-

ఈ పంక్తులలో చివరి పంక్తిని చదివేసరికి ముసిముసినవ్వు వస్తుంది కొస మెరుపును చూసినందువల్ల. ఈ కొసమెరుపు అంత్యప్రాసతో మిలమిలలాడుతున్నది. కవిగా పైపంక్తులను వ్రాసిన నారాయణరెడ్డియే

"ఇంతేనా నాయనా
మానైనా మనిషైనా"

అంటూ తత్త్వాన్ని వివరించినాడు చివరకు వ్యాఖ్యాతగా.

ప్రతీకాత్మకతా కథాకథనధోరణీ కొసమెరుపూ మూడూ త్రివేణిలా సంగమించిన కవితాప్రయోగ ఈ కావ్యభాగం-'మననం'లోని పన్నెండవ ఖండిక. ఒక సత్కవి శాశ్వతంగా కన్నుమూస్తే ప్రజలూ ప్రకృతీ సమస్తం పసిపాపలా ఎలా ఏడుస్తుందో రమణీయంగా వర్ణించినాడు. ఇలా చెప్పడం అనితరసాధ్యం.

భావప్రకటనానూత్నతకూ భావగాంభీర్యానికీ ధ్వనివైభవానికీ ఈక్రింది పంక్తులను స్థాలీపులాక న్యాయంగా చూడవచ్చు.

"లోతులను ముట్టే ఆలోకనం నీకుంటె
కన్నీటి బొట్టులో కడలివున్నది చూడు"

అణువులోనే బ్రహ్మాండం ఇమిడివుందనీ, మహాకార్యసాధనోత్సుకులైన వాళ్ళు చిన్న చిన్న వాటిని నిర్లక్ష్యం చేయరాదనీ ఈ పంక్తులలో నారాయణరెడ్డి ధ్వనింపజేసినాడు. పొడిపొడిమాటల్లో కడలి అంతటి అర్థాన్ని పొదిగినాడు.

"దైవమేదన్న 'సోదా' గుణం నీకుంటె
నాస్తికుని వాక్కులో నక్కివున్నది చూడు"

రెండవపంక్తి వక్రోక్తిని పుక్కిలిస్తున్నది. ఆస్తికునికన్న మిన్నగా నాస్తికుడే విరోధభావంతో దైవాన్నిగూర్చి చర్చిస్తాడనీ దైవం లేదని వాదిస్తాడనీ

అందుకే ఆతని నాల్కపై దైవం అన్నమాట ఎప్పుడూ నక్కి ఉంటుందని చెప్పి చమత్కారాన్ని సాధించినాడు కవి. చమత్కారత్వం కావ్యత్వం కదా!

"గమ్యమేదన్న జిజ్ఞాసయే నీకుంటె
ప్రతి మైలురాయిపై వ్రాసి వున్నదిచూడు"

మైలురాయి ప్రయాణించిన దూరాన్ని తెలుపుతుంది. దానిని చూస్తే ఇంకా ప్రయాణించవలసిన గమ్యం తెలుస్తుంది. గతమెంతో ఎలా ఉందో కనుక్కున్నవాడికి భవిష్యత్తు ఎంతదూరం ఉందో ఎలా ఉంటుందో తెలియక పోదన్న సత్యాన్ని పై పంక్తులు సంక్షిప్తగంభీరంగా ప్రకటిస్తున్నాయి;

"బ్రతుకులను చదివే నిశితబుద్ధి నీకుంటె
గుండెగుండెకు కత్తికోత వున్నది చూడు"

ప్రతి మనిషి జీవితం ఒక చరిత్రే అనీ, ప్రతివాడికీ కష్టాలూ కన్నీళ్లూ ఉన్నాయన్న భావాన్ని సూటిగా కత్తిపదునులా చెప్పినాడు. లోతైన భావాన్ని చిన్న పదాలలో కుదించటం ప్రౌఢి. ఇట్టి ప్రౌఢి అనంతంగా గలవాడు నారాయణ రెడ్డి.

"కళ్యాణీ! నీ వయసెంత
కాలమంత—
కానీ- ఎప్పటికప్పుడే చిగురంత"

కవిత్వం ఎంత సనాతనమో అంత వినూతనం. అది కళ్యాణాత్మకం. అనుదినమూ అది చిగురిస్తూనేఉంటుంది. దానికి శిశిరంలేదు. అది నిత్యవసంతం అన్న సత్యాన్ని మూడు చిన్న పంక్తుల్లో ముచ్చటగా ప్రకటించినాడు కవి. 'చిగురంత' మాటలో 'జగమంత' అర్థాన్ని పొదిగినాడు.

"అనిపిస్తుంది ఆకాశానికప్పుడు
చప్పున భూమ్మీదికి దూకి
చచ్చిపోవాలని.
దూకేస్తుంది పాపం తెగించి
సముద్రాల మీద సరస్సుల మీద;
నూతుల్లోనూ బురద గోతుల్లోనూ;

కాలం కలిసొస్తే అందగత్తెల
కళ్ళల్లోనూ
ఏం ఖర్మో ! ఆకాశం
ఎంతకూ చావదు"

సూర్యుడూ చంద్రుడూ చుక్కలూ మబ్బులూ మెరపులూ అన్నీ ఆకాశంలోనే కదా ఉండేవి. ఆకాశం చచ్చిపోవాలనుకున్నప్పుడు మేఘంగా మారి సముద్రాలపై సరస్సులపై నూతుల్లో గోతుల్లో దూకుతుంది- అంటే కురుస్తుంది. లేదా అందగత్తెల కళ్ళల్లోనూ దూకుతుంది- అంటే ఆడవాళ్ళ కళ్ళు నీలి మబ్బుల్లా ఉంటాయికదా ! కాలం కలిసొస్తే అన్నందువల్ల మరొక అర్థం కూడా స్ఫురిస్తుంది. ఆకాశం మెరుపుగామారి సుందరుల కళ్లల్లో దూకుతుంది. లేదా వర్షర్తువు తరువాత శారదచంద్రికయై వాళ్ల కళ్లల్లో దూకుతుందేమో ! అందగత్తెల చూపులు వెన్నెలచూపులు కదా ! కాలం కలిసొస్తే - అంటే ఆకాశానికి అదృష్టం పడితే అనికూడా చెప్పవచ్చు. అసలు 'ఆకాశం దూకేస్తుంది' 'ఆకాశం ఎంతకూ చావదు' అని చెప్పడమే అపూర్వం. ఒక చమత్కారం.

"రాజ్యం హింసమరిగిన చోట
రక్తం ఎదురుతిరిగిన చోట
ఇక్కడ
ఈ అడవిలో రగిలే పదముద్రలు
ఎవరి సంతకాలో"

ఈ పంక్తులు నేటి నక్సలైట్ ఉద్యమాన్ని స్ఫురింపజేస్తున్నాయి. ఇందులో రాజ్యం ప్రభుత్వానికి, రక్తం- నక్సలైట్ ఉద్యమానికంకితమైన యువక్రోధ శక్తికీ ప్రతీకలు. అడవిలోని నక్సలైట్ల అడుగుజాడలను సంతకాలనడం ఊహారమ్యం. అడవి అంతా కాగితమని ఇందువల్ల ధ్వనిస్తుంది.

"ఊపిరి పోసుకుంటుంది
దీపావళి ఏటేటా
కనుగుడ్లను కాంక్షల్లా వెలిగిస్తూ
బ్రాహ్మీలిపిలో బితుకుతున్న

మట్టి ప్రమిదలను
ప్రహరీ గోడలమీద పాతేసి"

దీపావళిని వర్ణించే ఈ పంక్తుల్లోని 'బ్రాహ్మీలిపి', 'మట్టిప్రమిద' 'ప్రహరీ గోడల' అన్న మాటలు మూడూ ప్రాచీనతను ధ్వనింపజేస్తున్నవి. 'బ్రాహ్మీ లిపి' ప్రాచీన అశోకుని శాసనకాలాన్ని తెలుపుతున్నది. 'మట్టిప్రమిద' లోని మట్టి శబ్దం సంప్రదాయాన్నీ సనాతనత్వాన్నీ ప్రసరిస్తున్నది. 'ప్రహరీ గోడలు' ప్రాచీనకాలంలోని గుడులకూ కోటలకూ ఉండే ఎత్తైన ప్రాకారాలను కళ్ళముందు నిల్పుతున్నాయి. 'పాతేసి' అనడంవల్ల కూడా పాతకాలమే నిన దిస్తున్నది. ఈ మూడింటిని ఒకచోట కలుపడంలో నారాయణరెడ్డి పాండితీ ఔచితీ వ్యక్తమవుతున్నాయి.

అర్ధరాత్రి మేల్కొని చూసుకుంటే చుక్కలకు తమ ఒంటిమీద గుడ్డ ల్లేవట. ఎవరెత్తుకుపోయినారో అని ఆ చుక్కమ్మలు కలవరపడుతుంటే కవి వాళ్లతో చెపుతాడు ఇలా—

"అవతరించాయి మీ వలువలు
ఆత్మహత్య చేసుకుని;
ఆకాశాన్ని పొదుగుకునే మబ్బులుగా
అర్థానికి పాలిచ్చే మాటలుగా
చిరునవ్వుకు లాలపోసే పెదవులుగా
కన్నీటికి జోలపాడే కనురెప్పలుగా"

ఇందులో చుక్కమ్మల్లాంటివి- ఆకాశం, అర్థం, చిరునవ్వు, కన్నీళ్ళు. వాటి వలువల్లాంటివి- మబ్బులు, మాటలు, పెదవులు, కనురెప్పలు. చుక్కలను వలువలు ఆచ్ఛాదించినట్లు ఆకాశాన్ని మబ్బులూ, అర్థాన్ని మాటలూ, చిరు నవ్వును పెదవులూ, కన్నీళ్ళను కనురెప్పలూ ఆచ్ఛాదించి ఉంటాయి. ఇలా క్రమంగా కలపడంలో కవిప్రౌఢి ప్రకటితమవుతున్నది. అంతేకాదు. చుక్కలను 'చుక్కమ్మ' లన్నాడు. అవి అమ్మలు కదా ! అందుకే వెంటనే క్రమంగా 'పొదుగుకునే' 'పాలిచ్చే' లాలపోసే, జోలపాడే అన్న క్రియ లను ప్రయోగించి చంటి పిల్లలను హత్తుకుని పాలిచ్చి లాలపోసి జోలపాడే అమ్మను బొమ్మ కట్టించినాడు. ఇలా చమత్కారంగా చెప్పడం ఆనాడు చేమ

కూర వేంకటకవికే సాధ్యమైంది. ఈనాడు నారాయణరెడ్డికే సాధ్యమైనది. ఈ కవితలో మరో చమత్కారమేమిటంటే—

"అర్థం చేసుకున్న ఆ చుక్కల
ఆత్మ మెరిసిందీ
గగనమంత నగ్నంగా
కాలమంత నవ్యంగా"

అని కొసమెరుపు విసరడం. చుక్కమ్మలకు వలువలు లేవు. అచ్ఛాదనం లేదు. అనగా శరీరాలులేవు. కనుకనే వాటి 'ఆత్మమెరిసింది', ఎలా? గగనమంత నగ్నంగా, కాలమంత నవ్యంగా, ఇలా కవితలో ప్రతిపదాన్ని తూచి తూచి సార్థకంగా వాడడం పండితకవికే సాధ్యం.

మనకు కనిపించే మామూలు వస్తువులను కూడా చమత్కారంగా వర్ణిస్తాడు నారాయణరెడ్డి. ఆతని వర్ణనాశక్తి అపూర్వం. ఆశ్చర్యకరం, ఉదాహరణకు కొన్ని-

కొండనూ గుండెనూ రెండు రెండు పంక్తుల్లో ఎలా వర్ణించినాడో చూడండి—

అటు కొండ-ఆ కొండ
కాలం పాతేసిన పిచ్చిస్తంభం
ఇటు గుండె—ఈ గుండె
రూపం తాగేసిన పచ్చిఅద్దం"

కొండను కాలం పాతేసిన స్తంభమనీ. అది ఎందుకు పాతబడిండో తెలియదనీ అది అంత ప్రాచీనమనీ ధ్వని. ఇక ఈ గుండె పచ్చిఅద్దమట. గుండె అద్దంలాంటిదని వర్ణించడం ఇదివరకు ఉన్నదే. కాని ఇక్కడ పచ్చి అద్దమన్నాడు. ఎందుకు? ఈ అద్దం రూపాన్ని తనలో ప్రతిబింబించేదికాదు. రూపాన్నే తాగేసిన అద్దమట. తాగిన అద్దం పచ్చి అద్దమేగా! రసమయమైన గుండెను తాగే అద్దానికి కూడా రసత్వాన్ని పులిమినాడు నారాయణరెడ్డి. 'రూపం తాగేసిన' అని అతడే అనగలిగినాడు. భావప్రకటనంలో నవ్యతను సాధించినాడు.

నల్లటిరాత్రి "తుడవని గుడ్డి అద్దంలా" ఉన్నదట. నినాదాలున్న గోడలను ఈ కవి వర్ణించిన తీరు సంక్షిప్తసుందరం-

"ఈ గోడలు
నిన్న ఉత్తబోసి మెడలు
నేడు నినాదాల నగలు"

ఈ నినాదాల గోడలు రోడుకిరువైపులా మనం అనుదినం అనుక్షణం చూసేవే. కవిచూపులకు అవి కాంతలుగా కనిపించినాయి.

టెలిఫోన్ ఇండెక్స్-

"హలో'లహాలాహలాన్ని
అన్ని పుటల్లో నొక్కుకున్న"దట.

హాలాహలాన్ని శివుడు కేవలం గళంలోనే నొక్కుకుంటే ఇండెక్స్ శరీరమంతటా నొక్కుకున్నదట.

భగవద్గీత-

" 'చావు'లనూ 'చంపు'లనూ
సకర్మకంగా"

వ్యాఖ్యానిస్తుందట. ఇలా భగవద్గీత తత్త్వాన్ని రెండు పంక్తుల్లో అత్యాధునికంగా చమత్కారంగా చెప్పడం ప్రతిభావంతుడైన ఈ కవికే సాధ్యమైనది. 'సకర్మకంగా' అనడంలో ఆతని వైదుష్యం వ్యక్తమవుతున్నది. ఒకవైపు కర్మయోగం మరోవైపు వ్యాకరణం 'సకర్మక' శబ్దంలోంచి తొంగిచూస్తున్నాయి.

సమకాలికసామాజికస్థితిగతులను ధ్వనిబలంతో చిత్రించినాడు నారాయణరెడ్డి ఈ కావ్యంలో-కొన్ని ఖండికల్లో. 'గంగడోళ్ళ' వంటి 'మేకమెడచళ్ళ' వంటి వ్యక్తులు ఈసమాజంలో ఉన్నారనీ, ఉరిమే తుపాకియే ఈనాడు సర్వోదయం పలుకుతున్నదనీ, గతంలో మహోజ్జ్వలంగా బ్రతికి కీర్తివి సంపాదించిన కొందరు నేడు దీనంగా కాలం గడుపుతున్నారనీ, అసత్యనాయకులు ఎన్నికల వాగ్దానాలు మరిచిపోతున్నారనీ, ఏ ఉద్యమాని

కైనా బస్సులే దగ్ధమవుతున్నాయనీ అన్నాడు. 'మద్యంలో తేలిన అరుపులు' అన్నమాటలద్వారా సంఘంలోని త్రాగుబోతులనూ, "నాలుగుమృగాలవిక్రీడలో నలిగింది ఒకఒళ్ళు" అనే పంక్తుల్లో సామూహికంగా పురుషులు జరిపే స్త్రీల మానభంగాలను ధ్వనింపజేసినాడు. నక్సలైట్ ఉద్యమం కూడా కొన్ని ఖండికల్లో చోటు చేసుకున్నది.

నారాయణరెడ్డి కేవలం సమాజదుఃస్థితి చిత్రణతో సంతృప్తిపడక సామాజికసుస్థితికై మానవప్రగతికై పరిష్కారాలు సూచిస్తూ ప్రబోధిస్తాడు. ఆతని కవితాఖండికల్లో ఈ ప్రబోధగుణం పరచుకొని ఉంటుంది. అయితే ఈ ప్రబోధం కేవలనినాదాలతో సాగదు. అది ప్రతీకాత్మకంగా పరమ రమణీయంగా ఉంటుంది. "అలగాజనమని నిరుపేదలగని చులకన" చేయ వద్దనీ - "నీటిగుండెలల్లాడిపోయెనా నిప్పుల వెల్లువ పుడుతుం"దనీ, కళా కారుడు కళంతా తన సొమ్మంటూ అహంకరించవద్దనీ, పరవశిస్తే "ప్రతి అడుగులో భరతనాట్యమే" ప్రభవిస్తుందనీ, యజమానులు కార్మికవర్గాన్ని అవమానించ కూడదనీ, "రాయీ రాయీ ఒరుసుకుంటె ఉగ్రజ్వాలాకృతి" ఉదయిస్తుందనీ, బలం అధికారం ఉందని మిడిసిపడుతూ పాలకులు దీనులను పీడించవద్దనీ 'ప్రతి స్తంభంలో నరసింహాకృతి' ప్రభవిస్తుందనీ, అణగిన ప్రతిభను తృణీకరించవద్దనీ, నమ్రంగా సాగే శక్తిమంతులను పరిహసించ కూడదనీ, "చల్లగ సాగే మూగకాళ్ళకూ సంకెళ్లు" వేస్తే "పల్లెపల్లెకూ ఒక నక్సల్‌బరి" పుడుతుందనీ హెచ్చరించినాడు- నారాయణరెడ్డి. క్రూర నిరం కుశులు ప్రకృతిలాంటి స్వేచ్ఛను బంధించలేరనీ, అధికారం తుఫానులను అరికట్టలేదనీ, అనేకులు పంచుకోవలసిన ఆస్తిని ఒక్కడనుభవించడం తగ దనీ, అందుకే నక్సలైట్ ఉద్యమం తలెత్తిందనీ, అందువల్ల ఈనాడు ఆర్థికసమానత్వాన్ని సాధించాలనీ, ఎడారులను ఇసుకపంజరాలనుంచి విముక్తిచేసి వాటిని పంటపొలాలుగా మార్చాలనీ ప్రబోధించినాడు ఈకవి. ఈనాడు చలిచీమల సమైక్యశక్తి ప్రజల్లోరావాలనీ, నిరుపేదలూ బలహీనులూ ఉద్యమాలను నిర్వహిస్తే సత్కవులు వాటిని బలపరచాలనీ, కవికోకిలలు 'సత్యంలాంటి శ్రుతి'లో పలుకాలనీ ఈకవి వాంఛిస్తాడు.

నారాయణరెడ్డి ఆదినుంచీ ఆశావాదియే. నేడు నీరసంగా నిట్టూర్పులు విడుస్తూనే రేపటికి సుడిగాడ్పులను సిద్ధం చేసుకుంటుంటాడు. 'మృతిలేని ఆశకు శ్రుతి' చేస్తుంటాడు ఆతడు.

"ఓపిక వుంటే ప్రతి ఎడారిలో ఒక గంగాఝురి పుడుతుంది"

"పంచమస్వరం ఎగురుతుంది
పక్షి పాడని ఈ కోనలో
చైత్రరాత్రి రగులుతుంది
సంకీర్ణపత్రాల వానలో"

వంటి పంక్తులు ఈకవి ఆశాహృదయానికి పతాకలెత్తుతున్నాయి.

'మథనం' కావ్యంలోని గేయాల ప్రత్యేకతను గూర్చి రెండుమూడు మాటలు. 'మననం'లోని కొన్ని గేయాల రచనలో అందలి భావప్రకటనా విన్యాసంలో ఉర్దూసంవిధానం ఉర్దూశైలి ఉర్దూబాణి గుబాళిస్తున్నది. ఉదాహరణకు—

"పిడికెడంత విలువుంటె
కడలియంత ఆమోదం;
మంచితనం మంటల్లో
మరణించాలని వుంది"
"గుర్తింపు లేదనే ఆర్తియే నీకుంటె
గుండెలో గాయాలదండ వున్నది చూడు"
"సాగిన నడకెంత ? తీగ
సాగిన వెలుగెంత ? అరే !
మలిపొద్దును కాస్త ఆగ
మంటూనే వున్నాను"—

వంటివాటిని చూడవచ్చు. ఈ కావ్యంలోని 'మననం' ఏడవ ఖండికలోని గేయాలలో ఒక శిల్పం కనపడుతుంది. అదేమిటంటే ఫలానాపని చేయవద్దని మొదటి పంక్తిలో పొడిపొడిగానే చెపుతూ, అలాచేస్తే ఏం జరుగుతుందో రెండవ పంక్తిలో ఉదాహరణరమ్యంగా హెచ్చరించడం. తార్కాణానికి— ఒకటిరెండు.

"సిరిఅన్నది నీ నుదుటే వుందని మురిసిపడతావు ఎందుకని
అవకాశముంటె ప్రతి నీటిచుక్క ఆణిముత్యమై పుడుతుంది"
"శిరసు వంచుకొని తరలే శక్తిని పరిహసిస్తావు ఎందుకని
ఉరిమిచూసెనా గోవు గొంతులో ఒక హర్యక్షం పుడుతుంది"

గేయపాదాన్ని విరిచి రెండు చేసి అది వచన కవిత్వమా అని భ్రమింపజేయడం కనిపిస్తుంది కొన్ని గేయాలలో. నిదర్శనానికి –

"ఎందుకని
ఇన్నిన్ని ముత్యాలు తెచ్చావు
దొరకలేదా ఒక్క కన్నీటిచుక్క"

'ఎందుకని' అన్నమాటలు రెండవ చరణంలోనివే నిజానికి. కాని వాటిని మొదటి పంక్తిగా చేసి వ్యావహారధోరణిలో వచనసంభాషణేమో అన్నట్లు కూర్చినాడు నారాయణరెడ్డి.

నారాయణరెడ్డి ప్రయోగించే అలంకారాలలో ఉపమాలంకారం, క్రమాలంకారం రూపకాలంకారం అధికం. రాశిలోనే కాదు రమ్యతలోనూ. ఆతడు ప్రయోగించే ఉపమాలంకారాలు అపూర్వములై ఔచితీమంతములై భాసిస్తూ కవితను భూషిస్తాయి. సందర్భాన్ని పోషిస్తాయి.

"....................నిల్చున్నాను
కళ్ళు తెరుచుకొని :
తూర్పులా- నక్షత్రాల ని
ట్టూర్పులా-
తెలుసు నాకు:
పొద్దులా నువ్వు
పొడుచుకొస్తానని-
........................
ఆగమంటావా అందాకా?
మూగలా; పొగమంచుతీగలా
నన్ను నేను పోగొట్టుకుంటూ
నాదంలా ఆత్మను చుట్టుకుంటూ."

పొద్దులా పొడుచుకొచ్చేవ్యక్తి కోసం నిరీక్షణం. కాబట్టి 'తూర్పులా' 'నక్షత్రాల నిట్టూర్పులా', 'పొగమంచుతీగలా' అన్న ఉపమానాలన్నీ ఉదయ కాలోచితాలే. 'నాదంలా ఆత్మను చుట్టుకుంటూ' అనే పంక్తిలోని ఉప మానంలో గభీరతా ప్రౌఢీ గోచరిస్తాయి.

కవిత్వం రాయనిపేజి 'బోసిపోయివ ముత్తైదువుమెడలా' ఉందట. కాగితాన్ని కాంతమెడగా కవితను అలంకారంగా భావించటం ఎంత బాగుందో!

"విచ్చుకున్నాయి కిటికీలూ తలుపులూ
కళ్లలా చెవుల్లా"

ఇందులో తలుపులను చెవులతో ఉపమించటం నవ్యత. అయితే ఒకచోట ఈ కవి 'కిటికీలచెవుల్ని పొడిగించి' అని కూడా అన్నాడు.

శూన్యం మూల్గుతున్నది
అరణ్యంలాగా
ధరణి కడుపులోని
హిరణ్యం లాగా"

శూన్యం 'ధరణి కడుపులోని హిరణ్యంలాగా' మూల్గుతుందనడం అపూర్వం. ఈకవి భావనాచక్షువు అంతలోతుకు వెళ్ళడం ఆశ్చర్యమే మరి!

చుక్కల ఆత్మ 'కాలమంతనవ్యంగా' మెరిసిందట. చలనశీలమైన కాలం నిత్యనూతనం కదా! ఆత్మకూడా అంతే. దానికి పాతదనం ఎక్కడిది? అందుకే ఉపమానం సహృదయరమ్యం.

ఒక కవితలో ఒకే విషయాన్ని ప్రతిపాదిస్తూ ఆవిషయాన్ని అందించ టానికి క్రమాలంకారాన్ని చివరిదాకా జాగ్రత్తగా హృదయంగమంగా నిర్వ హించటంలో నారాయణరెడ్డి సిద్ధహస్తుడు. గతఖండకావ్యాల్లో ఈ విషయాన్ని వివరించినాను. ఈ కావ్యంలో కూడా ఉదాహరణకు 'జ్వలనం'లోని ఆరవ- ఏడవ ఖండికలను దర్శించవచ్చు. ఏడవ కవిత చూడండి.

"ఇవన్నీ కట్టేసిన కాళ్లు
నడవవను కున్నావా
భ్రమ.

ఇవన్నీ కుట్టేసిన నోళ్లు
అరవవనుకున్నావా
భ్రమ.
ఇవన్నీ కప్పేసిన కళ్లు
చూడలేవనుకున్నావా
భ్రమ.
కట్లు సడలినప్పుడు
కుట్లు తెగినప్పుడు
గంతలూడినప్పుడు
ఈ కాళ్లే ఎవరెస్టులు
ఈ నోళ్లే శతఘ్నులు
ఈ కళ్లే త్రేతాగ్నులు.

ఈ పంక్తుల్లోని క్రమలంకారశోభను సహృదయులు సందర్శించవచ్చు. కవితలో స్వేచ్ఛా పారమ్యం ఎంత శక్తిమంతంగా ప్రకటీకృతమైనదో సహృదయులు ఎరుగుదురు.

ఈ కావ్యంలో-

"తొందరపడకు ఈ మౌనం
తుఫానులకు జన్మస్థానం"
"పిరికితనం సహనం కాదు
చచ్చుగుణం శాంతం కాదు"
"తూర్పును ఆర్పుతుందా చీకటి"
"మనసు మషియైనా
మనిషి ఋషియైనా
గుండె తడియైనా
కొంప గుడియైనా

-ఒక నిమిషం:

వంటి కవితాసూక్తిమౌక్తికాలెన్నో మెరుస్తున్నాయి.

ఎడారిపొదుగు, తెలుపుచీకట్లు, వెంగురులు (ముంగురులవలె) ముసలి కడలి, ఉషాశిశువు, బస్సులశవాలు· ఖర్జూరకావ్యాగానాలు, ఇసుకపంజరం,

మఖమల్ చీకటి వంటి చక్కని సమాసాలూ పదబంధాలూ ఈ కావ్యంలో చోటుచేసుకున్నాయి.

ప్రతి అంశాన్ని కవితగా మలచి చెప్పగలడు నారాయణరెడ్డి అనడానికి నిదర్శనంగా ఈ కావ్యంలోని 'జ్వలనం'లో తొమ్మిదవ పదవ కవితలూ, 'ఉన్మీలనం'లో ఎనిమిదవ, పదవ, పదిహేడవ కవితలు చూడవచ్చు. తన గదిలో టేబుల్‌పై ఉండే వస్తువులన్నీ కవితారూపాలుదాల్చి కనిపిస్తాయి ఈ కావ్యం చివరి ఖండికలో.

ఒకే భావాన్ని రకరకాలుగా కవితాసంవాసితంచేసి ప్రకటించగలడు ఈ కవి. ఉదాహరణకు—

"సాగుతాను నేను మనసు
ఝరిలా ప్రగమిస్తుంటే" ('మననం'లో 10వ ఖండిక)
"వెళ్ళిపో ఓ జీవితమా!
వెల్లువదూకే నా అడుగుల్లోంచి" ('మననం'లో 11వ ఖండిక)
"నా పరుగువేరు-ఆది
నయాగరాకు పెదబాలశిక్ష" ('మననం'లో 11వ ఖండిక)
"ఏదీ నా పరుగు?
కత్తిరించుకున్నాయా కొండవాగులు
కసి పెరిగి."

ఇలా జలపాతంలా పరుగుదీసే స్వీయచైతన్యమయ వ్యక్తిత్వాన్ని నాలుగు విధాలుగా ప్రకటించినాడు నారాయణరెడ్డి.

'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అని శ్రీనాథుడంటే 'కవిత్వం నా మాతృభాష' అన్నాడు నారాయణరెడ్డి ('ఉదయం నా హృదయం'లో). అంటే ఈతడు మాటాడేది అంతా కవిత్వమనీ, అది మాతృభాషకాబట్టి అతనికది సహజంగా అలవడిందనీ, అది మౌలికమనీ అర్థం. నారాయణరెడ్డి మాటాడుతున్నా, ఉపన్యసిస్తున్నా కవిత్వం జాలువారుతుంటుందనేది ఆతనిని విన్న సహృదయులందరూ అంగీకరించే సత్యం. తన మాతృభాషలో మామూలు మనిషి కాదు ఆతడు. మహాపండితుడు. అంటే కవితాభాషా పండితుడన్న మాట. ఆతని మాతృభాష కవిత్వమైతే, ఇక ఆ భాషలో ఆతడు

కవిత్వం వ్రాయాలనుకున్నప్పుడు ఆ కవిత్వభాష ఎలాగుంటుందో ఎంత వింతగా ఎంతరమణీయంగా ఉంటుందో ఊహించుకోవచ్చు. ఈ 'మథనం' కావ్యం చూస్తే తెలుస్తాయి ఆతని కవిత్వభాషాపాండితీమర్యాదలు. ఉదాహరణానికి కొన్ని-

"ఎవరికళ్లూ నడవని చోట
ఎవరి కాళ్లూ చూడని చోట
ఇక్కడ
ఈ బురదలో దిగిన మడమల గుర్తులు
ఎవరి సంతకాలో"

సామాన్యభాషలో అయితే, ఎవరి కళ్లూ చూడనిచోట- ఎవరి కాళ్లూ నడవని చోట అని ఉంటుంది. దీనిలో వింతలేదు. వక్రతలేదు. కళ్ళు నడవనిచోట అంటే వింతగా ఉంటుంది. కనుచూపులు ప్రసరించలేనంత దూరాన- దుర్గమ స్థలంలో అని అర్థం. 'ఎవరి కాళ్లూ చూడనిచోట'- అంటే ఎవరూ అడుగు పెట్టనిచోట అని భావం. ఇలా ఇంతగా విప్పి చెప్పకుండ ఈ అర్థాన్నంతా ఒక్కమాటలో కప్పిచెప్పడం గొప్ప. అందుకే అది కవిత్వం. కప్పిచెప్పేదే కవిత్వం కదా ! ఇక 'బురదలో దిగిన మడమల గుర్తుల'ను సంతకాలుగా భావించడం కవితాపాండిత్యం.

"స్నానం చేసింది ఒళ్ళు
మౌనంలో"

మౌనంగా ఉన్నాను అన్నది మామూలు భాష.

"ఉండేది నాకొక ఊహ
ఎండలో తడుస్తూ
చలిలో మండుతూ"

సామాన్యుల హృదయాలు ఎండలో ఎండుతాయి. చలిలో తడుస్తాయి. కాని కవి హృదయం ఎండలో తడుస్తుంది. చలిలో మండుతుంది.

ఇలాగే ఇంకా కొన్ని—

"మండే నిట్టూర్పులతో"
"పిలిచే సర్పాలున్నాయి
కరిచే పుష్పాలున్నాయి"

పైకి పువ్వుల్లా కనిపిస్తూ సమీపిస్తే పాముల్లా కరిచే పెద్దలున్నారని అర్థం.

"గాలి నోటిలో ఇరుక్కున్న
పూల ఊపిరులు"

గాలి గంధవహుడు. పూల ఊపిరులంటే పూల పరిమళాలు. 'నోటిలో ఇరుక్కున్న ఊపిరులు' అన్న మాటలచే మానవారోపణం జరిగింది. గాలి క్రూరుడనీ పూలు దీనులనీ అర్థం స్ఫురిస్తున్నది.

"కడుపు నింపుకుంటున్నది ఎడారి
ఒంటెల అడుగుల్ని జుర్రుకుంటూ"
"బుసకొట్టే నిప్పులకూ"
"ఎంత నల్లనిది ఈ పలక ?

పండు వెన్నెల్లో ఉతికేసినా
నలుపు విరిగిపోనిది.
ఏమి బీజాక్షరాలో ఇవి ?

పట్టపగటితో తుడిచేసినా
రాత్రికి పొడుచుకొస్తాయి"

ఆకాశాన్ని నల్లని పలకగానూ, చుక్కలను బీజాక్షరాలుగానూ ఊహించడం కవితాభాషా ప్రౌఢి. ఆ పలకను వెన్నెల్లో ఉతుకడం, పట్టపగటితో తుడువడం కవిత్వభాష.

"ఎండ కురుస్తున్నది ఏకధారగా
పగలు తడిసిపోయింది
పచ్చి ఆవిరిలో"

ఎండ తీవ్రంగా ఉందనడం సామాన్య భాష. ఎండ కురుస్తే పగలు తడువక ఏమవుతుంది పచ్చి ఆవిరిలో. 'పచ్చి ఆవిరి'లో ఆవిరి తీవ్రత ఇమిడి వుంది.

'పగలబడి యేడ్చింది జీవితం'. పగలబడి నవ్వడం అన్నది నల్గిన మాటే. అది వ్యవహార భాష. పగలబడి యేడ్వడం కవిత్వ భాష.

"ఆడుసులో తలంటిపోసుకున్న
గుడిసె కొప్పులు"

'కొప్పులు' అనడంవల్ల గుడిసె ప్రతిగా రూపుదిద్దుకుంది.

"ముట్టెమీద సందుల్ని మోసుకు తిరిగే
వరాహ వంశాలు"

సందుల్ని మోయడం చమత్కారం. వరాహవంశాలు- ఎంత సభ్యత చెప్పడంలో ! ఇలా ఎన్నైనా చూపించవచ్చు ఈ కావ్యంనుంచి. నారాయణరెడ్డి కవిత్వభాషలో వెలిసిన రసవత్కావ్యం ఈ 'మథనం'. ఆతని రచనలో ఈ కావ్యం ఒక మలుపు.

నారాయణరెడ్డి కవితారచన నిరంతరపరివర్తనశీలం కలది. ఒక కావ్యం మరో కావ్యంకన్న భిన్నంగానూ నవ్యంగానూ ఉంటుంది. ఈతని కవితామూర్తికి ఎండ వెన్నెల రెండూ రెండు కళ్ళుగా ఉండేవి మొదట్లో. అంటే "మంటలూ,మానవుడూ" వరకు. కాని తరువాత క్రమంగా వెలువడిన ఖండకావ్యాల్లో చంద్రికలు కనిపించవు. ఎండల చండిమలే కనిపిస్తాయి. కారణం ? సూర్యుడిలా ఉండడమే బాగుంటుందని నిశ్చయించుకున్నాడీకవి. 'అడుక్కు బతికే' చంద్రుడిలా ఉండవద్దనుకున్నాడు. ఆ మరుక్షణం ఆతని

"రెండు కళ్లూ చేతులు కలుపుకున్నాయి
ఒకేచూపుగా ఊపిరి నిలుపుకున్నాయి"

అందుకే ఇపుడు ఆతని చూపుల్లో రచనామార్గంలో కనిపించేది ప్రభాకరుని ప్రజ్వలనమే. ఈ ప్రజ్వలనం 'మెదళ్ల గంజాయిని' విదిలిస్తుంది.

కవితాజీవితంలో తాను పొందుతున్న పరివర్తనను తానే సూచిస్తుంటాడు నారాయణరెడ్డి- తన కావ్యాల్లో అక్కడక్కడ.

"ఇపుడు నేను వస్తున్నది
ఇనుడే పరిచిన మార్గం" ('ఇపుడు నేను' కవిత)

అని 'ఇంటిపేరు చైతన్యం' కావ్యంలోనూ,

"ఇచ్చే సూర్యుడిలా ఉండాలి"
"ఆవిర్భవించింది పరివర్తనం" ('ఉన్మీలనం' '5'లో)

అని ఈ కావ్యంలోనూ చెప్పినాడు. ఈ కవికి తనలో జరుగుతున్న పరివర్తనం తెలుసు. తెలిసియే వ్రాస్తున్నాడు. ఈ సందర్భంలో శ్రీ విశ్వనాథ వారి ఈ వాక్కులు జ్ఞాపకం వస్తున్నాయి,

"తెలియక వ్రాసినవాడు కవి. తెలిసి వ్రాసినవాడు మహాకవి"

నారాయణరెడ్డి తెలిసివ్రాస్తున్న కవి.

## మృత్యువునుంచి

1979లో ఆయా సందర్భాలలో వ్రాసి వివిధ పత్రికలలో ప్రచురించిన ముప్పైఒక్క ఖండికలను ఒక్కచో చేర్చి "మృత్యువు నుంచి" అనే ఖండ కావ్యంగా 1979 డిసెంబరులో ఆంధ్రదేశానికి అందించినాడు నారాయణ రెడ్డి. ఈ కావ్యంలోని మొదటి ఖండిక 'మృత్యువునుంచి'. ఐదువందల యాభైమూడు పంక్తులుగా ఇరవైయారు పుటలలో పరచుకున్న ఒక అపూర్వ సుదీర్ఘకవిత ఇది. దీనంతట ఇది ఒక ఖండకావ్యం అయితే తరువాతి ముప్పై కవితలు 'బ్రతుకులోకి' అన్న ప్రధానశీర్షికలో ఖండికలుగా ప్రచురితమైనాయి. వీటన్నిటినీ కలిపి మరో ఖండకావ్యంగా గ్రహించవచ్చు. కనుక 'మృత్యువునుంచి' అన్న ఈ కావ్యం రెండు ఖండకావ్యాల సంగమం . ఈ సంపుటి కూర్పులో కనిపించే నవ్యత ఇది. ఈ రెండు కావ్యాల పేర్లు కలిపితే 'మృత్యువునుంచి బ్రతుకులోకి' అవుతుంది. ఈ మాటలు చదువగానే 'మృత్యోర్మాఽమృతంగమయ' అనే ఉపనిషత్సుధాసూక్తి స్మృతి వాటికలో జాలువారుతుంది. తరతరాలనాటి తత్త్వగంధం మనఃపేటికలో ప్రసరిస్తుంది. ఇలా ఒకే సూక్తిని రెండు కావ్యాలుగా మలచుకున్న వైనం మరో నవ్యతగా భాసిస్తున్నది.

ఈ సంపుటిలోని మొత్తం ఖండికల్లో రెండుమాత్రమే గేయకవితలు. మిగిలినవన్నీ వచన కవితలే. కనుక ఈ సంపుటిని ప్రాధాన్యవివక్షచేత

వచనకవితాసంపుటి అనవచ్చు కాని సంపూర్ణవచనకవితాసంపుటిగా మాత్రం భావించరాదు.

నారాయణరెడ్డి వాణి చైతన్యవాహిని. అది ఒక త్రివేణి. అందులో గంగాయమునల్లా ఆనందోపదేశాలు ప్రవహిస్తుంటే సరస్వతిలా అంతః శ్రుతిగా ఆతని వ్యక్తిత్వం రవళిస్తుంటుంది. గంగాయమునలై భారతీయ తనూ సరస్వతియై విశ్వాత్మను ఆతని వాణి త్రివేణియై ప్రతిఫలింపజేస్తుంది. అంతేకాదు— గంగలా నిరర్గళంగా ప్రవహిస్తూ, యమునలా సంయమన శీలాన్ని ప్రదర్శిస్తూ ఆతని సరస్వతి ముందుకు సాగుతున్నది. ఆ త్రివేణిలో భూతవర్తమానభవిష్యత్తులు ప్రవహిస్తాయి. నిద్రా ముద్రితుడు కాకుండా కలలకు చోటివ్వకుండా కర్తవ్యాన్ని నిర్వహిస్తూ నిత్యజాగృతితో మనిషి సాగాలని ప్రబోధిస్తుందాతని వాణి. జనహృదయకేదారాలను రసప్లావితం చేస్తూ నడుస్తున్నదా వాణి. ప్రపంచంలో జరిగే ప్రతి సంఘటనకూ స్పందిస్తూ ప్రగతినిరోధక శక్తులకు ప్రతిద్వంద్వియై సాగుతున్నదా వాణి. ఆ వాణిలో రసమూ ఉంది; రాగమూ ఉంది. జలపాతాల గలగలలూ పయోధుల ప్రఘోషలూ ఆ వాణిలో వినిపిస్తాయి. "వోల్టేజి సరిచేసుకో" అని సూర్యుణ్ణి హెచ్చరించగలిగేంత ప్రతిభాచైతన్యోజ్జ్వలమూర్తి నారాయణరెడ్డి. అనుదినం పెరుగుతున్న వ్యక్తిత్వం ఆతనిది. 'అభ్యుదయం పునాదిమీద' అది అంచెలంచెలుగా పెరుగుతున్నది. ఆతని హృదయం కరుగుతూనే పెరుగుతుంది 'కన్నీళ్లమధ్య'. కాలుతూనే పేలుతుంది 'కార్చిచ్చులమధ్య'. ఈ కవిచెవులు ప్రాణఝంఝూనీలాన్ని 'మౌనమనోధ్వనుల్నీ' వినగలుగుతాయి. ఈ కవి తన శరీరాన్ని 'శ్రుతి తప్పని వాయులీనం'గా మార్చుకున్నాడు. ఆతని నవ నాడులే తీగలు. ఈ వాయుగానంలో సమకాలిక సమాజస్వరాలూ అనంతవేద నాదాలూ వినిపిస్తాయి. అనుక్షణం ఎదుగుతున్న ఈ కవి జీవితంతోపాటు ఆతని తత్త్వానుశీలంకూడా ప్రవర్ధమానమవుతున్నది. నారాయణరెడ్డి కవితా మూర్తిలోని తాత్త్వికస్ఫూర్తిని ఈ సంపుటిలోని 'మృత్యువునుంచి' అన్న కవితలో సమగ్రంగా దర్శించవచ్చు.

అణుసంయోజనమే జీవిజననం; అణువికేంద్రీకరణమే జీవిమరణం అన్న సత్యాన్ని శిల్పసుందరంగా ప్రకటించినాడు కవి. ప్రకృతిలో కొన్ని వస్తువులు స్వేచ్ఛగా ఉండాలనీ, అరలూ హద్దులూ లేకుండా జీవించాలనీ

కోరుకుంటాయి. అద్దంమీది నీటిచుక్క, సూర్యకిరణం, సుడిగాలిలోని ఇసుకరేణువు, నిప్పురవ్వ, మబ్బుతునక అలాంటివే. ఇలా ప్రకృతిలో విజృంభించేశక్తులెలా ఉన్నాయోవాటి స్వేచ్ఛను అరికడుతూ వాటిని నిరోధించే ప్రతిశక్తులు కూడా ఈ ప్రకృతిలో ఉన్నాయి. పొద్దును మింగాలని పొగమంచూ, చెలమల్లోని నీటిబిందువులను పీల్చేయాలని ఎండలూ చూస్తుంటాయి.

జన్మించిన ప్రతిజీవికీ మరణం తథ్యం. జీవులకూ బాలకౌమార యౌవన వార్ధక్యములనే చతురవస్థలున్నాయి. ఈ నాల్గూ కొంత కొంతకాలం పాటే ఉంటాయి. యౌవనం కుబుసం అతికింపువంటిదనీ, యౌవనంవలెనే ముదిమినీ జీవి అనుభవించక తప్పదని, ఆ ముదిమికి మృత్యువు చుట్టమనీ తెలిసినా, ఈ లోకంలో యయాతిలాంటి యౌవనసుఖానుభవపరాయణులూ, మూఢస్వార్థపరులూ కొందరుంటారనీ వారు ప్రతిక్షణం ప్రాణభీతితో బాధపడుతూ చివరకు ముదిమినీ మృత్యువునూ అనుభవిస్తారనీ ఉపమారమ్యంగా సూక్తిసుందరంగా చెప్పినాడు ఈ కవి.

'ముసలిమూలుగు వినపడని' చోటును, 'మృత్యువు అడుగు కనపడని చోటును' అన్వేషిస్తూ మనిషి స్వర్గానికి ఎగిసిపోతాడు. కానీ అక్కడి నిత్యవాసంతయౌవనవిలాసాలనూ, విశృంఖలశృంగారరసానుభవాలనూ, 'అంది విడని' ఆలింగనాలనూ చూసిన మనిషికి మతిపోతుంది. స్వర్గంపట్ల ఇప్పటివరకు ఆతనికిగల సదభిప్రాయం చెరిగిపోతుంది. 'పగటికలల వెన్నెముక' విరిగిపోగా స్వర్గంనుంచి మరలి మనిషి తన గదికి చేరుకుంటాడు. బ్రతుకును బ్రతికించుకోవాలనీ, చావును చంపాలనీ ఆతడు అనుక్షణం ఆరాటపడుతుంటాడు. తాను ఎలాగైనా మృత్యుంజయుడు కావాలని మథనపడుతుంటాడు. సముద్రమథనంవేళ ఉదయించిన అమృతాన్ని అందుకుందామని ఆశతోపోతే చివరిబొట్టుకూడా చేజారిపోతుంది. అదే వెంపరలాటతో ఆతని మనసు అమృతత్వాన్ని అందుకున్న నైమిశారణ్యంలోని ఋషులనూ, సంజీవనీసాధకులైన ధన్వంతరులనూ, యోగులనూ గాలిస్తుంది. కానీ వారికిగల ఆ యోగం తనకులేదని తెలుసుకున్న ఆ మనిషిమనస్సు నిరాశపడుతుంది. అయినా మళ్లీ ఊరటను నింపుకుంటుంది. మృత్యువును జయించి తన పతిని బ్రతికించుకున్న సావిత్రి గాథ ఆతనిస్మృతికి తగిలి

ఆతనిలో ఆశలను రేకెత్తిస్తుంది. ఇంతకూ మనిషి ఈ 'ఆశలన్నిటికి ఆఖరి ముక్తాయింపునిర్మృతి', 'ఆప్రవృత్తికి మూలధాతువు భోగరతి'- అంటూ ఈ సందర్భంలో నారాయణరెడ్డి పంచేంద్రియస్వేచ్ఛాసౌఖ్యానుభవాలకై మానవుడు చేసే ప్రయత్నాలనూ, ఆ ప్రయత్నంతో ఆతడనుభవించే జారుపాట్లనూ, చేదు అనుభవాలనూ, అపశ్రుతులనూ వివరిస్తూనే మనిషి వాటి వెంటబడిపోయే స్వభావాన్ని ప్రతిపదరమణీయంగా వర్ణించినాడు. ప్రకృతిలో మిట్టపల్లాలవలె మనిషికి జయాపజయాలూ, జననమరణాలూ సహజమని అనేకనిదర్శనాలతో తత్త్వాన్ని విడమరచి చూపినాడు.

ప్రకృతిలోని జీవులన్నీ మృత్యువుకు ఎలా భయపడతాయో మృత్యువు రకరకాల రూపాలను ఎలా ధరిస్తుందో, ఒక జీవి మరోజీవి పాలిటికి మృత్యువుగా ఎలా పరిణమిస్తుందో నిదర్శనాలతో నిరూపించినాడు - నారాయణరెడ్డి.

తన ప్రయత్నం ఫలిస్తే దైవం కరుణించినట్లుగా, విఫలమైతే విధి కోపించినట్లుగా మానవుడు విశ్వసిస్తాడనీ దుఃఖాలూ సుఖాలూ అతనికి రెండంచులనీ, అవి– తాలూగింజల సంచులవంటివనీ, అయినా 'తాలులేని గింజలకోసం', 'చావులేని బ్రతుకుకోసం' దేవులాడుతున్నాడనీ, దెబ్బలాడుతున్నాడనీ ఈకవి చిన్నచిన్న మాటల్లో చిత్తానికి హత్తుకుపోయేలా మానవుని విశ్వాసప్రయత్నాలను కవితాత్మకంగా చెప్పినాడు.

తప్పుచేసి తప్పుకోజూసే పలాయితులకు పరీక్షిత్తుకువలె ఎక్కడికి పోయినా మృత్యువుకాటు తప్పదని హెచ్చరించినాడీకవి.

"ప్రతినరుడూ పరీక్షితుడుకాడు
ప్రతిమనిషీ పలాయితుడుకాడు"

అని ఘోషిస్తూ నెత్తిమీద నిత్యం మృత్యువు వేలాడుతున్నా భయపడక తమ విధిని నిర్వహించే కార్మికులూ సైనికులూ నావికులూ వైమానికులూ వీరంతా 'మృత్యుజేతలే' 'జగత్ప్రగతికి చైతన్యవిధాతలే' అంటూ వారికి కవితాంజలు లర్పించినాడు నారాయణరెడ్డి.

ప్రకృతిఒడిలోని మనిషి కాలానుగుణంగా వచ్చే పరిణామాలకు ఒక్కొక్కసారి పొంగిపోతాడనీ ఒక్కొక్కసారి క్రుంగిపోతాడనీ, వసంత

శరత్తులను చూసి నింగి అందుకున్న మనిషి గ్రీష్మహేమంతాలకు నేలవాలి పోతాడని మానవస్వభావాన్ని విశ్లేషించిచూపినాడు.

"తనువుంటేనేకదా వ్రణాలు"
"బ్రతుకుంటేనే కదా మృత్యుఘోషలు"

అని తత్త్వం చెపుతూ అందుకు-

"వెదురెందుకు అరవాలి విరిచేస్తుంటే
విరవందే వేణువవుతుందా అది?
గంధపు చెట్టెందుకు ఏడవాలి నరికేస్తుంటే
నరకందే పరిమళమవుతుందా అది?"

వంటి చక్కని సాదృశ్యాలను ఎత్తి చూపినాడు.

"కనపడకపోతే ఉనికిలేనట్టుకాదు
వినపడకపోతే అలికిడి కానట్టు కాదు"

అన్న యాథార్థ్యాన్ని ఈ కవి సోదాహరణంగా నిరూపించిన వైనం ప్రశంస నీయం.

తత్త్వశాస్త్రాలెన్ని చదివినా మనిషి తన ఈప్సితాలనూ ఐహికప్రలోభాలనూ వదలుకోలేడని సామాన్యమానవస్వభావాన్ని ఎంతో చక్కగా చెప్పినాడు కవి.

నాటి అస్త్రాలయినా నేటి అణ్వస్త్రాలయినా మృత్యువుకు మారు రూపాలు. వీటిని సిద్ధం చేసింది ఏనాడైనా మానవుడే. అంటే - మృత్యువుకు జడిసిన మానవుడే మృత్యువును సృష్టిస్తున్నాడు. అంతేకాదు- ఆమృత్యువుకు బలి అవుతున్నాడు. ఈ దుఃస్థితిని చూసి శాంతికాముకుడైన నారాయణ రెడ్డి తన విచారాన్ని వ్యక్తం చేసినాడు.

మృత్యువును జయించిన పౌరాణిక మూర్తులనూ చారిత్రకత్యాగపురుషులను ప్రకృతిశక్తులనూ మనోహరంగా మన కళ్ళముందు నిలిపినాడు ఈ కవి. సౌమిత్రీ కచుడూ మృత్యువును జయించినవాళ్లే. అమృతసత్యసహనాలను చాటిన సోక్రటీసూ ఏసూ మృత్యుజేతలే. నిజానికి త్యాగమూర్తులందరూ అమృతమూర్తులే. గౌతముడూ అశోకుడూ మృత్యువునకు భయ

పడిన వాళ్లు కాదు. 'కడలిలో కరిగేనది' తన తీపి పోతుందని జడుసుకోదు. అలాగే 'పుడమిపై కురిసే మబ్బు' తన రూపుమాసిపోతుందని హడలిపోదు. అమృతత్త్వాన్ని వెలిగించే శక్తులివి.

ఇక మృత్యువును రగిలించిన శక్తులను గూర్చి వ్రాస్తూ చరిత్రలోని సంగ్రామాలనూ హిట్లర్లనూ, ప్రకృతిలోని రాబందులనూ పుళ్ళనూ పేర్కొన్నాడు కవి. ఈ "మరణాన్ని రగిలించిన శక్తులు మసిలా గసిలా మిడుకుతుంటాయి" అనీ-"మృత్యువును ఎదిరించిన మూర్తులు పొద్దులా పొడుపులా ఎదుగుతుంటాయి" అని వాటిని వ్యాఖ్యానించినాడు.

"బ్రతుకు ఆగితేచావు
చావుచస్తే బ్రతుకు"

అని పొడిపొడి విడివిడి మాటల్లో యాథార్థ్యాన్ని దర్శిస్తూ మనకళ్ళముందు కనిపించే వస్తువులను ఉదాహరణంగా తీసుకుని నిరూపించినతీరు అపూర్వం. ఈ పంక్తులు చూడండి.

"అగ్గి ఆరితే బొగ్గు
బొగ్గుమండితే అగ్గి"
"మొక్క ఒరిగితే మట్టి
మట్టి పెరిగితే మొక్క
మబ్బు ముగిస్తే చినుకు
చినుకు ఎగిస్తే మబ్బు
పొద్దు కనుమూస్తే చీకటి
చీకటి కనువిప్పితే పొద్దు"

అగ్గి, బొగ్గు, మొక్క, మట్టి, మబ్బు, చినుకు, పొద్దు, చీకటి అందరికీ తెలిసినవే. కాని వీటిలో జననమరణతత్త్వాన్నీ దాని మౌలికగుణాన్నీ దర్శించి, దానిని ఇంత శక్తిమంతంగా ఇంత సంక్షిప్తంగా ఇంత అందంగా వర్ణించడం నారాయణరెడ్డికే సాధ్యమైనది. అందుకే ఆతడు ద్రష్ట. ఆతడు స్రష్ట.

"మొక్క ఒరిగితే మట్టి
మట్టి పెరిగితే మొక్క"

అన్న రెండు పంక్తులు చాలు నారాయణరెడ్డి మహాకవి అని చెప్పడానికి.

ఈ జననమరణచక్రభ్రమణంలో ఆకుల్లాంటి జీవులు శిరసెత్తుతూ తలవంచుతూ మిరుమిట్లకూ అగచాట్లకూ గురిఅవుతుంటారని నిట్టూర్చినాడు కవి.

మృత్యువు నిత్యమని తెలిసినా కొందరు అధికారంతో నడిమంత్రపు సిరితో వర్తిస్తూ సామాన్యులనూ సాధువులనూ నిర్లక్ష్యం చేస్తుంటారని హెచ్చరించినాడు నారాయణరెడ్డి.

'ఏ పుట్టలో ఏ పాముందో' అన్నది నలిగిన సామెత. దీన్ని ఆదర్శంగా తీసుకుంటూనే తన నిర్మాణాత్మక దృష్టినీ చైతన్యశక్తినీ ప్రకటిస్తూ నారాయణరెడ్డి కొత్తసామెతలను సృష్టిస్తాడు ఇలా—

"ఏ పుట్టలో ఏ వాల్మీకి వున్నాడో?
ఏ పుట్టలో ఏ వ్యాసర్షి వున్నాడో?
ఏ రాయిలో చెకిముకిరాయి దాగుందో?
ఏ ఇసుకలో ఉప్పెన మాటుమణిగుందో?"

ఈ సామెతల్లోని పరమార్థాన్ని తెలిసి తెలివితో మనిషి సాగిపోతూ ప్రగతిని సాధించాలని ప్రబోధిస్తాడు. ఆంతరమైన చైతన్యంవల్ల ఆర్ద్రత వల్ల నూత్నసృష్టి జరుగుతుందన్న సత్యానికి

"విత్తు కడుపుకదలకపోతే
వృక్ష మెక్కడిది?
అద్దం మనసు కరగకపోతే
ఆకృతి ఎక్కడిది?"

వంటి పంక్తులు ఆదర్శాలు.

'మృత్యువునుంచి' అన్న ఈ ఖండికలో నారాయణరెడ్డి చిట్టచివరకు "సృష్టినుంచి సృష్టి" జరుగుతుందనీ, "జీవితం నుంచి జీవితం" "జ్యోతి నుంచి జ్యోతి" "ఆకృతి నుంచి ఆకృతి" ఆవిర్భవిస్తుందని చెపుతూ సృష్టికి మరో సృష్టికి మధ్య మృత్యువు వచ్చినా అది 'రెప్పపాటుమౌనం' లాంటిదని

అంటాడు. ఇలా ఈ కవి మృత్యువుకు ప్రాధాన్యం ఇవ్వడు. అది తాత్కాలికం. ఈ కవి ఆశావాది. ప్రగతిశీలి. ఈతని చూపు వెలుగుచూపు-బ్రతుకు చూపు. అందుకే ఈతడు 'జ్యోతినుంచి జ్యోతి' అంటాడు - తన హృదయాన్ని ఆవిష్కరిస్తూ.

"మృత్యువునుంచి బ్రతుకులోకి ఇది నాటిమాట" అన్నాడు నారాయణరెడ్డి. ఇక్కడ 'నాటిమాట' అంటే ఉపనిషత్తుల కాలం నాటి మాటఅని; పాతపాట అని. ఉపనిషత్తులలోని 'మృత్యోర్మాఽమృతంగమయ' అన్న మాటే నారాయణరెడ్డి తెనిగింపులో 'మృత్యువునుంచి బ్రతుకులోకి' అయింది. ఈ ఉపనిషత్సూక్తిలోని 'మృత్యు' శబ్దానికి సంసారబంధమనీ, 'అమృత' శబ్దానికి మోక్షమనీ అర్థాన్ని చెప్పినారు పండితులు. జననమరణశీలమైన సంసారబంధం నుంచి విముక్తికలిగించమని జీవుని ప్రార్థన. కానీ నారాయణరెడ్డి హృదయం ఇదికాదు. ఆతడు కోరేది జననమరణవిరహితమైన మోక్షం కాదు. జీవితం నుంచి జీవితానికి జరిగే ప్రస్థానంలో 'మృత్యువు' ఉందని ఒప్పుకున్నాడు, 'రెప్పపాటు మౌనం'గానైనాసరే. అంటే ఈతని దృష్టి జననమరణరహితమైన మోక్షం కాదన్నది ఆతని మాటలే చెప్తున్నాయి. మోక్షం కానప్పుడు మరేమిటి ఆతడు కోరేది? అంటే 'బ్రతుకు నుంచి బ్రతుకులోకి'. ఈ ఆకాంక్ష తత్త్వం ముందు నిలుపకపోవచ్చు. కాని కవితాచక్షువుముందు లీలగా కనిపించే సత్యలేశం ఇది ఈతని బ్రతుకు పాట. ఈ పాటలో మృత్యువు వినిపించదు. ఈ పాట అందరిపాట కావాలని ఆతని హృదయం. ఈ జీవితం ఎంతకాలం కొనసాగినాసరే దాన్ని జ్యోతిగా మలచుకోవాలనీ, దానితో ఈ ప్రపంచాన్ని వెలిగించాలనీ, తాను మృత్యువుకు గురైనా ఆరిపోని వెలుగులందించే మరోజ్యోతిని అందించి పోవాలనీ ఈ కవి ఆకాంక్షిస్తాడు.

అందరూ బ్రతుకుతారు బ్రతుకు. ఇది సాధారణమైన బ్రతుకు. దానిలో విశేషం లేదు. కాని ఈ సాధారణమైన బ్రతుకునే విశేషమైన అమరమైన అమృతమయమైన బ్రతుకుగా చేసుకుంటారు కొందరు. త్యాగమూర్తులూ కొందరు మనీషులూ; కొందరు మహాత్ములూ. ఈ లోకంలో వారు బ్రతికినంత కాలమూ ఈ లోకానికి జ్యోతులుగా ఉంటారు. వారు ఈ లోకాన్ని వదలిపోయినా వారు చేసిన సేవలూ, సాధించిన విశ్వజనీనమహత్కార్యాలూ

వారికి ప్రతినిధులై. వాళ్ళను వచ్చగా బ్రతికిస్తూనే ఉంటాయి. ప్రజల గుండెల్లో. అంటే వారు యశఃకాయులన్నమాట. వారు అమృతపుత్రులన్న మాట. వారిదే నిజమైన బ్రతుకు. ప్రతిమనిషీ ప్రజాహితాత్ముడై నిస్వార్థ సేవాతత్పరుడై తన శక్తియుక్తులతో లోకాన్ని వెలిగిస్తూ తనకున్న సామాన్య మైన బ్రతుకునే కళాప్రతిభా ధైర్య సాహసదీక్షాత్యాగౌర్యాది గుణవిశేషాలతో- 'చావులేని బ్రతుకు'గా. 'నీడపడని వెలుగు'గా మలచుకోవాలని నారాయణరెడ్డి ప్రగాఢవాంఛ. 'బ్రతుకునుంచి బ్రతుకులోకి' అన్న చిన్న మాటలో జీవితానికి అమృతత్వాన్ని ఆపాదించాలన్న మహోన్నతభావాన్ని పొదిగినాడు. జీవితానికి అమృతత్త్వం సిద్ధించినప్పుడు అది 'విచిత్రకావ్యం' అవుతుంది. అందలి— 'ప్రతి పంక్తీ కొనమెరుపు' అవుతుంది.

నారాయణరెడ్డి పాడిన ఈ పాటలో పరిమళించేది వేదాంతం కాదు. స్వచ్ఛమైన మానవ జీవితం. నిట్టూర్పు కాదు; నిర్మాణాత్మకమైన మార్పు. పలాయనవాదం కాదు: అధర్మప్రతిఘటనశీలం. ఉపదేశం కాదు ఉదాహరణం. జననమరణశీలమైన మానవజీవితాన్ని గూర్చి ఇంత గభీరంగా ఇంత మహోన్నతంగా ఇంత విశాలంగా వచనకవితారూపంగా బహుముఖ ప్రయోజన దృక్పథంతో వ్యాఖ్యానించిన కవిత ఆధునిక సాహితీలోకంలో అపూర్వం. బిందువులో సింధువును బిగించే సంక్షిప్తత ఈ రచనలోని పలుకు పలుకులో మరెంత పదునుదేరి కనిపిస్తుంది. ఈ సంపుటిలోని కవితలన్నీ ఒక ఎత్తు. ఈ 'మృత్యువునుంచి' అన్న కవిత ఒక ఎత్తు. 'మనిషీ-చిలక' అనే కావ్యంలోని మొదటి కవితలో మానవుని శరీరం ఆత్మ అంశాలను వ్యాఖ్యా నించే సన్నివేశంలో రేఖామాత్రంగా అగుపించిన నారాయణరెడ్డి తత్త్వాను శీలనం ఈ కవితలో విశ్వరూపాన్ని ప్రదర్శించింది.

ఈ సంపుటిలోని 'ఏమయ్యా సూర్యుడూ' ఖండికలో మానవులు వర్ణ భేదాలు పాటింపవద్దని అన్యాపదేశంగా ప్రబోధించినాడు నారాయణరెడ్డి.

"నలుపూ తెలుపూ తేడాల్లేని
సమవర్ణం సంపాదించుకో"

అన్న పంక్తుల్లో తెలుపు సూర్యుని ఉదయాన్ని తెలుపగా నలుపు సూర్యుని అస్తమయాన్ని సూచిస్తున్నది.

కోయిలది ఒక శ్రుతి. మనిషిది ఒక అరుపు. 'అరుపును నిరసిస్తే అసలు స్వరమే పుట్టదు' కాబట్టి అరుపును శ్రుతిగా మార్చుకోవాలని ప్రబోధించినాడు ధ్వనిరమ్యంగా—ఈ కవి 'ఒక శ్రుతి-ఒక అరుపు'లో.

ఆనాడు కవిత్వం (వాల్మీకి) అడవి పాలైంది. తర్వాత అది పుట్టల్ని చీల్చుకుని బైటకు వచ్చింది. మరి ఈనాడు, కవిత్వం జైలుపాలవుతున్నదనీ అది న్యాయం కాదని పరమవ్యంగ్యంగా ప్రబోధిస్తున్నాడు కవి. సత్యానికీ శీలానికీ ఈనాడు విలువలేకుండా పోతున్నదని వాటికి అజ్ఞాతవాసం కారాగార వాసం తప్పడం లేదని విచారిస్తాడు. ఈ వ్యవస్థ మారాలనీ సత్యం శీలం అడవిపాలూ జైలుపాలూ కాకుండా నేటి సమాజం జాగ్రత్తపడాలని ప్రబోధించినాడు.

"చేదు తీపి కలుపుకుని ఉగాది పచ్చడేమందో
ప్రతిపక్షాలకు ప్రభుతకు ప్రకటించాలని వుంది"

అన్న పంక్తులు సమైక్యసందేశానికెత్తిన పతాకలు, ఈ పంక్తుల్లోని క్రమాలంకారం రమణీయం, గంగాకావేరులను కలిపి జనాళికి ఒకవైపు జలాభావ సమస్యను తొలగించాలనీ మరోవైపు వరదలను నివారించాలనీ ఈ కవి సూచన.

ఈ సంపుటిలోని 'ఒంటరితనం కురుస్తున్నది నా మీద', 'గాలిని ముక్కలుగా కత్తిరించి', 'ఆనందాన్ని ఫోన్‌లో రంగరించి అప్పుడప్పుడూ చెవితో నంజుకుంటూ', 'చలిని కప్పుకుని వర్షాన్ని కాచుకుని' వంటి పంక్తులు నారాయణరెడ్డి కవిత్వభాషకు నవ్యోదాహరణాలు.

అపూర్వంగా వర్ణించడం నారాయణరెడ్డి సొత్తు అనడానికి ఈ క్రింది తార్కాణాలు చూడవచ్చు.

చెట్లను వర్ణిస్తూ—

"చెట్లు మాట్లాడవు
చిగుళ్లను పలికిస్తాయి
ఆకులు విడాకులిచ్చినప్పుడు
ఆత్మతో నవ్వేస్తాయి."

అంటాడు. ఈ నాలుగు పంక్తుల్లో మూడు ఋతువుల్లోని చెట్ల స్వభావాన్ని పొదిగినాడు సరికొత్తగా. 'చెట్లు' అన్న ఈ ఖండికలో ఆరు ఋతువుల్లోనూ తరుస్థితిని వర్ణించిన వైనం అత్యాధునికం; అతి సంక్షిప్తం; ధ్వనిసుందరం.

'కాగితం' శీర్షికలో కాగితం వర్ణన హృదయంగమం. తెల్లని కాగితాన్ని మానవుని బాల్యకౌమారాలుగానూ, వ్రాసిన కాగితాన్ని యౌవనంగానూ మూసిన కాగితాన్ని వార్ధక్యంగానూ, చించిన కాగితాన్ని ఏడ్చేసిన జీవితంగానూ దర్శించినాడు కవి. కాగితాన్ని మానవదశలతో సమన్వయించటం ఇందలి నవ్యత.

"తూర్పుచెట్టుకు పూచిన ఎర్రగన్నేరు"ట – ఉదయసూర్యుడు.

నెహ్రూ జయంతి సందర్భంగా వ్రాసిన కవిత– 'నీ జయంతి విశ్వోదయ వైజయంతి'. నెహ్రూ బహుముఖీన ప్రతిభావ్యక్తిత్వాలను నారాయణ రెడ్డి కవితాత్మకంగా అభివర్ణించినాడు. 'ఆకాశాన్ని శిరస్సుగా' తొడుక్కున్న, 'కాంతి గోళాలను కళ్లుగా' మలచుకున్న నెహ్రూ మనస్సు ఏకకాలంలో 'జలం-ఉజ్జ్వలం' అని వర్ణించినాడు.

ఈ కావ్యంలోని 'ఆత్మను సంవదించుకుంటూ' అన్న కవితలోని కాలవర్ణనలోని మొదటి ఆరు పంక్తులపై నన్నెచోడుని–

"సలలితంబగు శశికాంతశిలలరుచులు
నింద్రనీలోపలద్యుతు లెనసివెలల
పక్షులెల్ల సితాసితపక్షయుగళ
సహితమై చూడనొప్పు మాసములవోలె"

అన్న పద్యం ప్రభావం స్పష్టంగా కనిపిస్తున్నది. ఈ కవితలోని–

"పాడుతూంది ఆ పక్షి
ఆరు రకాల స్వరాలతో"

అన్న పంక్తులు చదువుతున్నప్పుడు సరోజినీనాయుడు రచించిన 'Bird of Time' అన్న శీర్షిక చప్పున శిరస్సులో కదులుతుంది. అయితే సరోజినీ ప్రభావం కాలాన్ని పక్షిగా రూపించేంత వరకే ఈతనిపై ఉంది— "పాడు తూంది ఆ పక్షి ఆరు రకాల స్వరాలతో" అని వ్రాసి స్వరాలను ఋతువులుగా స్ఫురింపజేయడంలో మాత్రం నారాయణరెడ్డి మౌలికత భాసిస్తున్నది.

'మృత్యువునుంచి' కవితలోని సముద్రమథన సన్నివేశం, సావిత్ర్యో పాఖ్యానసన్నివేశం ఈ కవి దృశ్యసాక్షాత్కరణ శక్తికి తార్కాణాలు.

నారాయణరెడ్డి కొన్ని సందర్భాలలో ప్రతీకాత్మకంగా భావాన్ని వ్యక్తం చేసినాడు. 'అడివి' - అజ్ఞానానికీ, అనాగరతకూ, అక్రమానికీ, 'పొగ'— యుద్ధవాతావరణానికీ, 'మూగవెలుతురు' - పటాటోపమూ ప్రచారమూలేని అభ్యుదయానికీ, 'నీటి బతుకు'— చల్లని ఉపకారశీలమున్న త్యాగమూర్తికీ, 'గాలి'— స్వేచ్ఛకూ ప్రతీకలుగా ప్రయోగించినాడు ఆయా ఖండికల్లో.

నారాయణరెడ్డి ఎప్పుడూ కొత్తకొత్త ఉపమాలంకారాలను ప్రయోగి స్తాడు. అవి ఒకప్పుడు సమకాలికప్రపంచసంఘటనలకు ప్రతినిధులై, మరొకప్పుడు స్థానిక పరిసర పరిజ్ఞానానికి ప్రతీకలై ఔచితినీ ధ్వనినీ పుక్కి లిస్తుంటాయి.

ఉదాహరణానికి కొన్ని—

"కాలం సుదుట చెక్కిన సంతకం
కడలిలా మిగిలిపోతుంది"

ఈ పంక్తుల్లో కడలి కాలమంత పాతదని ధ్వని.

"సంఘటనలు చెదిరిపడతాయి
స్కైలాబ్ చప్పు ముక్కల్లా"

సమకాలిక వైజ్ఞానిక పరిశోధనా సంఘటనకు స్పందించిన కవి హృదయం దానిని ఉపమానంగా గ్రహించి సాహిత్యంలో చిరంజీవంగా స్థాపించింది.

ఈ కవి తన ఆత్మను— "పెట్టె అడుగున దాచిన పెళ్లినాటి పట్టు పంచెలా"— చూసుకున్నాడట. ఈ చరణాల్లో ఆత్మపట్ల తనకున్న ఆప్యాయ తను వ్యక్తం చేయడం ఎంతో బాగుంది. అంతేకాదు - ఇక్కడ పెట్టెను

శరీరానికి, పట్టు పంచెను ఆత్మకూ ప్రతీకలుగా చేసి శరీరాత్మల సంబంధాన్ని ధ్వనింపజేసినాడు.

"మాటల్లో పడుకున్న పాట ఉరికింది
మహంకాళి జాత్రలా ఉరిమింది"

ఈ కవి తన మనుమడు పుట్టినరోజు పండుగ సంబరాన్ని వర్ణించే సందర్భంలోని ఈ పంక్తుల్లో— 'మాటల్లో పడుకున్న పాట'— అంటే మూలకున్న రికార్డు మ్రోగడమూ కావచ్చు లేదా తానే పాడడమూ కావచ్చు. సికింద్రాబాదులో జరిగే మహంకాళి జాత్ర సుప్రసిద్ధం. స్థానిక పరిసరాలను ఉపమానాలుగా గ్రహించటంలో ఈ కవి మౌలికత రవళిస్తున్నది. ఇక్కడ సాదృశ్యం 'ఉరుమడం'లో. 'కాళి' శబ్దానికి 'ఉరిమి' అనే మాట ఎంతో చక్కగా కుదిరింది. 'ఉగ్రత' ఇందువల్ల ధ్వనిస్తున్నది.

"నక్కివుంది నాస్తిలోనే ఆస్తి
'కంగారూ' కడుపులోని శిశువులా
దాగివుంది మృతిలోనే ప్రసూతి
కర్రను కాల్చిపుట్టే చిచ్చులా"

వంటి పంక్తుల్లోని ఉపమాలంకారాలు అపూర్వతను చాటుతున్నాయి.

'కాలజ్వాల', 'జ్వాలాస్వప్నాలు', 'హిమగిరుల తరంగా'లు 'గాలి అల్లికలు' (గాలిమేడలన్నట్లు) 'నీటి అమరికలు' (నీటిపై వ్రాతలన్నట్లు), 'నురగల కట్టడాలు', 'మృగతృష్ణల పట్టణాలూ' 'పాటవెలదులు' (ఆట వెలదుల వలె) వంటి వినూత్నసమాస పదబంధప్రసూనాలూ—

"ముదిమికి చుట్టం మృత్యువు
నిదురకు నేస్తం మృత్యువు"
"శిశువు ఎదిగితే ఒక జీవనం
చిచ్చు ఎదిగితే ఒక జ్వలనం"
"సంగ్రామాలు ఆగిపోతే
శ్మశానాలకు దిగులు"

"తెలిసి సాగిపోతే ప్రగతి
తెలివి ఆగిపోతే మృతి"

వంటి సూక్తిమౌక్తికమాలికలూ ఈ సంపుటిని అలంకరిస్తున్నాయి.

ఈ సంపుటిలోని 'అనివుంది' అనే ఖండికలోని గేయాలు 'మథనం' కావ్యంలోవలె ఉర్దూగజల్ల బాణీలో ఉరకలు వేసినాయి.

కాలం అనంతం; పృథ్వి విశాలం అని తెలిసిన నారాయణరెడ్డి తన 'ఊర్పును ఎదిగించాలని', అనంతంగా విశాలంగా సాహితీసృష్టిచేయాలని ఆకాంక్షిస్తున్నాడు. ఈ ఆకాంక్షతోనే ఆతడు నిరంతరం కవితాతపస్సు సాగిస్తూ సహృదయప్రపంచానికి అమృతకావ్యఫలాలను అందించగలుగుతున్నాడు.




# విశ్వగీతి

నారాయణరెడ్డి 1954 వసంతంలో సంతోషంతో ఆలపించిన గీతి ఈ 'విశ్వగీతి'. ఆతడు కవితారసజ్ఞులకు సమర్పించిన మూడవకానుక ఇది. ప్రసిద్ధకవి 'ఆరుద్ర' ప్రేరణతో తాను ఈ కావ్యరచనకు పూనుకున్నట్లు నారాయణరెడ్డియే కావ్యారంభమున చెప్పుకున్నాడు.

శ్రీ శ్రీశ్రీ 'మహాప్రస్థానం' లోని 'కవితా ఓ కవితా', శ్రీ దాశరథి 'పునర్నవం'లోని 'మస్తిష్కంలో లేబొరేటరీ' అనే కవితలు వృత్తగంధి వచనంలా నడిచే గీతికావ్యాలు. శ్రీ పుట్టపర్తి వారి 'శివతాండవం' మాత్రా చ్ఛందస్సులో మందహాసంచేసిన గీతికావ్యం. నారాయణరెడ్డి ఈ 'విశ్వగీతి'

ఇదేకోవకు చెందింది. ఇందులో నాల్గువందల ఇరవైయైదు చరణాలున్నవి. సంఘసంస్కరణాభిలాషయే, సమసమాజనిర్మాణాశయమే నారాయణరెడ్డిని ఈ కావ్యరచనకు పురికొల్పినవి. ఈరచనకు ప్రాణమూ పరమార్థమూ అవే. ఈ కావ్యం అభ్యుదయకవితాదృక్పథంతో సాగినది.

'విశ్వగీతి'లోని 'గీతి' నారాయణరెడ్డి కవితాహృదయానికి ప్రతీక. సమగ్రసమాజాభ్యుదయానికి ఆటంకంగా నిలిచే దురాచారాలనూ స్వార్థాలనూ దౌర్త్యాలనూ నిర్మూలించి విశ్వకల్యాణంకోసం పాటుపడాలనే ఒక గాఢమైన తపన, సమసమాజనిర్మాణం చేయాలనే ఒక దృఢమైన సంకల్పం ఈ కావ్య మంతటా పరివ్యాప్తమై నారాయణరెడ్డి విశ్వశ్రేయోదృక్పథాన్ని ప్రతిబింబింప జేస్తున్నది.

ఒక సుముహూర్తాన భావనామయమైన ఈ కవి హృదయంలో అంబ రాలను చుంబించే అంతరాలను స్పృశించే ఒక గీతం విరిసింది. అది హరి విల్లులా అందంగా మెరిసింది. సంధ్యారాగాలనూ, సప్తవర్ణాలనూ తనలో దాచుకున్న గీతమది. ఫాలాక్షుని నిటలపావకజ్వాలికలూ, 'మృత్యునర్తకీక రాళనృత్యంలో' తెగిన 'కింకిణీగణగళసంగీత' మాలికలూ ఆ గీతంలో కని పిస్తాయి వినిపిస్తాయి. ఈ భవ్యగీతం పల్లవించినవేళలో అంతరంగంలో అంధకారం అధికారం కోల్పోయింది. తేజస్సు తీంద్రించింది. కాలం గజ గజవణికి నిజరూపం చూపించింది. అపుడు ఇనబింబం నుండి ఏడువర్ణాలు దిగివచ్చినవి. పుడమి తన కడగళ్ళను వినిపించింది. ఆకాశం శోకించింది. మెరపులూ మేఘాలూ దైన్యాన్ని ప్రకటించినవి. శిలలు తలలూపినవి. చెట్లు నడిచినవి. స్తబ్ధత సడలింది. చైతన్యం జడలెత్తింది. నైశ్శబ్ద్యం నశిం చింది. నాదం మోదంగా సాగింది. కవి స్వప్నాలూ స్వర్గాలూ కట్టెదుట నిలిచినవి.

"కాళిదాసు కల్పించిన
నీలాషాఢ పయోదం
నన్నయ నడిచిననవప్ర
సన్నకథాకావ్యపథం
శ్రీనాథుని కవితా ధా
రానీరంధ్రధ్వానం

పోతన పలికించిన నవ
నీత కావ్యనిక్వాణం"

ఈతని గీతంలో చొరబడి రాగంనింపి అలజడి రేగించి మ్రోగించినవి. అంతేకాదు, ఎల్లోరా శిల్పాలూ, అజంతా చిత్రాలూ ఓరుగల్లు అమరావతుల కళావిలాసాలూ అన్నీకలిసి ఈతని గీతికలో నవ్యత్వం నింపినవి. ఈతని గీతిక రసగళంలో 'నాగస్వరములు' దింపినవి.

అణువులా జనించిన ఈతని గీతి అంతలోనే ఆకాశందాకా ప్రాకి, 'అనిలంలా' చలించి, 'అనలంలా' జ్వలించి 'కిరణంలా' ఇరులను తరిమింది.

ఈతని గీతిలో 'విచిత్రమైన జీవనమరణ దృశ్యాలు', 'వింత మానవ భాష్యాలు' కదలాడినవి. ఎలనవ్వుల వెన్నెలలను చిలికే పసిపాపల పెదవులపై 'విపన్మేఘ పరంపరలు' అమాంతం వచ్చిపడగా ఈతని గీతం క్షణకాలం స్తంభించింది. నూనూగుమీసాల నూత్నయౌవనవిలాసాలలో నున్న యువకుని ప్రగతిశీల శిరస్సుపై 'జీవితభారం' పడగా ఆశాసౌధాగ్రాలనుండి పాపం ఆ యువకుడు క్రిందికి జారగా ఈతనిగీతం 'దిగాలుపడి' చూచింది.

కండలు కరిగించి కలిమిని పండించినా కడుపునిండ తిండికి నోచుకోని శ్రమైక జీవులనుచూసి ఈతని గీతం జలజల భాష్పాలు జార్చింది. "పడుపు వృత్తియనేటి అడుసులో అడుగేసి" అర్థంకోసం యౌవనాన్ని, 'కరివోని' అందాలను 'కామజ్వరార్తులకు' పంచిపెట్టి కృశించి 'అవమానభారాన' తప్తమైపోతున్న 'పతిత ముతక బ్రతుకును' జూచి ఈతని గీతికానయనాలు చెమ్మగిల్లిపోయినవి. శిల్పచిత్రలేఖనకవితాగాననాట్యకళారాధకులూ, "మానవుని దేవతామాన్యునిగ మలిచే" కళాస్రష్టలూ, నిరాశ్రయులై నిరాశాహతులై 'కళదప్పి పడియుండగా' జూచిన ఈతని గీతి బాధతో దీర్ఘనిశ్వాసం విడిచింది. సామ్రాజ్యకాంక్షతో అణుగోళాది మారణాయుధాలు ప్రయోగించి, పచ్చని దేశాలను భస్మంచేసే పైశాచిక శక్తుల దాడులకు దెబ్బతిని, మిన్నులకెగురలేక భయంతో 'పరుగెత్తే శాంతికపోతిని చూచి' ఈతని గీతం విషాదంతో విలవిలలాడి పోయింది. వేదనలపాలైన పేదలను తమ స్వార్థానికై బలిచేసే 'ధరాపతుల ధనాన్వితుల' దారుణ హింసాచర్యల జూడలేక

ఈతని గీతం నిప్పులు రాల్చింది. ధాన్యాన్ని చీకటి బజారుల్లో నింపి జనాన్ని ఆకలికీ శోకానికీ గురిచేసే దేశద్రోహులనుజూచి ఈతని గీతం కోపించింది.

మానవతను మోసగించిన మతకర్తలూ ప్రజలను హింసించిన రాజకీయనాయకులూ 'పయోముఖవిషాంతరు'లూ సమకాలిక సాంఘికప్రగతిని నిరసించే 'నవతాయువతాద్వేషు'లూ వీరందరూ విషఖడ్గాలనీ విషసర్పాలనీ గమనించిన ఈతని గీతం ఆవేశంతో ఆవేగంతో ఉద్రేకంతో తాండవంచేస్తూ వారిపై కణకణ ప్రజ్వరిల్లే అగ్నికణాలను ఉల్కాపుంజాలను కురిసి భస్మం చేసింది. తరువాత క్రొత్తదనం పచ్చదనం చివురులెత్తిన ఒక నవ్యజగత్తు ఆవిర్భవించింది. ఆ జగత్తులో సమతాసంగీతం విని కళాప్రియులూ కార్మికులూ కర్షకులూ నిర్వాసులూ నిర్విణ్ణులూ మానవతానిర్మాతలూ పరవశులై వచ్చి త్యాగంతో సౌహార్దంతో పతాకల్లా శీర్షాలెత్తి బాకాలూదుతూ ఆనందంతో ఆత్మబలంతో 'విజయవాటి'కి బయలుదేరినారు. ఈతని గీతం ఆనందాశ్రువులు జలజలా రాల్చింది. అప్పుడు తన జీవితానికి సార్థకత, సంపూర్ణత చేకూరినట్లు భావించింది. ఇందాకా విశ్వరూపంలా ఉన్న ఈతని గీతం సూక్ష్మమై అణువణువునా 'జగన్మోహనగోళంలో' శాశ్వతంగా లీనమై నిండిపోయింది.

ఈ విధంగా 'జయవసంత'లో (1954లో) ఆలపించిన ఈతని గీతి చిట్టచివరకు జయాన్ని పొంది విశ్వానికి కల్యాణవాసంతశోభను సమకూర్చి కృతకృత్యమైంది.

ఈ దీర్ఘగీతిలో—

"ఆయుధాలు అణుగోళా
లంతిమవాయువు పీల్చెను"
"మానవత్వము జయించెను
శాంతితంత్రి వినదించెను"
"శ్రమకూ కళకూ ఫలితం
సమరీతిగ లభియించెను"—

వంటి పంక్తులు అభ్యుదయకవితాధోరణులైన 'యుద్ధ విముఖత' 'శాంతిప్రియత' 'సమసమాజనిర్మాణం' వంటి భావనలను ప్రకటిస్తున్నవి. తొలి

రోజుల్లో నారాయణరెడ్డి శ్రీశ్రీ ప్రభావంతో అభ్యుదయగేయాలు రచించి నాడు. అందుకు ఈ విశ్వగీతి ఒక ఉదాహరణగా పేర్కొనవచ్చును.

ఈ 'విశ్వగీతి'లో నారాయణరెడ్డి త్ర్యస్రగతి, చతురస్రగతి, ఖండ గతి ప్రయోగించినాడు. త్ర్యస్రగతిలో ఆరంభించిన గీతిని అదేగతిలో అవే చరణాలతో ముగించినాడు. భావానుగుణంగా గతులను మార్చడం వలన పాఠకుడు ఆనందానుభూతిని పొందుతాడు.

ధారాగంభీరమధురంగా నడిచిన ఈరచనలో అప్రయత్నంగా యతులూ ప్రాసలూ తమ స్థితినీ గతినీ పదిలపరచుకున్నాయి. సహజంగా దొరలిన అంత్యప్రాసలు అందాలు చిందించినవి. పూర్వకవి కవితాసారాన్ని అపారంగా ఆస్వాదించే నారాయణరెడ్డి ఈ 'విశ్వగీతి'లో కాళిదాస నన్నయాదుల కవితా ప్రాభవాన్ని నుతించినాడు. వారి కవిత విశ్వశ్రేయస్సౌందర్యాలకు అంకిత మైనదని ధ్వనింపజేసినాడు.

కర్షకుల కళాకారుల దుఃస్థితిని వర్ణించేటప్పుడూ, పతిత బ్రతుకును చిత్రిస్తున్నప్పుడూ, సామ్రాజ్యశక్తుల ప్రసక్తి వచ్చినప్పుడూ ధనాంధులను దేశద్రోహులను కోపించినప్పుడూ ఈ కావ్యంలో చక్కని శబ్దచిత్రాలు రూపుదిద్దుకున్నవి.

ఈ కావ్యంలో కవి హృదయం గీతంగా అవతరించి బాధాసంవలిత మైన ప్రజాకోటిని చూసింది. దౌష్ట్యానికీ వైషమ్యానికీ తావలమైపోయిన ఈ జగత్తును చూసి నిప్పులు కక్కింది. ఒక నూత్నజగత్తును సందర్శించింది. ఆ సృష్టి అంతా సుఖమయం ; అంతా రసమయం ; అంతా ఆస్వాదనీయం. కవి మహత్వాకాంక్షకూ కవి భవిష్యద్దర్శనానికీ ఆర్ద్రహృదయానికీ ఈ కావ్యం ఒక ప్రతీక. విశ్వప్రజాహృదయాళికి ఇది విశ్వగీతి. ఈ కావ్యం తరువాత నారాయణరెడ్డి వ్రాసిన ప్రతి కవితాఖండికలో ప్రతి కావ్యంలో పరోక్షంగా ఈ విశ్వగీతి కాంతికిరణాలు స్పృశిస్తుంటాయి. అయితే ఇది ఆతని రచనలను పదిలంగా చదివే పాఠకునికే సాధ్యం.

# భూమిక

కలం పట్టిన నాటి నుంచి నారాయణరెడ్డి మానవుల రకరకాల వింత మనస్తత్త్వాలనూ వారి తిరోగతినీ పురోగతినీ దౌర్జన్యాన్నీ సౌజన్యాన్నీ సమరోన్మాదాన్నీ శాంతివాదాన్నీ చిత్రిస్తూనే మానవతను ఎలుగెత్తి చాటుతున్నాడు. అనంతమైన అధునాతనమైన తన కవితాచైతన్యంతో మానవతామూర్తికి మకుటం పెడుతూ నిత్యనూతనంగా అనేక ఖండికలను రచించి వాటిని ఖండకావ్యాల ద్వారా ప్రకటిస్తూనే ఉన్నాడు. ఇక 1973లో 'ఉదయం నా హృదయం' కావ్యంలో తన 'ఇతివృత్తం మానవత్వం' అని అక్షరాలా ప్రకటించినాడు. ఇంతటితో ఆగలేదు. విశ్వాన్ని తన పరిష్వంగంలో పొదుగుకునే ఈ కవి 1976లో 'ఇంటిపేరు చైతన్యం' కావ్యం ద్వారా 'ఉన్ముక్తమానవతావిహంగం' ఉత్తాల గగనాల నందుకోవాలని తన భవ్యాశయాన్ని కవితాత్మకంగా నివేదించినాడు. ఇలా ఎన్నో ఖండకవితల ద్వారా మానవతాప్రబోధం చేసినా సంతృప్తికలుగలేదు నారాయణరెడ్డికి. మానవతనే ఇతివృత్తంగా గ్రహించి ప్రత్యేకత భాసించేలా ఒక కావ్యాన్నే వ్రాయాలనుకున్నాడు. గగనాంచలాలను స్పృశించే చైతన్యమున్నది ఈ కవికి: కవితావేశమున్నది ఈ కవికి, ఇంకేం? గళం పలికింది. కలం ఉరికింది. కావ్యం రూపు దాల్చింది. అలా రూపుదిద్దుకున్న కావ్యమే -'భూమిక'. ఇది 1977 డిసెంబరులో ప్రకటితం.

ఈ 'భూమిక' పద్దెనిమిది ఖండాలుగా (భాగాలుగా) సాగిన ఒక సుదీర్ఘగీతికావ్యం. సంఘసంస్కరణాభిలాషియై అభ్యుదయకవితాచేతనతో నారాయణరెడ్డి ఇరవైమూడు సంవత్సరాల క్రితం—అంటే 1954లో ఒక దీర్ఘగీతిని రచించి 'విశ్వగీతి' కావ్యంగా సహృదయలోకానికి అందించి తన సమసమాజనిర్మాణైకసదాశయాన్ని ప్రకటించినాడు. విశ్వగీతి నాల్గు వందల ఇరవై అయిదు పంక్తుల దీర్ఘగీతికావ్యం. ఈ 'భూమిక' ఈ కోవకు చెందిందే. ఈ కావ్యంలోని పద్దెనిమిది ఖండాలు దేశకాల పాత్రల మధ్య కలిగే వ్యవధికి బాహిరసంకేతాలు. కావ్యమూర్తి అవయవసదృశాలు

అంతే. అంతటా ప్రసరించే ఆత్మ ఒకటే. అదే–మానవత. అందువల్ల ఈ కావ్యమంతా ఒకేగీతిగా పదమూడు వందల పదహారు పంక్తుల సుదీర్ఘ గీతిగా భావించవచ్చు.

నారాయణరెడ్డి ఈ కావ్యానికి ముందుగా 'భూమిక' పేర వ్రాసిన గేయంలో–"గీతికి మోగిన తలపే భూమిక" అనీ, కావ్యం ముగింపులో-"ఆ మనిషే పల్లవి ఈ గీతికి" అనీ ఆద్యంతాలలో 'గీతి' పదాన్ని ప్రయోగించినాడు. ఇక 'విశ్వగీతి' కావ్యనామంలోనే 'గీతి' తిలకంలా భాసిస్తున్నది. అందుకే– గేయమన్నా గీతి అన్నా అర్థమొకటే అయినా నేను 'గీతి' శబ్దాన్నే గ్రహించినాను. ఏకరీతిగా భాసించే 'విశ్వగీతి' 'భూమిక' అన్న ఈ కావ్యాలు రెండింటిని–'సుదీర్ఘ గీతికావ్యసాహితి' అన్న ప్రత్యేకప్రక్రియగా నిర్ణయించినాను. ఈ వింగడింపులో నేను ఆశించింది ప్రక్రియా స్పష్టత. అంతే.

మంచుగడ్డల్లో మనుగడను సాగించిన మానవతకూ గుహలకడుపుల్లో గుర్రుపెట్టి పర్ణశాలల్లో నిద్రలేచిన మానవుని ప్రాథమికశిశునాగరికతకూ ఆదీ పునాదీ ఏదని ప్రశ్నిస్తూ నారాయణరెడ్డి, నైమిశారణ్యంలో బడులను నడిపి జ్ఞానాన్ని పంచిన మహర్షుల కృషినీ శేముషినీ, వారు గానం చేసిన వేదఋక్కులను పేర్కొని వాటి ప్రాశస్త్యాన్ని ప్రతిచరణరమణీయంగా వర్ణించినాడు. ఓజస్సునూ జీవోత్సేకాన్ని విరజిమ్మే వేదఋక్కులే ప్రథమ కవితా స్వరూపమనీ, సత్యదర్శనమంగళమైన ఆ కవిత 'ప్రకృతి పలికిన మాతృభాష' అనీ, ఆ కవిత్వమే మన్వంతరాలకు 'ఔరసంగా' అందిందని వర్ణిస్తూ ప్రథమఖండాన్ని ముగించినాడు నారాయణరెడ్డి.

రెండవ ఖండం వాల్మీకి జీవితకవిత్వాలను గూర్చిన కవితాత్మక వ్యాఖ్యానం. తమసానదీతీరాన జరిగిన క్రౌంచపక్షివధ సన్నివేశం వల్లనే వాల్మీకి కవియైనాడనీ, ఆతని శేముషి ఉదయించిందనీ అనడం సమంజసం కాదనీ, అందుకు ఆతని గత తపోజీవితమే భూమిక అని ప్రవచిస్తూ వాల్మీకి నిషాదజీవితంలో వచ్చిన పరివర్తనాన్ని తపోజీవితాన్ని వర్ణించినాడు. తపస్సు వల్లనే వాల్మీకి ద్రష్టగా మారినాడనీ క్రౌంచపక్షి విషాదసన్నివేశాన్ని చూసిన దయనీయక్షణంలో ఆ ద్రష్ట స్రష్ట అయినాడనీ, ఆతని వేదన 'అమరకావ్య

భూజమై' వెలసిందని కవితాత్మకంగా వ్యాఖ్యానించినాడు. ఈ సందర్భంలో— కవిత్వం ఏ రూపంలో ఉన్నా సత్యనిరూపణమే దాని 'పరమేచ్ఛ' అనీ, హింసానిరసనమే దాని 'భవ్యాత్మ' అని కవితా ప్రయోజనాన్ని ప్రతిపాదిస్తూ నారాయణరెడ్డి రామకథ కేవలం రావణవధ కాదనీ అది— 'మానినీ మాన హింసాభిశంసన'మనీ, 'మానవోత్తమతా మహిత నిరూపణ'మనీ రామాయణ పరమార్థాన్ని తాత్త్వికంగా వ్యాఖ్యానించినాడు.

మూడవ ఖండంలో మహాప్రతిభామూర్తి వ్యాసుడు సృష్టించిన భారత కవితాప్రాశస్త్యాన్నీ, భగవద్గీతాశక్తినీ ప్రశంసించినాడు నారాయణరెడ్డి. వాల్మీకిలోని కవితావేశమే వ్యాసునిలోనూ ప్రవేశించి పంచమవేదంగా 'పరమ పౌరుషవాణి'గా పలికిందని తత్త్వానుశీలనం చేసినాడు కవి. అవధులు దాటని పురుషార్థాలను ప్రబోధిస్తూ అనేక ప్రవృత్తులున్న పాత్రలతో ఆసురత్వ దైవత్వాలు ఘర్షించిన అనేక సన్నివేశాలతో భాసించే భారతం తర్వాత వెలిసిన అనేకకావ్యాలకు భూమికగా నిలిచిందని ప్రవచించినాడు. భారతం మాతృమూర్తి - కావ్యాలు దాని పుత్రికలు అంటూ ఈ 'మాతృకాపుత్రికల భాష' మాత్రం కవిత్వమే అని ప్రకృతిలో వచ్చిన పరిణామమిదే అనీ ఇదే ప్రగతి అని కవితాత్మకంగా వ్యాఖ్యానిస్తూ నారాయణరెడ్డి ఈ ఖండాన్ని ముగించినాడు.

నాల్గవ ఖండం మహాకవికాళిదాసకవితాప్రతిభావిభూతిని సందర్శిస్తుంది. ప్రజ్ఞాచక్షువైన కాళిదాసు కృతులనూ ఆతడు సృష్టించిన పాత్రలనూ ఆతని కవిత్వ భాషాఛందస్సులను ధ్వనిరుచిరంగా సంక్షిప్తంగా వర్ణించినాడు నారాయణరెడ్డి. కాళిదాసుని 'కవితాత్మలోని అంశలే మహాంశువులే' మబ్బులనూ మానులనూ గిరులనూ తరులనూ సృష్టించినాయనీ, ఆ రసమూర్తి పొందిన అనుభూతులే భావించిన తలపులే ప్రకృతి ఋతువర్ణనలై ఋతుసంహారకావ్యంగా అవతరించినాయనీ, కాళిదాసప్రతిభ గరుత్తులెత్తినవేళ 'భూదివమ్ము లేకీకృతమై'నాయనీ, శకుంతలా మాళవికాది పాత్రసృష్టి జరిగిందనీ తత్త్వాన్ని కవితాత్మకంగా విడమరచి చూపినాడు. సత్యసుందరశివాత్మకమైన కాళిదాసకవిత్వం రసికులకు ఆస్వాద్యమనీ ఆగామియుగాలకు ఆరాధ్యమని ప్రశంసించినాడు.

ప్రపంచాన్నే ఒక నాటకరంగంగా దర్శించిన షేక్స్పియర్ సాహితీ ప్రతిభా వ్యక్తిత్వాలకు పట్టిన ధ్వన్యాదర్శం ఐదవ ఖండం. షేక్స్పియరు కృతుల శిల్పవైభవాన్నీ అతిశయాలకూ అసంఖ్యాకప్రవృత్తులకూ ప్రతీకలుగా నిలిచే ఆతని పాత్రల వైవిధ్యాన్నీ ధ్వనిమంతంగా ప్రశంసిస్తూ నారాయణరెడ్డి అన్ని పాత్రలను సృష్టించటం ఏ వ్యక్తికీ అనుభవసంగతం కాదనీ, ఆతని కవితయే 'లక్షలుగా సాక్షులుగా' ఆతని 'యెద అంచులపై' నిలిచిపోవడం వల్లనే అది సాధ్యమైనదనీ, బ్రహ్మాండాన్ని రంగస్థలంగా భావించటానికి భూమిక ఆ మనీషి కవితాహృదయమే అని ధ్వనింపజేసినాడు.

కవిత్వం ఏ వికటపరీక్షలకూలొంగదనీ, సర్వజ్ఞులైనా శర్వజ్ఞులైనా కవిని ధిక్కరించి ఆతని కవితాసంపదను అపహరించలేరని కవి సృజనాత్మక నైపుణ్యాన్ని నవనిధులతో కొనలేరనీ చాటిచెప్పిన పోతన్న స్వచ్ఛస్వేచ్ఛా కవిత్వవ్యక్తిత్వాలను ప్రతిపదమధురంగా వర్ణించే కవితామృతభాండం ఆరవ ఖండం. చైతన్యభాస్వరమైన పోతనస్వరాన్ని జనసమ్మతమైన ఆతని మతాన్ని భూత-సమకాలిక-ఆగామి కవులను సంభావించిన ఆతని వినయాన్ని ప్రశంసిస్తూ నారాయణరెడ్డి పోతన పదప్రయోగ సహజమాధురికి ఆతని శైలీలహరికి ముగ్ధుడై తానే పోతనగా జన్మించనందుకు 'హరీ' అని బాధపడ్డాడు. భాగవతంలోని గజేంద్రమోక్ష నృసింహోద్భవ బృందావన రాసకేళ్యాది సన్నివేశాలను ధ్వనింపజేస్తూ సంగీత సాహిత్యాలను మేళవించుకున్న పోతన రచనను మెచ్చుకున్నాడు. ఏకశిలలో శిరసెత్తిన ఆతని కవిత్వం అఖిలాంధ్రాన్ని శివమెత్తించిందని అభివర్ణించినాడు.

ఏడవ ఖండం వేమన్న సాహిత్యవ్యక్తిత్వాలను గూర్చిన కవితాత్మక వివేచనం. 'లోకవృత్తం లోతుముట్టిన' వేమన్న పలుకులు పతితల మతులకు పదునెక్కిస్తాయనీ, 'మానవుని తలపండు నొలిచిన' సూక్ష్మదృష్టి ఆతనిదనీ పల్లెయాసలో ప్రజలభాషలో ఎంత పదునూ ఎంత జీవమూ నిండివుంటుందో నిరూపించిన కవి అతడనీ, 'చిటిపద్యజాలం'లో విశ్వాంతరాళాన్ని పొదిగి, అందరికీ తెలిసేలా అనంతసత్యాలను చాటిన కావ్యతత్త్వం ఆతనిదనీ వివేచిస్తూ వేమన్నను ఈ తరానికి 'అభిమానకవి'గా నిలిపినాడు నారాయణరెడ్డి.

కవిత్వ వివిధాంశాలను గూర్చి అందంగా సిద్ధాంతీకరిస్తుంది ఎనిమిదవ ఖండం. ఆవిర్భవించిన నాటినుంచి నేటివరకు వేదపురాణకావ్యరూపకాది వివిధ ప్రక్రియా స్రవంతులుగా ప్రవహిస్తూ వస్తున్న కవిత్వం 'ప్రతి మానవ మాతృభాష' అని ఉద్ఘాటిస్తూ దాని నిత్యనూతనతనూ విశ్వజనీనతనూ ప్రకటించినాడు నారాయణరెడ్డి. ప్రకృతిలోని వివిధ పదార్థాలలో కనిపించే చైతన్యమే కవిత్వానికి మూలద్రవ్యమనీ, ఉల్లాసమే కవితకు కొత్త ఉచ్ఛ్వాసమనీ సామాజిక పరిస్థితులను బట్టి వ్యక్తుల భావరసస్థితినిబట్టి కవిత్వం తన రూపు మార్చుకుంటుందనీ వైతాళికత్వమే కవితాగుణమని, విప్లవాలలో తిరుగుబాటులలో 'కవితా స్వరముద్రికలు' ఉంటాయనీ, వర్గ వర్ణమతాలకు అతీతమైన మానవతావాదం కవిత్వానికి ఉంటుందనీ, అది విశ్వాత్మకమనీ నవనవంగా కవనమధురంగా ఘోషించినాడు. కవికి కవిత్వమే ప్రాణమనీ, ఊహకు మూలశక్తి 'సుందరసంస్పందన' అనీ, ఉక్తికి జీవశక్తి 'విప్లవ పరికల్పన' అనీ వీటి సమాహారమే కవితాత్మకు భూమిక అని ఆ కవిత విశాలవిశ్వానికి మాతృభాష అని సిద్ధాంతీకరించినాడు.

నవమఖండం విశ్వాత్మకమైన నారాయణరెడ్డి కవితాచైతన్యాన్ని ప్రపంచిస్తుంది. ఒకే ప్రకృతి క్షేత్రాన్నిబట్టి పేరూ స్వభావమూ మారుతుందనీ, ఒకే ప్రకృతి మనఃస్థితికి యథానుగతికంగా ఆకృతి ధరిస్తుందనీ, కవి మనోభావాలే ఆయాస్థితుల్లో కావ్యాలకు భూమిక లౌతాయని శిల్పరమణీయంగా సోదాహరణంగా నిరూపించినాడు.

మహోన్నతభావసంపన్నులై మానవతామూర్తులై త్యాగస్ఫూర్తులై తమ సిద్ధాంత వ్యక్తిత్వాలతో దేశాలనూ మానవుల హృద్దేశాలనూ వెలిగించిన వాళ్ళు లింకన్-మార్క్స్-గాంధి. వీరు ఏకవచన సంకేతితులే అయినా వీరిని అనుసరించిన వారు అనేక వచనంలో ఉన్నారు. వీరిలో ఒక్కొక్కరు సర్వశక్తులనూ సమస్తప్రవృత్తులనూ ఏకత్ర సంఘటపరచిన అనేకతామూర్తులని వ్యంగ్యస్ఫూర్తితో నిరూపించినాడు నారాయణరెడ్డి పదవ ఖండంలో.

వ్యక్తి శక్తిగా మారి సమాజప్రగతికై కృషిచేయాలని ప్రబోధిస్తూ నారాయణరెడ్డి స్వీయశాంతికాముకతనూ నిజకవితాలక్షణాలనూ చాటినాడు ధ్వనిమంతంగా పదకొండవ ఖండంలో.

వ్యష్టి లేనినాడు సమష్టిలేదనీ, వ్యక్తిత్వం లేక ఏ సృష్టి జరుగదనీ చెపుతూ 'జనజలనిధి'లో ప్రతిమనిషీ ఒక తరంగమని వ్యక్తికీ సమాజానికీ గల అవినాభావసంబంధాన్ని కవితాత్మకంగా వ్యాఖ్యానించినాడు నారాయణ రెడ్డి. తామే సర్వమని అహంకరించిన హిట్లర్, అలెగ్జాండర్ వంటి నియంత లకూ దురహంకారులకూ మానవవికాసచరిత్రలో విజ్ఞులు చోటివ్వలేదని ప్రపచించి ఈ కవి స్వీయవిశ్వజనీనదృక్పథాన్ని వ్యంగ్యవచోవైభవంతో ప్రకటించినాడు పన్నెండవ ఖండంలో.

శాంతసహనాల అవినాభావసంబంధాన్నీ, వాటి శక్తి సామర్థ్యాలనూ ఆ మహితగుణాలతో భాసిల్లే అంబరసాగరవిశ్వంభరలను వర్ణిస్తూ నారాయణరెడ్డి సహనం అవధులు దాటితే సర్వం విలయాత్మకమనే సత్యాన్ని కవితాత్మకంగా నిరూపించినాడు. సహనమున్నచోట నిశ్చలపరాక్రమం, శాంతమున్నచోట దుర్దాంతధీరత ఉంటుందని ప్రపంచిస్తూ శాంతసహనాలతో ఆసేతుహిమాచలాన్ని చలింపజేసిన మహాత్మగాంధి మహోజ్జ్వలశక్తిని సాదృశ్యంగా చూపినాడు. శక్తి సంపన్నాలైన శాంతసహనాలు నరజాతికి ఆదర్శం కావాలని వక్కాణించినాడు. దీనితో పదమూడవఖండం ముగుస్తుంది.

సామాన్యప్రజలే కదా అని వారిని నిర్లక్ష్యం చేయకూడదనీ, మట్టిమనుషుల్లో చెకిముకి రవ్వలుంటాయనీ, వట్టి చేతుల్లో పిడికిళ్లు లేస్తాయనీ, కొడవళ్లూ నాగళ్లూ అర్రెత్తి చిర్రెత్తి గర్జిస్తాయనీ, దోపిడి బుద్ధులకు ఓటమి, ప్రజాసంకల్పానికి విజయం తప్పదని తెలుసుకోవాలని ప్రబోధిస్తూ నారాయణరెడ్డి అందుకు నిదర్శనంగా రష్యాలో జారుపాలనకు వ్యతిరేకంగా సాగి విజయం సాధించిన సామ్యవాదాన్నీ, తెలంగాణాలో నిజాం పాలనకు విరుద్ధంగా సాగి గెలుపును సాధించిన ప్రజాస్వామ్యాన్ని చూపినాడు. "సహనానికి తొలి పాఠం క్షమాగుణం" అని వక్కాణిస్తూ క్షమాగుణభూషితులూ నరోత్తములూ అయిన సోక్రటీసు ఏసుల స్థిరసమచిత్తతను ప్రశంసించినాడు. 'గిరిలాగా సంకల్పం ధరియించీ—విరిలాగా సౌజన్యం విరియించీ" ముందుకుసాగే సమచిత్తులు అనవద్యులని ఆగామియుగాలకు ఆరాధ్యులని సహనగుణ ప్రశంసతో పద్నాలుగవఖండాన్ని ముగించినాడు కవి.

నారాయణరెడ్డి ఆశావాదాన్నీ కవితావ్యక్తిత్వాన్నీ వ్యక్తంచేసేది పదిహేనవఖండం.

భిన్నప్రకృతుల నియతసముచితసమ్మేళనం వల్ల మరొక నూత్న ప్రకృతి ఉదయిస్తుందని సృష్టితత్త్వాన్ని సోదాహరణంగా నిరూపిస్తూ ప్రగతి తిరోగతులకు భూమికగా 'మానవతకు నికషోపలంగా' నిలిచే మానవుని మనస్సును గూర్చి, దాని ఆశ్చర్యకర చైతన్యతత్త్వాన్ని గూర్చి సాదృశ్య రమణీయంగా వ్యాఖ్యానించినాడు పదహారవ ఖండంలో నారాయణరెడ్డి. వాయురగ్నుల సమ్మేళనం వల్ల జలమూ, వెలుగు చీకట్ల ఆలింగనం వల్ల దృశ్యమూ, సునిశిత పురుష ప్రకృతుల సున్నితమైన స్త్రీ ప్రకృతుల కలయిక వల్ల అభినవరూపమూ ప్రభవిస్తాయని సృష్టి రహస్యాన్ని విడమరచి చూపినాడు. సూర్యాదిగ్రహాలూ తారకలూ జడములైనా అవి తమ గతులూ శ్రుతులూ తప్పవు. వాటిది పరహితబుద్ధి, సంయమసిద్ధి. కానీ చైతన్య స్వభావుడూ అనితర ప్రజ్ఞాప్రభావుడూ అయిన మానవుడు తన గతినీ లయనూ తప్పుతూ కాని దారిని తొక్కుతున్నాడు. ఇందుకు కారణం మానవుని వింతమనస్సే. ఈ మనస్సే మానవునికి 'మూలధాతువై' ఆతని "ప్రగతికి తిర్యగ్గతికీ, పతనోత్థాన స్థితికీ" మానవత్వానికీ హేతువై నిలుస్తున్నదని తత్త్వ ప్రతిపాదనం చేసినాడు. బ్రహ్మ విశ్వామిత్రరావణుల జీవితరేఖలను సూచిస్తూ వారు గతి తప్పడానికి వారి మనస్సే కారణమని ఉదాహరణలెత్తి చూపినాడు. దీనితో పదహారవ ఖండం ముగుస్తుంది.

అనాదిగా వస్తున్న అహింసాకథను దాని వైశిష్ట్యాన్ని చారిత్రకభూమికతో కవితాసురభిళంగా విలోకించడం జరిగింది పదిహేడవ ఖండంలో. విశ్వవిజేత అలెగ్జాండరు ధరాలుబ్ధుడు. యశోముగ్ధుడు. పరధరాక్రమణం, పరజీవహరణం కీర్తికి పునాదులనుకున్నాడుకాని అది కీర్తికాదు—'పాశవికమౌ అజీర్తి' అని ఆతని చర్యను విరసిస్తూ నారాయణరెడ్డి, చంపగలిగికూడా పడగెత్తిన కత్తిని విసిరేసి శాంత్యహింసలను విస్తరింపజేసిన అశోకుణ్ని—'హృదయవిజేత' అని ప్రశంసిస్తూ చరిత్ర అశోకుణ్ణే స్మరిస్తుందని ఉద్ఘాటించినాడు. అహింసాసిద్ధాంతం ఇప్పటిది కాదని, వేదసూక్తుల్లో ప్రోక్తమైన ఆ అహింస నిత్యజీవితంలో లోపించి యజ్ఞయాగాదుల్లో చిక్కువడి, శునశ్శేపుని 'రుధిరరోదనం'లో నిహతమై గౌతమబుద్ధునిలో పునరవతరించిం

చని అన్నాడు. గౌతముని 'తేజశ్శాఖి'గానూ. అశోకుని అందలి ఒక 'శాఖ' గానూ వర్ణిస్తూ ఆశాఖ 'నిరంతర పల్లవాత్మకం' అంటూ అశోకుని అహింసాత్మకతతో ఈ ఖండాన్ని ముగించినాడు కవి.

పుట్టిన నాటినుంచి నేటిదా॥ మానవుడు సాధించిన ప్రగతినిగూర్చి, ఇంకా సాగిస్తున్న కృషినిగూర్చి నారాయణరెడ్డి చేసిన కవితావిహంగావలోకనమే ఈ కావ్యంలోని చివరిఖండం. ఈ మనిషి దైవశప్తుడా? మనిషికి స్వర్గచ్యుతి ప్రతిబంధకమా? అని ప్రశ్నిస్తూ ఈ కవి ఆదిమానవమిథునం (ఆడం ఈవ్‌ల) ప్రసక్తి తెచ్చి, మానవుడు తొలిదశనుంచి ఈనాటివరకు వైజ్ఞానిక కళాత్మకదశకు ఎలా చేరుకున్నాడో, ఆతడు విజ్ఞాన కళాసామ్రాజ్యాలను విస్తరింపజేస్తూ పంచభూతాలనూ మృత్యువునూ జయించాలని నిరంతరం కృషిని ఎలా సాగిస్తూనే ఉన్నాడో కవితాత్మకంగా చెప్పినాడు. మానవుణ్ణి 'చచ్చిబ్రతికేటి స్వయంభువుడు'గా వర్ణించినాడు. ఈ విధంగా మనిషినీ ఆతని చైతన్యాన్నీ ఆతని సంస్కృతినీ భూమికగా గ్రహించి నారాయణరెడ్డి ఈ కావ్యాన్ని రచించినాడు. మానవుని బహుముఖీన చైతన్యాంచలాలనన్నింటిని సందర్శించి వర్ణించి దర్శింపజేసినాడు సహృదయులకు.

అన్ని కావ్యాలలో వలెనే ఈ కావ్యంలోనూ నారాయణరెడ్డి కవితావ్యక్తిత్వాన్ని దర్శించవచ్చు. ఈతనికి-"కవితాస్పర్శనంలేని పవనం పరిమళరహితం - కవితాదర్శనంలేని భువనం శూన్యతాహతం." ఈ కావ్యంలోని తొమ్మిదవఖండం ఆతని విశాలకవితామూర్తి అనంతమనోహర చైతన్యాన్ని వ్యక్తం చేస్తుంది. అఖండానంతచైతన్యంలో తానూ ఒక ఖండంగా భావిస్తాడు నారాయణరెడ్డి. అందువల్లనే ఆతడు - "ఒక మహాగ్నిగోళానికి-శకలంగా విడిపోయిన స్ఫులింగాన్ని" అన్నాడు. మళ్లీ ఆ మాతృగోళమందుకునేవరకు తాను చిత్రించిన గీతలను కప్పుకుంటూ, జాగ్రత్తగా మహోల్కలను తప్పించుకుంటూ, గుండెలో అనలద్రవ భాండాలను నొక్కివుంచి తన భ్రమణం సాగిస్తున్నానని చెప్పుకున్నాడు. అనంతగోళంలో ఖండమైనా ఆతని కవితామూర్తి భూమ్యాకాశాలను ఆవరించివుంది. విశాలప్రకృతిచైతన్యసౌందర్యాలకు పాఠాంతరంగా ఉంది. పక్షులే ఆ మూర్తి దృగంతాలు. ఆకాశం ఉచ్ఛ్వాసం. ఆ మూర్తి కదుష్ణనిశ్వాసఘోషలో పుట్టినాయి జలదాలూ చుక్కలూ చంద్రాదిగ్రహాలూ. ఆ మూర్తి

కనుబొమలదిరితే సర్వంసహామండలం చలిస్తుంది. ఉద్వేగం ఉదయిస్తే ఉదధుల్లో ద్వీపాలు ఉదయిస్తాయి. ఆ కవితామూర్తి అంబరమంటగా నిలిస్తే గిరిశిఖరాలు ఎదుగుతాయి. నవ్వితే గంగావోల్గాదినదులు పొంగుతాయి. ఆ మూర్తి చల్లని ఊపిరి తాకితే 'జలధితరంగాలు' ఎగురుతాయి. ఆ మూర్తి చూపులు సోకితే 'శంపాకురంగాలు' పరుగెత్తుతాయి.

నారాయణరెడ్డి అభ్యుదయకవితాదృక్పథం రచనావైశిష్ట్యం పదకొండవ ఖండంలో ప్రస్ఫుట మవుతుంది. సమరవైముఖ్యాన్నీ శాంతిప్రియత్వాన్నీ ప్రకటించినాడు. ఆతడు విసిరిన 'స్వరవిహంగం' రణైకవ్రత్తుల చెవి తలుపుతట్టి వారి 'రణగుణధ్వనులన్ని' మాన్పించి వారికి శాంతి వసంత లక్ష్మీచరణ శింజినీధ్వనులు' వినిపించి ఆతని గళంలో ప్రవేశిస్తుంది. ఆతడు విసిరిన చూపు భానుచంద్ర తారాతతిని పలికించి తిరిగి ఆతని కంటిలో వెళ్లిపోతుంది. ఆతడు విసిరిన 'వాగ్వీచి' లో జానపదుల నుడుల గరికపచ్చదనం, పౌరపదుని ప్రౌఢపదాల గులాబీ పరిమళం, ముగ్ధప్రణయమరందం, వాత్సల్యామృతరసం, విప్లవప్రబోధం తరంగితమవుతుంటాయి.

నారాయణరెడ్డి విశ్వజనీన దృక్పథం, ప్రగతి ప్రస్థానం పన్నెండవ ఖండంలో ప్రస్ఫుటమవుతుంది. వ్యష్టికీ సమష్టికీ అవినాభావసంబంధ ముందని భావించే ఈకవి తన అకుంఠితగమనంలో యుగప్రగతి ఉందని ముక్తకంఠంతో పలుకుతాడు. తన త్యాగం తనశక్తి జగచ్ఛ్రేయంకోసం ఉపయోగపడాలని గాఢంగా వాంఛిస్తాడు. ప్రతి యుగంలో తన ప్రగతిని ఏదో ఒక కుశక్తి ప్రతిరోధిస్తున్నదని, గతంలో భూజాతను దొంగిలించిన దశకంధరత, ద్రౌపదిని వెంట్రుకలు పట్టి ఈడ్చిన దుశ్శాసనత, మహాత్ముని కాల్చిన మతమూఢత అటువంటి కుశక్తులే అని వివరిస్తూ, అయినా ఆ దుశ్శక్తులు తన ప్రగతిని ఆపలేవని నొక్కివక్కాణిస్తాడు. నీతి కొరకు మంచికొరకు నిలిచేవ్యక్తిని కోటిగొంతులతో నుతిస్తూ, సమాజం కొండంత బలాన్ని అందిస్తుందనే ప్రగాఢ ప్రత్యయాన్ని ప్రకటిస్తూ, తన వచనం బహువచనమని ఘోషిస్తాడు.

తన ఆశయకేంద్రం సంద్రమనీ, తన 'శాంతం బడబాశిఖి' అని ప్రవచిస్తూ సహేతుకంగా దానిని వివరించినాడు. మబ్బుల్లో జన్మించే ఇరమ్మ

దాగ్ని మబ్బులను మాడ్చేస్తుంది. అడవిలోని దావాగ్ని అడవిని కాల్చేస్తుంది. కానీ కడలిలో అణగివున్న బడబాగ్ని మండదు. సముద్రహృదయాన్ని మండించదు. సహనం సాగరం. శాంతం బడబానలం. సహనం సౌధం లాంటిది. శాంతం పునాది లాంటిది. తనలో ఎంతతపన ఉన్నా ఎంత మథన మున్నా సాగరం హద్దులను దాటదు. అలల వీవనలతో పథికుల ఎదలను స్పందింప జేస్తుంది. సముద్రం ఉదారతకూ గభీరతకూ ఓరిమికీ మగటిమికీ ప్రతీక. అది నిత్యచైతన్యముఖి. ఇంటిపేరే చైతన్యమని చెప్పుకున్న నారాయణరెడ్డికి అందుకే సంద్రం ఆశయకేంద్రం అయింది. ఈ విధంగా నారాయణరెడ్డి కవితావ్యక్తిత్వాన్ని ఈ కావ్యం అభివ్యక్తం చేస్తున్నది.

జగత్కల్యాణకాంక్ష ఆత్మదఘ్నంగా ఉన్నది నారాయణరెడ్డికి. అందుకే ఆతని ఖండకావ్యాల్లో ప్రబోధగుణం ఆకాశంలా ఆవరించి ఉంటుంది, ఈ కావ్యంలోని పదకొండవ పన్నెండవ పధ్నాలుగవ ఖండాల్లో ఆతని ప్రబోధాన్ని దర్శించవచ్చు.

> "భూసారమై నేను వేళ్ళలో చొచ్చుకొని
> పోయినపుడే పచ్చగిలు చెట్టు ;
> రాగిల్లు పల్లవవిలాసాలు
> రంగురంగుల సుమసమాసాలు"

వంటి పంక్తులను ఇందుకు తార్కాణంగా గ్రహించవచ్చు. ఈ పంక్తుల్లోని 'నేను' విశ్వాత్మకు ప్రతీక. నేను అన్నది మినహాయిస్తే ప్రతి మనిషికీ వర్తిస్తుంది. నారాయణరెడ్డి ప్రబోధం ఎప్పుడూ వాచ్యంగా నినాదంలా ఉండదు. వ్యంగ్యంతో పరిమళిస్తుంటుంది. సమాజప్రగతి వ్యక్తి శక్తిపై త్యాగశీలంపై ఆధారపడిఉందనే యాథార్థ్యాన్ని సాదృశ్యరమ్యంగా ప్రకటిస్తు న్నాయి ఈ చరణాలు.

వ్యక్తిత్వం లేక సృష్టి జరుగదనే విషయం సత్యమే అయినా ప్రతి వ్యక్తీ సృష్టిలో తాను ఒక— "జీవాణు"వనీ, 'ఊరి ఆలమందలోని ఒక ధేను'వనీ, 'జనజలధరతతి'లో తానొక 'మెరుపు'నని భావించాలని, తామే సర్వమని నిక్కిన హిట్లర్ల అలెగ్జాండర్ల గతిని జ్ఞాపకం చేస్తూ వ్యక్తిత్వం

పెంచుకుంటూనే వినయంగా వర్తించాలని ప్రబోధిస్తాడు. సామాన్యప్రజలను తృణీకరిస్తే విప్లవాలు ప్రజ్వలిస్తాయని హెచ్చరిస్తాడు.

నారాయణరెడ్డి ఆదినుంచే ఆశావాది. ఈ కావ్యంలోని పదిహేనవ ఖండంలో ఆతని ఆశావాదాన్ని అవలోకించవచ్చు. 'ఆశావాదం మనిషికి ఆరో ప్రాణం' అన్న ఆతని సూత్రానికి ఈ క్రింది పంక్తులు ఉదాహరణాలు.

"కార్కొన్న మహాంధకార
కారాటవి గుబురులోన
చాలునొక్క వేగుచుక్క
చండ తమస్సును చీల్చగ."

మనిషిని మనీషిగా తీర్చిదిద్దేవి ఆతని మనోగతసుగుణాలు. ఆ సుగుణాలవల్లనే మనిషి సమ్యక్ కృతులను చేయగలుగుతున్నాడు. ఆ సత్కార్య నిర్వహణవల్లనే మానవత వికసిస్తున్నది. ఆ వికాసంవల్లనే మానవుడు క్రమక్రమంగా యుగానుగుణంగా మరింత ప్రగతిని సాధించగలుగుతున్నాడు. మానవునిలోని సత్యాహింసలు, శాంతసహనాలు, చైతన్యత్యాగాలు, క్షమా సమతలు, ఉదరతాగభీరతలు మున్నగు సుగుణాలే మానవతకు రూపకల్పన చేసి ప్రాణంపోసేవి. అందుకే నారాయణరెడ్డి మానవుని క్రమపరిణామాన్నీ నాగరికతనూ రేఖామాత్రంగా పరిశీలిస్తూనే ప్రధానంగా మానవతావికాసానికి దోహదంచేసి మానవచరిత్రను మహోజ్జ్వలంచేసిన మహితాత్ముల మానవోత్తముల జీవితసన్నివేశాలను దిఙ్మాత్రంగా కవితామనోజ్ఞంగా చిత్రించినాడు ఈ కావ్యంలో. సత్యధర్మత్యాగక్షమాదిసుగుణాలను తమ కావ్యాల ద్వారా ప్రబోధిస్తూ మానవతను చాటిన మహాకవుల జీవితరేఖలను గీస్తూనే విశ్వజనీనమైన వారి కృతులను వర్ణించినాడు. పాంచభౌతికమైన ప్రకృతిని ప్రతిభాచక్షువై అందలి మానవతాంశాలను దర్శించి వర్ణించినాడు.

ఆదిఋషులు వేదఋక్కులద్వారా వాల్మీకి రామాయణం ద్వారా వ్యాసుడు భారతం ద్వారా కాళిదాసు కావ్యాదుల ద్వారా షేక్స్పియరు రూపకాల ద్వారా పోతన భాగవతం ద్వారా వేమన్న పద్యాలద్వారా మానవతను ప్రబోధించినవారే. అందుకే ఈ కావ్యంలో వారి కవితాప్రతిభా వ్యక్తిత్వ ప్రశంస లగుపిస్తాయి. అలాగే తమ జీవితాలద్వారా శాంత్యహింసలను ప్రబోధించిన

గౌతముడూ అశోకుడూ, క్షమాసమతలను ప్రబోధించిన ఏసూ సోక్రటీసూ, వర్ణభేదాలు వద్దని ఘోషించిన లింకన్, శ్రామికవర్గచైతన్యాన్ని ప్రబోధించిన మార్క్సు, భారతావనికి స్వాతంత్ర్య భాగ్యాన్ని ప్రసాదించి, సత్యాహింసలను ప్రబోధించిన మహాత్మగాంధీ—వీరందరూ నారాయణరెడ్డి ఈ కావ్యానికి వస్తువైనారు. అంతేకాదు — అంబరం, సాగరం, భూమండలం సహనానికీ శాంతానికీ ప్రతీకలు. విశేషించి నిత్యచైతన్యానికీ ఔదార్యానికీ గాంభీర్యానికీ పగటిమికీ సముద్రం ప్రతీక. అందుకే అది ఈ కవికి ఆశయ కేంద్రమయినది. పరప్రాణహంతకులై నియంతలై మానవతాభంజకులై తామే సర్వమనుకుని అహంకరించిన అలెగ్జాండరునూ హిట్లరునూ నారాయణరెడ్డి నిరసించినాడు. కనిత్వానిది మానవతావాదం కావుననే ఈ కావ్యం ఎనిమిదవఖండంలో కవితాస్వరూపమూలద్రవ్యగుణాది విశేషాల రమణీయవివేచనచోటుచేసుకున్నది· విశ్వాత్ముడై మానవత్వమే ఇతివృత్తంగా నిరంతరం సాహితీసృష్టి చేస్తున్న ఈ కవి కవితావ్యక్తిత్వం కూడా ఈ కావ్యంలో వర్ణితం కావడం సమంజసమే. ఇలా మానవతను పద్దెనిమిది ఖండాలలో ప్రసరింపజేస్తున్న ఈ 'భూమిక' కావ్యం 'మానవతాగీత'గా భాసిస్తున్నది.

ఒక కవి రచించిన కావ్యాలలోని కొన్ని భావాలూ అంశాలూ తర్వాత వెలువడే ఆతని కావ్యాలలో మరింత రమణీయంగా విపులంగా ఆయా సందర్భాలలో చోటుచేసుకోవడం సహజం. నారాయణరెడ్డి ఈ 'భూమిక' కావ్యంలో విస్తృతంగా వివరింపబడిన కొన్ని అంశాలకు భూమికలు ఇతఃపూర్వం వెలువడిన ఆతని ఖండకావ్యాలలో బీజప్రాయంగా ఉన్నాయి. వాటిని ఇక్కడ చూపించడానికి ప్రయత్నిస్తాను.

'జలపాతం' కావ్యంలో 'మానవతా', 'శాస్త్రజ్ఞులకు' అనే శీర్షికలలో, 'అక్షరాలగవాక్షాలు' కావ్యంలోని 'మానవ గీతం' కవితలో, 'ఉదయం నా హృదయం'లోని 'ఎక్కడున్నావు మానవతా' అనే ఖండికలో క్రమంగా నారాయణరెడ్డి మానవతా దృక్పథం, సమరవైముఖ్యం, శాంతిప్రియత్వం, మానవతాచరిత్రను మహోజ్జ్వలం చేసిన మహనీయుల ప్రశంస కనిపిస్తాయి. 'నారాయణరెడ్డి గేయాలు' కావ్యంలోని 'వింతమానవుడు' కవితలో రకరకాల మానవుల వింతమనస్తత్త్వాలు చిత్రింపబడినాయి. 'మంటలూ మనవుడూ'

కావ్యం. 'ముఖాముఖి'లోని 'ఒకే ఒక్క దీపం' అనే కవిత, 'మనిషీ-చిలక' కావ్యం ఈనాటి మానవుని మహోజ్జ్వలచైతన్యశక్తిని వ్యక్తీకరించినాయి. ఈ కావ్యంలోని వాల్మీకి ఆతని కృతినిగూర్చిన ప్రశంసకూ అంశాత్మక భూమిక 'నారాయణరెడ్డి గేయాలు' కావ్యంలోని 'శోకః శ్లోకత్వమాగతః' అన్న ఖండికలో ఉంది. ఇదే కావ్యంలోని 'మేఘసందేశం' అనే కవిత కాళిదాసకవితావ్యక్తిత్వాన్ని అభినుతిస్తున్నది. ధనదశాపం లేదనీ, ఒక్కనాడు కూడా విరహంలేదనీ, యక్షయువకుడు పుష్కలావర్తకాన్ని నిలిపి సందేశమివ్వలేదనీ, మేఘశకలం ఆతని సందేశం వినలేదనీ చెపుతూ

"కాళిదాసుని హృదయ
కందరమ్ములలోన
అణగారు విరహమే
అక్షరత్వము దాల్చె
కాళిదాసుని భావ
కల్పనావేశ ఫల
మేకదా యీ నాటి
మేఘ సందేశమ్ము"

అని కాళిదాసుని గూర్చి 'నారాయణరెడ్డి గేయాలు'లో వ్రాసిన ఈ కవి ఈ 'భూమిక'లో—

"మబ్బేమిటి
మానేమిటి
గిరులేమిటి
దరులేమిటి
అన్నీ కవితాత్మలోని
అంశలే మహాంశువులే"

అని అన్నాడు. శబ్దాలు వేరైనా రెండు ఖండికల్లోని భావం ఒకటే. అందుకు భూమిక కవితాకల్పనపట్ల నారాయణరెడ్డికి నాటినుంచి నేటికీ ఉన్న నిశ్చితాభిప్రాయం.

పోతన కవితా వ్యక్తిత్వాలను గూర్చి నారాయణరెడ్డి గతంలో 'మందార మకరందాలు' అనే పేర కమనీయంగా వ్యాఖ్యానించినాడు. ఇక వేమన్న కవితాత్మపై ఈ కవి 'వ్యాసవాహిని'లో ఒక చక్కని వ్యాసం వ్రాసినాడు. మహాత్మగాంధి మహనీయ వ్యక్తిత్వాన్ని గతంలో 'మరోహరివిల్లు', 'ఉదయం నా హృదయం', 'మార్పు నా తీర్పు', 'ఇంటిపేరు చైతన్యం' వంటి కావ్యాలలో చిత్రించటమే గాక ఆతని వచనసూక్తులను 'గాంధీయం' పేర గేయానువాదకృతినే రచించినాడు. ఇక మానవతామూర్తులైన గౌతమబుద్ధ ఏసు సోక్రటీసులను గూర్చిన ప్రసక్తి 'ఉదయం నా హృదయం' కావ్యం లోని 'ఎక్కడున్నావు మానవతా' శీర్షికలో, 'మార్పు నా తీర్పు' కావ్యంలోని 'రెండూ-ఒకటి' శీర్షికలో రేఖామాత్రంగా ఉన్నది. దేశకల్యాణం కోసం ప్రాణాలర్పించిన మానవతామూర్తుల త్యాగపురుషుల పేర్లు తలపునకు వస్తే చాలు నారాయణరెడ్డి కవితాహృదయం పాలసంద్రమై పరవళ్లు తొక్కుతుంది. రసావేశంతో ఆతని కలం అలలు అలలుగా కవితలను సృష్టిస్తుంది. ఈ కారణం చేతనే ఈ మానవతా మూర్తులను ఒక్క ఈ 'భూమిక'లోనే కాదు గతంలోని ఖండకావ్యాల్లోనూ, దీని తర్వాత రచించిన 'మృత్యువు నుంచి' 'విశ్వంభర' కావ్యాలలోనూ వర్ణించినాడు నారాయణరెడ్డి.

కవిత్వం పట్ల తనకుగల అభిప్రాయాలను మొట్టమొదటిసారిగా నారాయణరెడ్డి 'నారాయణరెడ్డి గేయాలు' అనే కావ్యంలో 'శోకః శ్లోకత్వమాగతః' అనే శీర్షికలో కవితాత్మకంగా ప్రకటించినాడు. ఆ తర్వాత 'ఆధునికాంధ్రకవిత్వము' అనే పరిశోధనాగ్రంథంలో సమగ్రంగా పరిశీలించినాడు. నారాయణరెడ్డి తెలుగుశాఖలో ఆచార్యుడే కాదు, తెలుగు కవితకు కూడా ఆచార్యుడే. కవిత్వంలో వస్తున్న యుగోచితపరిణామాలను నిశితదృక్కుతో పరిశీలిస్తూ విద్యార్థియువకులకు బోధిస్తున్నాడు. కవిత్వం మానవతాపురోగతికి ఎలా కృషి చేయగలదో తెలపడానికే ఈ 'భూమిక'లోని ఎనిమిదవ ఖండాన్ని రచించినాడు. ఇక 'భూమిక' తొమ్మిదవ పదకొండవ పన్నెండవ పదిహేనవ ఖండాలలోని నారాయణరెడ్డి కవితా వ్యక్తిత్వానికి భూమిక ఆతని అన్ని ఖండకావ్యాలలోనూ ఉన్నది. విశేషించి ఈ కవియే 'మధ్యతరగతి మందహాసం' 'మరోహరివిల్లు', 'ఉదయం నా హృదయం'

'మార్పు నా తీర్పు' 'తేజస్సు నా తపస్సు' 'ఇంటిపేరు చైతన్యం' కవితా సంకలనాలలో స్వయంగా తన కవితావ్యక్తిత్వాన్ని చాటుకున్నాడు. ఈ కావ్య శీర్షికలన్నీ ఈ కవి వ్యక్తిత్వదర్పణాలే. 1973లో 'ఉదయం నా హృదయం'లో తన కవితావ్యక్తిత్వాన్ని గూర్చి చెప్పుకున్న 'నా వచనం బహువచనం', 'కవిత్వం నా మాతృభాష', 'నా శాంతం బడబాశిఖి' అనే సూత్రప్రాయమైన పంక్తులే ఈ 'భూమిక'లో సోదాహరణంగా కావ్యమర్యాదలతో నిరూపింపబడినాయి. అందలి 'కవిత్వం నా మాతృభాష' అనే పంక్తి ఈ కావ్యంలో—

"పల్లవించిన ప్రథమ కవితయె
ప్రకృతి పలికిన మాతృభాష" (పుట 6)
"మాతృకా పుత్రికలు పలికిన
మాతృభాష కవిత్వఘోష" (పుట 16)
"ప్రవహిస్తూవున్న కవిత
ప్రతిమానవమాతృభాష" (పుట 34)
"ఆ కవితయె విపుల విశ్వ
మంతటికీ మాతృభాష" (పుట 38)

అన్న పంక్తులుగా రూపుదిద్దుకుని కవితాస్వరూపాలైన వేదఋక్కులకూ, రామాయణ మహాభారతాలకూ, కావ్యనాటకాలకూ సమన్వయింప జేయబడినాయి. ఏ యుగంలో వెలిసినా కవితాత్మ ఒకటే. కవితాలక్ష్యం ఒకటే అన్న యాథార్థ్యాన్ని ఈ పంక్తుల్లో ప్రకటించినాడు.

నారాయణరెడ్డికి మొదటినుంచి సముద్రమంటే చాలా ఇష్టం. సముద్రం తన గుండెలో బడబాగ్ని ఉన్నా, తన మేనిపై తరంగాలు ఉవ్వెత్తుగా పొంగినా స్థైర్యంగా సహనశీలంతో అవధులు దాటక ఉండడమే అందుకు కారణం. ఆతని ఈ హృదయం ఇతఃపూర్వం వెలువడిన అనేక కావ్యాలలో ప్రకటితమైనది.

"బడబాగ్నులను గుండె - యొడిలోన ముడుచుకొని
జలచామరముల వి - శ్వంభరను లాలించు

శివమెత్తి కొనుచు వ - చ్చెడు వేదనోర్మికల
నొక మహాయోగి పో - లిక నిగ్రహము సేయు"
('దివ్వెలమువ్వలు' కావ్యంలోని 'కడలేని కడలి'లో)

"సముద్రగర్భంలో కూచుని
సరిగమ లేరుకుంటున్నాను"
('మధ్యతరగతి మందహాసం'లో)

"బడబాగ్ని మండుతుంది"

"ఇది అనంతకాల సందీప్తం" ('మంటలూ-మానవుడూ'లో)

ఈ భావాలే నారాయణరెడ్డికి తర్వాత కావ్యమైన 'ఉదయం నా హృదయం'లో 'నా శాంతం బడబాశిఖి' అనీ, 'బడబాగ్నిబడిలో పాఠాలు నేర్చే ప్రహ్లాదుణ్ణి' అనీ చెప్పుకోవడానికి భూమికగా పనిచేసినాయి. ఈ పంక్తులే ఈ 'భూమిక' లోని పదిహేడవ ఖండంలో సహేతుకంగా ఇలా వివరింపబడినాయి.

"ఉదాంతకు గభీరతకు
ఓరిమికీ మగటిమికీ
ప్రతీకగా నిలిచిన సం
ద్రం నా ఆశయకేంద్రం

ఆ సంద్రం నిత్యం చైతన్యముఖి
అందుకనే నా శాంతం బడబాశిఖి"

ఇక ఈకవి ప్రబోధగుణప్రాబల్యాన్నీ ఆశావాదాన్నీ ఆతని ఖండకావ్యా లన్నింటిలోనూ దర్శించవచ్చు.

"ఆకాశాత్ వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః
అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోఽన్నం
అన్నాత్ పురుషః.... .... .... ...."

ఆకాశం అనిలానికి భూమిక. అనిలం అగ్నికి భూమిక. అగ్ని అంబువుకు భూమిక. అంబువు పృథివికి భూమిక. పృథివి ఓషధులకు భూమిక. ఓషధులు అన్నానికి భూమిక. అన్నం పురుషునికి భూమిక. ఇలా కార్యకారణశీలమైన సృష్టిక్రమం జరిగిందని ఉపనిషత్తు చెపుతున్నది.

కావ్యసృష్టికి కవి ఆవేశమే భూమిక. ఈ 'భూమిక' కావ్యవిశేషసృష్టికి భవ్యరసావేశశీలుడైన నారాయణరెడ్డి మానవతాదృక్పథమే భూమిక. మానవతకు భూమిక చైతన్యశీలమైన మనిషి మనస్సు. అందుకే-

"ఆ మనిషే పల్లవి ఈగీతికి
ఆరిపోని పరిణామ జ్యోతికి
ఆ చైతన్యమె ఆకృతి ఈకృతికి
ఆది భూమిక సకలజీవసంస్కృతికి"

అంటూ ఈ కావ్యాన్ని ముగించినాడు కవి.

నారాయణరెడ్డి ప్రతిభాగరిష్ఠుడు, ఈ కావ్యంలోని ప్రతిఖండం ఆతని అఖండ ప్రతిభామహత్త్వకు అక్షరతార్కాణం. ఆతని రచనాసంవిధానశిల్పం ఈ కృతిలో శతపత్రమై విరిసింది. ఒక్కొక్క ఖండాన్ని ఎత్తుకోవడంలో తళుక్కుమంటుంది ఆతని ప్రజ్ఞ.

కవుల జీవితాలలోని ప్రధానమైన ఒక సన్నివేశంతోనో వారి కృతి ప్రశంసతోనో లేదా వారు అందించిన సూక్తితోనో కొన్నిఖండాలు ప్రారంభమవుతాయి. ఉదాహరణానికి- రెండవఖండం వాల్మీకి మానిషాదశ్లోకోద్భవసన్నివేశంతో ప్రారంభంకాగా మూడవ ఖండం భగవద్గీతా ప్రశంసతో మొదలవుతుంది. ఐదవ ఖం ం షేక్స్పియరు ఉద్ఘోషించిన 'ప్రపంచమే ఒక నాటకరంగం' ('All the world is a stage and all men are merely players') అనే సూక్తితో ఆరంభమవుతుంది. కవితాజగత్తును గూర్చిన వివిధాంశవిమర్శతో ప్రారంభమవుతుంది ఎనిమిదవ ఖండం. స్వీయ కవితావ్యక్తిత్వరేఖలను చిత్రించే ఏదైనా ఒక సిద్ధాంతప్రతిపాదనతో ప్రారంభమవుతాయి తొమ్మిది-పది-పదకొండు-పన్నెండు-పదమూడు-పదహారు ఖండాలు. చారిత్రకఘటనతో పద్నాలుగవ ఖండం, ఆశావాదంతో పదిహేనవ ఖండం మొదలవుతాయి. చివరి ఖండం ఆదిమానవమిథునసన్నివేశంతో ప్రారంభమై మానవక్రమప్రగతిచిత్రణతో ముందుకు సాగుతుంది. ఇలా ఈ కావ్యఖండాలను ప్రారంభించడంలో ఇంత వైవిధ్యం కనిపిస్తున్నది.

అక్కడక్కడ ఔచితీదృష్టితో కవుల శ్లోకాలను కొంతకొంత తెనిగిస్తూ పదప్రయోగంచేత మూలశ్లోకస్ఫురణ కలిగించటం కవి నిర్వహించిన మరో రచనాశిల్పం. మచ్చుకు కొన్ని--

మూడవఖండంలో— 'ఉపనిషత్తులు గోవులట' అనగానే "సర్వోపనిషదో గావో దోగ్ధాగోపాలనందనః" అనే శ్లోకం. నాల్గవఖండంలో— 'కామార్తుడుకాడు' అనగానే- "ధూమజ్యోతిస్సలిలమరుతాం............ కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనాచేతనేషు" అనేశ్లోకం, 'ఏమవి వాగార్థాలా' అనగానే "వాగార్థావివసంపృక్తౌ" అనేశ్లోకం- చప్పున మనకు స్ఫురిస్తాయి.

కవుల గ్రంథాలలోని కొన్ని సన్నివేశాలను ఉక్తిచమత్కారంతో పేర్కొని వాటికి తత్త్వవ్యాఖ్యానం చేస్తాడు. మూడవ ఖండంలో ద్రౌపదీ వస్త్రాపహరణ సన్నివేశం, గోపికల రాసక్రీడాసన్నివేశంలాంటివి.

ఆయా సన్నివేశాలలో కవుల పద్యాలలోని కొన్ని మాటలనే ప్రయోగించి కవుల మూలపద్యస్ఫూర్తిని కలిగించటం. ఉదాహరణానికి— మూడవ ఖండంలో 'కొన్ని మెత్తని పులులు' అనే మాటలవలన- 'అనయము పుట్టె జూదమున' అనే తిక న పద్యం, ఆరవఖండంలో— 'ఒక గుండె హడలి కూయిడినపుడు' అనే పంక్తిలో 'కూయి' అనగానే పోతన 'అలవైకుంఠ పురంబులో' పద్యం, 'మేడిపండును మేలిమంటివి' అనగానే- 'మేడిపండు చూడ మేలిమై యుండును' అన్న పద్యం సహృదయుల గుండెలకు తాకుతాయి.

కవుల పేర్లను చెప్పకుండ, వారు సృష్టించిన పాత్రల మనస్తత్త్వాలను సంక్షిప్తంగా చిత్రిస్తూ పాత్రలను ధ్వనింపజేసినాడు నారాయణరెడ్డి. మూడవ ఖండంలో మహాభారతంలోని పాత్రలూ ఐదవ ఖండంలో షేక్స్పియరు పాత్రలూ ధ్వనిస్తాయి. ఇలా శ్లోకపద్యాలను స్ఫురింపజేయడంలో ఆతనికి ఉన్న ఉపజ్ఞ, పురాసాహితీపర్యాలోకనాసామర్థ్యం ద్యోతకమవుతాయి. ఆయా కవుల ప్రతిభాపాటవాలను విడమరచి చెప్పగలిగే అవకాశాలను ఆయన వృత్తే ఆయనకు ప్రసాదించింది. కనుక ఆయా కావ్యాలను ఆయన విమర్శ దృష్టితో చెప్పడం ఇందులో కనిపిస్తుంది. మహాకావ్యాల్లోని పంక్తులూ సన్ని

వేశాలూ ఇలా ఈయన కావ్యంలో కొత్తరూపంలో చొరబడి, కొంత సాహితీ సంస్కారమున్న సహృదయునికే ఈ కావ్యం ఆస్వాదనీయమనే అంశాన్ని భంగ్యంతరంగా సూచిస్తున్నవి.

ఆరంభించవలసిన పంక్తులతో ఖండాన్ని ముగించటం మరోవిశేషం. పోతనకవితా వ్యక్తిత్వాలను చిత్రించే ఆరవఖండం చివరకుగల-

"అది ఏకశిలను శిరమెత్తింది
అఖిలాంధ్రజగతి శివమెత్తింది"

అన్న పంక్తులు ఇందుకు తార్కాణం.

శ్రీనాథుని ఓజస్సూ, ధారాశుద్ధీ, ప్రౌఢీ పోతన అంత్యప్రాసలూ ఈ కావ్యంలోభాసిస్తాయి. అవి సహృదయహృదయగమ్యములౌతాయి. నారాయణ రెడ్డికి గల కవితాశక్తి, శబ్దాధికారం, సాహితీసంస్కారధార అలాంటివి.

"సర్వజ్ఞులైన ఆ శర్వజ్ఞులైనా
ఉర్వీంద్రులైనా సుపర్వేంద్రులైనా"
"గంగానదీపులిన
సంగాతమున ధ్యాన
ముద్రాఖ్యలంకృతుడు
చిద్రూపశోభితుడు"
"మనుజేశ్వరాధములకది పిడుగు
మౌనీశ్వరాదులకు అది గొడుగు"
"తేనెలో ఎన్నాళ్లునానినా
పానకంలోన పద మూనినా
తెలుగుకంతటి తీపి ఎక్కడిది?
తెలుపనా అది వాని పుక్కిటిది.
ఏమిగతి మాధురి అదేమి శైలీలహరి
ఎందుకాతడుగ జన్మించనైతిని హరీ!"
"ఎక్కడిది యమునాధునీమణి
ఎచట వ్రేపల్లె బృందావని"
"నిగమ పాండితి నెత్తికెక్కక
అగమసాహితి బండ్లకెత్తక"

వంటి చరణాలు ఇందుకు ఉదాహరణాలు. అనంతమైన అగాధమైన అర్థాన్ని చిన్న మాటల్లో చిన్న పంక్తుల్లో ప్రకటించడంలోనే కవి ప్రౌఢి ప్రకటిత మవుతుంది. నారాయణరెడ్డి ఆంధ్రభాషాసాహిత్యాచార్యుడు. కావున సహృదయ విమర్శలో నిగ్గుదేరినవాడు. కవులను గూర్చి వారి కవితాతత్త్వాలను గూర్చి ఛందస్సుందరంగా కవితాత్మకంగా చెప్పటంలో ఈ విమర్శ గోచరిస్తుంది. కవిలా కథాకథనంచేస్తూ విమర్శకునిలా వ్యాఖ్యానించటం ఇందలి విశేషం. ఇందుకు వాల్మీకి, పోతన, వేమన వ్యక్తిత్వాలను వర్ణించే రెండు-ఆరు-ఏడు ఖండాలను గమనించవచ్చు.

వేమన్న కవితాశక్తిని ప్రశంసించే సందర్భంలో నారాయణరెడ్డి వ్రాసిన ముత్యాలసరాలు ఒక్కొక్కటి ముత్యంలా ప్రకాశిస్తున్నది.

"చెప్పినది చిటి పద్యజాలం
విప్పినది విశ్వాంతరాళం
నేటికీ ఏనాటికీ నీ
పోటి వీవేలే"
"ఏడ దొరికెను ఆటవెలది?
ఆడెనది నీ శక్తికొలది
దాని పేరిట అందరికి భర
తమ్మ పట్టితివో!"

'ఆటవెలది' తర్వాత 'భరతమ్మ పట్టితివో' ప్రయోగంలోని ఔచితి సహృదయుల తలలూపించును. వేమన్నను గూర్చి గురజాడముత్యాల సరాలలో వ్రాయటం విశేషం. ఇద్దరూ ప్రజాకవులే-ఒక ప్రజాకవి కవితాశక్తిని మరో ప్రజాకవి సృష్టించిన హృదయావర్జక ఛందస్సులో చెప్పటం విశేషం. ఆ ఇద్దరిలా నారాయణరెడ్డి కూడా సరళపదాలను ప్రయోగించి వాటిలో సమున్నతార్థాన్ని పొదిగినాడు.

ఋత్వనుగుణమైన క్రియాప్రయోగం నారాయణరెడ్డి రచనా నైపుణిని ఔచితీపరిజ్ఞానాన్నీ ప్రదర్శిస్తున్నది.

"రసలుబ్ధత కుసుమీకృతమైన వేళ
వసంతమై శ్మశానాల పూయించును

పాశవికత శిశిరీకృతమైన వేళ
పసిమి సిరులు తుంచి తుంచి కబళించును
ఉత్సాహం శరత్స్ఫీతమైన వేళ
జ్యోత్స్నా గోక్షీరరసం కురిపించును
నైస్పృహ్యం హిమీభూతమైన వేళ
నవనాడులలో భీరుత మొలిపించును"

నారాయణరెడ్డి దృశ్యసాక్షాత్కరణశక్తికి ఈ కావ్యంలోని పదకొండవ ఖండం చివరనున్న – 'నేను విసిరేదాక స్వరవిహంగం', 'నేను విసిరిందాకే పై చూపు' 'నేను విసిరిందాకే వాగ్వీచి' అనే భాగాలు నిదర్శనాలు.

ఒక విషయాన్ని మొదట సూత్రప్రాయంగా చెప్పి తర్వాత దానిని సాదృశ్యంతో సమర్థిస్తాడు నారాయణరెడ్డి. లేదా మొదట సాదృశ్యం చెప్పి తర్వాత దానిని సూత్రిస్తాడు ఇలా–

"సృష్టిలోన వ్యక్తి ఒక్క జీవాణువు
ఊరి ఆలమందలోని ఒక ధేనువు"
"కార్కొన్న మహాంధకార
కారాటవి గుబురులోన
చాలునొక్క వేగుచుక్క
చండ తమస్సును చీల్చగ
.... .... .... .... .... .... .... ....
ఆశావాదం మనిషికి ఆరోప్రాణం
అది లేనిది బ్రతుకేమిటి? నరకప్రాయం"

కథాకథనంలో నారాయణరెడ్డి వాచ్యంగా వ్యక్తులపేర్లను చెప్పకుండ ప్రతీకల ద్వారా రచనసాగిస్తాడు. ఋషులలో అనకుండ 'జటలలో', వాల్మీకి అనకుండ 'ఒక దృష్టి' కిరాతకుడు అనకుండ – 'మారణాకృతి' అని అంటాడు అలాగే పోతన అనక 'కవిత' అనీ, అలెగ్జాండర్ అనకుండ 'ధరాలుబ్ధుడు' అనీ, గౌతముడు అని అనకుండ 'అహింస' అనీ, విశ్వామిత్రమహర్షి అన కుండ- 'చిక్కువడిన జడలు' అని అంటాడు. చిక్కువడిన అనే మాటచేత

ఆ మహర్షి ఘోరవతస్సును ధ్వనింపజేసినాడు. హిరణ్యకశిపుడు అనకుండ 'దానవత' అంటాడు. ఇలా ఎన్నో ఎన్నెన్నో....

నారాయణరెడ్డి 'కవిత్వం నా మాతృభాష' అని 1973లో చెప్పుకున్నాడు. ఆ యాథార్థ్యాన్ని ఆతని ప్రతికావ్యం ఋజువుచేస్తున్నది. ఏది చెప్పినా కవిత గుప్పున గుబాళిస్తుంది. ఆతని భాషే కవిత్వం. ఆ కవిత్వ భాషలో రచితమైన కావ్యం ఇది. అందువలన ఎక్కడచూసినా ఆ కవిత్వ భాష అగుపించటం సహజం. మచ్చుకు ఒకటి-రెండు.

"జాలి జాలువారినపుడు
శ్రావణమాసం భోరున ఏడ్చేసె"

కాళిదాస హృదయంలో కరుణ కలిగినప్పుడు ఆతని కలం వర్షర్తువును వర్ణించిందనే భావాన్ని ఇంత శబ్దార్థసుందరంగా చెప్పినాడు. శ్రావణమాసం కాబట్టి భోరున కురిసింది అనడు. అందులోకూడా మళ్లీ 'ఏడ్చేసె' అంటాడు. ఎందుకంటే - పైనవేసిన మాట 'జాలి'. 'జాలువారుట' అన్న మాట కూడా ఎంతో చక్కగా పడింది. వర్షర్తు లక్షణాన్ని క్రియతోనే సూచించినాడు.

"నీటికే చురకంటితే"
"వెలుగుకే మతి మండేనా"
"శాంతమే ఫాలాక్షి విప్పితె"

అంటాడు. నీటికి, వెలుగుకు, శాంతానికి కోపంవస్తే అని అర్థం. కోపం వస్తే అని వాచ్యం చేయక ఇలా ప్రకటిస్తాడు.

"తనకు మునుపు గురకపెట్టు గనులున్నవి
తన అలికిడితో మేల్కొని మణులైనవి"

మనిషి తవ్వనప్పటి గనులు గురకపెట్టే గనులట. మనిషి రాగానే అవి మేల్కొన్నాయట. అంతేకాదు మేల్కొని మణులైనాయట. గనులు మేల్కొని మణులు కావడం ఎంత బాగుందో సహృదయులకు తెలుసు. గనులను త్రవ్వి మనిషి మణులను గ్రహించినాడు అనే అంశాన్ని కవిత్వభాషలో - ధ్వని భాషలో చెప్పినాడు నారాయణరెడ్డి. ఇలా చిన్న పంక్తుల్లో కవితా మర్యాదలన్నీ చూపిస్తాడు.

ఈ కావ్యంలో వేదబుక్కులను, తమసానదిని భారతకవితాశక్తిని, కాళిదాస కావ్యసౌందర్యాన్ని, పోతన కవితామాధురిని, వేమన్న ఆటవెలదుల అందాలను, మానవుని మనస్తత్త్వ వైచిత్రిని వర్ణించిన సందర్భాలు ఆతని వర్ణనావైశారద్యాన్ని ఎత్తిచాటే సువర్ణపతాకలు. ఉదాహరణానికి కొన్ని.

తమసానది—

"తామస విదారణాంశుమత్
మృదులోర్మికాచరిత"యట.

తళతళలాడే నదీ తరంగాలలో సత్త్వగుణాన్ని సందర్శించింది కవి ప్రతిభా చక్షువు. వాల్మీకి తపస్సుచే— 'నిప్పులో కాలిన సువర్ణ'మైనాడట. 'నిజములో తడిసిన ధరిత్రి'యైనాడట. ఆతడు 'పుట్టలో పుట్టిన త్రిపురుషాకృతి' యట.

భారతకవితను—

"ఒరసి చూస్తే పసిడిగీతలు
తరచి చూస్తే కడలి లోతులు"

కనిపిస్తాయట.

ఆ కవితలో— 'ఎగసి చూస్తే ద్యోజగత్తులు' ఉన్నాయట. 'పసిడి గీతలు' అన్న మాటలో శబ్దసౌందర్యమూ, 'గీతలు'లో భగవద్గీతా సనత్సుజాతీయమూ ధ్వనిస్తున్నాయి. 'కడలిలోతులు' అనడం వల్ల అర్థగాంభీర్యమూ, 'ద్యోజగత్తులు' వలన వ్యాసుని ఊహాశాలిత ధ్వనిస్తున్నాయి.

కాళిదాసు రచించిన మందాక్రాంతాలు - 'ఛందస్సరస్వతీ మంజులనూపురశింజానా'లేమో అని సందేహించినాడు.

"ఆతని ప్రతిపద్యమొక జేగంట
అది మ్రోగిపోయె ప్రతితెలుగింట
ఏ నాల్క తాకినా ఏమంది
ఇందు గలడందు లేదని అంది"

అన్న పోతన్న కవితాప్రశంస ఆహా అనిపిస్తుంది.

"చీకటిలో ఆకాశం
వాకిటిలో రజని రమణి
రచియించిన ముగ్గుల్లో
రవల కవిత ధవళ కవిత"

చుక్కలను రజని రమణి వేసిన ముగ్గులుగా ఊహించటంలో నారాయణరెడ్డి రవలకవిత భాసిస్తున్నది.

మానవుని మనస్సు—

"అమావాస్యా దర్పణంలో
అమృతకర బింబాన్ని"

చూస్తుందని,

"మంచు కొండల సిగలలో సెగ
మల్లె మొగ్గలు"—

పవదరిస్తుందని వర్ణిస్తూ నారాయణరెడ్డి దాని పోకడ 'గాలితక్కెడ' అంటాడు.

ఈ కావ్యంలో సరళ గ్రాంథిక, వ్యావహారిక భాషల సమ్మిశ్రణం కనిపిస్తుంది. క్రియా ప్రయోగాలలో ఒక చోట గ్రాంథికం మరోచోట వ్యావహారికం అగుపిస్తుంది. గేయరచనలో శ్రవణతర్పణాన్ని సాధిస్తుంది గ్రాంథిక వ్యావహారిక సమ్మేళనం.

అడవిబడి, హృదయోదయం, సుమసమాసాలు, పౌరపదులు (జానపదుల వలె), పైడిబొర. పండువెన్నెలపట్టుపాలు, వెలుగుచందాలు, సెగమల్లె మొగ్గలువంటి అపూర్వసుందర పదబంధాలనూ, 'హైమవతీ పరమేశ్వర కామిత యోగోత్థిత పరమార్థాలా' 'ఛందస్సరస్వతీమంజుల నూపురశింజానాలా' వంటి దీర్ఘ సమాసాలనూ ప్రయోగించినాడు. ప్రచలించు, ప్రవర్షించు, అభిగమించు, అభినుతించువంటి ఉపసర్గలతోడిక్రియాపదాలను ప్రయోగించి అర్థతీవ్రతనూ ఛందస్సౌభాగ్యాన్నీ సాధించినాడు

'యుగాంతర నిత్యనూత్నకం' అనే సమాసంలోని 'నూత్నకం' శబ ప్రయోగం విచారణీయం.

'ఊకోవు' అనే తెలంగాణా మాండలికం ఈ కావ్యంలో ఒక చోట ప్రయుక్తమైనది ('ఒకలిప్తసేపైన ఊకోవు'). ఊర్కోవు అని అర్థం. కవిది తెలంగాణా కదా!

మోరకత్వం, మతమౌఢ్యత వంటి అశాస్త్రీయప్రయోగాలు దొరలినా ఈ కావ్య సౌందర్యానికి లోటులేదు. "ఏకోహి దోషోగుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః" అని కదా ఆర్యోక్తి. 'శాశ్వతవారసులు' అనేది అన్యభాషా సమ్మిశ్రిత సమాసమైనా వాడుకలో ఉంది కాబట్టి కవి వదలలేక పోయినాడు.

నారాయణరెడ్డి ఛందో రహస్యవేత్త. ఛందశ్శిల్ప ప్రయోక్త. పద్యంలోని ఛందస్సౌందర్యసర్వస్వం, శిల్పవైవిధ్యం గేయంలో కూడా ఉందని ఋజువుచేసిన గేయకవి. మందహాసానికి కూడా ఛందస్సుంటుందని భావించిన ఛందోహృదయం ఆయనది. ఆతడు ఈ సుదీర్ఘగీతికావ్యంలో మాత్రాచ్ఛందస్సౌందర్యాన్నీ శిల్పవైవిధ్యాన్నీ ప్రదర్శించినాడు. ఈకావ్యంలో త్రిశ్ర, ఖండ, మిశ్రగతులను ప్రయోగించినా త్రిశ్ర గతినే ఎక్కువగా ప్రయోగించినాడు. దాదాపు తొమ్మిది ఖండాలు—అంటే సగం కావ్యం నడిచింది ఈ గతిలోనే. ఇక ఖండమిశ్ర గతులు సమానపరిమాణంలో సాగినాయి. ముత్యాలసరాలు కూడా ఈ కావ్యంలో కాంతులీనుతున్నాయి.

భావాన్నిబట్టి గేయచరణదైర్ఘ్యాన్ని నిర్వహించినాడు. అంతేకాదు-పాఠకుని పఠనసౌలభ్యాన్నీ, అర్థ స్పష్టతనూ కథాకథనశైలినీ దృష్టిలో పెట్టుకుని పాఠకులకు విసుగు కలుగకుండ మాత్రలను పెంచి, త్రుంచి, పాదాలను పొడుగ్గా పొట్టిగా చేసినాడు. పాదాలను పొట్టిగా కుంచించడంలో, పొడుగ్గా సాగదీయడంలో కూడా ఈకవి భావతీవ్రతనూ భావగభీరతనూ ధ్వనింపజేసినాడు,

యతిప్రాసలను ఈ కవి నియంతగా అర్థవంతంగా పాటించినాడు. ఇది ఈ కవి సహజప్రవృత్తి. యతిప్రాసలనుబట్టి కూడా పాదాలను కొన్నిచోట్ల విరిచినాడు. అంత్యప్రాసలను సహజసుందరంగా ప్రయోగించి వాటిచేత అర్థాన్ని మరింత శోభింపజేసినాడు. గేయరచనలో పరిణతస్థాయి నందుకున్న ఈ కవి కలంలో దీర్ఘసమాసాలు కూడా మాత్రాబద్ధంగా నడిచినాయి.

వేమన్న కవితావ్యక్తిత్వాలను ప్రశంసించే ఏడవఖండాన్ని పూర్తిగా ముత్యాలసరాలతోనే ఈ కవి సాగించటం విశేషం. వేమన్నతో సంభాషణ సాగిస్తున్నట్లే మధ్యమపురుషప్రయోగంచేసి చిన్నచిన్న వాక్యాలా అన్నట్లు

వ్రాయడానికి ఈ ఛందస్సులోని చివరి పొట్టిచరణం బాగుగా పనికివస్తుందని కవి భావించి వీటిని ప్రయోగించినాడేమో. పదమూడవ ఖండంలో రెండే రెండు ముత్యాల సరాలున్నాయి. ఈ రెండు అర్థానుగుణంగా ప్రయుక్తములై పాఠకుని విసుగును దూరం చేస్తున్నాయి.

మాత్రాబద్ధంగా సాగుతూనే కొన్ని పంక్తులు వచనకవితా భ్రాంతిని కలిగిస్తాయి. ఛందోరచనలో సిద్ధహస్తుడైన కవి వాటిని ఏవిధంగానైనా మలచ గలడు. ఉదాహరణానికి తొమ్మిదవ ఖండాన్ని చూడవచ్చు.

సాధారణంగా ఒక్కొక్క ఖండంలో ఒక్కొక్క గతిని ప్రయోగిస్తూనే ఈకవి కొన్నిచోట్ల గతిమార్పుతో భావపరివర్తనాన్ని ధ్వనింపజేసినాడు. పద్నాలుగు పదహారు ఖండాలలో ఈ గతి మార్పును గమనించవచ్చు. పద్నాలుగవ ఖండంలో మొదట ఖండగతి, ఆ తరువాత త్ర్యస్రగతి ప్రయుక్తమైనాయి. రష్యాలోనూ తెలంగాణాలోనూ వచ్చిన సామ్యవాద ప్రజాస్వామ్యాలను గూర్చి ఖండగతిలో చెప్పి, సహనగుణ ప్రశంసను త్ర్యస్రగతిలో నడిపించినాడు. ఇలా విషయాన్నిబట్టి గతినీమార్చినాడు కవి. పదహారవఖండంలో మొదట ఖండగతి మధ్యలో మిశ్రగతి చివరకు త్రిశ్రగతి ప్రయోగింపబడినాయి. సృష్టిరహస్యాన్ని ఖండగతిలోనూ గ్రహాలకూ మానవునికీ గల తారతమ్యాన్ని మిశ్రగతిలోనూ మానవుని వింత మనస్తత్త్వాన్ని మిశ్రత్రిశ్రగతుల్లోనూ వర్ణించి ఖండాన్ని ముగించినాడు.

కవితలో మానవతా తరువును పూయించిన భూమి ఈ 'భూమిక'.

మానవతను వికసింపజేసిన జాతినేతల మహోదయుల ధ్వన్యాత్మక జీవితరేఖాచరిత్ర ఈ 'భూమిక'.

ప్రపంచ నాటకరంగంలో మానవతావిలసనంకోసం మహాకవులు నిర్వహించిన పాత్రపోషణ ఈ 'భూమిక'.

స్వీయ ఖండకావ్యాలలో రేఖామాత్రంగా ఉన్న మానవతామూర్తికి నారాయణరెడ్డి చేసిన సమగ్రసువర్ణాలంకరణం ఈ 'భూమిక'.

తరువాత వెలువడిన 'మృత్యువునుంచి', 'విశ్వంభర' అనే కావ్యాలకు ఉపోద్ఘాతం ఈ భూమిక.

'విశ్వంభర' కావ్యసౌధానికి సోపానం ఈ 'భూమిక'. మానవచైతన్య సంస్కృతులకు నారాయణరెడ్డి పట్టిన ధ్వనిదర్పణం ఈ 'భూమిక'.



# కథాగేయకావ్యసాహితి

## నాగార్జున సాగరం

మనిషిలో సౌజన్యం ప్రఫుల్లమై పరిమళిస్తే ఆ తరంగాలు పరిసర ప్రాంతాలను ఆనందింపజేస్తాయి. ఎన్నెన్నో హృదయాల క్రమవికాసానికీ ప్రకాశానికీ దోహదం చేస్తాయి. తద్వారా సమాజ సౌభాగ్యానికీ పూలబాటలు వేస్తాయి. మనిషిలోని సౌజన్యంతో చైతన్యం చేతులు కలిపితే మానవజాతి మరింతవేగంగా విస్తృతంగా పురోగతిని సాధిస్తుంది. సౌజన్యచైతన్యాలు రెంటికీ ప్రతిభామయమైన కవితాశక్తి తోడైతే మానవాభ్యుదయం మహోజ్జ్వలంగా మహోదాత్తంగా అక్షరంగా అక్షతంగా వెలుస్తుందనటం అత్యుక్తి కాదు. మానవత్వం, ధర్మం, న్యాయం, సత్యం, ఔదార్యం, త్యాగం, సంస్కారం, పరోపకారం మున్నగు సుగుణాలన్నీ ఈ సౌజన్యమహాసాగరంలోని తరంగాలే; ఈ సౌజన్యజ్యోతిర్మండలంలోని కిరణాలే. అందువల్లనే సౌజన్యమున్న మనిషికి చైతన్యమూ కవితాశక్తీ జతగా నిలిస్తే ఉత్తమ

కావ్యాలు ఆవిర్భవిస్తాయి. ఆ కావ్యాలు మానవతా త్యాగధర్మన్యాయౌదార్యాది ఉదాత్తాశయాలను ప్రబోధిస్తూ విశ్వశ్రేయస్సాధనకు సహకరిస్తాయి. ఈ యాథార్థ్యాన్ని దృష్టియందుంచుకొనియే మనీషులు 'విశ్వశ్రేయఃకావ్యమ్' అన్నారు. నారాయణరెడ్డిలో సౌజన్యం చైతన్యం కవితాశక్తీ ఈ మూడూ త్రివేణిలా సంగమించినాయి. అందుకే ఆతని కావ్యాలు మానవతా ధర్మ త్యాగాదులను సందేశాలుగా చాటుతాయి.

తమ మహోదారవ్యక్తిత్వంతో యుగోచితధర్మనిర్వహణ దక్షతతో అప్రతిమానప్రతిభాపాటవంతో సమకాలికసమాజాన్ని ప్రభావితం చేస్తూ మానవప్రగతికై జీవితసర్వస్వాన్ని ధారపోసి యశశ్చంద్రికలు వెలార్చి చరిత్రను సృష్టించిన త్యాగమూర్తుల మహనీయుల జీవితేతివృత్తాలను సందర్శించినపుడు నారాయణరెడ్డి హృదయం క్షీరసాగరమై తరగెత్తుతుంది. ఆతని లేఖినీముఖాన అమృతకావ్యాలు అవతరిస్తాయి.

మానవుడు సాధించిన కళలూ శాస్త్రాలూ మతసిద్ధాంతాలూ అన్నీ మానవజీవితాలను వెలిగించటంకోసమే అనీ, మానవతా వికాసంకోసమే అనీ, కేవలసిద్ధాంతప్రవచనం వల్ల మానవసమాజం అభివృద్ధినీ ఔన్నత్యాన్నీ సాధించలేదనీ నమ్మే అభ్యుదయదృక్పథం నారాయణరెడ్డిది.

కళాకారునికి సౌశీల్యం ప్రధానమనీ అందుకోసం ఆతడు స్వర్గసుఖా లెదురైనా సరే ఆశించగూడదనీ అట్టి ఆశలకూ విలాసాలకూ చేరువైతే తన కళాగమ్యానికి దూరమౌతాడనీ నారాయణరెడ్డి విశ్వాసం. అతడిట్టి ఉదాత్తాశయాలకూ అభిరుచులకూ దృక్పథాలకూ విశ్వాసాలకూ అనుగుణంగానే కవితా వ్యవసాయం సాగించినాడు ; సాగిస్తున్నాడు. ఖండకావ్యాలే కాదు నాటికలే కాదు కథాకావ్యాలను కూడా నిర్మించినాడు. నాగార్జునసాగరం, స్వప్నభంగం, కర్పూరవసంతరాయలు, విశ్వనాథనాయడు, జాతిరత్నం కావ్యాలు ఆతని ఆశయాలకు అక్షరప్రతిబింబాలు. ఈ కావ్యాల్లోని వస్తుసంవరణాన్నీ, ప్రధానపాత్రకల్పననూ సమీక్షించిన సహృదయులకు ఈ విషయం గోచరమౌతుంది.

రచనాదృష్టితో చూసినప్పుడు పద్యంకంటె గేయంలో అధిక సౌలభ్యమున్నది. అధికస్వేచ్ఛ ఉన్నది. రెండు పాదాలకు యతిగానీ ప్రాసగానీ వేసుకుంటూ వెళ్ళిపోవచ్చు. గురులఘువుల నియతి ఉండవలసిన అవసరం లేదు. మాత్రలు సరిపోతే చాలు. అందువల్ల కవులు పద్యంలోకంటె గేయంలో తమ ప్రతిభనూ కవితావేశాన్నీ సంగీతస్ఫూర్తినీ మరింత విస్తృతంగా ప్రదర్శించటానికి అవకాశం ఎక్కువ. నారాయణరెడ్డి పద్యాన్నీ గేయాన్నీ వచనకవితనూ సమర్థవంతంగా నిర్వహింపగల ప్రతిభామూర్తి. ఆతని 'జలపాతం' అందుకు నిదర్శనం. 'జలపాతం' తరువాత ఆతడు నవ్వని పువ్వు, అజంతాసుందరి అనే గేయనాటికలనూ, 'విశ్వగీతి' అనే (దీర్ఘగీతి) కావ్యాన్ని రచించినాడు. గేయనాటికలు అతనికి ఎనలేని ప్రాచుర్యాన్ని ప్రాశస్త్యాన్ని సంపాదించిపెట్టినవి. దీనితో గేయకావ్యాలు వ్రాయడానికి అతనికి ఉత్సాహం విశ్వాసం కలిగింది. నారాయణరెడ్డి చక్కని గాయకుడు కూడా. ఆతడు తన నవ్వనిపువ్వు మున్నగు నాటికలను గానంచేస్తుంటే రసజ్ఞులు పరవశించేవారు. ఆతని ఈ గానప్రతిభ కూడా గేయరచనకు మరింత ప్రోత్సాహం కలిగించిందని చెప్పవచ్చు. నారాయణరెడ్డిని గేయం అధికంగా ఆకర్షించడానికిగల మరో కారణం ఆతని హృదయసౌకుమార్యంకూడా.

నారాయణరెడ్డి కలం పట్టుకున్నది అభ్యుదయకవిత్వయుగంలోనే. అభ్యుదయ కవితకు తొలిరోజుల్లో ప్రధానవాహిక మాత్రాచ్ఛందస్సే. సమకాలికసమాజంలో బాగా ప్రాచుర్యంలోఉన్న మాత్రాచ్ఛందస్సులో సామర్థ్యాన్నీ మెలకువనూ ప్రదర్శించగలిగిన నారాయణరెడ్డి అందులోనే కావ్యాలు కూడా వెలయించదలచుకున్నాడు. అయితే అప్పటికి గేయకావ్యాలు పూర్తిగాలేవని చెప్పడానికివీలులేదు. శ్రీ తల్లావఝ్ఝల, శ్రీ విశ్వనాథ, శ్రీ పుట్టపర్తివంటి వారి గేయకావ్యాలు ఉన్నవి. కాని వాటిలో కథావస్తువునకు ప్రాధాన్యం తక్కువనే చెప్పాలి. వస్తుబలం కావ్యశాశ్వతత్వసాధకం అని గ్రహించినాడు నారాయణరెడ్డి. వస్తువు లభించక కేవలం అభ్యుదయకవితాధోరణులతో విసిగి కవులు బాధపడుతున్న ఆ రోజుల్లో నారాయణరెడ్డి వస్తువుకోసం అన్వేషణ మారంభించినాడు. ఆంధ్రుల చరిత్రపుటలను తిరుగవేసినాడు. ఆతని కళాచక్షువుల ముందు బౌద్ధశిల్పకళారమణీయకాన్ని తనలో రంగరించుకున్న నాగార్జునకొండ మెరిసింది. "చారిత్రకాధారములగు శిల్పములను

శాసనములను గూడ పరిశీలించి"[1] కొన్ని చారిత్రకాంశములను ఆధారంగా గ్రహించి 'నాగార్జున సాగరం' అనే కథాకావ్యాన్ని 1955లో రచించినాడు. ఇది ఆతని మొట్టమొదటి చారిత్రకకథాకావ్యం.

ఈనాటి నాగార్జునసాగరం ప్రాజెక్టు నిర్మాణానికి బీజావాపనం కూడా కానప్పుడే ఈ కావ్యరూపంలో కలగన్నాడు నారాయణరెడ్డి. ద్రష్టయైన ఆ కవి స్వప్నం ఫలించింది. సాగరం వెలిసింది. "సాగరాన్ని సాక్షాత్కరించు కున్న తెలుగు ప్రజలకీకావ్యాన్ని" అంకితం చేసినాడు నారాయణరెడ్డి హర్షోత్ఫుల్లహృదయంతో.

ఈ సందర్భంలో నారాయణరెడ్డి ఈ కథాకావ్యరచనను గూర్చి డా॥ కోవెల సుప్రసన్నాచార్య గారు వెలిబుచ్చిన ఈ క్రింది అభిప్రాయాలు గమనార్హములు. "కథాకావ్యరచనకు పూనుకోవడంలో భావకవితాయుగం నాటినుంచీ నిరాదృతమయిన కావ్యప్రక్రియ మళ్లీ ఆదరింపబడ్డదనే చెప్పవలె. ........ఆధునిక కవిత్వోద్యమంలో ఒక భాగంగా కావ్యరచన నారాయణరెడ్డి చేపట్టడంతో ప్రారంభమైనదిగా పేర్కొనవచ్చు2.

నాగార్జునసాగరం కావ్యంలోని కథ, పాత్రలు కల్పితాలు. రక్తికీ విరక్తికీ మతానికీ ప్రణయానికీ మధ్య జరిగిన సంఘర్షణం ఈ కావ్యంలోని ప్రధానవస్తువు. పద్మదేవుడు, శాంతిశ్రీ, సుజాత, మతాచార్యుడు (గురుదేవుడు) మరికొందరు బౌద్ధభిక్షువులు ఈ కావ్యంలోని పాత్రలు. కథ అంతా నాగార్జునాద్రి, కృష్ణానదీపరిసరాలలో జరిగింది. ఐదు తరంగాలుగా ప్రసన్నంగా పరుగులెత్తిన ఈ కావ్యంలోని కథ సంక్షిప్తంగా ఇది.

ఇక్ష్వాకుల కాలంలో నాగార్జునాచార్యస్థాపితమైన విశ్వవిద్యాలయం బౌద్ధమత ధర్మాభ్యాసపీఠంగా విరాజిల్లుతున్న తరుణంలో నాగార్జున పర్వతంలో మహాచైత్యశిల్పకళాఖండాలను సృష్టించటానికి పద్మదేవుడు అనే యువశిల్పి

---

1. నాగార్జునసాగరం—డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారి 'ప్రస్తావన' పుట 12. ద్వితీయముద్రణ 1961 జనవరి.

2, సాహిత్య వివేచన-పుటలు 61, 62 : ప్రచురణ : సాహితీబంధుబృందం-వరంగల్లు. తొలిముద్రణ—1971

ఒకనాటి సంధ్యాసమయంలో యశోధరాగౌతముల ప్రణయసన్నివేశాన్ని చిత్రిస్తున్నవేళ శాంతిశ్రీ అనే నాగార్జునవిశ్వవిద్యాలయతరుణవిద్యార్థిని అతని దగ్గ కి వస్తుంది. వారు పరస్పరం చూచుకుని ప్రణయభావ తరంగితు లవుతారు. ఇది ప్రథమతరంగంలోని కథ.

ఒక వసంతకాలప్రభాతంలో శాంతిశ్రీ పద్మదేవుని కళానిలయానికి వచ్చి గతరాత్రి ఆతడు చిత్రించిన తన వర్ణచిత్రాన్ని చూసి ఆశ్చర్యపడు తుండగా నిదురలేచి పద్మదేవుడు వస్తాడు. వారు పరస్పరం తమ తమ మత కళాదర్శాలను తెలుపుకుంటూ మధురానుభూతుల్లో తేలిపోయి అవ్యక్తబాధ ననుభవిస్తారు. పద్మదేవుడు శాంతిశ్రీకి ఆమె చిత్రఫలకాన్ని కానుకగా ఇస్తాడు. ఇది ద్వితీయతరంగంలోని విషయం.

నాగార్జునవిశ్వవిద్యాలయంలో బౌద్ధమతాచార్యసూక్తిప్రవచనాన్ని వింటున్న శాంతిశ్రీ పద్మదేవుని వేణుగానం విని, గురువు గమనిస్తుండగానే బయలుదేరి కృష్ణాతీరాన్ని చేరుకుంటుంది. పద్మదేవునితో ఆటల్లో పాటల్లో ప్రణయానుభూతిలో తేలిపోతుంది. వెన్నెలలు సోకగానే కళ్లుదెరచి సిగ్గుతో భయంతో శాంతిశ్రీ సంఘారామానికి వెళ్లిపోతుంది. పద్మదేవుడు తన మంది రానికి పోతాడు. ఇది తృతీయతరంగం.

శాంతిశ్రీ తన నర్మసఖి సుజాత ద్వారా పద్మదేవునితోడి తన ప్రణ యోదంతం బౌద్ధమతాచార్యునికి తెలిసిపోయిందని తెలిసికొని దుఃఖిస్తుంది. అంత పద్మదేవుడు ఆమె దుఃఖకారణం గ్రహించి దుఃఖించవద్దనీ మతవాసన లేని జీవితం గడుపుదామని ఆమెను ఓదారుస్తాడు. కాని శాంతిశ్రీ గురుదేవుని సూక్తులు గుండెల్లో ప్రతిధ్వనించగా తనను తాను అపరాధిగా భావిస్తూ త్రిశర ణాలు వల్లిస్తూ పరుగెత్తిపోతుంది. ఆమె మతావేశానికి పద్మదేవుడు చింతి స్తాడు. ఇది చతుర్థతరంగం.

తాను పద్మదేవునితో ఉండిపోతే లోకం తనను పతితగా భావించి చిన్నచూపు చూస్తుందనే భయంతో శాంతిశ్రీ బుద్ధజయంతినాడు గురుదేవుని ప్రార్థించి శాశ్వత బ్రహ్మచర్యదీక్షను గ్రహిస్తుంది. పద్మదేవుడు శాంతిశ్రీ కోసం రాగా గురుదేవుడు అడ్డుపడుతాడు. ఉభయులూ పరస్పరం దూషించు కుంటారు. మతాచార్యుడు పద్మదేవుణ్ని బహిష్కరిస్తాడు. మానవత్వంలేని

మతంకన్న దీనమానవసేవచేయడం మేలని నిశ్చయించుకుని శాంతిశ్రీని పిలిచి వెళ్లిపోతాడు. అంతలో శాంతిశ్రీ బయటికి వచ్చి గురుదేవుడు కోపిస్తున్నా వినక పద్మదేవునికై ఆక్రందిస్తుంది. కాని ఆతడు తిరిగిరాడు. ఆ రాత్రి శాంతిశ్రీ కలగంటుంది. కలలో సంఘారామం ఉన్నచోట వెలిసిన నాగార్జునసాగర తరంగాలపై పద్మదేవుడు వడివడిగా నడిచిపోవటం చూసి శాంతిశ్రీ అతణ్ని పిలుస్తూ ఆతని ఉత్తరీయ మందుకోవాలని ప్రయత్నించి విఫల మౌతుంది. దీనితో కావ్యం పూర్తి అవుతుంది.

నారాయణరెడ్డి తన 'హృదయము పెంచి' ఈ కావ్యాన్ని రచించినాడు. ఈ కావ్యంలోని పాత్ర చిత్రణనూ రసపోషణనూ కథాకథనసంవిధానాన్నీ దృశ్యసాక్షాత్కరణవైచిత్రినీ, వర్ణనావైభవాన్ని, ఔచితీ నిర్వహణాన్నీ- దేనిని చూసినాసరే ఈ విషయం విదితమౌతుంది.

ఈ కావ్యంలో నాయకుడు పద్మదేవుడు. 'నిదురించెడు కళాత్మలను ఉలితో' మేల్కొలిపే సుందర యువశిల్పి. ఆంధ్రుడైనా 'అనంత విశ్వాత్మజుండు'. అతనిది ఎల్లలనెరుగని 'కళాత్మక జీవనము.' కనుకనే—

"అతనికి ప్రాంతపు టెల్లలు
అక్షి గోచరములు కావు
అతనికి మతవైషమ్యము
లణుమాత్రము తెలియరావు"

పద్మదేవుడు శిల్పియేకాక చిత్రలేఖనకళాకారుడు కూడా. ఆతడు నాగార్జునాద్రిని 'ఒక అజంతా కందరముగా', 'ఒక ఎలోరా మందిరముగా' వెలిగించినాడు. అంతేకాదు— శాంతిశ్రీని చూసిననాడే ఆమె వర్ణచిత్రాన్ని గీసిన కళాహృదయమాతనిది. ఆతడు వేణుగానవిశారదుడు కూడా. సంధ్యావేళ శాంతిశ్రీని బోధనామందిరం నుంచి కృష్ణాతీరానికి రప్పించిందాతని గాంధర్వ కళావైభవం. కాంభోజ రాగాలాపనచేసి శాంతిశ్రీని పరవశింపజేసిందాతని వేణుగానం. ఆతనిది కుశాగ్రబుద్ధి. శాంతిశ్రీ తనను విద్యార్థినిగా పరిచయం చేసుకోగానే ఆమెతో—

"మతపాకములు దప్ప
ఇతరాంశములు మీకు

ఆస్వాదనీయమ్ము
లైనట్లు కన్పడవు"

అని అంటూ ఆమె మతసంరక్తిని వెంటనే కనిపెట్టినాడు. ఆతని ఆదర్శం సౌందర్యమే. అదే ఆతని 'కళామందిరమూలస్తంభము.' ప్రకృతిలోని ప్రత్యణువులో నిద్రించే సౌందర్యాన్ని సుత్తియతో కుంచియతో ఉన్మిషితం చేయటం వర్ణితం చేయటం ఆతని పని. ఆతనికి బుద్ధుని గాథలు కళాఖండాలు గానే కనిపిస్తాయి. ప్రత్యణువులో 'సురపురమ్ము' దర్శించే సౌందర్యకళా ప్రతిభ ఆతనిది. తాను బౌద్ధమతయాయి కాకున్నా తన కళను బుద్ధదేవుని చిత్రణకే అంకితం చేసినాడు. ఎప్పుడూ కల్పనావస్థలో ఉంటూ దేనినైనా గాఢంగా భావించే కళాశీలి ఆతడు.

పద్మదేవునిది వినిర్మలప్రణయార్ద్రహృదయం. శాంతిశ్రీ మొట్ట మొదటిసారి రాగానే ఆతని 'హృదిని పరిమళమ్ములు' వీస్తాయి. ఆమెను చూడగానే ఆతని డెందం స్పందిస్తుంది. ఆ స్పందనమే శాంతిశ్రీ వర్ణచిత్రా నికి ప్రాణం పోసింది. శాంతిశ్రీ శోభాధునీతరంగాలలో తేలిపోయి ఊహా లోకాల్లో విహరిస్తాడు. శాంతిశ్రీ అప్సరస అయినట్లు తాను గంధర్వుడైనట్లు తాదాత్మ్యం చెందుతాడు. ప్రణయంకోసం స్వీయకళాజీవితాన్ని త్యాగం చేసిన ప్రణయమూర్తి.

పద్మదేవుడు నిశ్చితాభిప్రాయాలు గలవాడు. 'మతమే ప్రతివారికి జీవిత సర్వస్వమ్ము' కాదనీ, 'మతబోధలకే కళలంకితము సేయుట' సమంజ సం కాదనీ ఆతని ఉద్దేశం.

"..................కాలేను త్రి
శరణమ్ములు వల్లించెడు
సన్యస్తాఖిల భోగుడ"

అని తన నిశ్చితాభిప్రాయాన్ని చెపుతాడు శాంతిశ్రీతో. ప్రణయం మానవ తను వెల్గించే మహితసాధనమనీ, మానవత లోపించిన మతం వద్దనీ, 'మత వాసన యింతలేని మహిత జీవితము' గడపాలనీ ఆతని ఆశయం. మతమనే 'పచ్చిమచ్చుమందు' చల్లి తరుణులను సన్యాసినులుగా మారుస్తూ వారి కళా

త్మక జీవితాలను బౌద్ధగురువులు నాశనం చేస్తున్నారనీ, మతం పేరుతో మానవత్వాన్ని విడనాడవద్దనీ, మతాచార్యుల్లాగా అందరూ విరాగులై పోవడం అసంభవమనీ, కేవలం శాస్త్రోక్తులు వల్లించినంత మాత్రాన 'సకల జగద్భావళి' పసిపోదనీ, సంఘారామాలు 'సోమరులను పోషించెడు ధామమ్ములు'నీ, కళను మతప్రచారసాధనంగా గాక 'సౌందర్యాంగముగా' భావించాలనీ, మానవత్వంలేని మతం కోసం కళను 'మీదు గట్టియుంటకన్న' మానవుడిగా మానవసేవచేయటం మంచిదనీ ఘోషిస్తూ మతాచార్యుని ధిక్కరించి కళాజీవితాన్ని త్యాగంచేసిన ధీరుడు, మానవతావాది పద్మదేవుడు. పద్మదేవుని పాత్రలో మానవతావాదియైన నారాయణరెడ్డి కవిహృదయం భాసిస్తుంది. అందువల్లనే శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తమ 'మంగళాశాసనము'లో "కవికి పద్మదేవుని పక్షమున కొంత యభిమాన మెక్కువగా నున్నదని చదువరులకు తోపవచ్చును" అని అన్నారు.

ఈ కావ్యంలో నాయిక శాంతిశ్రీ. నాగార్జునవిశ్వవిద్యాలయంలో మతాచార్యునిసన్నిధిలో బౌద్ధసిద్ధాంతాల నభ్యసించటానికి వచ్చిన తరుణ విద్యార్థిని. ముగ్ధ. ఆమె— 'కదిలివచ్చిన మల్లికావల్లిక'. 'అవయవాల దాల్చివట్టి అమృతము'. ఆమె రూపం 'చంచల' వంటిది; 'దోరవెన్నెల' వంటిది;

"మదన సమ్రాడ్ధను
ర్మర్యాదలను దాటి
వెనుకముందాడు క్రొ
వ్విరి మార్గణము"

వంటిది. అందుకే అది 'పరిమళాత్మకమ్ము'. 'భానుదేవుని మొదటి బంగారు కిరణమ్ము' ఈమెరూపాన్ని దాల్చి నడకలు నేర్చుకున్నదట. "సురతరంగిణిలోని నురుగులను పురుడించు చిన్నారినుడుల"ను పలుకగలదామె. ఆమెది 'కళాత్మక జీవనము'. 'కోకిల'లా అమరగానం, 'మయూరమటుల' నటనం చేయగల కళాభిజ్ఞ.

బుద్ధుని జీవితాన్ని అందంగా చిత్రిస్తున్నవి కాబట్టి పద్మదేవుని కళలు ఆమెకు 'ఆస్వాదనీయములు', 'ఆరాధనీయములు' అయినవి. కళలు బుద్ధుని వంటి మహాత్ముల మహోమహిమల చిత్రణకోసమే కాని తనవంటి అల్ప

జీవుల చిత్రణకోసం ఉపయోగపడకూడదనే మతసంరక్తి ఆమెది. బుద్ధమూర్తిని చిత్రించే కళాకారుడు పద్మదేవుణ్నికూడా బౌద్ధుడుగానే భావించిన అమాయికురాలు.

శాంతిశ్రీ ప్రణయార్ద్రహృదయ. కళామూర్తి పద్మదేవుని చూడగానే తననుతాను మరచిపోతుంది. తనగుండెలో 'వీణియలు కదలినయట్లు' అనుభూతి పొందుతుంది. పద్మదేవుని పరిచయం కాకముందు "మతమొక్కటి దక్క తాను ఇతరము" కోరలేదు. కాని అతని స్నేహం వల్ల ఆతనినుంచి స్వీయచిత్రఫలకాన్ని స్వీకరించిన ప్రణయార్ద్రచిత్త ఆమె. శాంతిశ్రీ అధీర; అనిశ్చితస్వభావ ; పద్మదేవప్రణయానికీ, మతాచార్యోపదేశానికీ మధ్య "ఆమె చిత్తము ప్రవాహానీతమైనపూదోనె చందాన" ఆందోళన చెందుతుంది. అటు సమాజాన్ని ఎదిరించే ధైర్యంలేక, ఇటు మతాచార్యుని ధిక్కరించే గుండెబలం లేక చివరకు శాశ్వతబ్రహ్మచర్యదీక్షాగ్రహణంతో తన వినిర్మల ప్రణయాన్ని విషాదంగా మార్చుకున్న భగ్నహృదయ. దీక్షానంతరం కూడా పద్మదేవుని మరువలేక ఆతడు వెళ్ళిపోయేటప్పుడు తిరిగిరమ్మని పిలుస్తూ పలికిన—

"నాతిని నీవొక్కమాటు
రాతిగా నొనర్చిపొమ్ము"

అన్నమాటల వల్లనూ చిట్టచివరకు కలలో పద్మదేవుని వెంటబడి ఆతనిని అందుకోవటానికి ప్రయత్నించటంవల్లనూ శాంతిశ్రీ హృదయం రాగబంధం నుంచి విముక్తం కాలేదని విదితమౌతుంది. కవిహృదయంకూడా కాకూడదనే. ఏమైనా శాంతిశ్రీ అసహాయస్థితీ, ఆమె పొందిన అంతస్సంఘర్షణా దయానీయములై ఆమెపట్ల సహృదయుల సానుభూతిని వర్షింపజేస్తాయి.

బౌద్ధమతాచార్యుడు మతసిద్ధాంతానర్గళసుధాప్రవచనం వల్ల విద్యార్థుల 'మనశ్శ్రవణములకుత్సవము' చేసే దక్షుడు. అతడు 'మూర్తబౌద్ధమతమ్ము'. పద్మదేవునితోడి శాంతిశ్రీ విలాసజీవనాన్ని పసిగట్టి—

"ఎల్లజీవకోటులపై
చల్లుము ప్రేమామృతమ్ము

ప్రత్యేకప్రాణిపైన
పనికిరాదు మమత్వమ్మ

విలాస జీవనపిపాస
విసర్జనీయమ్మ సదా
చిత్తచలత నిర్వాణ
శ్రీ నాశనకారిగదా !"

అనే రెండు సూక్తులతో ఆమెలో 'అంతశ్శోధన'ను కలుగజేసి ఆమెకు శాశ్వతబ్రహ్మచర్యమిచ్చి విలాసజీవనలతను త్రుంచివేసిన కర్కశమత చిత్తుడు. కళ మతప్రచారసాధనమని ఘోషిస్తూ 'కళ అనెడు తెరలోన కామ గోపనము' జరుగుతున్నదని శంకించి పద్మదేవుణ్ని బహిష్కరించిన కఠిన వ్రతుడు. తాను బోధించిన—

"కత్తినెత్తి జయించనిది-కరుణతో సులభసాధ్యము
ద్వేషముతో లభించనిది - ప్రేమతోడ సంపాద్యము"

అన్న సూక్తిని ఆచరణలో పెట్టలేకపోయిన కేవలశుష్కోపదేశమాత్రుడు. బాహిరంగా ఆతడు శాంతిశ్రీకి రక్షనివ్వగల్గినా ఆమె అనురక్తిని మార్చలేక పోయినాడు. ఈ కావ్యంలో మతాచార్యుడు ప్రతినాయకునిలా కనిపిస్తూ పాఠకుల కోపానికి గురిఅవుతాడు.

ఈ కావ్యంలో సుజాత శాంతిశ్రీనర్మసఖిగా, ఆమెకు 'ప్రాణసమాన'గా, వ్యంగ్యవచోవిశారదగా, 'సమయస్ఫూర్తి'గా సహృదయుల చిత్తాన్ని ఆకర్షిస్తుంది. ఇలా నారాయణరెడ్డి నాగార్జునసాగరంలోని పాత్రలు నాల్గింటిని చతురంగా చిత్రించినాడు.

ఈ కావ్యంలో శృంగారశాంతకరుణరసాలు చోటు చేసుకున్నాయి. మొదటి తరంగంలో శాంతిశ్రీ పద్మదేవుల పరస్పరదర్శనంతో అంకురించిన శృంగారబీజం, ద్వితీయతరంగంలో వారి సన్నిహితసంభాషణ వల్లనూ శాంతిశ్రీ వర్ణచిత్రప్రదానం వల్లనూ రెమ్మలూ కొమ్మలూవేసింది. తృతీయ తరంగంలో వెన్నెలరాత్రుల్లో కృష్ణాతీరంలో వారు ఉభయలూ కలుసుకున్న తరుణంలో అది కుట్మలించి కుసుమించింది,

నాగార్జున విశ్వవిద్యాలయ దివ్యవాతావరణంలో బోధనామందిరంలో గురుదేవునిసూక్తి ప్రవచన సన్నివేశాలలో శాంతరసరేఖలుమెరుస్తాయి. చతుర్థ తరంగంలో సుజాతద్వారా తన ప్రణయోదంతం అందరికీ తెలిసిందన్న విషయంవిని సుజాత తరువాత పద్మదేవులసన్నిధిలో శాంతిశ్రీ విలపించిన సందర్భంలోనూ, చివరి తరంగంలో పద్మదేవుడు వెళ్ళిపోతుండగా శాంతిశ్రీ ఆక్రందించిన సన్నివేశంలోనూ కరుణం జాలువారింది.

ఈ కావ్యంలో నారాయణరెడ్డి సరససన్నివేశకల్పనంతో కథను ప్రసన్నంగా ఉత్కంఠాపాదకంగా నిర్వహించినాడు యశోధరాగౌతముల ప్రణయ సన్నివేశచిత్రణను ఏర్పాటుచేయటంలోనూ, పద్మదేవునికి తాను స్వయంగా చెప్పుకునేదాకా శాంతిశ్రీ పేరు గుప్తంగా ఉంచడంలోనూ, శాంతిశ్రీ చిత్తం చలిస్తున్నప్పుడు సమయస్ఫూర్తిగా గురుదేవునిచే సూక్తిప్రవచనం చేయించటం లోనూ, కృష్ణానదికి శాంతిశ్రీ పరుగెత్తేదాకా వేణువుమ్రోగిస్తున్నది పద్మదేవుడని తెలియకుండునట్లు రచించటంలోనూ, శాంతిశ్రీ సౌందర్య సందర్శన సందర్భాలలో పద్మదేవునిలో పెల్లుబికిన ఊహాలచిత్రణంలోనూ, శాంతిశ్రీ స్వాంతంలోని సంఘర్షణప్రకటనంలోనూ నారాయణరెడ్డికి గల ప్రసన్నకథాకథనశక్తి ప్రస్ఫుటంగా భాసిస్తుంది.

కథాకాలంలో తాను జీవించియున్నట్లు భావిస్తూ కావ్యాన్ని పలికిస్తానన్నాడు నారాయణరెడ్డి. ఇందలి సన్నివేశాలన్నీ చలనచిత్రంలోవలె కళ్ళ ముందు కదలునట్లుగా చేసి తనకు గల దృశ్యసాక్షాత్కరణసామర్థ్యాన్ని నిరూపించుకున్నాడు.

ఈ కావ్యంలో సన్నివేశాలకనుగుణంగా చక్కని వర్ణనలు చేసినాడు నారాయణరెడ్డి. కృష్ణానదినీ, పద్మదేవుడు తీర్చిన బుద్ధజాతకగాథాచిత్రాలనూ, శాంతిశ్రీ పద్మదేవుల స్వరూపస్వభావాలనూ, సంధ్యాయామినీ ప్రభాతాలనూ, శాంతిశ్రీ పద్మదేవుల ప్రణయాద్వైతాన్నీ, శాంతిశ్రీ మానసికపరిణామాన్నీ, వేదననూ ఎంతో చక్కగా వర్ణించి తన కవితాశక్తిని చాటినాడు. ఉదాహరణకు కొన్ని.

కృష్ణానదీ తరంగాలు—

"........చిత్రాతి చిత్రములైన
గతులతో పయనించు
కవితలే యనిపించు"నట!

అవి 'బోధిసత్వుని మూర్ధమును' పరివేష్టించి ఉండే 'దుర్నిరీక్ష్య మహోల హారులట్లు', ఆ మహనీయుని కడకంటి చాయల్లో వెల్లువలు దూకే 'కరుణార్ద్రి లలిత భావనలట్లు' దివ్యరూపాలను ధరించగలవట.

"చిన్మయాత్మలను వం
చింపనెంచెడు క్షుద్ర
భోగములవలె తమ
మ్ములు లోకముల గ్రమ్మె"

అనే చీకట్ల వర్ణనలోని అదృశ్యోపమానం హృదయంగమం.

"ఒక మహాత్ముని మాన
సిక నిగ్రహణశక్తి
కెదురొడ్డి పారు లౌ
కిక కామనల వోలె"

చీకట్లు దిగంతాలకు పరుగెత్తిపోయినాయట ప్రభాతం కాగానే.

శాంతిశ్రీ కృష్ణానదీతీరంలో 'ఆమని పోలిక', 'అబ్దము పోలిక' 'అతిశీతసమీరాహృతనదీతరంగము పోలిక' చలించిందట. కృష్ణాతీరంలో శాంతిశ్రీ పద్మదేవుల ఆటపాటలనూ వారి ప్రణయాద్వైతాన్నీ రకరకాలుగా మనోజ్ఞంగా వర్ణించినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు—

"అతడు చంద్రుండాయె - ఆమె చంద్రికయాయె
అతడు తంత్రికయాయె - ఆమె మూర్ఛనమాయె
అతడు గాయకుడయ్యె - ఆమె పల్లవియయ్యె
అతడు కృష్ణుండయ్యె - ఆమె వల్లవియయ్యె
అతడు హృదయమ్మాయె - ఆమె భావమ్మాయె"

వంటి చరణాలను తిలకించవచ్చు.

ప్రసన్నమధురగంభీరంగా సాగిన ఈ కావ్యంలో— 'అలౌకిక మహానురాగచాంద్రీనిగూఢరేఖావిశేధి', 'దినాంతసంధ్యామరుత్‌గరుత్ చాలితోర్మికాపరిద్వీధిక' 'అపూర్వశోభాధునీతరంగడోలికాందోళనము' వంటి

దీర్ఘసమాసాలు భావానుకూలంగా కథా పాత్ర వాతావరణాల కనుగుణంగా సాగి కావ్యశోభను ఇనుమిడింపజేస్తున్నవి.

కావ్యవర్ణనలలో ఔచిత్యాన్ని పాటించి సహృదయులను రంజింప జేసినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు—పద్మదేవుడు చిత్రించిన యశోధరా గౌతముల ప్రణయచిత్రమును వర్ణించే సందర్భమది. 'ధమ్మిల్ల విజితాంబుధర'అయిన యశోధర ఎదురుగా నిలిస్తే గౌతమునిలో 'చంచలలు' కదలి నాయట. అంబుధరానికీ చంచలలకూ ఉన్న చక్కని అనుబంధాన్ని సమయోచితంగా ఈ వర్ణనలో వాడుకున్నాడు కవి.

బుద్ధజాతకగాధలను పద్మదేవుడు కళాఖండాలుగా తీర్చిన సన్నివేశాన్ని విపులంగా వర్ణించటం కూడా ఔచితీభాసురమే. దానివలన పద్మదేవుని కళా పాటవం ప్రస్ఫుటమవుతున్నది.

శాంతిశ్రీ పద్మదేవుని వద్దకు పోయేటప్పుడు పద్మాలు దూసుకొని పోయినట్లు చెప్పటం కూడా మనోహరం. పద్మదేవుని పట్ల ఆమెకు గల ప్రణయభావం ఈ పద్మాలను గ్రహించటం వలన పరిమళిస్తున్నది.

గురుదేవుడు 'ఉత్తుంగగంగాతరంగస్వరమ్మొత్తి' ప్రవచిస్తుండగా, పద్మదేవుని వేణుగానం 'యామునోర్మికరీతి' వీతెంచినట్లు వర్ణించటం కూడా సహృదయరమ్యం. గురుదేవుని దివ్యబోధనాస్వరం దివ్యనదీతరంగమైతే పద్మదేవుని ప్రణయార్ద్రవేణుగానం యమునాతరంగం కావటం ఎంతో సమంజసం. యమునాతరంగాలు ఆలనాటి వేణుగోపాలుని రాగాలను జీర్ణించు కున్నవి గదా ! ఇలా ఉపదేశానికి గంగనూ, ప్రణయసందేశానికి యముననూ వాడుకోవడం అపూర్వం.

తృతీయతరంగంలో శాంతిశ్రీపద్మదేవులు ఏకమైన మధురసన్నివేశాన్ని సుదీర్ఘంగా వర్ణించటం సమంజసం. ఈ సుదీర్ఘవర్ణనం వారు అంతసేపు విశ్వాన్ని మరచి విహరించినారని ధ్వని- 'ఇరువురికి నడుమగల తెరలు' ఎలా మాయమైనాయో బహుముఖాలుగా ప్రకటించినాడు ఔచితీరహస్యం తెలిసిన నారాయణరెడ్డి.

ఈ కావ్యంలో అన్ని గతులను ప్రయోగిస్తూనే ఖండగతిని అధికంగా ప్రయోగించినాడు నారాయణరెడ్డి. వెంటవెంట గతులు మారుస్తూ భావపరివర్త

వమూ సన్నివేశాలమార్పునూ వ్యంజింప జేసినాడు. ఉదాహరణకు తృతీయ తరంగంనుంచి ఒకటి. శాంతిశ్రీ బోధనామందిరం నుంచి పద్మదేవుని వద్దకు పోయినప్పుడు గురుదేవుడు ఆమెను గమనించి కన్నెర్రచేసిన సందర్భంలో ఈ మార్పును గమనించవచ్చును.

"ఆచార్యుని భ్రుకుటి నిటా
లాంచల మారోహించెను
ఆమెమనసు నదీతీర
మందక సంచలియించెను"

అని త్ర్యస్రగతిలో నడిచి వెంటనే—

"ఆమె చలించెను ఆమనిపోలిక
ఆమె చలించెను అబ్దముపోలిక"

అంటూ చతురస్రగతిలోనికి మారి తరువాత—

"అదొ పద్మదేవుండు
అదొ వేణువాదమ్ము"

అని ఖండగతిలోనికి వెళ్ళిపోతుంది. త్ర్యస్రగతిపంక్తుల్లో మతాచార్యుని క్రోధాన్నీ శాంతిశ్రీస్థితినీ ప్రతియోగరీతిచే వ్యక్తపరచి, చతురస్రగతి పంక్తుల్లో కేవలం శాంతిశ్రీ చలనవేగాన్నీ, ఖండగతి పంక్తుల్లో పద్మదేవుని గానపరిస్థితిని ప్రకటించినాడు కవి. ఇలాగే ఈ కావ్యంలో ఇట్టి ఛందో విన్యాసాలెన్నో.

కావ్యారంభంలో కృష్ణానదిని వర్ణించే—

"అదిగో కృష్ణమ్మ న
వ్యాప్సరోంగన భంగి
నడయాడె నాంధ్ర భూ
నందనోద్యానమున
అల్లదిగో కృష్ణవే
ణమ్మ భాసించె బౌ
ద్ధము రసాకృతి దాల్చి
తరలివచ్చెననంగ"

అన్న పంక్తులు వస్తుధ్వనిని గర్భీకరించుకున్నవి. మొదటి నాలుగు చరణాలు సౌందర్యప్రణయాలకు సంకేతాలై పద్మదేవుణ్ణి శాంతిశ్రీని, తరువాతి నాలుగు పంక్తులు మూర్తీభవించిన బౌద్ధంలా ఉండే మతాచార్యునిని స్ఫురణకు తెస్తున్నవి. ఈ పంక్తుల క్రమం కూడా కావ్యంలోవచ్చే పాత్రలక్రమమే. ఈ రకంగా పైపంక్తులు ప్రణయానికీ మతానికీ గల సంఘర్షణను వ్యంజిస్తున్నవి.

"శాంతిశ్రీ పద్మదేవు
సాన్నిధ్యము పొందుగాత"

అన్న పంక్తులద్వారా నారాయణరెడ్డి మానవత్వాన్ని రంగరించుకున్న ప్రణయమే గెలువాలన్న తన ఆకాంక్షను వ్యక్తంచేసినాడు. సంఘారామాన్ని విడిచి దీనమానవసేవకై కంకణం కట్టుకున్న పద్మదేవుని ప్రగాఢకృషిఫలం గానే నాగార్జునసాగరం వెలిసినట్లు స్ఫురింపజేస్తూ ఆ నాగార్జునసాగరం 'జనతను' ఆహ్వానిస్తుందనీ, 'మానవతను' ఓదారుస్తుందనీ తన ఆకాంక్షను శాంతిశ్రీ స్వప్నవృత్తాంతసందర్భంలో వ్యంజింపజేసినాడు కవి.

మానవతావాదియైన నారాయణరెడ్డి కావ్యసందేశాన్ని పద్మదేవ ముఖతః ప్రకటించినాడు. మతమనేది—

"మానవత్వ సంరక్షణ
మహాప్రయోజనము కొరకు"

గానీ మతం మతం కోసం కాదనీ, కేవలం ధర్మశాస్త్రాల వల్లింపువల్ల 'సకలజగద్బాధావళి' సమసిపోదనీ, దీనమానవసేవ కోసం మతాలన్నీ నడుముకట్టాలనీ, కళల శాస్త్రాల మతాల గమ్యం మానవతామృతప్రదానమే అనీ నారాయణరెడ్డి ఘోషించినాడు.

ఈ నాగార్జునసాగరం 'మధురభావనామయ కావ్యము' అనీ— "ప్రాచీనాధునిక సంస్కారాలు రెంటిని గూడ ఔచిత్యమెఱిగి సమేళము చేసికొని భావనలను భాషను సంయమముతో నడపగల నేటి ప్రతిభాశాలులు కొందఱే. అట్టి కవుల అగ్రపంక్తిలోనివారు రెడ్డిగారు"[1] అని సహృదయవిద్వద్విమ

1. నాగార్జునసాగరం - 'మంగళాశాసనము' పుట 3, ద్వితీయముద్రణ, జనవరి 1961.

ర్శకులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారూ, "నారాయణరెడ్డిగారి కావ్యము తెనుగునందున్న ఉత్తమ చారిత్రకకావ్యములలో నొకటియని విస్సందేహముగా చెప్పవచ్చును"[1] అని ప్రసిద్ధచరిత్ర పరిశోధకులూ విమర్శకులూ డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారూ ఈ కావ్యాన్నీ కావ్యకర్తనూ ప్రశంసించినారు. ఈ ప్రశంసలు వాస్తవానికి ఎత్తిన పతాకలు.

# స్వప్నభంగం

నారాయణరెడ్డి రెండవ కథాకావ్యం 'స్వప్నభంగం'. ఇది 1957 ఫిబ్రవరిలో ఆదర్శసాహిత్యమాల - హైదరాబాదు పక్షాన ప్రచురితం. కవిత్వాన్ని ఊపిరిగా భావించే నారాయణరెడ్డి తన కలను కావ్యంగా మలచక ఎలా ఉండగలడు? ఆతనిలో—

" ............దాగియు
న్న వికారభావనయె
కల రూపుతో వచ్చి
కలవరమ్మి"డగా

దానిని దాచుకోలేక ఆ ప్రతిభామూర్తి 'స్వప్నభంగం' అనే శృంగారరస ప్రధానమైన కథాకావ్యంగా సహృదయజగత్తుకు అందించినాడు. కావ్యాంతంలో ఉన్న—

"స్వప్నభంగోద్భవి
స్తార రోమాంచమ్ము"

1. 'నాగార్జునసాగరం' - ప్రస్తావన - పుట - 15, ద్వితీయముద్రణ జనవరి 1961.

అన్న పంక్తుల్లో ఈ కావ్యనామం కన్పిస్తుంది. కవి స్వప్నవృత్తాంతమే ఇందలి వస్తువు. దీనిలోని కథ అంతా స్వర్గంలో జరిగిందే.

నానాపురాణప్రబంధపఠనపాఠనాలవలన తనకు ఉపలబ్ధమైన సంస్కారాన్ని ప్రతిభతో సమ్మేళనం చేసి సహృదయరమ్యంగా ఈ కావ్యంలో ప్రదర్శించినాడు నారాయణరెడ్డి. ఈ కావ్యం ఆశ్వాసాల్లాంటి భాగాలేవీ లేకుండ దీర్ఘగీతంలా తీగసాగింది.

కావ్యకర్తృశృంగారదివ్య భావనలతో నిండిన ఈ 'స్వప్నభంగం' లోని కథ భిన్నభిన్న సన్నివేశాలలో పరచుకొనిఉన్నది. ఒక సన్నివేశానికి మరొక సన్నివేశానికి ఏమీ సంబంధంలేదు. కలకాబట్టి వీటికి అంతస్సూత్రం లేదు. కావ్యంలోని కథ సంక్షిప్తంగా ఇది.

కవి నిదురలో కలగంటాడు. ఆ కలలో తరుణతారలు అప్సరస్తరుణులు తనను పిలిచినట్లనిపించగానే దివ్యానుభూతిలో పడతాడు కవి. అతనికి 'గంధర్వనవభావసౌవర్ణపక్షావిష్కరణము' అవుతుంది. వెంటనే మొయిలు పాన్పుపై పవళించి రెండు మబ్బుముక్కలను తలగడలుగా సవరించుకొని గగనలక్ష్మిని పలకరిస్తాడు. తరువాత పార్వణసుధాంశుబింబముపై పవళించి తారాచంద్రుల రహస్య ప్రణయసంకేతాలను గమనిస్తూ గంగానదిచేరుకుంటాడు. నదిలో జలకాలాడుతున్న రంభ, మేనక, హరిణి, ఘృతాచి, ఊర్వశి మున్నగు అప్సరః ప్రౌఢాంగనలు కవిని చూసి సమీపించి రకరకాలుగా స్పృశించి ఆతనికిసౌఖ్యాన్ని అందిస్తారు. రంభోర్వశులిద్దరూ ఆతనిని ముందుకు తీసుకుపోతారు. తరువాత నందనవనంలో రంభ మదనబాణతప్తుడైన కవికి పరీరంభచుంబనసౌఖ్యాలందిస్తుంది. అమృతం త్రాగించి మత్తులో ముంచేస్తుంది. తరువాత రంభాప్రేరితుడైన కవి ఇంద్రసభామంటపంలో ఇంద్రుని సన్నిధిలో జరిగే రంభోర్వశుల నాట్యప్రదర్శనను తిలకిస్తాడు. నాట్యానంతరం అప్సరసల ముఖస్తుతులనూ పరస్పరద్వేషాలనూ గమనించిన కవి నిరాశాహతుడై ఇక ముందుకు పోకూడదని నిశ్చయించుకుంటాడు.ఆతరువాత రంభఅతనికి అమరావతీనగరరాజవీథులసౌందర్యవైభవాలను చూపిస్తుంది. ఎటుచూసినా యువదంపతులప్రణయకలాపాలే కనపడేసరికి

కవికి దేవతానగరీదిదృక్ష సన్నగిల్లుతుంది. విసుగుకలుగగా ఆతడు రంభతో నందనవనానికి పోతాడు. పారిజాతసౌరభాలవలన మరింత ప్రజ్వరిల్లిన గుండెమంటలను అమృతపానంతో చల్లార్చుకుంటాడు. క్షణమైనా శాంతిని ప్రసాదించలేని స్వర్గాన్ని విడిచి భూలోకానికి రావాలని నిశ్చయించుకుంటాడు. కాని రంభకు ఇష్టంలేదు. అందువలన ఆతనిని పక్షరహితుణ్నిచేసి బంధించే ప్రయత్నం చేస్తుంది. అంత కవి ఆమెను నిందిస్తూ పరుగుదీస్తాడు. రంభాద్యప్సరసలు రమ్మంటున్నా వినక కెవ్వుమని అరుస్తూ గంగలోదూకుతాడు. దానితో కవికి స్వప్నభంగం అవుతుంది. ఆతని కేక విని ప్రక్కనపడుకున్న భార్య ఉలిక్కిపడిలేచి భయంతో ప్రశ్నార్థకంగా చూస్తూ ఆతని ఒళ్లు నిమురుతుంది. కాని కవి తన 'వికారస్వప్నము'ను ఆమెకు చెప్పలేకపోతాడు. 'హృదయగత దుష్టప్రకృతిలవము సైతము' ఈ స్వప్నముఖంగా విధుతమైనందుకు సంతోషిస్తూ స్వప్నభంగం వలన కలిగిన రోమాంచాన్ని అర్ధాంగిని కవుగిలించుటలో సార్థకం చేసుకుంటాడు కవి.

నారాయణరెడ్డి తన దర్శన వర్ణనశక్తులచేత ఈ కావ్యాన్ని మనోజ్ఞంగా నిర్మించినాడు. దీనిలో ఎక్కడచూసినా వర్ణనలు పురివిప్పిన నెమళ్ళలా దర్శనమిస్తాయి. తెల్లని మొయిలు పాన్పుపై అధిష్ఠించి ఆకాశంలో పయనిస్తున్న కవి భూలోకంలోని నదులను చూస్తాడు. అప్పుడవి—

"అలసముగ సాగు జ్యో
త్స్నాభిసారికల ప
య్యెద తుదలు"

వలె ఉన్నాయట. పరుగెత్తే నదీతరంగఫేనజాలం జ్యోత్స్నాభిసారికల పయ్యెదతుదలుగా భాసించటం సహృదయరమ్యం. అలాగే సాగర సరోవరాలు—

"రాత్రినదీస్నాత
గాత్రులైన తమోభి
సారికలు చీరెలను
స్తనవల్కలమ్ములను"

ఆరవేసినారా అన్నట్లున్నవి. ఇలా ప్రతిభాచక్షువైన ఈ కవికి ఉభయ జ్యోత్స్నాభిసారికల జాడలు ఒకేసారి కనిపించినవి. ఇక తరువులు పైనుండి చూసినపుడు-

"తమలోని చంచల
త్వము నణంచగలేక
బహిరంగముగ మొగ్గు
వడిన మూఢవ్రజము"

లా కనిపించినవట. మరి పర్వతాలేమో—

"ఏ రాక్షసక్రియా
హేతువుననో కంఠ
దఘ్నముగ భువిని పా
తరవేయబడిన శి
క్షితుల"

తలలను స్ఫురింపజేసినవి. ఆకాశగంగాలహరిక-'ఒక నాట్యకర్త్రి రొమ్ము కుదింపు'వలె వీచిందట. అచ్చరలు 'దివిజగంగాఫేనదీప్తి'లా ఉన్నారట. విచ్చుతామరల్లాంటి అచ్చరలగుంపులో మహేంద్రుడు 'రాయంచవలె' కన్పించినాడు. స్వర్గంలో—

"వక్షోజభరముతో-వంగువారలెకాని
అనుభవభరాన వంగిన వారు కనరార"ట-

ఇంకా ఈ కావ్యంలో స్వర్గంగానందనోద్యాలూ, రంభోర్వశీనాట్యభంగిమలూ అమరావతీనగరభ్యంతరకామినీసంచారాలూ మహేంద్రభోగాలూ మధురంగా వర్ణింపబడినవి.

కావ్యనాయకుడైన నారాయణరెడ్డి వ్యక్తిత్వాన్ని ఈ కావ్యం వ్యంజిస్తున్నది. తనలోని 'వికారభావన' కారణంగా స్వప్నంలో స్వర్గలోకాన్ని స్వర్లోకకామినీమణులైన రంభోర్వశీమేనకాదులను దర్శించినా కవికి భోగేచ్ఛ ఉన్నట్లు ఈ కావ్యంలో ఎక్కడా కనిపించదు. అప్సరసలు తనను రకరకాలుగా స్పృశించినా రంభపరీరంభచుంబనాలనందించినా తాను మాత్రం వాటికై చొరవను ప్రకటించలేదు. అయితే అప్సరసల స్పర్శవలన—

"పడగాడ్పు తెర ఒక్క-
పరి చరచిపోయినటు
గుప్పుమని ఆవిరులు
అప్పళించిన యట్లు"

చిత్రానుభవాన్ని మాత్రం పొందుతాడు. రంభోర్వశులు తన చేతులను తమ భుజాలపై వేసుకుని నడిపించుకుంటూ పోయినపుడు అతడు 'బౌగాదనన్ లేక' తూలిపోతాడు. మార్పులేని కేవలసుఖాపాదకమైన స్వర్గంకన్న వెలుగు నీడల మేలికలయిక అయిన భూలోకమే మిన్న అని స్వర్గాన్ని తృణీకరించిన కవిహృదయమాతనిది. తనకు ఎదురుగా రంభ పడుకున్న విలాసదృశ్యాన్ని చూసినప్పుడు ఆతని 'నరనరమున అగ్గి' కరిగిపోసినట్లుకాగా అరుస్తాడు దాహంతో. రంభ తన బింబాధరమందిస్తే ఆతనిలో 'బాడబజ్వాలలు' విజృంభిస్తాయి. అప్సరసల ముఖస్తుతులను, పరస్పర ద్వేషస్థితులను చూసి ఈ కవి చింతిస్తాడు. ఆతనికి స్వర్గంపట్లగల ఆదరాభిమానాలు తగ్గిపోతాయి.

ఇక రంభ ప్రౌఢ. విలాసంగా స్వర్గలోకమంతా చూపిస్తూ కవికి తనంత తానే ముద్దులనూ కౌగిలింతలనూ అమృతాన్నీ అధరామృతాన్నీ అందిస్తూ నాట్యచాతురిని ప్రదర్శిస్తూ మొదటినుంచి తుదిదాకా ఆతనికి మార్గదర్శకురాలై స్వర్గసౌఖ్యాలు చవిచూపిస్తుంది. ఆమె మాటల్లో చేతల్లో చతురతా ప్రౌఢతా ఉట్టిపడుతాయి. కవిని చాలా ఇష్టపడ్డందువలననే ఆతడు భూలోకానికి వెళ్ళిపోతానన్నప్పుడు ఆతనిని పక్షరహితుణ్ణిగా చేసి బంధించే ప్రయత్నం చేస్తుంది. కావ్యారంభం నుంచి కావ్యసమాప్తం వరకు రంభ పాత్ర సహృదయుల ప్రశంసలనందుకుంటుంది.

రంభాద్యప్సరసలు జలకాలాడుతూ కవిని చూడగానే బుడుగు మునిగి తీరంచేరి వస్త్రాలందుకొని ధరించివచ్చిన సందర్భమూ, మహేంద్రుడు సౌరపాత్రికతో అప్సరసలగుంపులో ఉన్నప్పటి సన్నివేశమూ, రంభోర్వశులు ప్రదర్శించిన మేనకావిశ్వామిత్రప్రణయనృత్యసన్నివేశమూ నారాయణరెడ్డికి గల దృశ్య సాక్షాత్కరణశక్తికి ఉదాహరణములు.

రంభోర్వశుల నాట్యప్రదర్శన సందర్భంలో వర్ణితములైన నాట్యభంగిమలూ వివిధహస్తముద్రలూ రేచకాంగహారాలూ నారాయణరెడ్డికి గల నాట్యశాస్త్రపరిజ్ఞానానికి సంకేతాలు.

ఈ కావ్యంలో— "తలపైన గంగనిడి - జలమునకు వెదకేవు"

"తృషితుడెందాకయని
తేనెసోనలు ద్రావి
తనలోపలి పిపాస
అణగార్చుకొననేర్చు"

వంటి సూక్తులూ, పూలమంటలు, నిప్పులవిపంచిక వంటి సుందరపద బంధాలూ చోటుచేసుకున్నాయి.

"పొందామరల పెదవు
అందు చిందు మరంద
బిందువుల నందెడు మి
ళిందముల బృందములు"

వంటి చరణాలలోని అనుస్వారసంయుక్త దకారావృత్తి శృంగారసవ్యంజకం.

"నవరత్నఖచిత సుం
దర శాతకుంభ కుం
భాదీప్త తుంగ హ
ర్మ్య పరంపరల్ గనుచు,
హర్మ్యాంతరాళ బహి
రాయాత యక్షమిధు
న ప్రణయకలహ మం
ద్ర స్వరమ్ములు వినుచు,
ఘంటాధ్వకామినీ
కబరీభరోల్లస
న్మందార సౌరభో
న్మత్తచిత్తుడ నగుచు"

వంటి పంక్తుల్లోని దీర్ఘసమాసాలు అమరావతీనగరసౌధసౌందర్యవ్యంజకాలై అందలి యక్షకామినుల శృంగారసౌరభాన్ని ప్రసరిస్తూనే నారాయణరెడ్డి గేయ రచనాపై శారద్యాన్నీ పాండితీపాటవాన్నీ ప్రకటిస్తున్నాయి.

"..........రంభ చం
చచ్చంచల విధాన
ప్రణమిల్లె మేఘవా
హుని సముఖములోన"

అన్న పంక్తుల్లోని 'చంచల' 'మేఘవాహన' శబ్దాల ప్రయోగం నారాయణరెడ్డి పదప్రయోగౌచితికి తార్కాణం.

ఈ కావ్యమంతా ఖండగతిలోనే నడిచినా కావ్యకర్త కవితాశక్తి కారణంగా రసహృదయులకు చదివేటప్పుడు విసుగన్నదిరాదు. ఇందలి కొన్ని చరణాల పునరుక్తి కవిభావావేశాన్ని స్ఫురింపజేస్తూ కావ్యగాన సౌభాగ్య సాధకాలుగా భాసిస్తాయి.

"సస్యలక్ష్మీకలిత - జగతియే స్వర్గమ్ము
స్నేహార్ద్రచిత్తులగు - జీవులే దేవతలు"
"మానవ సమాజమ్ము - మానధన యైనసతి
కల్గుచోనేల స్వ - ర్గములు"

అన్న చరణకుసుమాలు సందేశమధువును చిలుకుతూ 'జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' అన్న మహితోక్తికి పర్యాయంగా భాసిస్తూ నారాయణరెడ్డికి మానవలోకం పట్లగల ఆదరాభిమానాలనూ జన్మభూమి ఎడలగల భక్తిగౌరవాలను పరిమళింపజేస్తున్నాయి.

"అప్సరోలోకమ్ము
నముకొంటి ఆదర్శ
ముల రూపములు మొల్చు
పుణ్యాలనేలయని
దేవతాలోకమును
భావించితిని పర
స్పర సహనదుగ్ధ సా
గర కనద్వేల యని
నాయాశలెన్నొ 'ఛి
న్నాభిన్న'ములు కాగ

లోలోన ఎంతగా
నో లజ్జితుడనైతి"

లజ్జితుడు కావలసినది కవియేకాదు, లోకమని అతని అభిప్రాయం. ఏదో ఒక ఊహాలోకమున్నదనీ, అందులో రంభాద్యప్సరసలూ, అమృతమూ నిత్యవసంతమూ, నిత్యయౌవనమూ ఉంటాయని భావించటం స్వప్నసంకాశమైన అభిప్రాయమని కవి ఉద్దేశం. కష్టసుఖాలకు నిలయమైన ఈ లోకంలో ఉంటూనే తోటిమానవుని కష్టాలను పరిష్కరిస్తూ ఆనందానుభూతిని పొందటంలోనే స్వర్గసౌఖ్యముందని భావించటం మహోదాత్తలక్షణమని కవి హృదయం. లేని స్వర్గాన్ని ఊహించుకొని అందులో నివసించి ప్రపంచాన్నీ పరిసరాలనూ మరవటంకంటె ఆ స్వప్నాన్ని బద్దలుకొట్టడంలోనే మానవత్వం ఉన్నది. స్వప్నభంగం అంటే ఇదే అర్థం. ఈ కావ్యానికి ప్రయోజనం కూడా ఇదే.

# కర్పూర వసంతరాయలు

'కర్పూరవసంతరాయలు' నారాయణరెడ్డి రెండవ చారిత్రకకథాకావ్యం. కథాకావ్యాలలో మాత్రం మూడవది. "క్రమంగా ఆంధ్రులచరిత్రలో అక్కడక్కడా నిల్చి ఉన్న వెలుగుకంబాలను కావ్యజగత్తులో నాటాలనేసంకల్పంతో" ఉన్న నారాయణరెడ్డి ఈ కావ్యాన్ని రచించి 1957 డిసంబరులో ప్రచురించినాడు. నారాయణరెడ్డి ఎం.ఏ. చదువుతున్నప్పుడు ప్రసిద్ధచరిత్రపరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'History of Reddy Kingdoms' అనే ఆంగ్లగ్రంథాన్ని చదివినాడు. కుమారగిరిరెడ్డికి 'కర్పూరవసంతరాయలు' అనే బిరుదముందని తెలిసికొని ముగ్ధుడై అతనిపై కావ్యం వ్రాయాలని సంకల్పించుకున్నాడు. ఫలితంగా ఈ రసవత్కావ్యం ఆవిర్భవించింది. 'History of Reddy Kingdoms' గ్రంథంలో శ్రీ మల్లంపల్లి సోమ

శేఖరశర్మగారు చెప్పిన విషయాలు ఈ కావ్యరచనకు ఆధారమైనట్లు నారాయణరెడ్డియే ఈ కావ్యానికి వ్రాసిన 'భూమిక'లో విపులంగా తెలిపినాడు[1].

ఈ మధురకావ్యాన్ని 'తెనుగులచరితకు ప్రాణంపోసిన మహామనీషి' శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి అంకితం చేసినాడు నారాయణరెడ్డి. ఎవరిగ్రంథం తనకు కర్పూరవసంతరాయలను పరిచయం చేసిందో ఎవరి నిరంతర సహకారం ఈ కావ్యనిర్మాణానికి అన్నివిధాలా తోడ్పడిందో అట్టి విద్వన్మణికీ మానవోత్తమునికీ ఈ కావ్యాన్ని అంకితం చేసిన నారాయణరెడ్డి ఔచితీప్రాజ్ఞత ప్రశంసనీయం.

ఈ కావ్యంలోని కథమాత్రం కేవలం కల్పితం. అది 1386లో జరిగినట్లు నారాయణరెడ్డి ఊహించినాడు. లకుమాకర్పూరవసంతరాయల శృంగారజీవితాన్నీ, లకుమాత్యాగశీలాన్ని రసమహితంగా చిత్రించే ఈ కావ్యంలోని కథ ఐదు ఆశ్వాసాలలో ఇలా పరచుకొని ఉన్నది.

కొండవీడు రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తున్న కర్పూరవసంతరాయ బిరుదాంచితుడైన కుమారగిరిరెడ్డి వసంతోత్సవాలసందర్భంగా చైత్రశుద్ధత్రయోదశినాడు మహారాజ్ఞితోనూ తన బావ కాటయవేమారెడ్డితోనూ కలిసి నగరోద్యానానికి వెళ్ళి పూవిల్తుని పూజను పూర్తిచేసికొని నగరానికి తిరిగి వస్తాడు. మళ్ళీ చైత్రపూర్ణిమ సాయంకాలం భార్యతోనూ ప్రధానమంత్రి కాటయవేమునితోనూ కలిసి నగరోద్యానానికి వెళ్లి లకుమ అనే వేశ్య నృత్యప్రదర్శనను చూస్తాడు. లకుమాసౌందర్యాన్నీ నాట్యకళావిలాసాన్నీ చూసి రాయలు 'లకుమాలగ్న పంచప్రాణుండ'వుతాడు. నాట్యానంతరం రాయలు తన కంఠహారాన్ని తీసి లకుమ గళాన్ని అలంకరిస్తాడు. ఇది ప్రథమాశ్వాసంలోని కథాంశం.

లకుమను చూసిన రాయలూ, రాయలచే సన్మానితయైన లకుమా నిదుర పట్టక కలలుగంటారు. 'లకుమాగత సంస్మృతి' రాయలకు మించిపోగా ఒకనాడు కాటయవేముని రప్పించి లకుమను రాజనర్తకిని చేయాలనే తన అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తాడు. తనకు అప్రియమైనా కాటయవేముడు రాయల

1. 'కర్పూరవసంతరాయలు'—'భూమిక' పుటలు 5-11
ద్వితీయముద్రణ—1964.

సంతోషంకోసం అందుకు ఒప్పుకుంటాడు. ఈ విషయం తెలిసి లకుమ సంతోషించగా మహారాజ్ఞి సంతాపంపొందుతుంది. ఇది ద్వితీయాశ్వాసం.

తాను అనుకున్నట్లుగా రాయలు లకుమకు రాజనర్తకిపట్టాన్ని ప్రదానం చేస్తాడు. లకుమాభినయామృతాన్ని ఆస్వాదించే సంకల్పంతో తనకు తీర్థ ప్రసేవనకాంక్ష ఉన్నదని కాటయవేమునికి తెలిపి, ఆతని మౌనాన్ని అంగీకారంగా భావించి లకుమతో తీర్థాటనకు బయలుదేరుతాడు రాయలు. లకుమా రాయలు అహోబలనరసింహునికీ, దాక్షారామ మహేశ్వరునికీ పూజాదికములు జరుపుతూ లకుమానాట్యవిలాసాలను తిలకిస్తూ ఆమె సౌందర్యసరసిలో ఓలలాడుతాడు. ఇలా తీర్థాటనలో వారి ప్రణయం కుసుమిస్తుండగా అక్కడ మహారాజ్ఞి వికృతస్వప్నాలుకంటూ రాయలను తలచుకుంటూ దుఃఖిస్తుంటుంది. ఇది తృతీయాశ్వాసంలోని వృత్తాంతం.

తీర్థాటనం ముగించుకొని రాగానే రాయలు లకుమ కోసం కేళీమందిరం నిర్మించాలని సంకల్పిస్తాడు. కాటయవేముడు రెండవ హరిహరరాయలపై దండయాత్ర సాగిస్తాడు. కేళీమందిర నిర్మాణం పూర్తికాగానే, రాయలు ప్రతి సంధ్యాసమయం లకుమానృత్యవిశేషాలు తిలకిస్తూ పులకిస్తూ 'వసంత రాజీయం' అనే నాట్యశాస్త్రగ్రంథాన్ని రచిస్తాడు. కాటయవేముడు హరిహర రాయలను జయించివస్తాడు. దివారాత్రాలు లకుమసన్నిధిలోనే ఉంటూ రాజ్య వ్యవహారాలను నిర్లక్ష్యంచేసే రాయలను చూసి మహారాజ్ఞి దుఃఖిస్తున్న విషయం తెలిసికొని వేమారెడ్డి రాయలవద్దకేగి ఒకసారి ఆస్థానానికి రావలసినదిగా ప్రార్థించి ఒప్పిస్తాడు. ఇది చతుర్థాశ్వాసంలోని కథాంశం.

మరునాడు కొలువుకూటానికి రాగానే లకుమ కాలు బెణకిందన్న వార్త విని వెంటనే రాయలు లకుమాసన్నిధికిపోతాడు. రాణి ఈ విషయంవిని దుఃఖిస్తుంది. తన దుఃఖాన్ని కాటయవేమునికి తెలుపుతుంది. కాటయవేముడు మహారాజ్ఞి మంచం పట్టిందనీ దేశంకోసమైనా ఆమెను ఓదార్చాలనీ రాయలను ప్రార్థించి విఫలుడౌతాడు. చిట్టచివరకు మహారాజ్ఞి మరునాటిరాత్రి లకుమ దగ్గరకువెళ్ళి విషయమంతాచెప్పి దేశంకోసం రాజును మరచిపోవాలని ప్రతిమాలి వస్తుంది. లకుమ ఒక నిర్ణయానికివచ్చి మరునాటి సంధ్యావేళ రాయల

సన్నిధిలో నాట్యంచేస్తూ బాకుతో పొడుచుకొని నేలగూలిపోతుంది. బాకు పిడి చుట్టు ఉన్న లకుమా సందేశపత్రాన్ని చదువుకొని రాయలు జాగృతుడై తన దృష్టిని దేశంపైపు మహారాజ్ఞివైపు సారిస్తాడు. దీనితో కావ్యం పరిసమాప్త మవుతుంది.

ఈ కావ్యంలో కథాసన్నివేశానుగుణంగా వర్ణనలుచేసి నారాయణరెడ్డి తన ప్రౌఢ కవితాశక్తిని ప్రదర్శించినాడు. ఆయా సందర్భాలలో ఆతడుచేసిన వర్ణనలు ఆయా పాత్రల వ్యక్తిత్వాన్ని చాటుతున్నాయి. రచన అంతా సహృదయ హృదయా వర్జకంగా కవితాకర్పూరపరిమళాత్తమై సాగింది. దీనిలోని కొన్ని అపూర్వములైన వర్ణనలను స్థాలీపులాకన్యాయంగా ఉదాహరిస్తాను.

చైత్ర పూర్ణిమనాటి చంద్రుడు—

"విరహ చిత్తముల జర్జరితమ్ములుగజేయ
దండు వెడలిన మన్మథస్వామి రథముపై
ముద్దుమూటలు గట్టు ముత్యాల గొడుగు"లా ఉన్నాడు. అతడే వియోగులకు 'అగ్గిపిడుగు' అట.

లకుమానృత్యసన్నివేశాలన్ని చలన చిత్రాల్లా కళ్ళముందు కదలుతాయి. వాటిని చదివినప్పుడల్లా 'మరందతుందిలభావనలతో' డెందం ఆనందడోలికలలో తేలియాడుతుంది.

వసంతరాయలు అహోబలానికి చేరినప్పుడు సంధ్యాసమయమవుతుంది. ఆ కడసందియ—

"అతిధావన పరిశ్రాంత
మై సూర్యుని అశ్వసప్త
కము నెత్తురు గ్రక్కెననగ"

ఎర్రవారిందట. ఈ కావ్యంలోని కేళికామందిర సౌందర్య వర్ణనలు రమ్యాతి రమ్యములు. 'తారలదారుల'లో కాంతులను వెదజల్లే ఆ మందిరపు 'బంగరు తలుపులు' వనితల మెయివన్నెను గని నవ్వుతున్నాయట. 'అందాల నెలరా తిన్నెలు' 'నెలతల ముఖమండలముల'ను కేరుతున్నవట. అందలి 'పగడపు

చూరులు' పడతుల మోములను పరిహసిస్తున్నవట. ఇక 'ముత్యపు వాకిళులు' ముదితల నవ్వులను చులకనచేస్తున్నవట. ఇలా మందిర సౌందర్యం మహిళా మణుల సౌందర్యాన్ని మించటం ఇందలి విశేషం.

ఈ కావ్యంలో లకుమాసౌందర్యాన్ని ఆయా సన్నివేశాల ననుసరించి హృదయంగమంగా వర్ణించినాడు. 'మన్మథుని ఆరవ బాణము'లా 'అమృతాంశుని పదునేడవకళ'లా, 'జ్యోత్స్నాభిసారిక'లా 'వెన్నెల'లా 'శక్తయై దివినుండి భువిపై జారివచ్చిన అచ్చర'లా, 'మునికన్యవోని సుందరి'లా ఉన్నదట. ఆమె 'మరుచ్చలితకుసుమితలత మాదిరిగా' 'పాలవెల్లి తరంగముల నూర్వశి'లా నడుస్తుంది. గోదావరిలో స్నానమాడి బయటకు వచ్చినపుడు ఆమె 'చెలువరూపునుగొనిన అలవలె' ఉన్నదట. ఆమె పదములు 'భరతునిశాస్త్రమున కొజ్జబంతులు'. ఈ వర్ణనలన్నీ ఒక ఎత్తు లకుమను సృష్టికిప్రతీకగా చిత్రించే ఈ క్రింది వర్ణన ఒక ఎత్తు.

"పృథ్వినాయమ జఘనపీఠమ్మునంజూచి
జలమామె కంటిపాపల లోతులం జూచి
తేజమ్ము నామెముఖరాజీవమున గాంచి
వాయుగతి నామె నిశ్వాసముల గుర్తించి
ఆకాశమామె మధ్యమునందు గమనించి
నిఖిలసృష్టికి లకుమనే ప్రతీకగనెంచి"

వసంతరాయలు మదనపూజకై వెళ్లుతున్న సందర్భంలో ముగ్ధా మధ్యాప్రౌఢలనూ, లకుమానృత్యసన్నివేశాలలో వివిధహస్తముద్రలనూ, విరహోత్కంఠా జ్యోత్స్నాభిసారికా వాసకసజ్జికా ఖండితా నాయికలను వర్ణించి నారాయణరెడ్డి తన అలంకారశాస్త్ర పరిజ్ఞానాన్ని ప్రదర్శించినాడు. కావ్యారంభంలోనున్న వసంతోత్సవ వర్ణనాసందర్భంలో క్రీడాభిరామాన్నీ, దాక్షారామవర్ణనంలో భీమేశ్వరపురాణాన్ని సందర్భోచితంగా నారాయణరెడ్డి ఉపయోగించుకున్నాడు.

ఈ కావ్యంలో ప్రధానరసం శృంగారం. కరుణవీరములు అంగరసాలు. మదనపూజోత్సవాల సందర్భంలో, నగరోద్యాన లకుమా నృత్యసన్నివేశంలో, లకుమారాయల తీర్థాటన సందర్భంలో, లకుమా నాట్యప్రదర్శన వేళల్లో, రాయల వసంతరాజీయ రచనా సన్నివేశంలో, లకుమారాయల

పరస్పర సంభాషణల్లో, వారి జలకేళీచతురంగఖేలనల్లో శృంగార రసం చక్కగా పోషింపబడినది. చతుర్థాశ్వాసంలోని—

"లకుమ ఒకప్పుడు నదిపో
లిక పొంగులు వోయినపుడు
ప్రభువే రత్నాకరుడై
పరీరంభమున ముంచును
ఆమె విపంచికయై తా
దాత్మ్యమ్మన మ్రోయునపుడు
ప్రభువాయమ తనూవల్లి
పై పాణితలమ్మౌంచును"

వంటి చరణములు ఈ కావ్యంలోని శృంగార రసధారకు తరంగసదృశోదాహరణములు. ఈ కావ్యంలో మహారాజ్ఞి దుఃఖించిన ఘట్టాలలోనూ, లకుమ మరణ సన్నివేశంలోనూ కరుణరసం జాలువారింది. కాటయవేముడు సమర భేరి మ్రోగించినప్పుడు వీరరసరేఖలు తళుక్కున మెరుస్తాయి.

"ఆలంకారికు లేమన్నను
లక్షణయో వ్యంజనయో లీ
లామాత్రముగా భాసించును"

అని కాటయవేముని నుద్దేశించి వసంతరాయల నోట పలికించిన నారాయణ రెడ్డి ఈ కావ్యంలో సర్వత్రా కావ్యాత్మ అయిన ధ్వనికి పనికల్పించినాడు. ఉదాహరణకు కొన్ని.

గజారూఢుడై మదనపూజోత్సవాలకు బయలుదేరి పోతున్న కర్పూర వసంతరాయలు—

"..........సురగజముపై
స్వారివెడలు శచీద్వితీయుని
స్మరింపించి"నాడట.

ఈ పంక్తులు వసంతరాయల వైభవాన్ని చాటుతూనే మరోవైపు నాట్యంలో రంభాదులను మించే లకుమతో రాయల భవిష్యత్పరిణయాన్నీ, అతని లౌల్యాన్నీ రాసిక్యాన్నీ స్ఫురింప జేస్తున్నవి.

"అల్లనాటి పురూరవుని ముం
దవతరించిన ఊర్వశికి వలె"— (ద్వితీయాశ్వాసం)
"లకుమ నడచెను పాలవెల్లి త
రంగముల సూర్యశివిధమ్మున"— (తృతీయాశ్వాసం)
"గుసగుసలు వోయిరి పురూరవు
గూడిపోయిన ఊర్వశియె యని"— (తృతీయాశ్వాసం)

ఇలా లకుమకు ఊర్వశీ సాదృశ్యం మూడుసార్లు ఉగ్గడింపబడింది ఈ కావ్యంలో. దీనివలన లకుమాసౌందర్యనృత్యాభినయకళావిశేషాలేగాక ఆమెకు రాయలతో ఏర్పడే ప్రణయం అశాశ్వతమని ధ్వనిస్తున్నది.

వసంతరాయలు లకుమను చూసిన నాటి తెలవారుజామున గన్న కల కూడా లకుమాప్రణయభాగ్యం అతనికి సిద్ధిస్తుందనే సత్యాన్ని వ్యంగ్యంగా ప్రకటిస్తున్నది.

లకుమ స్వప్నంలో తాను పార్వతిలా శివుని సన్నిధి చేరినపుడు పరమ శివుని నిటలనేత్రం నిప్పులుమియటం, ఆతని మెడలో నాగఫూత్కారాలు విన పడడం, 'తన శిరోలంకరణమౌ నాగమణి ఫణివోలె' బుసకొట్టడం మెడపై పాకడం అనేవి రాయలతోడి లకుమ ప్రణయం అధర్మమనీ ప్రమాదమనీ అది దగ్ధమైపోతుందనీ స్ఫురింప జేయకపోవు.

అలాగే ఆహోబలంలో రాయలకు ప్రసన్నంగా కన్పించిన నృసింహ స్వామి లకుమకు 'క్రుద్ధకంఠీరవమూర్తి'గా కనిపించినట్లు వర్ణించి లకుమ ప్రణయం ధర్మవిరుద్ధమని అది భగవంతునికి ఇష్టంలేదని ఆమె ప్రణయ జీవితం భగ్నమౌతుందనే ఆగామివిషాదాన్ని ధ్వనింపజేసినాడు కవి. ఇలా ఈ కావ్యంలోని పలుఘట్టాలు ఉత్తరకథా సూచకాలు; వస్తుధ్వనికి నిదర్శనాలు.

నారాయణరెడ్డి ఏ విషయాన్నైనా ఉక్తివైచిత్రితో కవితాత్మకంగా వ్యక్తీకరిస్తాడు. రాయలు లకుమను రాజనర్తకిని చేస్తానన్నాడు. లకుమకు ఆ వార్త సంతోషం కల్గించింది. కాని కవియైన నారాయణరెడ్డి అలా పొడి పొడిగా చెప్పడు. ఆ భావాన్ని—

"లకుమ కావార్త క
ల్వ నెలంత కంటి పా

పల పైన పాల వె
న్నెల సోకినటులయ్యె"

అనే చరణకుసుమాల ద్వారా పరిమళింపజేస్తాడు.

అదేవార్త రాణికి సంతాపం కలిగిస్తుంది అపుడు నారాయణరెడ్డి

"రాణి కావార్త క
ల్వనెలంత చెవులలో
ఖరకరుని అశ్వరిం
ఖల చప్పుడుగ తోచె"

అన్న పంక్తులద్వారా ధ్వనింపజేస్తాడు. కావ్యకళలలో అందెవేసిన చెయ్యి నారాయణరెడ్డిది. ఎలా అనుకుంటే అలా అందంగా ధ్వనిమనోజ్ఞంగా చెప్ప గలడు. ఇంకా కొన్ని ఉదాహరణలు—

కోపంతగ్గి శాంతిని పొందిందనడానికి—

"పగడమ్ము నునుముత్యముగ మారిపోయె"

అంటాడు. నీటతడిసిన లకుమా విస్ఫురితాంగ సౌందర్యాన్ని చూసిన రాయడు 'కెరటం బలె' కిందుమీదై పోతాడు. అంతలో ఆలయశంఖనాదం విని పిస్తుంది. అతడు 'శరత్కాసారము' అయిపోతాడు.

"విద్వన్మణియైన కాట
వేముడు రాయని హృదయ
మ్మున మొల్చిన ఇంద్రచాప
మును వెంటనె గమనించెను"
"పరరాజుల గుండెలుపూచెను"
"ఆమె నేత్రములందు
అమవసలు జడలు విరబోసికొనె"

ఇలా ధ్వనిమంతములైన మనోజ్ఞగేయ ఖండికలు ఈ కావ్యమంతట కర్పూ రంలా సురభిళిస్తున్నవి.

ఈ కావ్యంలోని నాలుగు పాత్రలను ఎంతోనేర్పుతో చిత్రించినాడు నారాయణరెడ్డి. కుమారగిరిరెడ్డి ధీరలలితుడు. ఆతడు ఈ కావ్యంలో 'పరిపంథినృపతి దోర్బలకంధిమంధనాపరమందరాద్రి' స్వరూపుడుగాగాక- 'కళాదుగ్ధ సాగరమనోముగ్ధ సంపూర్ణచంద్రమూర్తి'గానే కనిపిస్తాడు. ఆతడు 'రాజసమూర్తి.' 'ఇక్షుధన్వికీడగు మోహనమూర్తి' 'మెఱపు'లాంటి లకుమ నాట్యవేదికపై ప్రత్యక్షంకాగానే 'చకితుడై'నాడు. లకుమ రాధగా అభినయించేవేళ 'రసజగత్తునకీశ్వరుండగు' తాను కృష్ణస్వామిగా రూపొందినట్లు మహానుభావాన్ని పొందుతూ తన్మయుడై 'లకుమాలగ్నపంచప్రాణుండై'నాడు. అతడు 'ఔచిత్యజ్ఞుండైనను ఆవేశవశుండు.' ఆతని రసావేశహృదయం లకుమను కంఠహారంతో సన్మానించింది; ఆమెను రాజనర్తకిని చేసింది; దక్షవాటిలో లకుమ పార్వతిగా అభినయించినప్పుడు పరిజనం చూస్తూండగానే 'గాటముగా' కౌగిలించుకున్నది. కాటయవేముని విజయనగర దండయాత్రను గూర్చి విన్నప్పుడు ఆతనిలోని 'పౌరుషబడబాగ్ని' ఒక్కమారు విజృంభించినా, అది లకుమను తలచుకోగానే 'జానువెన్నలై' పోతుంది. ఆతని 'శౌర్యరేఖ' మాసిపోతుంది. లకుమాకళావికాసానికి ముగ్ధుడైన రాయలు తరువాత ఆమె తనూలావణ్యానికేదాసుడైపోతాడు. ఆతనికి మహారాజ్ఞి అంటే గౌరవమూ భయమూదప్ప అనురాగంమాత్రం లేదు. ఆతని 'బ్రతుకునావనునడుపు చుక్కాని' లకుమే అయింది. లకుమాసాంగత్యంవలన ఆమె అభినయకళావైదగ్ధ్యంవలన ఆతని 'వైదుష్యధార' పెల్లుబికింది. 'వసంతరాజీయం' వెలిసింది. ఆతడు సాధించిన ఏకైకవిజయమిదే. దేశంకన్న అతనికి లకుమయే మిన్న. ఆమెకు కాలుబెణికిన వార్త విని కొలువు చాలించివచ్చి ఆమెతో 'నా జీవనవామృతభాండమే తొణకెనో లకుమా' అంటాడు. లకుమ మరణిస్తే ఆతనికి 'తన శరీరము మనసు సర్వమ్ము పాతాళకుహరాన బడిపోయినటు' తోచింది. ఇలా లకుమనుచూసినప్పటినుంచి నృత్యకేళీ వినోదియై అన్నీ మరచి మళ్ళీ ఆమె మరణం తర్వాతనే మహారాజ్ఞినీ దేశాన్నీ చూడగల్గిన ధీరలలితత్వం కుమారగిరిరెడ్డిది.

లకుమా పాత్రచిత్రణంలో నారాయణరెడ్డి చూపిన ప్రతిభానైపుణ్యాలు అద్భుతం. ఆమెకు మొట్టమొదటిసారిగా ఈ కవి వేసిన విశేషణం 'కళాలక్ష్మి' అని. తరువాత 'మెఱపువలెనున్న యొకకాంత' అని. ఆ తర్వాత 'మన్మథుని ఆరవబాణం', 'అమృతాంశుపదునేడవకళ' 'సకలకళాసంగమ

తీర్థము' ఇలా ఎన్నెన్నో. ఏ విశేషణమైనా ఆమె కళాసౌందర్యప్రణయ మూర్తులనే మన కళ్ళముందు నిలుపుతుంది. తన నాట్యకళాసంపదచేత తనూ లావణ్యంచేత కుమారగిరిహృదయాన్ని పరవశింపజేసి ఆతనిచే రత్నహారాన్ని కానుకగా పొందిన కళామూర్తి.

"ఆటవెలదుల యింటి పడుచే
నాటికైనను కాదు లకుమ
శక్తియై దివినుండి భువిపై
జారివచ్చిన అచ్చరసుమ"

అని ఆమెనుగూర్చి వసంతరాయలనోట పలి ంచిన వాక్కులు ఋక్కులే. వసంతరాయలను త్రికరణశుద్ధిగా ప్రేమించి ఈ జన్మలోనే కాదు తరువాతి జన్మలోకూడా ఆతని 'యువహృదయము'గా జన్మించాలని కోరుకున్న ప్రణయమూర్తి. తన అసాధారణనృత్యకళావైశారద్యంతో 'రసవన్నవలాస్య భంగులను' ప్రదర్శించి. 'భరతుడుచూపించనట్టిభావమ్ములు' చూపి వసంత రాయలచే అభినయశాస్త్రగ్రంథం వ్రాయించిన విదుషీమణి.

"మట్టిముద్దనొక అనర్ఘ
మణిగామలచితి వీవే"

అని రాయలు తనను ప్రశంసించినా గర్వించక ఆతనితో—

"కాలిధూళి యేనాటికి
గంధపుపొడి యగునా"

అని పల్కిన వినయవంతురాలు. కాటయవేముని పట్ల ఆమెకు అత్యాదరము. ఆతని 'సహృదయతకు' మనస్సులోనే అంజలి అర్పిస్తుంది.

"పట్టమహిషివ్యాధి మహో
పప్లవమ్మునకు సూచిక
రాణిగారిసేమము దే
శానికమృతవీచిక"

అని గ్రహించి రాయలను మహారాణి దగ్గరికిపొమ్మని బ్రతిమాలిన విశాల వినిర్మలహృదయ. ఋజుమార్గగామిని. మహారాజ్ఞి అర్ధరాత్రి వచ్చి తనకు నమస్కరించగా దానిని దోషంగా భావించి రాణికి వినయంతో ప్రతినమ

స్ఫూర్తింపచేసి, ఆమె ఆర్తిని గ్రహించి 'వ్యష్టికన్నను దేశదృష్టియె గరిష్ఠ మని' గమనించి ప్రాణాలర్పించిన త్యాగమూర్తి. 'శిబిదధీచులను మించిన' త్యాగశీలం లకుమది. ఈ శీలంతో 'పరమసాధ్వీజగత్ స్వర్ణాసనము'ను అలంకరించిన మహోదాత్తవ్యక్తిత్వం లకుమది.

కాటయవేముడు 'సమరభీముడు', విద్వన్మణి. కుమారగిరి 'మనసు కెక్కినట్టి ప్రధాని'. ఆతనిభావ· ఇంగితజ్ఞుడు. సరసవాక్చతురుడు. రాయలకు లకుమను పరిచయం చేసిన రసజ్ఞుడు. రాయలు అసంతృప్తిపడతాడని ఆతని తీర్థప్రసేవన కాంక్షకు ఔననడు కాదనడు. రాజు తీర్థయాత్రను ముగించుకొని రాగానే ఆతనికి స్వాగతం పలికి కౌగిలించుకుంటాడు. కాని రాయల ప్రక్కన లకుమ కనిపించగానే ఆతని 'నేత్రాంభోజయుగము' ముకుళితమౌతుంది. తానొక్కడే విజయనగరరాజును జయించిన వీరావతారుడు. శౌర్యధాముడు. శరణువొచ్చిన హరిహరుని ప్రాణాలు రక్షించి ఆతని పుత్రికను క్షాత్రకుల్యా ముగా గ్రహించిన తేజస్వి. వసంతరాజీయరచనను చూసి 'కళాత్మ' పొంగిపోగా రాయలను అభినందించిన సహృదయుడు. 'కళలపాల్కడలి'. కాళిదాసనాటకవ్యాఖ్యారచనకు పూనుకున్న పండితుడు. రాజ్యంలో అంతః కల్లోలాను అణచిన పరిపాలనాదక్షుడు. మహారాజ్ఞి మనోవ్యాధిని కనిపెట్టి ఆమెను మాటి మాటికి ఓదార్చిన ఆత్మబంధువు. రాజ్ఞివ్యాధినీ, రాజ్యస్థితినీ రాయలకు వివరించి ఆతనిని సభకు వచ్చేటట్లు ఒప్పించి అతనికి 'బంగారు సంకెలలు' వేయగల్గిన ఏకైక వ్యక్తి వేముడు.

మహారాజ్ఞి 'ఆదిసతి' కెనవచ్చు వ్యక్తి. 'భూదేవికపరావతారము'. కళాభిజ్ఞయైన లకుమను ఆదరించటం రాజధర్మమైనా రాయలు ఆమె 'అడుగుల మ్రోలబ్రతుకును ధారవోయుట' న్యాయంకాదన్న ధర్మజ్ఞ. సంప్ర దాయజ్ఞురాలు. లకుమా దాసుడైన రాయలు తన అంతఃపురమునకు రాలేదన్న దుఃఖంకన్న రాచగద్దెను విడిచివచ్చినాడన్న వార్తయే అధికంగా బాధించిందా మెను. రాయలు 'లలితకళాజగత్సమ్రాట్టనుచు' మురిసింది కానీ ఆతడు దేశాన్ని మరచినందుకు మాత్రం విలపించింది. కాటయవేమునితో తన మహా వేదనను విన్నవించుకుంటూ పల్కిన—

"కేళికామందిరము కన్నను
ఓలగమ్మె పవిత్రమైనది
వ్యక్తికన్నను దేశసౌభా
గ్యమ్మె ఆదర పాత్రమైనది"

అనే మాటలు 'ధర్మశాస్త్రజగత్తునకు మణి దర్పణములు'. ఆమె ఈ ధర్మ దృక్పథమే లకుమా హృదయాన్నిమార్చి ఆమెచే ప్రాణత్యాగం చేయించింది; రాజుకళ్ళు తెరపించింది; దేశాన్ని రక్షించింది. ఆమె వాక్కులే ఈ కావ్య సందేశం.

ఇలా నారాయణరెడ్డి ఈ కావ్యంలోని నాలుగు పాత్రలను ఆమోఘంగా చిత్రించినాడు.

ఈ కావ్యంలోని సంభాషణలు సరసములై చమత్కార గర్భితములై నాటకీయతాసంపాదకములై సన్నివేశానికి వన్నెలు కూరుస్తూ పాత్రల వ్యక్తిత్వమును భాసింపజేస్తున్నవి. నగరోద్యానంలో లకుమానాట్యప్రదర్శన సందర్భంలో కాటయవేమునికీ వసంతరాయలకూ జరిగిన సంభాషణం, సింగనికీ చెంచెతకూ జరిగిన సంవాదం ఇందుకుదాహరణములుగా గ్రహింపవచ్చు.

నారాయణరెడ్డి ఔచితీ మర్యాదావిదుడు. ఆతని ఈ వైదుష్యం ఈ కావ్యంలో ప్రతి ఆశ్వాసంలోనూ భాసిస్తూ ఆయా సందర్భాలలో సహృదయుల ఉత్కంఠను పెంచుతున్నది. వసంతోత్సవంలో ఉద్యానానికి బయలుదేరిన వారిలో కాటయవేముడున్నాడు. అతడపుడు—'సైన్యాధిపతి కాటయ్యవేముడు సమరభీముడు' మాత్రమే. అతడే మదన పూజావేళ రాజుగారి 'మనసునకెక్కినట్టి ప్రధాని....ఆతని బావ'గానే కనిపిస్తాడు. అందుకే ఆతడు పరిహాస మాడుతాడు. లకుమను 'వెన్నెల'గా వర్ణించి తర్వాత లకుమా నాట్య సందర్భంలో రాధికనోట శ్రీకృష్ణుని—

"చీకటి నిలవెల్లరూపు
గైకొనునటులున్నవాడ
నిను తాకిన వెన్నెల మా
యను పొమ్మా మొరటుకాడ"

అని అనిపిస్తాడు నారాయణరెడ్డి. అలాగే లకుమ పేరును మొట్టమొదటి సారిగా రాజునోటనే పలికించటం, అంతవరకూ మె పేరును తెలుపకపోవటం ప్రాచితీశోభితంగానూ ఉత్కంఠతాపాదకంగానూ ఉన్నది.

ఈ కావ్యంలో నారాయణరెడ్డి త్ర్యస్యచతురస్రాదిగతులను సన్ని వేశానుగుణంగా, భావపరివర్తనసూచకంగా పాత్ర మనఃస్థితి స్ఫోరకంగా మారుస్తూపోయినాడు. గతులలో కొన్నిచోట్ల మాత్రలను తగ్గించినాడు, పెంచి నాడు. ఆరకంగా పఠితలకు విసుగురాకుండా ప్రయత్నించినాడు. గతివైవి ధ్యాన్ని ప్రదర్శించినాడు. ప్రతి ఆశ్వాసంలోనుంచీ ప్రతిసన్నివేశం నుంచీ ఇందుకు ఉదాహరణలు చూపించవచ్చు.

లకుమ చెంచెతగా అభినయించినప్పుడు కవి పద్నాలుగు పంక్తుల్లో తప్పకుండ 'ంగ' ప్రాసను వాడి చెంగునదూకే చెంచెత సింగని గంతులనూ చిందులనూ కళ్ళకు కట్టించినాడు. ఛందస్సుమంలోని పరిమళాన్ని పట్టుకున్న పండితకవి నారాయణరెడ్డి.

తెలుగు పద్యరచనలో కవులు ఎన్నెన్ని పోకడలను, మలుపులను మెలి కలను ప్రవేశపెట్టి మెలకువలు ప్రదర్శించినారో నారాయణరెడ్డి గేయరచనలో అంత వైవిధ్యాన్నీ వైచిత్రినీ మెలకువతో ప్రదర్శించి గేయానికి పాండితీ ప్రౌఢినీ గాంభీర్యాన్నీ సౌందర్యాన్నీ ధారామాధుర్యాన్నీ సంతరించినాడు.

'ప్రతియోగరీతి'చే (by contrast) భిన్నసన్నివేశాలను ఏకకాలంలో సమాంతరంగా కన్నులముందు నిల్పుతూ పాత్రలచిత్తవృత్తుల్లో కలిగే పరిణా మాలను మనోజ్ఞంగా చిత్రించినాడు ఈ కావ్యంలో నారాయణరెడ్డి. నాగా ర్జునసాగరంలో పల్లవించిన ఈ సంవిధానం ఈ కావ్యంలో ఫలోన్ముఖమైనది. ఉదాహరణకు ఒకటి-రెండు.

"లకుమ అపుడె తొలిసారిగ
రాయని తన మనసారగ కౌగిలించె
అచట కొండవీట రాణి
అతివికృతస్వప్నమ్మున కలవరించె"
"కొలువుకూటమ్ము ని
శ్చలసాగరమువోలె నిల్చెనట

రేని చిత్తమ్ము సుడి
లోని పడవగ మారిపోయెనిట"

ఈ కావ్యంలోని—

"తనువులేకమైనంతనె
మనసులేకమవునా మరి ?
"కాలిదూళి యేనాటికి
గంధపుపొడియగునా"
"శబ్దవిదులకు - తెలియలేనిదియేది ?"

వంటి సూక్తులు విశ్వజనీనతను చాటుతాయి.

'సురసరిన్మందార సుమగరుస్నీహార పరిహాసన్మంజుకీర్తీ', 'ఆకాశ సింధు పృషత్ ప్రసిక్త మరాళమృదుకాంచన గరుత్మత్త', 'లకుమాదివ్యాభినయామృత శీకరరింఛోళికాభిషేకము' వంటి దీర్ఘసమాసాలు నారాయణరెడ్డి విద్వత్తునూ గేయరచనా చాతురిని ప్రకటిస్తూ కావ్యానికి ప్రౌఢిని సంపాదించి పెడుతున్నాయి. తెలుగుపలుకుల సంస్కృతోక్తుల సరసస మ్మేళనం ఈ కావ్యమంతటా గుబాళిస్తుంది.

"రమ్యమైన కథను గ్రహించి దానిని రసభావమహితముగా గ్రహించి గేయరూపమున తీర్చిదిద్దిన కీర్తి శ్రీ నారాయణరెడ్డిగారికే దక్కినది. వారి నాగార్జునసాగరములో కన్నెతనపు వన్నెలొలికించిన యాకీర్తి కర్పూరవసంత రాయలలో ప్రౌఢతనము ప్రాపించినది"[1] అని ఈ కావ్యమును గూర్చి ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు పల్కిన పలుకులు అక్షరసత్యములు.

'కర్పూర వసంతరాయలు' నారాయణరెడ్డి కావ్యాలలోకెల్ల మకుటాయమైనది. విద్వత్కవిగా నారాయణరెడ్డి యశస్సౌరభాలను దిగంతాలదాకా ప్రసరింపజేసింది. ఈ మధురకావ్యాన్ని నారాయణరెడ్డి 'ఢిల్లీ జంషడ్‌పూర్, బరంపురం మద్రాసు వంటి ఆంధ్రేతరనగరాల్లో' గానంచేసి సహృదయ హృదయాలను రసతరంగితం చేసినాడు. హృదంతరాలలో రసనదాలను

1. కర్పూర వసంతరాయలు - 'కర్పూరసౌరభము' - పుట 16, ద్వితీయ ముద్రణ - 1964.

కదిలించే కవితాశిల్పపరీమళం గుప్పుమనే కావ్యకర్పూరఖండం ఈ 'కర్పూర వసంతరాయలు'.

ఈ కావ్యం చదివినప్పుడు మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు ఈ కావ్యాన్నిగూర్చి నాతో అన్నమాటలు జ్ఞాపకానికి వస్తాయి. "ఆధునికాంధ్ర కావ్యప్రపంచంలో గేయచ్ఛందస్సులో నడిచిన సమగ్రరసబంధుర ప్రబంధం కర్పూర వసంతరాయలు. రసభరితమైన రచనతోనూ త్యాగమహితమైన సందేశంతోనూ నిత్యనూతనంగా పరిమళిస్తున్న మహాకావ్యం 'కర్పూర వసంతరాయలు".

# విశ్వనాథనాయుడు

నారాయణరెడ్డి మూడవ చారిత్రకకథాకావ్యం 'విశ్వనాథనాయుడు'. ఇది 1959 డిసంబరులో ప్రచురితం. 'తంజాపురాంధ్రరాజుల చరిత్ర' అనే గ్రంథంనుంచి నారాయణరెడ్డి ఈ కావ్యవస్తువును తీసుకున్నాడు.

వీరరసప్రధానమైన ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి శ్రీగుమ్మడి వేంకటేశ్వరరావుగారికి స్నేహచిహ్నంగా అంకితం చేసినాడు.

శ్రీకృష్ణదేవరాయల మన్నీడైన విశ్వనాథనాయుడు అధర్మపరుడైన తన తండ్రి నాగమనాయని కూడా నిర్బంధించి ఆతనిని రాయల సమక్షమున నిలిపి తన ధర్మరక్తినీ ప్రభుభక్తినీ ప్రకటించుకొనుట ఈ కావ్యంలోని ప్రధానవస్తువు.

సౌందర్యదృష్టితో ఔచితీదృక్పథంతో నారాయణరెడ్డి మూలంలోలేని రెండు మార్పులు కల్పించినాడీకావ్యంలో. అవి—విశ్వనాథనాయని జనన వృత్తాంతం, విశ్వనాథనాయని తల్లి ('మలికాంబ') పాత్రకల్పనం.[1]

[1]. విశ్వనాథనాయుడు - 'సహృదయులకు'—లో నారాయణరెడ్డి మాటలు. పుట 1. ద్వితీయముద్రణ మార్చి 1965.

ఈ కావ్యంలో ఆరు ఖండాలున్నవి. ప్రథమఖండంలో విశ్వనాథనాయని జననవృత్తాంతం, ద్వితీయఖండంలో విశ్వనాథుని విద్యాయుద్ధాభ్యాసాలూ, కృష్ణరాయలసేనాపతికావటం, శ్రీకృష్ణదేవరాయల ఆజ్ఞతో నాగమనాయడు మధురను అక్రమంగా ఆక్రమించుకున్న తంజాపురచోళభూపతిని తరిమికొట్టుటకై సమరభేరి మ్రోగించుట, తృతీయఖండంలో తంజావూరు మధురలను ఆక్రమించుకొని రాయలకెదురుతిరిగిన నాగమనాయని బంధించి తెచ్చుటకై ఆతని పుత్రుడు విశ్వనాథనాయడు ససైన్యంగా బయలుదేరటం, చతుర్థ ఖండంలో విశ్వనాథనాయడు నాగమనాయడు యుద్ధసన్నద్ధులుకావడం, పంచమఖండంలో కబురందుకొని తలిసన్నిధికి వెళ్లిన విశ్వనాథనాయణ్ని తండ్రి అక్రమంగా చంపయత్నించి విఫలుడుకావడం, తలిదండ్రులకు నమస్కరించి విశ్వనాథనాయడు తనగుడారం చేరుకోవడం, షష్ఠఖండంలో తండ్రినిబంధించితెచ్చిన విశ్వనాథనాయణ్ని కృష్ణరాయలు సన్మానించటం, నాగమనాయణ్ని క్షమించటం పాండుభూపతి అభ్యర్థనమేరకు రాయలు విశ్వనాథనాయణ్ని మధురకు ఏలికచేయడం, విశ్వనాథుడు పాండ్యశ్రీని ఏలుకోవటం - అనేవి చక్కగా కూర్చబడినవి.

ఈ కావ్యంలో వర్ణనలుకథానుగుణములై సంక్షిప్తమనోహరములై రసస్ఫూర్తిని కలిగిస్తున్నవి. కావ్యం సూర్యోదయవర్ణనతో ప్రారంభమవుతుంది.

"సూర్యావతరణప్రచురణార్థమయ సం
భృతశంఖమన"

ఆకాశంలో వేగుచుక్క వెలిగినదట. ఇందులో సూర్యావరతణ శంఖశబ్దాలు కావ్యవస్తువునూ, అందలి వీరరసమునూ ధ్వనింపజేస్తున్నవి. సూర్యుడు తేజస్సంపన్నుడు; నిజధర్మనిర్వహణ తత్పరుడు; అతడవతరింపబోతున్నాడు. అలాగే సూర్యసదృశప్రతాపసంపన్నుడూ, వీరరసాలంబనుడు, ధర్మదీక్షా నిరతుడూ అయిన కావ్యనాయకుడు విశ్వనాథనాయడు ఉదయింపబోతున్నాడనే అర్థస్ఫూర్తి ఈ వర్ణనద్వారా కలుగుతున్నది.

సూర్యోదయసమయంలో ఆలయాన్ని దాటి వస్తున్న నాగమనాయడు 'వెలుతురు పొత్తిళ్ళ'లో నవ్వుతున్న 'బాలసూర్యబింబము'ను చూడడం,

మల్లికాంబ కొమ్మపై కూర్చొని తన నిసుగుచుంచు దువ్వుతున్న పెంటిని చూడడం కూడా ఆ దంపతుల భవిష్యత్సంతానప్రాప్తిని ధ్వనింపజేస్తున్నవి.

విశ్వనాథుని శైశవబాల్యవర్ణనలు రమ్యాతిరమ్యములై భావికథా సంసూచకములై భాసిస్తున్నవి. "చిట్టెమ్మ గట్టిన అధర్మమును నెట్టివేసిన యట్లు" విశ్వనాథనాయడు శైశవంలో కాళ్ళేతులను కదలిస్తున్నాడట! "తన నీడ తానెరుంగని వాని నపహసించెనో యనగ" విశ్వనాథనాయడు దీపాన్నిచూసి కిలకిల నవ్వుతున్నాడట!

'అంకురము పల్లవితమైనట్లు' విశ్వనాథుడు శైశవమును దాటి బాల్యంలో ప్రవేశించినాడు. బాలుడైన ఆతడు యౌవనుడు కావడం-"వత్సము మహార్షభత్వమ్ము దాల్చినయట్లు" ఉన్నదట.

విశ్వనాథుడు తండ్రిపైకి యుద్ధానికి బయలుదేరుతున్నప్పటి గ్రీష్మర్తు వర్ణనం హృదయంగమం.

"విశ్వనాథుని కోష్ణనిశ్వాసములు సహ
స్రగుణీకృతములైన పగిది"

గ్రీష్మం వచ్చిందట. ఆతని సుతిమెత్తని ఊహలు-"మండుటెండలకు మొనలు వాడిన మల్లెమొగ్గలను" తలపిస్తున్నాయట.

తండ్రికొడుకులు యుద్ధసన్నద్ధులౌతున్న సమయంలో సూర్యాస్తమయ వర్ణనమున్నది. ఈ వర్ణనం వృద్ధవీరుడైన నాగమనాయని చిత్తవృత్తిస్ఫోరకమై ఆగామివస్తువును ధ్వనింపజేస్తున్నది.

"తన ప్రతాపమ్ము వార్ధక్యదోషోపహత
మైపోయె బ్రతుకెందుకని"

ముఖము దప్పించినాడట సూర్యుడు. అట్లే చీకటి—

"ఒక భ్రష్టచేతసుని వికృతోహలకు బాహ్య
రూపమో యన్నట్లు"

వ్యాపించిందట. ఇక్కడ 'భ్రష్టచేతసుని వికృతోహలు' అనడం వల్ల నాగమనాయని దుస్సంకల్పం స్ఫురణకు వస్తుంది.

తల్లి సెలవు గైకొని సంగరసంగతచిత్తుడై శిబిరానికి పోతున్న విశ్వనాథునికి తలలూపే చెట్లకొమ్మలు--

"..........సంగర రంగమ్మున
పరుగెత్తెడు అరదమ్ముల
పతాకమ్ములటు"

కనిపిస్తాయి. ఆతడు తన శిబిరానికి 'చంచత్పాశుపతాస్త్రమట్లు' వెళ్ళినాడట.

"అతనిలో గుడుసుళ్ళవడు అ
త్యాశ ఒక్కమ్మడిగ లేచెను
ఒక్క తొల్కరివానతో పై
కుబికివచ్చు శిలీంధ్రమట్టుల"

అనే పంక్తుల్లోని నీచోపమానం నాగమనాయని దుస్సంకల్పానికి తగినట్లు ప్రయుక్తమైనది.

ఈ కావ్యంలో ప్రధానరసం వీరం - ధర్మవీరం. అద్భుత రౌద్ర కరుణ దయావీరములు అంగరసములు. కావ్యారంభంలో సూర్యోదయవర్ణనా సందర్భంలోని—

"ద్విజకోటి నిఖిలశ్రుతిహితమ్ముగా పాడి
చాటె నిజధర్మ నిష్ఠాగరిష్ఠత్వమ్ము"

వంటి పంక్తుల్లో నారాయణరెడ్డి కావ్యంలోని ధర్మవీరమును స్ఫురింపజేసినాడు. విశ్వనాథపాత్ర ఆలంబనంగా ఈకావ్యంలో ధర్మవీరం ప్రవహించింది. కృష్ణరాయల సభాస్థానంలో కావ్యనాయకుడు విశ్వనాథుని ముఖతః వెల్వడిన—

కన్నతండ్రియటన్న నెవ్వడు
కరిగిపోవడు ? కాని స్వామీ
ధర్మదండము బూనినప్పుడు
తండ్రి యెవ్వడు ? తనయుడెవ్వడు ?"
....................ధర్మ
క్షతిని జూడగలేక ధ్వజమె
త్తితిని ననుదీవించుము ప్రభూ !"

అనే చరణాలు ధర్మవీరమునకెత్తిన జయపతాకలు.

విశ్వనాథుడు సేనాపతిగా అరివీరుల శిరస్సులను చెండాడి రాయల విజయాంకములను స్థాపించినప్పుడు యుద్ధవీరం చోటుచేసుకున్నది.

శ్రీకృష్ణదేవరాయలు పాండ్యునకభయ మిచ్చినప్పుడూ, నాగమనాయని బంధించి తీసికొని రమ్మని సభనుద్దేశించి పలికినప్పుడూ విశ్వనాథుడు ప్రతిజ్ఞ చేసినప్పుడూ మధురలో సేనలు విడిచి తల్లిదండ్రుల కబురందుకొని విశ్వనాథుడు వారితో మాటాడినప్పుడూ తండ్రిని బంధించి తెచ్చి విజయనగర సభలో నిలిపినప్పుడూ ధర్మవీరం మహోజ్జ్వలంగా పోషింపబడినది.

విశ్వనాథమందిరంలో మల్లికాంబా నాగమనాయల ప్రార్థనా సందర్భంలో జేగంటలు మోగడం అద్భుతరసద్యోతకం.

మల్లికాంబ విశ్వనాథుని పైనబడి శోకించే సమయంలో కరుణరసం జాలువారింది.

శ్రీకృష్ణదేవరాయలు నాగమనాయని దురాక్రమణవార్త విన్నప్పుడూ, ప్రతినాయకుడైన నాగమనాయడు యుద్ధసన్నద్ధుడై హుంకరిస్తూ కొడుకుపైకి కత్తిదూసినప్పుడూ వీరరౌద్రములు సముచితంగా పోషింపబడినవి. రాయలు నాగమనాయని శిక్షించక వదలిపెట్టిన సన్నివేశంలో దయావీరం తళుక్కుమన్నది.

ఈ కావ్యంలోని పాత్రలు– నాగమనాయడు, మల్లికాంబ, కృష్ణదేవరాయలు, విశ్వనాథుడు, చంద్రశేఖరపాండ్యుడు. నారాయణరెడ్డి ఈ పాత్రలను చిత్రించిన వైనం ప్రశంసాపాత్రం.

కావ్యనాయకుడైన విశ్వనాథనాయకుడు ధీరోదాత్తుడు. దైవప్రసాదుడు. 'విశ్వనాథ కృపాజలధి వీచిక'యై జన్మించిన ఆతడు తల్లిదండ్రుల మనస్సులకు 'దాశరథి'గా వెలుగొందినాడు. కృష్ణదేవరాయలు ముందే ఊహించినట్లు అతడు బాలచంద్రుని వంటివాడే. ఆటల్లోనే మేటికాదు–

> "శ్రీకారమును మొదల్ చేసి ఒకయేడు గడు
> వకమున్నె తిక్కన్నభారతము"

వల్లించిన కుశాగ్రబుద్ధి. భారతభాగవతాలనూ కావ్యాలనూ అవలోడనం చేసి కొని శాశ్వతసత్యాలను జీర్ణించుకున్నాడు. 'ఖడ్గాది శస్త్రప్రయోగవిధాకుశల

హస్తుడై' యౌవనంలోనే తండ్రినిమించిన ప్రతాపసింహుడైనాడు. హుంకారంతో 'ఉద్రిక్తతురంగమ్ముల' మరల్చే వీరమూర్తి కావుననే అచిర కాలంలో కృష్ణరాయల సేనాధిపతియై ఆతని విజయాంకములను అన్నిదిశల్లో ప్రతిష్ఠించినాడు. విశ్వనాథుడు గొప్ప సంస్కారసంపన్నుడు; 'అధర్మభీతాంతస్థుడు' కాబట్టియే తండ్రి అన్యరాజ్యకబళనోదంతాన్ని వినగానే ఆతడు 'లజ్జావిషాదపిహితచేతసుండౌ' తాడు. ధర్మక్షతినిజూడగలేక ధ్వజమెత్తి తండ్రిని బంధించి తెచ్చిన దృఢధర్మవ్రతుడు. ఆతడు తండ్రితో పలికిన—

"అక్రమముగ గడియించిన
అమృతమ్మైనను హేయము
స్వధర్మనిర్వహణములో
నిధనమ్మైనను శ్రేయము"
"స్వామిద్రోహముచేసిన
జనకుడైన శిక్షార్హుడు"

వంటిమాటలు ఆతని మహోదాత్తధర్మపరత్వమునూ, అకళంకస్వామిభక్తి పరాయణతనూ చాటుతున్నవి. ఆతడు- 'జ్ఞానకృశానుదగ్ధానేకకర్ముడు'గా, 'ఆత్మహుతసర్వేంద్రియుడు'గా, 'అలౌకికప్రతిభోన్నతుడు'గా కృష్ణరాయల ప్రశంసలందుకున్నాడు. రాయలు ఆతనితో-

"మాసమానస్కంధుడవు సు
మ్మా! కుమారా! నేటినుండియె"

అని పల్కిన వచస్సులు ఆతని వ్యక్తిత్వమునకు పట్టిన మణిదర్పణం. విశ్వనాథుని ధీరోదాత్తతవల్లనే పాండ్యుని రాజ్యప్రలోభం చెదిరిపోయింది. తనకు రాజ్యమప్పగించే రాయలతో-

"నాకా రాజ్యమ్ము? గరిక
కా కిరీటమున స్థానము?
మీరు నడుచుదారుల ఈ
మేను పరచుకొన్నచాలు"
"యుగయుగాలనుండి వెల్గు
చుండిన ధర్మాగ్నికుండ

మున నేనొక గరిసెడు నే
యిని బోసితి; నంతేకదః"

అని పలికిన స్వామిభక్తిపరాయణుడు; నిరహంకారశీలి; అవికత్థనుడు; రాజ్యాన్ని 'మొగలిపూల పానుపు'గా భావించిన అలౌకికసత్వసంపన్నుడు.

బంధించితెచ్చి తనకర్తవ్యంనెరవేరగానే క్షమించవలసినదిగా తండ్రిని వేడుకున్న పితృభక్తిఆతనిది. ఆతడు 'ధర్మహైమశిఖరాగ్రస్థాయి'.

"అతని చరిత్రమ్ము ధర్మ
వ్రతపృతనాధిపకోటీ
రత్నశ్రేణికి కల్కిపచ్చ
ల తురాయినికై సేసెను".

శ్రీకృష్ణదేవరాయలు దయామయుడు. ధర్మమూర్తి. 'మేరుశిఖరము' వంటి సార్వభౌముడైనా నాగమనాయని వద్దకు వచ్చి ఆతనిని ఓదార్చిన ఆర్ద్ర హృదయుడు.

'ఎగుడు దిగుడులు ఇరులువెల్తురు' మానవులకే అని గ్రహించిన జ్ఞాని. ఆతని 'కంటిచల్వ'లో ఇగురులేసినారు సామంతులు. ఆతని దీనావనత్వం పాండ్యునికభయమివ్వడంలో సువ్యక్తమైనది. ఆతడు ధర్మపక్షపాతి. ఆతని నిర్ణయమునకెదురులేదు. 'రాజద్రోహమునకై కాలు ద్రవ్వినవాడు' ఆప్తుడైనా వధ్యుడే. ఇది ఆతని ధర్మమార్గం. అందరి ఎడదలోతులు తెలిసినవాడు. అందుచే పాండ్యరాజ్యాన్ని విశ్వనాథునికిచ్చినాడు. కృష్ణరాయలు ఇంద్రుడైతే విశ్వనాథనాయకుడు విజయుడు. రాయలది పరిణద్ధమనఃస్థాయి. విశ్వనాథుని ధర్మవీరాన్ని ప్రశంసించి ఆతనిని తన కుమారునిగా భావించిన సన్నివేశం ఇందుకు నిదర్శనం. ద్రోహియైన నాగమనాయని మన్నించి అతనికీ విశ్వనాథునికీ సంతోషం కలిగించిన దయాసంపన్నుడు. ఈవిధంగా కృష్ణరాయల పాత్రచిత్రణం ఆద్యంతం హృద్యం.

ఇదే విధంగా నాగమనాయని పాత్రనూ మల్లికాంబపాత్రనూ బహు సమర్థతతో పోషించినాడు కవి. నాగమనాయడు 'కృష్ణరాయలయశోగీతి సంచాలకుడై' అతని కుడిభుజమై రిపునృపులమ నొప్పించి రాయలను మెప్పించిన ధీరుడు. నాగమనాయని ఎద కదనరంగాల్లో కత్తికంచె కరాళం. మమతపొంగితే

ఆతని మనస్సు 'వెన్న'. అహంత నిటలిస్తే అది 'రాయి.' నాగమనాయనిలో పుత్రవ్యామోహం కారణంగా కల్గిన రాజ్యప్రలోభచింతనమూ తత్పరిణామమూ ఈ కావ్యంలో చక్కగా చిత్రింపబడింది. నాగమనాయడు ధీరోద్ధతుడుగా కనిపిస్తాడు. తన పుత్రుని ఔదాత్యం వలన బ్రతికిపోయిన జీవి నాగమనాయడు.

మల్లికాంబ ధార్మికహృదయమే విశ్వనాథుని ధర్మమూర్తిగా తీర్చి దిద్దింది. ఆమె ఆర్ద్రితామూర్తి. రాజ్యం కంటె కుమారుడే ముఖ్యమని ఘోషించిన అనురాగమూర్తి. పతికీ సుతునికీ మధ్య ప:తప్తమైన గుండె ఆమెది. మల్లికాంబ నిజంగానే మల్లికాసదృశహృదయ.

కృష్ణరాయలు నాగమనాయని ఊరడింపవచ్చినప్పుడూ సభలో ఆతడు ప్రసంగించినప్పుడూ, నాగమనాయడు మల్లికాంబతో తన ఆ వేదనను వ్యక్త పరచినప్పుడూ, మల్లికాంబ భర్తను బ్రతిమాలినప్పుడూ, విశ్వనాథుడూ నాగమనాయడూ కలుసుకున్నప్పుడూ ఈ కావ్యంలో రమణీయసంభాషణలు నడిచినవి. అవి నాటకీయతను ప్రదర్శింపగలిగినవి.

ఈ కావ్యంలో త్య్రిస చతురస్ర ఖండ మిశ్రగతులు ప్రయుక్తములైనవి. ఒకటి రెండుచోట్ల భావపరివర్తనసూచకంగా గతిమార్పును నిర్వహించినాడు నారాయణరెడ్డి. ఇందులో 'తుహినాంశు రేఖాధరాశీస్సుమ పరీమళ ప్రవాహపునీతములు', 'పటహకాహళశంఖ చటులస్ఫుటార్భటీ పటలి', 'సుజనోత్సవసంరంభతిరోహితనిఖిలాన్యవ్యాపృతి'-వంటి సుదీర్ఘ సంస్కృత సమాసాలు ఈ కవి పాండితీశౌండీర్యాన్నీ రచనా చాతుర్యాన్నీ ప్రకటిస్తున్నాయి,

'వ్యామోహమునకు వయసేమిటి?'

'చేనుగాచి నక్కలపాల్ చేయు వెర్రివాడెవ్వడు?'

'ఉదాత్తుల కోపము క్షణకాలికమే కద!'

'పెద్దపులి మీసముల నెవ్వడు పెరికివేయగ సాహసించును'

'బుద్ధితీర ద్రావి తల్లి పొదుగును గ్రుద్దినయట్టుల'

'అమృతభక్షణసేయు వీరుడు ఆశపడునా దొంగకూటికి'—

వంటి చక్కని సూక్తులూ సామెతలూ ఈ కావ్యసార్వజనీనతకు వన్నెలు దిద్దుతున్నాయి.

ధర్మవీరమునకు జయపతాకమైన విశ్వనాథమూర్తిని దర్శించిన నారాయణరెడ్డి హృదయం ఈ రసపతాకావ్యాన్ని నిర్మించింది. దీనిని చదివిన సహృదయహృదయాలు ధర్మవీర రసోద్దీప్తములై సమాజకల్యాణసాధనకు ఉద్యమిస్తాయని ఆశించవచ్చు.

చరిత్రలో మెరిసిన ఘట్టాలకు కావ్యత్వాన్ని పులుమడంలో నారాయణరెడ్డి అపూర్వమైన ప్రతిభాపాటవాలను ప్రదర్శింపగలుగుతాడు. యాథార్థ్యానికీ కల్పనకూ కవితాసేతువులు నిర్మించడం తెలుగులో ఏ కొందరికో సాధ్యమైన పని. రేఖామాత్రంగా ఉన్న చారిత్రకసత్యానికి మహాకావ్యమర్యాదలను సంతరించడంలో కృతార్థుడైన నారాయణరెడ్డి నిజంగా ధన్యజీవి. సహృదయ విద్వద్విమర్శకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి మాటలతో ఈ కావ్య సమీక్షను ముగిస్తాను. "'విశ్వనాథనాయడు' వీరరసప్రధానమైన చారిత్రక (లఘు) కావ్యములలో నెన్నదగినది..................గేయకావ్యములు వ్రాసి మెప్పించుటలో నవ్యసాహిత్యమున శివశంకర స్వాములవారి తరువాత వీరి కొక ప్రత్యేక స్థానమేర్పడుచున్నది.[1]

# ఋతుచక్రం

ఆదికవి వాల్మీకి నుంచి ఆధునికకవులదాకా వెలిసిన సాహిత్యంలో ఋతువర్ణనలు ఏదో ఒక రూపంలో కనబడుతూనే ఉన్నవి. మహాకావ్యాలలో లఘుకావ్యాలలో ఖండకావ్యాలలో దృశ్యకావ్యాలలో ఋతువర్ణనలు చోటు చేసుకున్నాయి. కవికులగురువు కాళిదాసు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ ప్రత్యేకంగా ఋతువర్ణనాత్మక కావ్యాలను రచించి సహృదయుల రసానందాన్ని సంవర్ధనమొనరించినారు.

---

1. వీరరసము - పుట 383. ప్రథమముద్రణ 1961.

ఖండకావ్యాలలో గేయనాటికలలో ఋతువర్ణనలు చేసిన నారాయణరెడ్డి ఋతువర్ణనాప్రధానంగా ప్రత్యేకకావ్యం వ్రాయాలని సంకల్పించినాడు. దాని ఫలితమే ఈ 'ఋతుచక్రం'. మొదట ఈ కావ్యం ధారావాహికంగా 'యువ' పత్రికలో ప్రచురితమైనది. తర్వాత 1964 డిసంబరులో కావ్యరూపాన్ని దాల్చింది.

నారాయణరెడ్డి రచించిన ఈ 'ఋతుచక్రం' గేయకావ్యానికి ఆంధ్ర సాహిత్యంలో ఒక ప్రత్యేకత ఒక విశిష్టత ఉన్నది. ఋతువర్ణనలను స్వీయ జీవితఘటనాసూత్రంలో కూర్చి కథనం సాగించటం ఈ కావ్యంలో నారాయణరెడ్డి చేసిన నవ్యప్రయోగం. అందువలననే దీనిని ఆత్మాశ్రయగేయ కావ్యమని చెప్పవచ్చు. ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి డా॥ బెజవాడ గోపాల రెడ్డిగారికి అంకితం చేసినాడు.

ఆరుఖండాలుగా సాగిన ఈ కావ్యంలో కొన్ని ముఖ్యములైన స్వీయ జీవితఘటనలనూ స్వీయానుభూతులనూ చిన్నప్పటి జ్ఞాపకాలనూ అక్షరబద్ధం చేస్తూనే తెలంగాణా పల్లెజీవితాన్ని సహృదయరమ్యంగా ప్రతిబింబింపజేసినాడు నారాయణరెడ్డి. ఆరు ఋతువుల్లోనూ 'ప్రకృతి అణ్వాణువులో గుప్తమైన చిన్మయశక్తి' ఉద్గమించిన వైఖరిని ఈ కావ్యంలో మనోజ్ఞంగా వ్యక్తం చేసినాడు కవి. వసంతఖండంతో ఈ కావ్యం ప్రారంభమవుతుంది.

వసంతర్తువులోని ప్రకృతి సౌందర్యాన్నీ, 'సుఖదుఃఖముల నొకించుకనైన పట్టించుకొనలేని' తన బాల్యస్థితినీ, వివాహం జరిగిన తొలిరోజుల్లో తన మనసు తొందరించినప్పటి యువజీవిత గతినీ, తన సతి పుట్టింటికేగినపుడు తానుపడిన విరహవేదనలనూ, మళ్లీ ఆమె తిరిగిరాగా తానుపొందిన మధురానుభూతులనూ వసంతఖండంలో రసాత్మకంగా వ్యక్తీకరించి సహృదయులకు గిలిగింతలు పెట్టినాడు నారాయణరెడ్డి.

"చిగురు చిగురున రాగశీకరము లొలకించి
ఆకునాకున మరకతాకృతులు పలికించి
పూవుపూవున మధువు పుకిలింతలొనరించి"

వసంతం వచ్చింది. ఎటుచూసినా పూలూ పరిమళాలూ. ప్రకృతికాంత కొత్త జిలుగులు కూర్చుకున్నది. ఆమె కవితాచక్షువైన నారాయణరెడ్డికి— 'ఆకు

పచ్చనిసిగ్గు లందగించిన వధువు'లా, 'ఏడువారాల నగలిడిన ముద్దుల గుమ్మ'లా, 'బిడియపడు మొగ్గ'లా, 'తెరవీడి కిల్కుమని కెరలినవ్వేడు ప్రౌఢ'లా కన్పిస్తుంది.

చిన్ననాడు వచ్చిన వసంతంలో ఊరిపక్కనున్నమామిళ్ల తోపులో కోకిల కుహూరవం విని కవి దాన్ని చూద్దామని తోటి కుర్రవాళ్ళను వెంటతీసుకుని కేరింతలిడుతూ చప్పట్లు కొడుతూ రాళ్లువిసురుతూ మామిళ్ళన్ని తిరిగినా కోకిల కనపడలేదట. కానీ గున్న మామిళ్ళన్నింటి పైనుంచీ అదే స్వరం వినిపించగా 'ఓసి మామిళ్లై కూసినవిరోరి' అనుకుని దారి బట్టినారట. ఈ మాటల్లో మాత్రం కవితాకోకిల కనిపిస్తున్నది.

విప్రలంభవ్యథ ననుభవిస్తున్న కవికి 'మందమారుత గంధలహరి కలు' - 'భుజగవిష నిశ్వాస ఫూత్కారము'గానూ, "రక్కసి పరుడు విరహి జనులను కోతవెట్టి నెత్తురులు జొబ్బిలు పచ్చిగుండెలను ప్రేలాడ" గట్టినట్లు గానూ కనిపించినాయి.

గ్రీష్మ ఖండంలో పల్లెల్లో మండే ఎండల చండశాసనాన్ని, గ్రీష్మర్తు వివిధలక్షణాలనూ పరిణామాలనూ పల్లీయుల జీవితాలనూ నగరాల్లోని శ్రామికుల బాధలనూ తన బాల్యస్మృతులనూ సహజరమ్యంగా చిత్రించినాడు.

'యక్షగానము లోని రాక్షసునట్లు' హుమ్మనివచ్చిందట గ్రీష్మం. మన్మథుని భస్మంచేసిన 'నాటి రుద్రుని క్రోధమా' అన్నట్లు తీంద్రించిందట. సుడిగాలికి 'ఉప్పరమ్మన' ఎగిసిఆడే ఎండుటాకులు 'పెద్దపదని గడించు అల్పులవోలె' కనిపించినవీకవికి. 'రాక్షసేంద్రుల పుత్రులకు ఏకాక్షిఉపదేశ ముల'వలె కాలే దుమ్ముకు సుడిగాలి తోడైనదట.

'నిప్పులుమిసెడు యంత్రములతో' నేస్తంచేసే నగరకార్మికులు యమునిమహిషపురంకెసాగినయట్లు 'సైరను' కూతవెట్టగా బయలుదేరుతారని వారి బాధలను రేఖామాత్రంగా వర్ణించినాడు నారాయణరెడ్డి. ఇంకా గ్రీష్మ ఖండంలో పెంకుటిళ్లకు మిరపఅండెములకు గడ్డివాములకు జరిగే అగ్ని ప్రమాదాలనూ వడదెబ్బలకు ముసలిఎద్దులుపడే బాధలనూ, దొమ్మరోగాలతో పాడిగేదెలుపడే యాతననూ దాహంతో గిజగిజలాడే లేగదూడల తపననూ దప్పికతో ఎఱుకుబుడుతలుపడే వేదననూ ఎండదెబ్బకు ముసలవ్వలు క్రింద

పడిన దృశ్యాలనూ, మోటలుగొడుతూ ఏతములాగుతూ ఏలపాటలు గాలి పాటలు పాడే కర్షకులనూ వరిగొల్కలనూ పంటకోతలనూ సహృదయుల కళ్లకు కట్టించినాడు నారాయణరెడ్డి.

వర్షాఖండంలో మబ్బులూ, గర్జనలూ, హరివిల్లులూ, మొగలిపూలూ. వ్యవసాయ క్షేత్రాలూ, పశుపక్ష్యాదులు, పేద ఆసాముల స్థితులూ ఒక్కగా వర్ణింపబడినవి. అంతేకాక కవిబాల్య స్మృతులూ, అర్ధాంగితోడి సరస సంభాషణలూ రమణీయంగా వ్యక్తీకరింపబడినవి.

నీలిమబ్బులు - 'గ్రీష్మాదిత్య ప్రచండ కిరణమ్ములకడ్డము నిల్చిన గొడుగులు'గా - 'నీలినింగి పందిరి నొరిగిన ద్రాక్ష పక్వఫలగుళుచ్ఛమ్ములు'గా భాసించినవీ విద్వత్కవి నేత్రాలకు. ఇక మెరుపులు - మత్తేభాలవలె ఎదురుదిరిగిన మబ్బులపై ప్రయుక్తములైన అంకుశములట.

అర్థగౌరవంతో 'నమ్రసుందరమ్ము'గా నడిచిన శ్లోకంలా ఒక మబ్బు కదిలితే మరోమేఘం పైనిపటారాలు చూపించే 'చిత్రపద్యమ్ము'లా ప్రజలను అదల గొట్టినదట. రోహిణీకార్తెలో మూగినమేఘాలు 'భావకవిత్వమ్ములోని ప్రణయినివలె' మింటినుంచి దిగడం లేదట. ఈ వర్ణనలు నారాయణరెడ్డి ప్రతిభావ్యుత్పత్తులకు అద్దం పట్టుతున్నవి.

వానకు తడిసిన తరువులు 'అభ్యంజనమాడిన ముత్తైదువులై' భాసించగా బాటపక్కనున్న నీటిగుంటలు - 'ఆ తరువులు మొగముజూచి కొనెడు అద్దముల'వలె అగుపించినాయి ఈ కవికి.

వర్షాలను చూస్తున్న కవిమనస్సులో బాల్యభావనలు ఒక్కసారి మూగుతాయి. కుర్రవాళ్లు కాళ్ళతో ఒకరిపై ఒకరు నీళ్లుచిమ్ముకోవడం, నీళ్ళనాపడానికి కట్టలుకట్టడం, నీళ్ళల్లో కాగితం పడవలు విడువడం, ఇసుకతో పిట్టగూళ్లుకట్టకం వెంటనే వాటిని పిసికివేయడం అన్నీ ఆతని స్మృతిపథంలో కదలుతాయి. హరివిల్లును చూడగానే నారాయణరెడ్డికి తన బాల్యం 'ఏడు వన్నెలతో' మెరుస్తుంది. అపుడు ఆ ఇంద్రధనుస్సు-పిల్లలు నింగినిచేరుటకై 'దేవుడు నిల్పిన నిచ్చెన' అనిపించేదట. 'చిత్రజగతి వీరులవలె' పెకెగిసి హరివిల్లుపై ఆటలాడాలనీ అలిసిపోతే మబ్బులనే తలగడలుగా పాన్పుగా చేసుకుని పండుకోవాలని అనిపించేదట చిన్ననాడు. చిన్నపెద్ద మెరుపులను

కటార్లుగా కొరడాలుగా పట్టుకుని తుంటరికుర్రలను జళిపించాలి అనిపించే వట.

నింగిలో బార్లుగట్టిపోతున్న కొంగలు—

"గగనలక్ష్మిమెడలో తెలికల్వపూల దండలట్లు
అప్సరాంగనల సితవసనాంచలపుంజమ్ము లట్లు"

ఉన్నవట.

శరత్ఖండంలో సర్వాలంకార సంశోభితయైన శారదేందిరను సాక్షాత్కరింపజేసినాడు నారాయణరెడ్డి. ఆ శరద్రమకు 'పిండివెన్నెల'యే 'గందవాడి'. నిండుజాబిల్లియే 'పువ్వులచెండు'. 'విరియబూచిన రెల్లుపూవులె ఇరుదెసల వింజామరలు'. ఆ విలాసినికి రాత్రుల్లో కల్వపువ్వులే నేత్రాలు: పగళ్ళలో కమలాలే కన్నులు. ఆమె అమృతకరస్పర్శవల్ల 'పొగలుగ్రక్కెడు విషధరమ్ములు' పాలవెన్నెలలను పుక్కిలించినవట!

తెలిమొయిళ్లు - 'అంబరశ్యామాలలామ తలంటుస్నానములా'డగా పైకి దేలిన కుంకుమపండ్ల నురుగులా అన్నట్లున్నవట. ఇందలి ఉత్ప్రేక్ష నారాయణరెడ్డి నిశితపరిశీలనాశక్తినీ, వర్ణనాప్రతిభనూ చాటుతున్నది. అలాగే ఈ ఖండంలో ఇంకా నదులనూ సరస్సులనూ, బీరపువ్వులనూ, రుద్రాక్ష పూలనూ, గోరంటపూలనూ తంగెడుపూలనూ, అరటిపూల పరాగమునూ, కమలరజమునూ పంటచేలనడిమిపల్లెలనూ, పల్లెపడుచులనూ బతుకమ్మ దసరా పండుగల విశేషాలనూ, శరత్పూర్ణిమనూ చకోరికలనూ రమ్యాతి రమ్యంగా వర్ణించినాడు నారాయణరెడ్డి. రకరకాల గోరంటపూలు-"వన్నెవన్నెల పరిమళ ద్రవ్యములు నింపినగిన్నెలో" అన్నట్లున్నవట.

"పంచబాణుడు వేయిరేకుల
పద్మమల్లనద్రిప్పెనో"

అన్నట్లు మదవతులు బతుకమ్మచుట్టు తిరిగినారట. ఇందలి ఉత్ప్రేక్ష సహృదయులకు రసానందభిక్ష.

జొన్నచేనిలో కవిచేతి ఒడిసెలగుండుదెబ్బతిన్న మాదిగపడుచు ఈకవి హృదయంలో పరిమళములు నిల్పిన ఘటన రమణీయం.

హేమంతఖండంలో మంచుబిందువులూ వలిగాడ్పులూ, చలీ, ఎండా, సూర్యచంద్రులూ, నీళ్లూ, దీపావళి విశేషాలూ, పంటలూ, గుమ్మడిపూలూ, మిరపపండ్లూ, ముద్దబంతులూ, భోగిమంటలూ, గంగెద్దులూ, భోగిపండ్లుమున్నగునవి హృద్యంగా వర్ణింపబడినవి. అంతేకాక కడచిన సంక్రాంతినాడు తన చిన్నకూతురు చలిమంటల్లోపడి పుణ్యవశాత్తు బ్రతికిన ఒక సంఘటనను కూడా ఈ ఖండంతో పేర్కొన్నాడు నారాయణరెడ్డి.

"మొదటిరోజులందున చలి
మృదువుగ బుగ్గలను నిమిరి
దినముగడచు కొద్దియు వే
ధించెను వెలయాలివోలె"

అనే చలి వర్ణనం హృదయావర్జకం.

"ఒకనాడుజ్జ్వలముగభువి
నూగించిన రవిచంద్రులు"

చలికాలం వచ్చేసరికి 'పదవీచ్యుతులైన మంత్రివర్యులట్టు లైనారట ! ఇందలి సాదృశ్యం ఈకవి లోకజ్ఞతకు స్ఫటికదర్పణం.

శిశిరఖండంలో శిశిరాగమనాన్ని, తెల్లమబ్బులను, పూర్ణిమాకౌముదులను, హిమానీవర్షమును, చలిని, ఆకురాలిన చెట్లను, సెనగచేలను, దోసతీగలను, ప్రత్తిచేనును హృద్యంగా వర్ణించి జీవితంలోని రెండు ఘటనలను వివరించినాడు కవి.

సెనగచేలల్లో దాగిన దోసతీగలను వేదపండితులతో పోల్చడం నారాయణరెడ్డి అద్భుతభావనాబలానికి లోకజ్ఞతకూ చక్కనిఉదాహరణం. దోసతీగలు-

"తమంతట తామెఅగుపడవు; పైకీ ర
ప్పించిన ఒకొక్కతీవియ ఫలశతప్రదము."

'పగిలిపూర్తిగ' విచ్చిన ప్రత్తిచేను నారాయణరెడ్డికి 'వెర్రిబాగులది నవ్విన యట్లు' కనిపించింది. అంతటితో ఆగక ఆతడు—

"ఔనుమరి! విశ్వకల్యాణార్థమై పాటు
పడుమహాత్ములకు పైపై మెరుగులెక్కడివి?"

అని వ్రాసి గేయపంక్తులకు సార్వజనీనతను పులిమి సముద్దీపింపజేసినాడు. ఇందలి మహాత్మ శబ్దం గాంధీజీని స్ఫురింపజేస్తుంది. 'విచ్చిన' 'ప్రత్తి చేను' అనే మాటలు ఆతని ఖాదీవస్త్రాలను జ్ఞాపకం చేస్తాయి.

ఈ కావ్యంలో విశ్వజనీనతాపరిమళాలను పులుముకున్న సూక్తు లున్నవి. ఉదాహరణకు—

"పసరుమొగ్గకులేని పండుటాకునకులే
ని మధుస్పృశానుభోగమ్ము పూవునకెకదా!"
"ఈడువచ్చినవారికేగద — ఎండయైనను నీడయైనను"
"గుడిసెలోని మట్టిదివ్వె—గుడిలోపలిమణిదీపము
సమానమ్ములే రెండును తమస్సులను కడిగివేయ"
"లోతు ముట్టనిది ముక్తాలోకమ్ముప్రసక్తి లేదు"

వంటి వాటిని గమనింపవచ్చు.

ఈ కావ్యంలో

"మాఘమాసపుచలిమంటలంబడినపోదు"
"పూలమ్ముకొనుచోటనె కట్టెలమ్ముకొనుగతి"

వంటి సామెతలు కనిపిస్తాయి.

ఆయాసందర్భాలలో శృంగారభావాలతో పాటు హాస్యస్ఫోరకములైన గేయఖండికలు కూడా ఉన్నాయి.

"మడమబంటి వాననీటి మడుగులోన పొర్లాడుచు
తానొక గజయూతకాని తాతనంచునిక్కొనొకడు"

(చలిగాలి) "మంగలికత్తిచేతగొని ప్రాణులను చిత్రవధచేసినది"
వంటివి ఇందుకు నిదర్శనములు.

ఈ కావ్యంలో వసంతశిశిరఖండాలను ఖండగతిలోనూ, గ్రీష్మ శరత్ ఖండాలను మిశ్ర గతిలోనూ వర్షాహేమంతఖండాలను త్ర్యస్రగతిలోనూ నడిపించినాడు నారాయణరెడ్డి. భావాలను రెండు నాలుగు పాదాలలో అన్వయ కాఠిన్యం లేకుండా చక్కగా నింపినాడు.

ఈ కావ్యంలోని — 'మృదుకోప వీచీచలత్ భ్రూలతా ద్విగుణీతాత్మ సౌందర్యకుల్యాకృతీ', 'మృదుల హాసమరంద ధారా స్నపిత హరిదంతర వియచ్చర' వంటి దీర్ఘసమాసాలు అక్కడక్కడా కనిపించినా రచన అంతా సులభశైలిలో సాగింది.

పల్లెజీవితాన్ని ప్రతిబింబింపజేసే తెలంగాణా మాండలికాలను ప్రయోగించి నారాయణరెడ్డి వాటికి కావ్యార్హతను కలిగించినాడు. ఉదాహరణకు— సవారిబండ్లు, మిరప అండెము, గొల్కలు, ఉచ్చిలితనము. ఆసామి, బొంచెను— వంటి వాటిని పేర్కొనవచ్చు. వీటిని ఆచార్య బి. రామరాజుగారు చక్కగా వివరించినారు ఈ కావ్యానికి వ్రాసిన 'వివృతి'లో.

నారాయణరెడ్డి తన భావాలకు అనుభూతులకు కవితాశక్తిచే సార్వజనీనతను సాధించినందువల్ల ప్రతి 'రసాత్మకుడు' ఈ కావ్యదర్పణంలో తన బ్రతుకును చూచుకుని మురిసిపోతాడనటంలో అత్యుక్తిలేదు.

ఈ కావ్యానికి ఆంధ్రప్రదేశ్‌సాహిత్యఅకాడమీ బహుమతి లభించింది. ఋతువర్ణనలు అనగానే మనకు సంప్రదాయసిద్ధంగా వస్తున్న వ్యాపారమే కనిపిస్తుంది. కానీ నారాయణరెడ్డి ప్రాచీనప్రబంధాల మూసలలో పోసిన మార్గాలలో నడిచే కవికాడు. తన అనుభవానికి రాని అంశాన్ని అతడు కవితగానే మలచడు. అలాంటప్పుడు ఒకరు గీసిన గీట్లను దాటకుండ ఋతువులను వర్ణించటం ఆ ప్రతిభామూర్తికి ఎలా సాధ్యమవుతుంది? కనుక ఈ ఋతుచక్రం ఆర్తవానుభవానికి కవితాసౌగంధ్యాన్ని పులిమిన మధుర ఘట్టం.

ఆచార్య బి. రామరాజుగారి పలుకులతో ఈ కావ్యపరిశీలనను పరిసమాప్తం చేస్తాను.

"ఆధునికయువకవులందగ్రేసరుడు మిత్రుడు సి. నారాయణరెడ్డి కూడ కాలమహాస్రవంతిలో ఒక్కయేటిని మాత్రము తన కవితాచక్షువున

కందిన దాని దిఙ్మాత్రముగా నీ ఋతుచక్రమున ప్రదర్శించినాడ..........
ఇది యాత్మాశ్రయకవిత్వమైనంత మాత్రమున ఈ యనుభూతులితరులకు చెందనివికావు. ఇది నారాయణరెడ్డి స్వీయచరిత్రము కాదు: కాకనుపోదు. ఉత్తమకవులకు స్వపరమను నెల్లలుండవు. సాధారణీకరణమున వారి యనుభూతులు లోకమునకంతటికి నాస్వాదయోగ్యములగును."[1]

# జాతిరత్నం

'విశ్వనాథనాయడు' తర్వాత వచ్చిన చారిత్రకకథాకావ్యం 'జాతిరత్నం'. జాతికోసం నీతికోసం దేశంకోసం భాషకోసం మంచికోసం మానవతకోసం తమ జీవితాలను కర్పూరంలా వెలిగించే త్యాగమూర్తుల పట్ల ప్రతిభామహితులపట్ల నారాయణరెడ్డి అపారమైన ప్రేమాదరాలను అభివ్యక్తం చేస్తాడు. మధురమంజులకవితామంగళహారతులిస్తూ వారిని కీర్తిస్తాడు, ఆతని ఖండకావ్యాలలోని కవితలెన్నో ఈ విషయాన్ని బలపరుస్తాయి. నవభారతనిర్మాత 'ఆసియాఖండానికి అగ్రనేత' 'అఖిలలోకానికి శాంతిదూత' అయిన భారతరత్న జవహర్‌లాల్‌నెహ్రూ మహితవ్యక్తిత్వం నారాయణరెడ్డిని కదిలించింది. 'గరళం మ్రింగినమ గుర్తు కననీయని నవహరు'ని దేశసేవానురక్తి ఆతని గుండెలో కవితామృతభాండాలను దింపింది. ఖండికల రూపంలో ఆ కమనీయమూర్తిని ఎంత స్తుతించినా సంతృప్తి కలుగలేదు. ఆ జాతిరత్నాన్ని గూర్చి ఒక రసవత్కావ్యమే వ్రాయాలనిపించింది. ఈ కవిరత్నం డెందం స్పందించింది. 1967 జూలైలో 'జాతిరత్నం' అవతరించింది; సాహితీజగత్తును అలంకరించింది ; సారస్వతేయులను అలరించింది.

---

1. ఋతుచక్రము - 'వివృతి' - పుట i
ప్రథమముద్రణ 1964 డిసంబరు.

ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి శ్రీమతి ఇందిరాగాంధికి అంకితం చేసినాడు. ఈ కావ్యం పండితనెహ్రూ జీవితచరిత్రను పద్నాలుగు భాగాలలో రేఖామాత్రంగా రమణీయశబ్దచిత్రంగా ప్రదర్శిస్తుంది. డా॥ పి.వి. రాజమన్నారుగారు అన్నట్లు "ఈ కావ్యం వీరగాథ. భారతస్వాతంత్ర్యసమరంలో నాయకత్వం వహించిన జవహర్‌లాలు ఈ కావ్యంలో నాయకుడు".[1] ఆ మహామహుని జీవితయాత్రలో ప్రధానపాత్రను నిర్వహించిన వారందరూ ఈ కావ్యంలో ప్రత్యక్షమవుతారు.

నెహ్రూ జీవితంలోని ప్రధానఘట్టాలను కవితాత్మకంగా కథాకథనశిల్ప సుందరంగానడిపించినాడు నారాయణరెడ్డి. నాగార్జునసాగరం, కర్పూర వసంతరాయలు వంటి చారిత్రకకథాకావ్యాలను సమర్థవంతంగా సహృదయ రంజకంగా రచించి కథాకథనశిల్పంలో నిష్ణాతుడైనాడు కవి. ఆతని కథా కథన నైపుణ్యం ఈ కావ్యారంభంలోనే తెలుస్తుంది.

నారాయణరెడ్డి ఢిల్లీకివెళ్ళి శాంతివనంలోని జవహరుని సమాధికి ప్రణమిల్లి ప్రదక్షిణంచేసి దోసెడుగులాబీలు ఆ సమాధిపైపోసి కన్నీరు కార్చినాడు. జవహరుని పాదాలను చుంబించిన ఒక గులాబి పువ్వును అల్లన కళ్లకు హత్తుకొని సమాధినివీడి సాగుతూ ఆ గులాబిని గుండెల కద్దుకున్నాడు. అపుడాగులాబి కన్నీరు విడుస్తూ తన ఆవేదనను నివేదించుకున్నది కవికి. బ్రతికియున్నప్పుడు నెహ్రూ ఎదపై నిలిచే తర్వాత ఆతని చితిపై ఆహుతి అయ్యే భాగ్యానికి నోచుకోనందుకు దుఃఖిస్తూ, నెహ్రూగారికి తాను అలా పూజాపుష్పమయ్యే పుణ్యమును ప్రసాదించిన కవికి కృతజ్ఞతలు తెలుపుకుంటుంది. ఆ గులాబిదళాలలో 'ఒక రసార్ద్రగళము' వినిపించింది; ఒక 'మహత్తరాకృతి' కనిపించింది ఈ కవికి. 'ఒకొక్కరేకున' జవహరుని ఉదంతం స్పష్టంగా కనిపించింది. ఈ విధంగా ఆ గులాబి నెహ్రూజననం మొదలు మరణందాకా దృశ్యాలు చూపుతూ భాష్యాలు చెపుతూ ఈ కావ్యాన్ని వినిపించింది. ఆయా సన్నివేశాలలో గులాబి దుఃఖాతిశయంతో చెప్పలేకపోవడం, కవి చెప్పుమని బ్రతిమిలాడడం, సందేహించినచోట ప్రశ్నించడం, ఆపువ్వు సమాధానం చెప్పడం జరుగుతుంది.

---

1. 'జాతిరత్నం'—'తొలిపలుకు'- పుట V ప్రథమముద్రణ 1967.

ఈ కావ్యాన్ని ముగించిన వైనం కూడా అద్భుతంగా ఉంది. నెహ్రూ మరణోదంతాన్ని విషాదార్ద్రియైన ఆ గులాబి వివరింపలేకపోతుంది. దుఃఖాతిశయంతో మాటాడలేకపోతుంది. అంతేకాదు, ఆ గులాబిరూపు మసిలా మారిపోతుంది. దానిరేకులు ఊడిపడిపోతాయి. గులాబీచెప్పిన జవహరు గాథను నారాయణరెడ్డి 'గుండెగూటిలో' దాచుకుని మిగిలిన ఆ గులాబికాడను అంతరంగానికిహత్తుకొని దానిని జవహరుపండితుని సమాధిపైచేర్చి బాష్ప జలాలతో అభిషేకిస్తాడు. తరువాత సమాధిలోనుంచి 'సామగానంలాంటి జవహర్‌వాణి'ని వింటాడు. ఆవాణితో జవహరుని మరణశాసనం (వీలు నామా) వినిపిస్తుంది.

పరిమళానికీ అందానికీ పేరొంది నెహ్రూకు ప్రీతిపాత్రమైన గులాబి నోట కావ్యాన్ని పలికించటం, చిట్టచివరకు జవహర్ వాణిలోనే ఆతని మరణ శాసనాన్ని వినిపించి కావ్యాన్ని ముగించటం ఈ కావ్యరచనాశిల్పం లోని వైశిష్ట్యం.

'జాతిరత్నం' అనే ఈ కావ్యనామం— "జాతిరత్నము జవహరుడు" అనే రవీంద్రుని వాక్కుల్లోనూ, "జవహర్లాల్ నీవు జాతిరత్నానివి" అనే మహాత్మాగాంధీ వచస్సుల్లోనూ కనిపిస్తుంది. రవీంద్రుడూ గాంధీజీ ఇద్దరూ మహామనీషులు ; ఋషికల్పులు. వారినోట ఈ మాటలు పలికించటం ఔచితీ భాసురంగా ఉన్నది.

ఈ కావ్యంలో మొదటిభాగంలోని గులాబి కథాకథనసన్నివేశాన్ని మినహాయిస్తే మిగిలిన పదమూడు భాగాలలో నెహ్రూగారి జీవితగంగ గంభీరంగా ధారామధురంగా సాగింది.

నారాయణరెడ్డి కవితామతి జవహర్‌జీవితంలోని ప్రతిఘట్టాన్ని రసాలోకనంచేసి అక్షరాకృతియై నిలిచింది ఈ కావ్యంలో. నెహ్రూ జీవితమే ఒక కావ్యం ; స్వాతంత్ర్యసమరేతిహాసాన్ని ప్రతిబింబింపజేసే రసముకురం. స్వాతంత్ర్యసమరసేనానాయకుడేగాక రసవత్ సాహిత్యరచనాధురీణుడు జవహరుడు. ఆయన రచనల్లో భారతాత్మ ప్రకాశించింది. 'జాతిరత్నం' కావ్యం చదువుతున్నప్పుడు నారాయణరెడ్డి స్వేచ్ఛాప్రియత్వం, త్యాగమహితు

దైన జవహర్‌లాల్ భవ్యజీవితంపట్ల ఆతనికున్న భక్తిపారవశ్యం పొంగులు వారినట్లనిపిస్తుంది.

ఈ కావ్యంలోని వర్ణనలు సహృదయస్వాంతాలలో సమ్మోదసౌరభాలను నింపుతాయి. జవహర్ జననవేళావిశేషాన్ని వర్ణించే—

"అతడు పుట్టిననాడు అమృతభాండము పుట్టె
అతడు పుట్టిననాడు అవని మిన్నులు ముట్టె"

అన్న పంక్తులు అద్భుతసౌరభాలను వెదజల్లుతున్నాయి.

జలియన్‌వాలాబాగ్ దుశ్చర్యలో—

"గూటిలో చేరిన గువ్వలను
గురిపెట్టి కూల్చినట్లుగా
జోనులో దూరిన బెబ్బులులను
పొంచిపొంచి కాల్చినట్లుగా"

శతాధికప్రజల ప్రాణాలను కబళించినాడట డయ్యర్.

నెహ్రూ జైలుజీవితం సుదీర్ఘంగా వర్ణింపబడింది. పన్నెండు వత్సరాల కారాగారవాసజీవితాన్ని ఈ వర్ణన ధ్వనింపజేస్తున్నది.

ఈ కావ్యంలోని పదమూడవ విభాగంలోని కనాట్‌సర్కస్ సంఘటన, గాంధీజీ హత్య కరుణరసాత్మకములై ఈకవికి గల దృశ్యప్రత్యక్షీకరణ శక్తిని ప్రదర్శిస్తున్నవి. చిట్టచివరకుఉన్న మరణశాసనం లోని గేయచరణాలు గంగానది కెరటాల్లా కదలినవి.

ఆయాసందర్భాలలో జవహరుడు 'యువహరుడు'గా 'శీతకరుడు'గా, 'పార్థసారధి'గా, 'విరాణ్మూర్తి'గా కావ్యంలో వర్ణింపబడినాడు. మోతీలాల్— 'అంపశయ్యపై పరున్న అలనాటి కురుయోధుడు'గా, స్వరూపారాణి 'చండికాకృతి'గా, కమలానెహ్రూ 'స్వరాజ్యయజ్ఞమ్మున సమిధ'గా ఇకగాంధీజీ- 'సత్యాగ్రహోగ్రసుపర్ణుడు'గా, 'సబర్మతీముని'గా వర్ణింపబడినారు. మహాత్ముని చేతినూలు 'ధర్మశ్రీసూత్రము'గా రాట్నం 'సుదర్శన చక్రమ్ము'గా, ఉప్పు 'రామాస్త్రము'గా వర్ణితములైనవి.

ఈ కావ్యంలో '9'వ విభాగంలో నెహ్రూ జైలు జీవితవర్ణనాఘట్టం లోని—

"చెరసాలలో శిరసెత్తిన రావిచెట్లు
శిశిర రాక్షసిని ఎదిరించి నిలిచేవి
.... .... .... .... .... .... .... ....
కొనవ్రేళ్లతో విషణ్ణతరువులను
స్పృశించేది వసంతసమీరం"

అన్న పంక్తులు ఆగామిస్వాతంత్ర్యవాతావరణాన్ని ధ్వనింపజేస్తున్నవి. ఇందులో తరువులు స్వాతంత్ర్య సమరవీరులకు, శిశిరం ఆంగ్ల ప్రభుత్వానికి వసంతం రాబోయే స్వాతంత్ర్యానికీ ప్రతీకలు. ఇలా ఆయా సందర్భాలలో సంకేతాలను ప్రయోగించి వస్తువును ధ్వనింపజేసినాడు నారాయణరెడ్డి.

మంచులా స్తంభించు, వెల్లువలా దూకే తరుణం, సుడిగాలివంటి మహోద్రేకం, సహనానికి సానరాయిలా, ఈదరగాలిలా వ్యాపించు, నంది వర్ధనంలా నవ్వులొలుకు, పొగచుట్టలాంటి చర్చిల్‌బుర్ర', వంటి చక్కని ఉపమాలంకారాలు ఈ కావ్యాన్ని సమలంకరించినాయి.

"సాగరగర్భంలోని బడబానలం"
సాగే కెరటాలకేం తెలుసు?"
"ఋజుమతులను నిరోధించే దొరతనం
ఋతువులగతిని ఆపగలుగుతుందా"
"వేళ్లనాటుకున్న చిరుగరికపోచ
వెల్లువనెదిరించి నిలువకపోదు"

వంటి సూక్తిపారిజాతాలు ఈ కావ్యంలో పరిమళిస్తున్నాయి. ఇంతవరకు మాత్రాచ్ఛందస్సులో కథాకావ్యాలు రచించిన నారాయణరెడ్డి ఈ కావ్యంలో గేయాలతోపాటు వచనకవితను కూడా ప్రయోగించి నవ్యతను ప్రదర్శించి నాడు. ఆయాసందర్భాలను మెలకువతో గేయంలో వచనకవితలో నడిపిస్తూ గతిమార్పులతో భిన్నభిన్నసన్నివేశాలనూ రసభావపరివర్తనాన్నీ సూచిస్తూ సహృదయ పాఠకులకు నవోల్లాసాన్ని కలిగించినాడు నారాయణరెడ్డి.

గేయాలకు గ్రాంధికభాషనూ వచనకవితకు వ్యావహారికభాషనూ ప్రయోగించినాడు నారాయణరెడ్డి. అయితే—కొన్నిచోట్ల—"మెత్తగవీచే గాలి

లోన" 'గిలగిలలాడే ధూళిలోన', 'ఇల్లుమరచి ఇల్లాలినిమరచే" వంటి కొన్ని గేయపంక్తుల్లో వ్యావహారికం తొంగిచూస్తున్నది. ఏమైనా గేయాలకు గ్రాంథికమే ప్రయోగించినాడు నారాయణరెడ్డి అని చెప్పక తప్పదు.

ప్రముఖకళాకారుడు బాపు చిత్రించిన నెహ్రూగారి జీవితచిత్రాలు సహృదయుని రసాభిముఖునిచేస్తూ ఈ కావ్యసౌందర్యానికి ఇంకనూ కలికి వన్నెలు దిద్దుతున్నాయి.

ఈ కావ్యసమీక్షను ప్రముఖ సాహితీవేత్తలు శ్రీ పి. వి. రాజ మన్నారుగారి పలుకులతో ముగిస్తాను.

"కావ్యవస్తువు ఉదాత్తమైన భారతరత్న జవహర్‌లాల్ జీవితం. కవి అసమాన ప్రతిభావంతుడు. మేధావి. పండితుడు. ఇటువంటి సంయోగం అపూర్వం. కావున అమూల్యం. ........................ ఆంధ్రభారతికి ఈ కావ్యం జాతిరత్నహారం."[1]




# రామప్ప

'రామప్ప' చరిత్రాత్మకమైన రూపకం. వచన పద్యగేయ మిశ్రితమైన ఈ రూపకం 1960లో ప్రచురితం. చారిత్రకమైన ఈ రూపకాన్ని చరిత్రపరిశోధకులూ విద్వాంసులూ అయిన డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు గారికి అంకితంచేసి ఔచిత్యాన్ని ప్రదర్శించినాడు నారాయణరెడ్డి.

కాకతీయులకాలంనాటి శిల్పనృత్యకళాసంస్కృతివైభవాలను కమనీయంగా చిత్రించే ఈరూపకం మొదట ఆకాశవాణీ హైదరాబాదు, విజయవాడ మద్రాసుకేంద్రములనుంచి, ఆ తర్వాత హిందీభాషద్వారా పన్నెండు భాషలలోనికి అనూదితమై అఖిలభారతరూపకకార్యక్రమంలో అన్నికేంద్రాలనుంచి ఒకేసారి ప్రసారితమైనది. ఈ రూపకరచనాప్రేరణనుగూర్చి నారాయణరెడ్డి

'నాలుగుమాటలు' ఈవిధంగా వ్రాసినాడు-"రామప్పగుడి సింహద్వారంమీది 'మదనికాశిల్పాల్లో' 'నాగిని' అనే విగ్రహం ఈ రచనకు ఊపిరిలూదింది. దీనిలోని కథంతా నాగినిచుట్టే తిరిగింది. నా సౌందర్యదృష్టికనుగుణంగా, చారిత్రకమూల్యాలు చెదిరిపోకుండా ఈ రూపకాన్ని కల్పించుకున్నాను.[1]"

యాత్రికుడు, గణపతిదేవుడు, రుద్రసేనాని, జాయపసేనాని, చంద్రభూషణుడు, నాగి, నందికేశ్వరుడు, వందిమాగధులు, ఇద్దరుకవులు, ఇద్దరు వ్యక్తులు, భటుడు, ఇద్దరుశిల్పులు, కావలాదారు, తలవరి పాత్రలుగా పద్దెనిమిది భాగాలుగా వరచుకున్న ఈనాటికలోని కథఅంతా రామప్పగుడిలోని నాగదేవతాశిల్పవిగ్రహాన్ని చూచి ముగ్ధుడై, గతచరిత్రస్మృతిలోనికి పయనించిన ఒక సహృదయయాత్రికుని మధురానుభూతిగా, ఒక కమ్మని కలగా చిత్రించినాడు నారాయణరెడ్డి. ఇందలి కథ సంగీతవాహినీసదృశం.

ఆలోచనామృతమైన సాహిత్యం, ఆపాతమధురమైన సంగీతం, నయనపర్వమైన నృత్యం మూడూ సరసంగా సంగమించిన రమ్యరూపకం రామప్ప. ఈ నాటికలో మొట్టమొదట వచ్చు యాత్రికునిలో కవియైననారాయణరెడ్డిమే కనిపిస్తాడు. ఇందలిప్రతిపాత్ర జీవాన్ని నింపుకున్నది. ముఖ్యంగా - నాగి చంద్రభూషణుల పాత్రలు ఈ రూపకకర్త అమృతంలో కలాన్ని అద్ది చిత్రించినట్లున్నవి. సన్నివేశాలకూర్పూ, సంభాషణ తీర్పూ సహృదయులకు గిలిగింతలు కలిగిస్తాయి. నాగి పల్కినపలుకులలో తెలంగాణా మాండలిక పదజాలం అతిసహజంగా చోటుచేసుకున్నది. శృంగార కరుణాద్భుతరౌద్రరసాలు చక్కగా పోషింపబడినవీ రూపకంలో. ఇందులోని ఏడు పాటలూ రసరమ్యాలు. వాటిలో-

"ఈనల్లని రాలలో
ఏ కన్నులు దాగెనో
ఈ బండల మాటున
ఏగుండెలు మ్రోగెనో ॥ఈ॥

పాపాలకు తాపాలకు
బహుదూరములోనున్నవి

---

1. 'రామప్ప' - 'నాలుగుమాటలు' - ప్రచురణ మార్చి, 1960.

మునులవోలె కారడవుల
మూలలందు పడియున్నవి ॥ ఈ ॥

కదలలేవు మెదలలేవు
పెదవి విప్పి పలుకలేవు
ఉలియలికిడి విన్నంతనె
గలగలమని పొంగిపొరలు ॥ ఈ ॥

పైన కఠినమనిపించును
లోన వెన్న కనిపించును
జీవమున్న మనిషికన్న
శిలలే నయమనిపించును ॥ ఈ ॥

అనే పాట తారాస్థాయినందుకున్నది. ఈనాటికలో ఉన్నది ఒకే పద్యమైనా హృద్యముగా ఉన్నది.

కళావిర్భూతికీ కళావిలసనానికీ ఉన్న అతిసూక్ష్మమైన సంబంధాన్ని నారాయణరెడ్డి ఈ నాటికలో వ్యంగ్యస్ఫూర్తికో ప్రతిపాదించినాడు. కళ దైవాంశమనే భారతీయుల విశ్వాసానికి ఈనాటిక ఒక కాణాచి.

# నారాయణరెడ్డి నాటికలు

నారాయణరెడ్డి బహుముఖప్రతిభాశాలి. అతడు గేయనాటికలనేగాక వచననాటికలను కూడా రచించినాడు. అవన్నీ ఆయాసందర్భాలలో వివిధ పత్రికలలో ప్రచురితములై ఆకాశవాణిలో ప్రసారితములై బహుళజనాదరణను అందుకున్నాయి. వాటిని సేకరించి 'రసమయి' అనే సాహిత్య సాంస్కృతికసంస్థ హైదరాబాదు - మార్చి 1978లో "నారాయణరెడ్డి నాటికలు" అనే సంపుటిగా వెలువరించింది. ఈ సంపుటిని నారాయణరెడ్డి ధ్వన్యనుకరణ సమ్రాట్ శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్‌గారికి అంకితం చేసినాడు.

ఈ సంపుటిలో పదినాటికలు చోటుచేసుకున్నాయి. అవి ఇవి—ఊర్మిళ, వరూధిని, మేఘమాధురి, దీపలీల, నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలు, విజయసంక్రాంతి, రఘుపతిరాఘవరాజారాం, కాళిదాసు పునరాగమనం, హరిచరణదాసి "మీరా". ఇందులోని ఏడునాటికలలో ఒక్కొక్కదానిలో ఒకటీ రెండూ మూడూ పాటలున్నాయి. కొన్నింటిలో నేపథ్యగీతాలూ బృంద గానాలూ ఉన్నాయి. పాటలు (గేయాలు) నామమాత్రంగా ఉన్నందువలన వీటిని వచననాటికలనే చెప్పాలి. సంగీతం రసానుభూతికి సహకరిస్తుందన్న దృక్పథంతో నారాయణరెడ్డి ఈ పాటలను చేర్చినాడని ఊహింపవచ్చును. ఈ సంపుటిలోని నాటికలలో కొన్ని వాస్తవికతామహితంగానూ మరికొన్ని కల్పనాసుందరంగానూ సాగినవి.

## ఊర్మిళ

'ఊర్మిళ' నాటికలోని ఏడుభాగాలను ఏడు సన్నివేశాలుగా భావింప వచ్చును. ఊర్మిళ, లక్ష్మణుడు, వకుళ, మాలతి, సీత, రాముడు, సుమిత్ర, కౌసల్య- ఇందలిపాత్రలు.

వివాహానంతరం పతితో సుఖంగా ఉన్న ఊర్మిళ సీతారామలక్ష్మణుల అరణ్యవాసవార్తవిని దుఃఖించటం, పత్యాజ్ఞప్రకారం వారు వచ్చేదాక అయో ధ్యలో యోగినిగా ఉండిపోవటం, రావణవధానంతరం వారు రాగానే ఆనం దించటం అనేవి ఈ నాటికలోని ప్రధానకథాంశాలు.

ముగ్ధరాగిణిగా వింతయోగినిగా త్యాగశీలగా వినయమూర్తిగా శేముషీ స్ఫూర్తిగా పతిసేవాపరాయణగా ధర్మమార్గగామినిగా ఊర్మిళపాత్రను నారా యణరెడ్డి ఎంతో మెలకువతో చిత్రించినాడు. లక్ష్మణుని భ్రాతృసేవా ధౌరంధర్యం, త్యాగశీలం సహృదయహృదయాలను కరిగిస్తుంది. లక్ష్మణుడు ఆదిశేషుని అవతారమనే పురాణసత్యాన్ని ఈ నాటికలోని మాటలు సమర్థిస్తు న్నాయి.

ఈనాటికలో సంభాషణలు సంక్షిప్తములై పాత్రోచితములై కవితాత్మక ములై పాఠకుని ముందుకు పరుగెత్తిస్తాయి.

ఊర్మిళాలక్ష్మణుల "మధుర దాంపత్యజీవితానికి మాసిపోని"చిహ్నంగా మల్లెమొక్కను ఊర్మిళచే నాటింపజేసి, దానిమూలంగా ఆగామివిషాదసంతోషాలను సూచించిన కవి కల్పనాశిల్పం ప్రశంసనీయం.

నాటికకు ఆరంభంలోనూ ఏడవభాగంలోనూ నేపథ్యగీతాలను ప్రయోగించి నాటికాకర్త రామలక్ష్మణుల వివాహం, రావణసంహారం వంటి కొన్ని కథాభాగాలను నడిపించినాడు.

"నాలో దాగిన రాగం అలపించనాస్వామీ" అనే పాటలోని

"నా ముంగిట గగనగంగ
నడయాడెను నేడే
నా మదిలో నందనాలు
నవ్వెను ఈనాడే"

వంటి చరణాలూ, నేపథ్యగీతంలోని—

"మోడువడిన సాకేతము పూవులపందిరియాయేను
ఇరులలమిన సాకేతము శరదిందీవరమాయెను"

వంటి పంక్తులూ కవితాసౌందర్యానికి నిదర్శనాలు.

శృంగారకరుణరసాలు ఈ నాటికలో చక్కగా పోషింపబడినవి. 'దివ్వెలమువ్వలు' సంపుటిలో నారాయణరెడ్డి వ్రాసిన 'ఊర్మిళ' అనే ఖండికయే ఈ నాటికగా రూపుదిద్దుకున్నది.

# వరూధిని

అల్లసాని పెద్దన 'మనుచరిత్ర'లోని మొదటి మూడు ఆశ్వాసాలకు అనుసరణం 'వరూధిని' నాటిక. ఆరు భాగాలుగా సాగిన ఈ నాటికలోని పాత్రలు— గంధర్వుడు, వరూధిని, హేమ, ప్రవరుడు, సిద్ధుడు, మాయా ప్రవరుడు, అశరీరవాణి.

నారాయణరెడ్డి నాటికచివరిభాగంలో మూలంలోలేని రెండు విషయాలను కల్పించి ఈ నాటికకు ఒక విశిష్టతను కలిగించినాడు. ఒకటి- ప్రవరుడు

కలగనటం, రెండు- అశరీరవాణి ప్రవరునికి ఆగామిస్వారోచిషమనుసంభవ రహస్యాన్ని చెప్పటం.

వరూధిని మాయాప్రవరుని కవుగిలించుకుంటున్న సమయంలో ఇక్కడ ఇంట్లో పడుకున్న ప్రవరునికి వరూధిని తనను కౌగిలించుకున్నట్లూ, తాను ఆమెను వదలుమంటూ తృణీకరించినట్లూ కలపడుతుంది. "పీడకలలో కూడా ఇలాటి దుర్ఘటన జరగడం దారుణం" అని ప్రవరుడు చింతిస్తున్న తరుణంలో అశరీరవాణి అతనితో- ఆక్షణాన వరూధిని కౌగిట్లో ఉన్నది అతడే అనీ- అంటే ఆతనితేజమేఅనీ, తిరస్కృతగంధర్వుడతని రూపంలో ఆమె కౌగిట్లో ఉన్నాడనీ, సురవీర్యం భూసురతేజం కలిసిన ఫలితంగా స్వరోచి జన్మిస్తాడనీ, ఆ స్వరోచి స్వారోచిషమనుసంభవానికి కారణభూతు డవుతాడనీ నిగూఢసత్యమంతా చెపుతుంది. కలలో గూడా పరకాంతాస్పర్శ సహించని ప్రవరుని పరమనిష్ఠను ఈ స్వప్నకల్పనం హిమాలయోన్నతశిఖ రాలకెత్తి చాటుతున్నది. ప్రతిభామూర్తి యైన నారాయణరెడ్డి ఈ నాటికలో ప్రవరపాత్రోద్దీప్తికై చేసిన మరొకచిన్నహూర్పును చెప్పవలసి ఉన్నది. మను చరిత్రలో ప్రవరుణ్ణి చూసిన వరూధిని 'రతిసంరంభము' మించిపోగా 'పాలిండ్లుపొంగారఁ బైయంచుల్ మోవఁగఁగౌగిలించి'నట్లూ ఆతని 'అధ రంబా'సించినట్లూ, అంత ప్రవరుడు 'ఓరమోమిడి' ఆమె 'అంసద్వయం బంటి' పొమ్మని త్రోసివేసినట్లూ అల్లసానిపెద్దన చిత్రించినాడు. కాని నారా యణరెడ్డికి వరూధిని ప్రవరుణ్ణి కౌగిలించటంకాదు గదా ఆ నిష్ఠాగరిష్ఠుని స్పర్శించటంకూడా ఇష్టంలేదు. ఆతని పరమపవిత్రతను కలుషితం చేయటం సంభావ్యమనిపించలేదు. అందుకే వరూధిని ప్రవరుణ్ణి సమీపించినట్లు మాత్రమే చిత్రిస్తూ ఆమెనోట 'కాదులేదనక నా బిగికౌగిట ఒదిగిపో ప్రియ వరా ! ప్రవరా !" అని మాత్రమే అనిపించినాడు. వెనువెంటనే ప్రవరుని నోట– "శ్రీహరీ ! ఏమిటి పరీక్ష ! అగ్నిదేవా ! నిత్యాగ్నిహోత్రినైన నాకు నీవే రక్ష" అని పలికించినాడు. అంతే. కవి చిత్రించిన ఈ సన్నివేశంలో ఇలా వరూధినీపరీరంభం కానీ చుంబనేచ్ఛాప్రయత్నంకానీ ప్రవరుడామెను త్రోసివేయడం కానీ ఏమీ లేవు. నాటిక కాబట్టి నటులసూచనకోసం బ్రాకెట్లో నైనా వ్రాయవచ్చుగదా ! అదికూడా చేయలేదు. కారణం- అది అక్షరాలా తనకిష్టం లేదనే అంశం సహృదయులకు ధ్వనించకపోదని ఆతని హృద

యం. ఇలా ఆ నిత్యాగ్నిహోత్రి పవిత్రతను కాపాడడానికి కవి చేసిన ప్రయత్నం బహుధా ప్రశంసనీయం. ఇక అశరీరవాణిని కల్పించి స్వారోచిషమను సంభవసత్యాన్ని ప్రవరునికి తెలియచేయటంవలన ప్రవరునికి తనవలన పరోక్షంగా మనుసంభవమనే ఒక మహోపకారం జరుగుతుందనే ఆనందంతో పాటు సహృదయప్రేక్షకపాఠకులకు మనుచరిత్రకథావగాహనం కూడా ఏర్పడుతున్నది. ఈ కల్పనలు సాధించిన ప్రయోజనాలు ఇవే.

నాటిక చివరకు 'అగ్నిమీళే పురోహితం' అనే అగ్నిదేవాతాకమైన ఋగ్వేదమంత్రాన్నిచేర్చి ప్రవరుని అగ్నిహోత్రిత్వంతోపాటు, ఔచిత్యాన్నీ నాటకీయతనూ ఇతోధికంగా భాసింపజేసినాడు కవి.

అక్కడక్కడా మనుచరిత్ర పద్యాల్లోని కొన్ని మాటలనూ భావాలనూ గ్రహిస్తూ తనకు సహజమైన ఉక్తిచమత్కారంతో అంత్యప్రాసల అందాలతో కవితారమ్యములైన సంక్షిప్తసంభాషణలలో అల్లసాని పెద్దన చతురవచోనిధిత్వానికి ప్రతినిధిత్వాన్ని నెరపుతూ ఈ నాటికను రచించినాడు నారాయణరెడ్డి.

# మేఘమాధురి

సృష్టిలోని మొట్టమొదటి స్త్రీపురుషుల అనురాగబంధాన్నిగూర్చి వర్ణించే నాటిక 'మేఘమాధురి'. ఇందలి పాత్రలు—పురుషుడు, స్త్రీ, పృథివి. వసంతంలో మొట్టమొదటిసారిగా తనను కలుసుక్తున్న లావణ్యమూర్తి స్త్రీ అని పృథివిద్వారా తెలుసుకున్న పురుషుడు ఆమెతో హాయిగా వసంతాన్ని గడపుతాడు. అంతలో గ్రీష్మం వస్తుంది. ఆ గ్రీష్మర్తుతైక్ష్ణతకూ అందలి భయంకర దవానలానికి జడుస్తూ దాహంతో బాధపడుతున్న ఆ ఆది దంపతులకు పృథివి ప్రత్యక్షమై వారికి ఋతుపరివర్తన జ్ఞానాన్ని కలిగించి, చల్లని సరస్సును చూపించి, తరువాత వర్షర్తువు వస్తుందని తెలిపి వెళ్లిపోతుంది. అంతవర్షరువు వస్తుంది. ఆ దంపతులు హాయిగా జలధారలో నిలబడి వర్షాసౌఖ్యాన్ని 'మేఘమాధురి'ని అనుభవిస్తారు. ఇది ఇందలి కథాంశం.

స్త్రీ ప్రకృతి స్వరూపిణి అనీ, ఋతుపరివర్తనం ప్రకృతిధర్మమనీ, ఆ ధర్మాన్ని మార్చటం అసాధ్యమనీ, "మేఘమాధురిని అనుభవించాలంటే మండుటెండల కటికచేదును చవిచూడక" తప్పదనీ, జీవితాలకు కష్టసుఖాలు ఋతువుల్లా వస్తూపోతుంటాయనీ ఈ నాటికలోని పృథివి పాత్రద్వారా సందేశమందించినాడు కవి.

## దీపలీల

నాలుగు పాత్రలతో నడిచే నాటిక 'దీపలీల'. మానవుడు, మాయ ప్రధానపాత్రలు. వృద్ధుడు (తాతయ్య), అమ్మాయి, Flash backలో వచ్చే పాత్రలు.

పంచభూతమనోబుద్ధ్యహంకారాలనే అష్టరూపాలలో ఉన్న మాయాశక్తి ఈ లోకాన్ని తన గుప్పిట్లో పెట్టుకొని ఉందనీ, దీపాల రూపంలో కనిపించే కాంతి ఈ మాయాశక్తిలో ఒక అంశమనీ, కనిపించే ఈ ప్రకృతి మిథ్య అనీ, "దీనికతీతంగా శాశ్వతమయిన పరిశుద్ధమయిన ప్రకృతి" ఒకటి ఉందనీ అదే పరమాత్మ అనీ నిజమైన కాంతి అదే అనీ, అక్షరంగా అమృతంగా నిలిచే ఆ కాంతియే నిరంతరాన్వేషణశీలి అయిన మానవుని లక్ష్యమనీ అది మనశ్శక్తిద్వారా సాధ్యమని ప్రబోధించే నాటిక దీపలీల.

సృష్టిక్రమాన్నీ సృష్టితత్త్వాన్నీ వివరించిన వైనం రమణీయం. మాయ సాయంతోనే మానవుడు పరంజ్యోతిని దర్శించగలగటం ఈ నాటికలోని వైచిత్రి. మానవపాత్రలో నారాయణరెడ్డి కవితాత్మ భాసిస్తున్నది. ఇందలి సంభాషణలు సరళసంక్షిప్తాలు; కవితాసంవాసితాలు. నారాయణరెడ్డి వ్రాసిన 'దివ్వెల మువ్వలు' అనే ఖండిక కొన్ని మార్పులతో ఈ 'దీపలీల' రూపకంగా అవతరించిందని చెప్పవచ్చు. మానవుడు గానంచేసిన ఇందలికొన్ని గేయపంక్తులు ఆ ఖండికలోనివే.

# నాగార్జునసాగరం

ఈ సంపుటిలోని 'నాగార్జునసాగరం' 'కర్పూరవసంతరాయలు' రెండు కూడా అవే పేర్లతో వెలువడిన నారాయణరెడ్డి కావ్యాలకు 'నాటకీకృతులు'.

తొమ్మిదిభాగాలుగా సాగిన 'నాగార్జున సాగరం'లోని పాత్రలూ భావాలూ మూలంలోనివే. అక్కడక్కడా కావ్యంలోని పంక్తులు సన్నివేశానికి గభీరతను కలిగిస్తున్నవి. 'శాంతిశ్రీ'ని వర్ణించే 'నామదిలో విరిసే ఆమనివో' అనే గీతం కవితాకాంతిస్నాతం. నాటికారంభంలోని బృందగానం నాగార్జున సాగర నిర్మాణఘట్టాన్నీ, 'నేపథ్యకంఠం' ద్వారా కథాకాలవాతావరణాన్నీ చక్కగా పరిచయం చేస్తున్నవి.

# కర్పూరవసంతరాయలు

'కర్పూర వసంతరాయలు' నాటికలోని పదకొండు విడివిడి భాగాలను సన్నివేశాలుగా గ్రహింపవచ్చు. లకుమ పార్వతీపూజను అభినయించే సందర్భంలో కాళిదాసు శ్లోకాన్నీ, నాటకాంతంలో సంస్కృత చాటు శ్లోకాన్నీ చేర్చి నారాయణరెడ్డి ఔచిత్యాన్ని పోషించినాడు; నాటికకు ఒక గాంభీర్యాన్ని ఆపాదించినాడు.

# విజయసంక్రాంతి

బంగ్లాదేశవిముక్తికోసం భారతదేశం పాకిస్తాన్‌తో జరిపిన సమర సందర్భంగా 1971లో నారాయణరెడ్డి 'జయహే బంగ్లాదేశ్.' 'సమర సంక్రాంతి' అనే రెండు కవితాఖండికలు రచించినాడు. 'విజయసంక్రాంతి' నాటికలోని వస్తువుకూడా ఇదే. నాలుగు భాగాలున్న ఈ నాటికలోని పాత్రలు- సరళ, తల్లి, సాతానిజియ్యర్, నౌకరు (మిలిటరీ సైనికోద్యోగి), పాలేరు, ఇద్దరు అల్లుళ్లు, ఇద్దరు కూతుళ్లు.

చాంబ్ సెక్టర్ సరిహద్దుపోరాటంలో వీరోచితంగా పోరాడి ఒక కన్నూ కాలూ పోగొట్టుకుని ఒక మిలిటరీ సైనికోద్యోగి సంక్రాంతిపండుగకు ఇంటికి వెళ్ళి దుఃఖంలో ఉన్న తనభార్య-సరళను—కలుసుకోవటం ఈ నాటికలోని కథ. కరుణరసతరంగితమైన ఈ నాటిక సమకాలిక సంఘంలోని కొన్ని రంగాలను రేఖా మాత్రంగా చిత్రిస్తున్నది.

# రఘుపతిరాఘవరాజారాం

గాంధీశతజయంతిసందర్భంగా నారాయణరెడ్డి 'బాపూ నీ పుట్టినరోజు' అనే శీర్షికతో మహాత్ముని స్తుతిస్తూ ఒక గీతాన్ని వ్రాసినాడు. ఈ గీతంలోని కొన్ని పంక్తులను గ్రహించి వాటిని బింబించే సన్నివేశాలను కల్పిస్తూ రచించిన నాటికయే 'రఘుపతిరాఘవరాజారాం'.

మూడు సన్నివేశాలున్న (భాగాలున్న) ఈనాటికలోని మొదటి సన్నివేశంలో కవి, వ్యాఖ్యాత కాక ఇద్దరు వ్యక్తులు (ఒకడు హిందువు; ఒకడు ముస్లిము) ఒక వృద్ధుడు, పాత్రలు. హిందూముస్లిం సమైక్యాన్నీ, మత సహనాన్నీ ప్రబోధించే ఈ సన్నివేశం-

"ఒక రాముడు పుట్టినరోజు
ఒక రహీము పుట్టినరోజు"

అనే చరణాలకు దృశ్యాత్మకోదాహరణం.

నాటికలోని రెండవభాగం స్వదేశీ ఉద్యమాన్ని చిత్రిస్తున్నది. ఇద్దరు ముగ్గురు వ్యక్తుల సంవాదరూపంగా సాగే ఈ సన్నివేశం-

"చరఖాతో భరతమాతకు
పరువును నిలబెట్టినరోజు"

అన్న పంక్తులకు రూపకస్వరూపం.

మూడవ సన్నివేశంలోని వస్తువు క్విటిండియా ఉద్యమం. ఒక అధికారి, కొందరు వ్యక్తులు ఇందలి పాత్రలు.

"స్వతంత్రభారత పౌరులారా!
స్వరాజ్యసంగర ధీరులారా!"

అనేగేయంలో స్వాతంత్ర్యవీరం ప్రవహించింది.

# కాళిదాసుపునరాగమనం

ఒకనాడు మేఘునిద్వారా ప్రణయసందేశం పంపిన కాళిదాసు నేటి ప్రపంచంలోని ధనదాహాన్నీ, సమరోన్మాదాన్నీ మారణాయుధనిర్మాణాన్నీ చూసి చింతిస్తూ "ద్వేషానల మారిపోవగా స్నేహబీజమంకురించగా" మేఘుని చేత శాంతిసుధలు కురిపించుటయే 'కాళిదాసుపునరాగమనం' నాటికలోని ఇతివృత్తం. 'విజ్ఞానం వెర్రితలలు వేస్తున్నలోకానికి' మహాకవిచేత శాంతి సందేశమిప్పించి 'కవివాణి అనశ్వరం' అన్న సత్యాన్ని ఈ నాటిక ద్వారా ఘోషించినాడు కవి. వ్యాఖ్యాతతోపాటు ఈ నాటికలోని పాత్రలు - కాళిదాసు యక్షుడు - యక్షి.

హిమాలయోన్నతశిఖరంపై కూర్చొని మేఘసందేశశ్లోకాలను గానం చేస్తున్న కాళిదాసును వ్యాఖ్యాత యక్షీయక్షులు దర్శించినట్లు చేసిన కల్పనం రమణీయంగానూ నాటకీయతాభరితంగానూ ఉన్నది. కాళిదాససందేశంవిన్న మేఘుడు వర్షంకురిసినట్లు చిత్రించటం వలన ఆ మహాకవి ఆశయం నెరవేరిందని ధ్వనింపజేసినాడు నాటికాకర్త. నాటి కాళిదాసేమి? నేటి నారాయణ రెడ్డి ఏమి? కవితాత్మ ఒకటే కదా!

అమరభాషలో కావ్యగానంచేసిన కాళిదాసుచేత ఆంధ్రభాషలో కూడా కవితాగానంచేయించి కవి ఈ నాటికకు విశిష్టతను కలిగించినాడు.

# హరిచరణదాసి "మీరా"

ప్రసిద్ధకృష్ణభక్తురాలైన "మీరా" భర్తపెట్టిన విషమపరీక్షలనుంచి బయటపడి తన పునీతత్వాన్నీ భక్తిపారమ్యాన్నీ నిరూపించుకున్న సన్నివేశం ఈనాటికలోని వస్తువు.

మీరా, వాసంతి, రాణా (మీరాభర్త) ఈనాటికలోని పాత్రలు. నాటికలోని మూడుపాటలూ సంభాషణలూ హృదయంగమంగా ఉన్నవి.

"మోవిచిగురుపై మురళిని మోపి
మూగవైతివేలా కృష్ణా!
మ్రోగింపవదేలా కృష్ణా!"

అనేపాట భక్తిరసార్ద్రం.

ఈసంపుటిలోని వరూధిని, నాగార్జునసాగరం, కర్పూరవసంతరాయలు అనే నాటికలు కావ్యాలను నారాయణరెడ్డి మనోజ్ఞరూపకాలుగా మలచగలడన టానికి నిదర్శనాలుగా నిలుస్తున్నవి. ఈ విధంగా 'నారాయణరెడ్డి నాటికలు' అన్నసంపుటిలోని దశరూపకాలూ రసాత్మకాలై సహృదయానందసంధాయకాలై నారాయణరెడ్డి నాటకాంతసాహితీమూర్తికి అమూల్యాదర్శంగాభాసిస్తున్నవి.

# మరికొన్ని నాటికలు

ఇవేకాక నారాయణరెడ్డి వసంతలక్ష్మి, బలేశిష్యులు [1], సినీకవి, శిథిలశిల [2] అనే మరికొన్ని నాటికలను కూడా వ్రాసినాడు.

## వసంతలక్ష్మి

వసంతలక్ష్మి ఆకాశవాణిలో ప్రసారితమైన చిన్ననాటిక. వసంతర్తుశోభ ఇందలివస్తువు. పవనుడు, మందారం, మల్లిక, మాలతి, వసంతలక్ష్మి ఇందలి పాత్రలు. ఈ నాటికలోని పాటలు మకరందమధురాలు.

---

1. 'బలేశిష్యులు' నాటిక నాకు లభ్యముకాలేదు.
2. 'శిథిలశిల' 'సింహేంద్ర' అనే కలంపేరుతో వెలువడింది. ఇది ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు కళాశాల విద్యార్థుల సాహితీ సంచిక "శోభ" (మార్చి 1952)లో ప్రచురితం. సంచిక సంపాదకుడు. సి. నారాయణరెడ్డి- పుటలు (23-26)

# సినీకవి

నారాయణరెడ్డి విద్యార్థిదశలో ఉన్నప్పుడు వ్రాసిన నాటిక 'సినీకవి'. చలనచిత్రనిర్మాతల ఇష్టానుసారం పాటలు వ్రాయగలిగినవాడే మంచి సినీమాకవిగా— అంటే నాలుగు డబ్బులు చేసుకోగలిగేవాడిగా - రాణించ గలుగుతాడే గానీ, తనకు నచ్చినట్లు వ్రాసుకునే కవి సినీమాల్లో రాణించ లేడనీ, అంగారాన్నీ శృంగారాన్నీ దేనినైనాసరే అతివేలంగా అందించగల వాడే సిసలైన సినీమాకవి అని ఈ నాటికద్వారా సూచించినాడు.

ఇందలి పాత్రలు- తారాపతి (కథకుడు), ప్రొడ్యూసరు, మకరంద మూర్తి (భావకవి), అభ్యుదయకవి, హిమాంగారశాస్త్రి.

ఇది హాస్యరసప్రధానమైన నాటిక. హిమాంగారశాస్త్రిని తనపేరు చెప్పమని ప్రొడ్యూసరు అడిగినప్పుడు- ఆతడు—

"విపులంగా చెపితే
విషాదకవితావిశారద
వినోదపద్యగద్యరచనాప్రవీణ
ప్రళయగేయ సముదాయ కల్పనాధురీణ
ప్రణయగీతికాలతికాపుంజనికుంజ - కవిఘోటక - కవి
శారిక - కవిపిక........"

అని తనపేరు చెప్పుకున్నప్పటి పంక్తులు ఈ నాటికలోని హాస్యధోరణిని పరిచయం చేస్తాయి.

1953లో ఆంధ్రాభ్యుదయోత్సవాల సందర్భంగా ఈ నాటిక ప్రద ర్శింపబడినది. మకరందమూర్తి పాత్రధారిగా నారాయణరెడ్డి ఉత్తమనటుని బహుమతినందుకున్నాడు. ఈ నాటికను గూర్చిన విషయాలన్నీ నాకు దయతో అందించినవారు సహృదయులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు. నాకు ఈ నాటిక లభించలేదు.

# శిథిలశీల

రెండు దృశ్యాలుగా సాగిన 'శిథిలశీల' నాటికలోని పాత్రలు– జగన్నాథం (శీలతండ్రి), ఆనందరావు (జగన్నాథం మిత్రుడు), పరాంకుశం (విలన్).

ఈ నాటిక రెడ్డి హాస్టల్‌లో ప్రదర్శింపబడింది. బాల్యవివాహనిషేధాన్నీ, వితంతువివాహాన్నీ ప్రబోధించే నాటిక ఇది.

నాటిక చివరనున్న–

"నడవరా నడవరా నవసమాజనిర్మాతా"

అనే నేపథ్యగీతం వితంతువివాహాన్ని ప్రబోధిస్తుంది.



# గేయసూక్తి సాహితి

## సమదర్శనం

'సమదర్శనం' గేయసూక్తుల సంపుటి. 1958 ఏప్రిల్ నుండి 1959 మార్చి వరకు అప్పుడప్పుడూ తన "గుండియ జుమ్మని స్పందనము పొందినప్పుడు" వ్రాసిన ముక్తకాలను ఒక్కచోట చేర్చి 'సమదర్శనం' పేర 1960 డిసంబరులో ప్రకటించినాడు నారాయణరెడ్డి. ఈ ముక్తకకావ్యం 'సాహితీ తపస్సులో తలపండిన మహారచయిత' శ్రీ తాపీ ధర్మారావునాయుడు గారికి అంకితం.

ముక్తకమనగా చమత్కారమైన ఒక పద్యం లేక శ్లోకం. కథాసూత్రం ఉండకపోవడం వల్ల ఈ ప్రక్రియలోని పద్యాలకు పరస్పర సంబంధ

ముండదు. దేనికదే స్వతంత్రం. ఇట్టి ముక్తకాలు పురాణేతిహాసాల్లో కావ్య ప్రబంధాలలో, గాథాదులలో, ఆశుకవితలలో భిన్న భిన్న సందర్భాలలో నీతిధర్మాది వివిధవిషయములను గూర్చిన ప్రసక్తి వచ్చినపుడు విరివిగా కని పిస్తాయి. శతకాలూ చాటువులూ ఈ కోవకు చెందినవే. అయితే ఇవన్నీ పద్యరూపంలో ఉంటాయి.

గేయచ్ఛందస్సులో చారిత్రకకావ్యాలను రమణీయంగా రచించిన నారాయణరెడ్డి అదే ఛందంలో ముక్తకాలను కూడ వెలువరించాలనే అభిప్రాయంతో ఈ 'సమదర్శనం'ను రూపొందించినాడు. ఇందులో నూటికి పైగా గేయఖండికలున్నవి. కాని మకుటం మాత్రం లేదు. అందుచేతనే "మకుట నియమము విస్మరించినచో దీనిని గేయ శతక మనవచ్చు"[1] నని నారాయణ రెడ్డి తన సిద్ధాంతగ్రంథంలో తెలిపినాడు.

నారాయణరెడ్డికి ఉర్దూభాషలో మంచి అభినివేశం ఉంది. ఉర్దూ ఛంద స్సులతో చక్కని పరిచయం ఉంది. ఉర్దూ ఫారసీ భాషల్లో 'రుబాయీ' అనే నాలుగు పాదాల ఛందస్సు ఒకటి ఉన్నది. ముక్తకాలు అనేకం ఆ భాషలో ఈ ఛందస్సులోనే అవతరించినవి. 'రుబాయీ'లో అంత్యప్రాస నియమాల జోలికి పోక నారాయణరెడ్డి ముక్తకాలకు రుబాయీ సరిపోతుందని గేయ చ్ఛందస్సును సంపరించి ఈ సూక్తి రత్నాలను అందించినాడు. ఈ విధంగా సూక్తిముక్తకాలను విరచించి ఒక కొత్త ప్రయోగం చేసినాడని చెప్పడానికి వీలుంది.

'సమదర్శనం'లో రెండు భాగాలున్నవి. పూర్వార్ధంలో యాభైయారు. ఉత్తర భాగంలో అరవైఆరు మొత్తం నూటాయిరవై రెండు ముక్తకాలు న్నాయి. మొదటి భాగంలోని ముక్తకమౌక్తికాలు మిశ్రగతిలో మెరిస్తే, రెండవ భాగంలోని గేయఖండాలలో త్ర్యస్రగతి చోటుచేసుకొన్నది. "సమ కాలీన సమాజంలోని మంచి చెడుగులను చాలావరకు మెత్తగా ఎత్తిచూపడం ఒక్కొక్కప్పుడు పొడిచి హెచ్చరించడం ఈ సంపుటిలో కనిపిస్తుంది. ఈ పద్ధతి మన సాహిత్యానికి కొత్తకాదు. అధిక్షేపశతకాల్లో ఇది బహుళంగా

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు - ప్రయోగములు ; పుట 683 ; ప్రథమముద్రణ 1967.

కనిపిస్తుంది" అని కావ్యారంభంలోనే పేర్కొన్నాడు కవి. 'సమదర్శనం' అనే ఈ ముక్తకకావ్యనామం ఈ సంపుటి పూర్వభాగంలోని

"సత్త్వమనియెడు పాదున కొనల్
సాచు మరువపు మొల్క సహనము
నిత్యసమదర్శనము దానికి
నీరువలె దోహదము సేయును"

అనే గేయంలో కనిపిస్తుంది.

ఈ సంపుటిలోని కొన్ని గేయములు జాతిమత సంప్రదాయ సహనాలను గూర్చి ప్రపంచిస్తే, మరికొన్ని ద్వేష బహిర్ద్వేష కులతత్త్వకువిమర్శలను పరిహసిస్తాయి. కొన్ని సూక్తులు ధర్మకర్మత్యాగ వీరతాప్రతిభాసంస్కార సమతావిశేషాలను నిర్వచిస్తే మరికొన్ని కీర్తికాంక్ష ముఖస్తుత్య హంకారాలను నిరసిస్తాయి. ఇవన్నీ మానవజీవితసత్యాలను గూర్చి నారాయణరెడ్డికి గల భావాలనూ దైనందిన జీవితంలో తాను పొందిన అనుభవాలనూ వివరిస్తూ ఈతని కవితావ్యక్తిత్వ స్వరూప స్వభావాలను ప్రస్ఫుటీకరిస్తాయి.

నారాయణరెడ్డి మొదటినుండీ సూటిగా సూనృతంగా సంఘాన్ని అర్థం చేసికొని దానిని సుందరంగా కవితలో వ్యక్తంచేసిన, చేస్తున్న సత్కవి. సంప్రదాయబలమూ, సంస్కారఫలమూ ఉన్నకవి కాబట్టి ఆతడు గతాన్ని కాదనక వర్తమానాన్ని వద్దనక ఆరెంటికీ కట్టవలసినంత విలువ కట్టినాడు. ఆతని దృష్టిలో నిన్న నేటికి ప్రాతిపదిక. ఆతడు వర్తమానాన్ని—

"గతమనెడు వజ్రంపుగోడల
కట్టడముపై నిట్టనిలువున
శిరసునెత్తిన స్వర్ణమయ గో
పురము"

గా వర్ణించినాడు.

"అంతకడవెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి అదియే సంప్రదాయము"

అని సంప్రదాయాన్ని నిర్వచించినాడు నారాయణరెడ్డి. ఆ సంప్రదాయమే స్తన్యంలా జాతినాడిలో చొరబడి శైశవంనుండి బ్రహ్మజ్ఞాన పదవికి జాతిని చేర్చగలదన్నాడు. ఆ సంప్రదాయం స్తబ్ధమైతే జాతి రోగగ్రస్తమైపోతుందన్నాడు. జాతి అంటే 'సర్వమానవజాతి'. బాహిరాకృతులు వేరైనా—

"భిన్నమతముల లక్ష్యమొక అ
చ్ఛిన్న తేజమునందుకొనుటే
నదులదారులువేరు; గమ్యము
తుదకు సంద్రము జేరుకొనుటే"

అని సర్వమతగమ్యాన్ని సహృదయరమ్యంగా సూక్తీకరించినాడు. గుణాన్ని కులంతో ముడిపెట్టడం 'అతివివేకం' అంటూ—

"పశుగణమ్మనసైతమున్నది
పరమసాత్త్వికమూర్తి ధేనువు"

అని చిత్తానికి హత్తుకునేలా చెప్పినాడు. సత్త్వరజస్తమోగుణాలను గూర్చి చెపుతూ 'నేటి అణుగోళమ్ములు' రాజసగుణకోటిలోపలి 'వెర్రితలలే' అని పరోక్షంగా అణ్వాయుధ నిర్మాణాన్ని నిరసించినాడు నారాయణరెడ్డి. ఈతడు జాతిపితహత్యను ఖండిస్తూ ఆతనిహత్య 'భారతజాతినుదుట నెత్రుచారిక' అని అన్నాడు.

సమకాలిక సమాజంలోని కుకవుల ఈర్ష్యను మెత్తగా ఎత్తిచూపుతూ ఇలా అన్నాడు కవి.

"ఒక్క శుభజాతకుడు ఏనుగు
నెక్కి సన్మానమ్ములందగ
నేల తొలుచుకుపోయినటు గ
గ్గోలు పడు నింకొకడు పాపము".

రాజకీయములను తిట్టడమన్నది "తన ముఖంపువికారమున కద్దమునునేలకు" కొట్టడం వంటిదనీ, ప్రజలను ముందుకునెట్టే సత్తా ఈ రాజనీతికే ఉన్నదనీ కాని కొందరు 'ఊసరవెల్లివారసులు' ఈ రంగంలో ఉన్నందువల్ల రాజకీయాలందరికీ చుల్కనగా మారినవనీ రాజనీతి ప్రాధాన్యాన్ని వివరించినాడు నారా

యణరెడ్డి. పంచములలో నాడూ నేడూ బ్రహ్మవేత్తలున్నారనీ, కవులలో గూడా 'కులాలవారిగా' గణనసేయడం బుద్ధిమాంద్యమనీ అటువంటి మన స్తత్త్వమున్న వారిని ఈసడించినాడు ఈ కవి. అందరినీ ఆనందింపజేసే వెన్నెలలకు వలె కవులకు కులం ఉండదని సందేశమిస్తూనే కవులకు ఉండ వలసిన విశాలహృదయాన్నీ వారి కర్తవ్యాన్నీ ధ్వనివైభవంతో చెప్పి నాడు.

నారాయణరెడ్డి హాస్యాన్ని జోడించి అందంగా చెప్పినాడు కొన్ని సూక్తులను. ముఖస్తుతిని మించిన సమ్మోహనాస్త్రం లేదని చెపుతూ "స్తుతు లకు పరమేశునికే మతిదప్పిన కథలున్నవి" అంటాడు.

"వందిమాగధులు లేనిది
కొందరకేది సయింపదు
సూది యివ్వకున్న నిదుర
రాదు కొన్ని జీవాలకు"

అనే గేయంలోని మూడవచరణం చదువుతున్నప్పుడు ముసిముసినవ్వు ముంచు కొస్తుంది. ఇందలి సూది ఇవ్వడమనేది వ్యవహారంలో ఉన్న శక్తిమంతమైన చక్కని తెలుగునుడికారం.

"స్తుతిని భవిష్యత్ ప్రగతికి
చూపుడువ్రేలని యెంచిన
పరిణతాత్ముడే రోజాక
బారెడు"

పెరుగుతుంటాడని వ్రాస్తూ పొగడ్తలకు పొంగిపోకుండ పనిచేస్తూ పోవాలని ఉపదేశించినాడు నారాయణరెడ్డి. అందుకే ఈకవి జీవితంలో కవిత్వంలో క్రమపరిణతిని సాధించుకుంటూ ముందుకు పోతున్నాడు. ఆవేదన ఉన్న కవియే అనంతంగా వ్రాస్తాడనే సత్యాన్ని ఈకవి ఇలా చెపుతాడు.

"బాధపడిన హృదయమ్మే
పలికించును పరమాత్మను
పెల్లగిలిన కొండ్రలోనె
పల్లవించు పసిడిపంట"

ఇలా పరమరమణీయంగా పల్కిన తీరు గమనిస్తే ఎంతవేదన అనుభవించి నాడో 'కొంద్ర' పలుకు తెలుపుతుంది. ఈ పదం రైతుబిడ్డ నారాయణరెడ్డికి పరమసన్నిహితం.

ఉపన్యాస ధారలేని వాళ్ళ అవస్థను ఉదాహరణంతో చూపిస్తూ—

"ఎంతగద్రవ్వినను మెట్ట
ప్రాంతమ్మున నీరంతే"

అంటాడు నారాయణరెడ్డి. భావబలంలేని కవి పదాడంబరాన్ని చమత్కారంగా చెప్పినాడు--

"వాక్స్థానములోన బృహ
స్పతియుండిననేమి ఫలం
ఊహలోన శనైశ్చరుం
డుట్టంకితుడై యుండగ"

ఇంకా ఈ సంపుటి— 'పేరుకొరకు సభ్యత పొలిమేరలు' జవదాటగూడదనీ, బ్రతుకునే నటనంగా మార్చుకోవద్దనీ మనసు మంచిదైతే అందరూ ఆదరిస్తారనీ ఇలా సమస్త మానవజాతి శీలాన్ని తీర్చిదిద్దే ఎన్నెన్నో సూక్తులను కవితా గంధసంవలితంగా అందిస్తున్నది. నారాయణరెడ్డి నిర్మలహృదయాన్నీ కవిత్వ పారమ్యాన్నీ ఈ ముక్తకకావ్యదర్పణం ప్రతిబింబింపజేస్తున్నదనడం అతిశయోక్తికాదు.

'గండదీపజ్వాల' వంటి 'మల్లెపూవు పరిమళం'వంటి నారాయణరెడ్డి ప్రతిభనుండి— "వెలికుబికిన చమత్కార లలితముక్తకా లివ్వి". సహృదయ హృదయాలలో ఈ ముక్తకాలు ఒక స్పందనం ఒక మెరుపు ఒక చమత్కారం కలిగిస్తాయనడంలో సందేహం ఉండకూడదు.




## వ్యాసవాహిని

కవితారచనలో ఎంత రసార్ద్రితనూ కల్పనాపటిమనూ ప్రదర్శించగలడో సాహిత్యవిమర్శలో అంతటి వైశిత్యాన్నీ సహృదయతనూ ప్రకటించగల విద్వద్విమర్శకుడు నారాయణరెడ్డి. కవి హృదయాన్ని ఇట్టే గమనించి రమణీయఫణితిలో వెలువరించగల విమర్శనాకళావిశారదుడు. అన్ని ప్రక్రియలను అర్థం చేసుకుని ప్రతిభావంతంగా రచనావ్యాసంగాన్ని కొనసాగిస్తూ నారాయణరెడ్డి 1955 నుండి 1965 వరకు తాను 'అప్పుడప్పుడు వ్రాసిన వ్యాసాలూ, చేసిన ఆకాశవాణి ప్రసంగాలూ' ఏర్చి కూర్చి 'వ్యాసవాహిని'గా 1965 లో ప్రచురించినాడు. నన్నెచోడుని నుంచి నందూరి సుబ్బారావు దాకా

తెలుగు సాహిత్యజగత్తులో దివ్యకవితాదీపాలను వెలిగించిన కొందరు సాహితీమూర్తుల కవితాసృష్టిని వివిధదృక్కోణాలతో సరసంగా సమీక్షించి నాడీ కొన్ని వ్యాసాల్లో. మరికొన్ని వ్యాసాలలో పఠితృలోకానికి సాహిత్యాధ్యయనం పట్ల అభిరుచినీ ఆసక్తినీ ఇనుమడింపజేసే ఉద్దేశంతో కొన్ని సాహిత్యాంశాలను గూర్చి వివేచనాత్మకమైన పరిశీలనం చేసినాడు. నారాయణరెడ్డి గద్యం కుసుమమే పద్యం కుసుమమే. ఏది విచ్చుకున్నా కవితాపరిమళాలు గుబాళించవలసిందే. ఈ వ్యాసాలు చదువుతూ ఉంటే వచనకవితాసరిత్తులు పొంగులు వారినట్లు అనిపిస్తుంది. వాక్యరచనానిర్మాణంలో ఆయన చూపిన ఒడుపు చాలా అరుదైనదనీ తలపోయడంలో అత్యుక్తిలేదు.

ఈసంపుటిలోని మొదటివ్యాసం 'నన్నెచోడుని కవితాశక్తి', స్వతంత్ర కావ్యశంఖమెత్తిన నన్నెచోడుని వ్యక్తిత్వాన్నీ, 'కుమారసంభవము' లోని మౌలికతనూ, శివాధిక్యప్రతిపాదనోద్దేశంతో నన్నెచోడుడు మూలకథను, మార్చిన పట్టులనూ, ఆతనివర్ణనౌచిత్యాన్నీ నిబిడకల్పనాశక్తినీ, నిశితపరిశీలనాపటిమనూ, మనస్తత్వనిరూపణసామర్థ్యాన్నీ, రసపోషణదక్షతనూ, ఉక్తివైచిత్రినీ, జాతీయాలను, తెలుగుపలుకుబళ్ళనూ, సోదాహరణంగా వివరించినాడు. అర్వాచీనాంధ్రకవులనేకులు నన్నెచోడుని అనుకరించికూడా ఆతని పేరైనా ఎత్తనందుకు నారాయణరెడ్డి చింతించినాడు. నన్నెచోడుడు కాళిదాసుసూ నన్నయనూ అనుకరించిన సందర్భాలను ఉదాహరిస్తూనే ఆతనిలోని అనౌచిత్యాన్నీ అస్పష్టతను ఎత్తిచూపినాడు. ఈవిధంగా ఈవ్యాసం నన్నెచోడుని కవితాశక్తికి దర్పణంపట్టుతూ నారాయణరెడ్డి విమర్శనానైశిత్యాన్ని బహుముఖాలుగా ప్రకటిస్తున్నది.

రెండవవ్యాసం- 'ద్విపదలలో దివ్యకవిత'. ద్విపదవంటి సామాన్యచ్ఛందస్సులో మహాకావ్యాలు వ్రాయవచ్చునని సోమనాథగౌరనలు ఎలా నిరూపించినారో ఈ వ్యాసంలో ఎత్తిచూపడానికి ప్రయత్నించి కృతకృత్యుడైనాడు నారాయణరెడ్డి. ద్విపదకవుల భావనాశక్తినీ, కల్పనాగౌరవాన్నీ పరిశీలిస్తూ ద్విపదకావ్యాలు మార్గకవితారీతిలో నడిచిన మహాకావ్యాలకు ఏమాత్రం తీసిపోవని ఋజువుచేసినాడు. ఈ వ్యాసరచనావిన్యాసంలో నారాయణరెడ్డి చలనచిత్రానుభవగంధం గుప్పుమంటుంది.

తిక్కనచేతిలో పడ్డ భారతం కళాఖండంగా ఎలా రూపుదిద్దుకున్నదో వివిధదృక్కోణాలతో నిరూపించే వ్యాసం 'తిక్కనతీరుతెన్నులు'. తెలుగు పలుకులకు తిక్కనకూర్చిన చేవను ప్రశంసిస్తూ "ఇంగ్లీషులో షేక్స్పియర్‌కు వలె తెలుగునాట తిక్కనకు భాష్యంచెప్పే వేల మల్లినాథులు ఉదయించవలసి ఉన్నది" అంటూ నారాయణరెడ్డి సహృదయవిద్వల్లోకంపై గురుతరమైన బాధ్యతనుంచినాడు.

నాల్గవవ్యాసం 'రంగనాథ రామాయణం'. అవాల్మీకములైన కథా కల్పనల్లో, వర్ణనల్లో, ఔచితీనిర్వహణంలో, గతిభేదంలో, పదప్రయోగంలో బుద్ధారెడ్డి ప్రదర్శించిన మౌలిక ప్రతిభ ఈ వ్యాసాదర్శంలో బింబిస్తున్నది.

'తెలుగు కావ్యాలలో సాంఘిక జీవనం' అనేది ఐదవ వ్యాసం. పాల వేకరి కదిరీపతి 'శుకసప్తతి', అయ్యలరాజు నారాయణామాత్యుని 'హంస వింశతి' కావ్యాల్లోనూ, తెలుగుచాటుపద్యాల్లోనూ వివిధవర్గాల ప్రజల ఆచార వ్యవహారాలూ, వేషభాషలూ, వినోదాలూ వేడుకలూ ఆటలూ పాటలూ, వృత్తులూ సాంస్కృతికప్రవృత్తులూ ఎలా ప్రతిఫలించినవో రమణీయ ఫణితిలో వివరించినాడీ వ్యాసంలో నారాయణరెడ్డి.

కవిత్వం సార్వకాలికమనీ నిత్యనూతనమనీ, కాలానికి కవిత్వానికి వాగర్థాల సంబంధముంటుందనీ సోదాహరణంగా వివరిస్తూ భవిష్యత్తులో మాత్రాచ్ఛందస్సులో కండగల గుండెగల రచనలు రావచ్చనే విశ్వాసాన్ని ప్రకటిస్తూ ప్రజలందరికీ కవిత్వం అవసరమైన వస్తువుకావాలని ఆకాంక్షించి నాడీ వ్యాసకర్త "భవిష్యత్తులో కవిత" అనే వ్యాసంలో.

కాలం కరిగినకొద్దీ ఒకే శబ్దం వివిధశాస్త్రాల్లో భిన్నార్థాలను ఎలా కలిగించగలుగుతుందో, శబ్దం తొలినాటి అర్థాలను కోల్పోయి కొత్తకొత్త అర్థపరిమళాలను ఎలా పంచిపెట్టగలుగుతుందో, అన్యశబ్దసన్నిధానం వల్ల అభినయకాకుపులవల్ల శబ్దానికి అద్భుతశక్తి ఎలా కలుగుతుందో నిరూపించే చిన్న వ్యాసం 'శబ్దశక్తి-అర్థస్ఫూర్తి".

ఆటవెలదిలాంటి చిన్నపద్యంలో మిన్నులనందుకునే భావాలను పొదిగిన వేమన ఈనాటికినీ 'ఊపిరిలో ఊపిరి'గా ఎలా కలిసిపోయినాడో నిరూపించే వ్యాసం 'నిత్యజీవితంలో వేమన'.

విశ్వకవి రవీంద్రుని కవితావ్యక్తిత్వాలను ప్రపంచిస్తూ ఆతని కవిత్వంలో విశ్వమానవప్రేమ, యుద్ధవైముఖ్యం, శాంతి ప్రియత్వం, కారుణ్యం వంటి విశ్వజనీనగుణాలు ఎలా భాసిస్తున్నవో సోదాహరణంగా చూపించే వ్యాసం 'రవీంద్రుని కవిత్వంలో విశ్వజనీనత'.

'వ్యాసవాహిని'లో చివరిదీ పదవదీ అయిన వ్యాసం 'నాయుడుబావ.' నండూరి సుబ్బారావు సృష్టించిన పాత్రలు — ఎంకి నాయుడుబావ. మధుర శృంగార నాయకుడైన నాయుడుబావ అమాయికుడుగా - ముగ్ధప్రేమికుడుగా - సరసుడుగా చతురుడుగా - ఉదాత్తగుణసంపన్నుడుగా - పవిత్రదాంపత్య ధర్మవ్రతుడుగా ఎలా క్రమంగా పరిణతిని సాధించినాడో సలక్ష్యంగా చిత్రిస్తుందీవ్యాసం.

పాఠకుల్లో ఉత్తమాధ్యయనానికి సంబంధించిన అభిరుచులను ఈ వ్యాసాలు అలవడ జేయగలవనటంలో సందేహం ఉండవలసిన అవసరం లేదు. ఈ వ్యాసాలన్నిటిలో నారాయణరెడ్డి చిన్నచిన్న వాక్యాలనే ఉపయోగించి సరళ మధురమైన శైలినే అవలంబించినాడు. వాక్యాలలో పదాలను కూర్చిన తీరు మౌనంగా పాఠకుణ్ణి చదువనీయదు. తాను చదివి మరొకనికి వినిపిస్తే బాగుంటుందని ప్రతిపాఠకుడు అనుకుంటాడు ఈవ్యాసాలను చదువుతున్నప్పుడు.

## మావూరు మాట్లాడింది

తెలంగాణా (కరీంనగరం) మాండలికపదప్రయోగవిశేషాలను సరసంగా సరదాగా పరిశీలించే పన్నెండువ్యాసాలసంపుటి 'మావూరు మాట్లాడింది'. మార్చి 1980 లో ఇది ప్రచురింపబడింది. ఈ సంపుటిలో రెండు భాగాలు— 'తొలినుడుగు' 'మలినుడుగు' అని. జానపదులు మాట్లాడుకునే

మాటల్లోని, పైరగాలిలా వారు పాడుకునే పాటల్లోని మాటలను గూర్చిన చర్చ 'తొలినుడుగు'. ఇందలి ఆరువ్యాసాలు 'మావూరు మాట్లాడింది' శీర్షికతో 'ఈనాడు' పత్రికలో ప్రచురింపబడినవే. 'జానపదగేయసరళి' లో 1970 లో నారాయణరెడ్డియే వ్రాసిన ఆరుపాటల్లోని మాటలను గూర్చిన పరిశీలనం 'మలి నుడుగు'.

నారాయణరెడ్డి గతంలో 'ఋతుచక్రం' కావ్యంలోనూ, 'మార్పు నా తీర్పు' ఖండకావ్యంలోని ఒక ఖండికలోనూ తెలంగాణామాండలికాలను ప్రయోగించినాడు. అయితే అవి కొన్నిమాత్రమే. ఇంకా జానపదుల నాల్క లపై నర్తిస్తున్న పదాలు ఎన్నో ఉన్నాయి. ఆ పదాల్లో రకరకాల పరిమళాలు ఒదిగి ఉన్నాయి. ఆ జానపదపదసౌరభాలను సహృదయ నాగరకులకు అందించవలసిన బాధ్యత భాషా సాహిత్యవేత్తలపై ఎంతో ఉన్నది. ఈ సత్యాన్ని గ్రహించియే నారాయణరెడ్డి ఈ వ్యాసాలను వ్రాసినాడు. అయితే అనేకంగా ఉన్న మాండలికపదాలజాబితాను అదేపనిగా ఏకరువుపెడితే రసికు లకు విసుగుకలుగుతుందని ఆతడు కొన్ని పాత్రలను కల్పించినాడు. ఈ సంపుటిలోని 'పసులపోశమ్మ', పండు ముత్తైదువ, మైసడు (పోశమ్మ మన వడు) అలా రూపుదిద్దుకున్న వాళ్లే. కేవలం పాత్రలను సృష్టించి వాళ్లచేత పదాలను వట్టిగా పలికిస్తే సరసంగా ఉండదని సంభావించి భిన్న భిన్న సన్ని వేశాలను ఎన్నుకున్నాడు. అందుకు అనుగుణంగా సంభాషణలు పలికించి నాడు. మధ్యమధ్య తానూ ప్రవేశిస్తూ వాళ్లసంభాషణలో దొరలే మాండలికాల మణులను ఏరి వాటి విలువలనూ వెలుగులనూ పాఠకులకు చమత్కారంగా పరిచయం చేసినాడు. ఒకసారి వ్యాఖ్యాతగా మరొకసారి అధ్యాపకుడుగా అలంకారభాషావ్యాకరణ సూత్రాలను చిత్రంగా రేఖామాత్రంగా లాగుతూ మాండలికాలకూ వాటికీ ఉన్న అనుబంధాన్ని కవితాత్మకంగా వివరించినాడు. పాత్రలచే ఒక్కమాట పలికిస్తే నీరసంగా ఉంటుందని పాటలను కూడా పాడించినాడు. పాత్రగా తానూ వింటూనే ఆ పాటలతీగలకు పూచిన మాండ లికాలను మెత్తగా మెల్లగా దూసి వాటి వన్నెలనూ వాసనలనూ పాఠకులకు పంచిపెట్టినాడు. ఇలా పాత్రలనూ సన్నివేశాలనూ చిన్నచిన్నసంభాషణలనూ కల్పించి, తానూ పాత్రయై స్వగతాలను వ్యాఖ్యానాలను చేర్చి ఈ సంపుటి 'తొలినుడుగు'లో నాటకీయతను గుబాళింపజేసినాడు నారాయణరెడ్డి. నాట

కీయతామధురంగా చమత్కారంగా మాండలికాలలోని భాషావ్యాకరణశాస్త్రీయతను పరిశీలించిన ఇట్టి సంవిధానం నాదృష్టిలో అపూర్వం. భాషాసాహిత్య వ్యాసరచనలో ఆతడు సాధించిన నవ్యత ఇది. 'మావూరు మాట్లాడింది' శీర్షికలోనే నవ్యత తొంగిచూస్తున్నది. ఈ సంపుటి 'మలినుడుగు'లోని నారాయణరెడ్డి పాటలు| జానపదపదసంపదను కట్టుకున్న ముత్యాలమూటలు, తెలంగాణాయాసను కవితాత్మకంగా పుక్కిలించే పూలతోటలు. ఉదాహరణకు 'ఏమి మొగడో' శీర్షికలోని—

"వద్దంటె యినడేమి మొగడో ! తాగ
వద్దంటె యినడెంత అగడో..........॥వద్దంటె॥
గురిక్కుదిరెనా ఎంత
మురికి బొంతలనైన
మల్లెపువ్వులవతుగ
తెల్లంగ ఉతుకుతడు
పీటేసి కూసుంటె
పెద్ద బుంగెడు కల్లు
దమ్ముతిప్పక తాగి
తైతక్కలాడుతడు ........॥వద్దంటె॥
రాతిరేమో బండ
బూతులను యిప్పుతడు
పొద్దుపొడువంగనే
సుద్దులను జెప్పుతడు
కడుపులో ఒక బింకి
కల్లు ఉరికిందంటె
దేవునసువంటోడు
దయ్యమై తూలుతడు ........॥వద్దంటె"

వంటి వంక్తులూ—

'దొరకొడుకు' అనే గేయంలోని-

"ఎంతపనిజేసె దొరకొడుకు-అతనిపే
రెత్తితే కడుపంత ఉడుకు ....॥ఎంత॥

నేనడిసిపోతుంటె
తానడిసి వచ్చిండు
నేనేడ నిలుసుంటె
తానాడ నిలిసిండు
ఏమి తోసక నేను
'ఏందయ్యా' అంటేను
ఫోటో తీస్తానని
మాట తిప్పేసిండు"

వంటి చరణాలనూ చూడవచ్చు. ఈ పాటలను సభావేదికలపైనుంచి మధురంగా గానం చేస్తూ నారాయణరెడ్డి సహృదయులను ఊపివేసినాడు. ఈ పాటల్లోని మాటలను వ్యాఖ్యాతగా వివరించిన తీరు కూడా హృదయంగమం.

ఈ సంపుటిలో చర్చింపబడిన మాండలికాలలో—బాంచను, గులాపోల్లం, మస్కూల, షబ్బుల, గైరాల్ల, గైండ్ల, అద్దెమద్దెం, కైతాకాలోడు, కైకిలి, మగులు, మొగులు, నువ్వద్ది, బంగరిద్దోడు, యాష్ట, నానువాలు, బిత్తిరెది, అగడు, ఇగరాడు అగరాడు, కారచేపె, సవారికచ్ఛం, వతుగ, ఉగ్గబట్టు, గావు, సివారు, శాన, పయ్యెడ్లు, కొత్తలు వంటివి కొన్ని.

ఈ గ్రంథం మొదటిభాగంలో జీవంతో తొణికిసలాడే 'మాటల మూటల్ని' ఆత్మీయంగా తనకు అందించిన 'పసుల పోశమ్మ'కు ఈ సంపుటిని నారాయణరెడ్డి అంకితంచేయ్యటం ఔచితీమణిహారంలో తరళాయమానం. ఈ పసుల పోశమ్మ "కొంత యథార్థం కొంతకల్పన కలబోసి రూపొందించిన అపురూపమైన పాత్ర" అని నారాయణరెడ్డి అనడం వలన నాఆలోచన ఒక్కసారి 1974కు పరుగుతీస్తున్నది. ఆ సంవత్సరం ఆతని ఖండకావ్యం 'మార్పు నాతీర్పు' వెలువడింది. అందులో 'పసులపోశి' అని ఒక ఖండిక ఉన్నది. చిన్ననాడు ఈ కవికి పసులపోశి తన ఆత్మీయతనూ ఆప్యాయతనూ అంబలితో 'సింతకాయ తొక్కు'తో రంగరించి అందించినట్లు ఆ ఖండికలో వర్ణించినాడు. వాత్సల్యామృతాన్ని పోసిన ఆ పోశియే ఈ సంపుటిలో 'పోశమ్మ'గా మారిందని అనుకుంటున్నాను. అయితే ఆ పోశమ్మ ఇన్ని మాటలను అందించలేకపోవచ్చు. తానూ కొన్నింటిని చేర్చి

నాడు. అందువలననే నారాయణరెడ్డి ఆ పాత్రసృష్టిలో 'కొంత యథార్థం కొంత కల్పన' మిశ్రితమైనట్లు చెప్పినాడు.

ఈ పుస్తకంలో నారాయణరెడ్డి మాండలికపదప్రయుక్తములైన వాక్యాలు చూపిస్తూ, ఆపదాలకు మూలగ్రాంథిక రూపాలను ఎత్తిచూపినాడు. ఉర్దూ, హిందీ, ఫారసీ, సంస్కృతం భాషలకు చెందిన కొన్ని పదాలు మార్పులుచెంది మాండలికాలైనట్లు నిరూపించినాడు. కొన్ని మాండలికాలు నేటి ఇంగ్లీషుమాటలకు ఎలా సమానంగా సమాంతరంగా ఉన్నవో చూపినాడు. తెలంగాణా మాండలికాలకు కోస్తా రాయలసీమ ప్రాంతాల్లో ఉన్న సమానార్థక పదాలను పరిచయం చేసినాడు. కాలప్రవాహఘర్షణకు ఏ విధంగా మాటలు రూపాలను మార్చుకుంటూ కొత్తకొత్త రుచులను తమలో చేర్చుకుంటాయో, మాండలికంలోనూ గ్రాంథికంలోనూ ఉన్న ఒకేపదం ఎలాభిన్నార్థాలను ఇవ్వ గలుగుతున్నదో సోదాహరణంగా చూపినాడు. పరమగ్రాంథికరూపాలు కొన్ని నేటికీ నిత్యవ్యవహారంలో ఎలా నిగ్గులొలుకుతున్నవో, పద విపరిణామం వర్ణవ్యత్యయం వంటివి మాండలికాల్లో ఎలా చోటు చేసుకున్నవో, జానపదులు ప్రయోగించే అరిసమాసాల్లోని పదమూర్తులు ఎంత సరసంగా ఎదలుకలుపు కుంటూ కాపురం చేస్తున్నాయో నిరూపించినాడు. జానపద గీతాల్లో అలంకా రాలు అందగించే తీరుతెన్నులను, వాటిలో భావుకత పరుచుకపోయిన సర జిని, అవి కవితా పరిమళాలను పుక్కిలిస్తున్న వైనాన్ని వివరిస్తూనే అవి ప్రస్తుత సామాజిక జీవనానికీ, పల్లీయ సాంఘికవ్యవస్థకూ ఎలా అద్దం పట్టు తున్నవో, జమీందారీ వ్యవస్థకూ శిథిలశేషాలుగా చారిత్రక సత్యాలకు ప్రతీక లుగా ఎలా నిలుస్తున్నవో వివరించినాడు నారాయణరెడ్డి.

సహజంగా కవి అయినందువలన నారాయణరెడ్డి గద్యంలోకూడా ఒక ఊపూ తూగూ ఉంటుంది - వచనకవితలో లాగానే. అది ఆతని కవితాత్మకు అల్లుకున్న శరీరం. ఒక మాటవేసి దానికి సమాంతరంగా అందలి అర్థాన్ని ఉద్దీప్తం చేస్తూ అంత్యప్రాసను ఘోషిస్తూ ఊపుగా మరో మాట వేయడం ఆతనికి ఆజానజం. ఉదాహరణకు ఒకటి-రెండు-

"తీయని ఓదార్పు. ఆ ప్తత అంచుల్లో విరగబూస్తున్న ఊర్పు" "ఈ సారి మరికొంత జోరుగా; చేనూ చెలకా ప్రతిధ్వనించేంత హోరుగా"

పల్లీయులు పలికే పలుకుల్లోని అర్థశక్తిని వ్యక్తీకరిస్తూ నారాయణరెడ్డి భావాలను "సమర్థవంతంగా అందించే మాండలికపదాలను నిఘంటువుల కెక్కించవలసిన అవసరం" "పత్రికావ్యవహారంలో వాటిని ప్రయోగించ వలసిన అగత్యం" ఎంతో ఉందని నొక్కివక్కాణించినాడీ సంపుటిలో.

జానపదుల మాటల చర్చకు సంబంధించిన నారాయణరెడ్డి మాటలతో ఈ సంపుటిసమీక్షను ముగిస్తాను.

"అయితే ఈ చర్చ భాషావ్యాకరణసూత్రాల పరిధిలో గిరిగీసుకుని వున్నది కాదు. కొంత శాస్త్రీయంగా కొంత చమత్కారంగా కొంత ఛలోక్తికంగా జరిపిన పదపరిశీలన ఇది."1

# సమీక్షణం

భిన్నభిన్న సందర్భాలలో తాను చేసే సాహిత్యోపన్యాసాలనూ వ్రాసే పరిశోధనాత్మకవ్యాసాలనూ, అవి ఆయాపత్రికల్లో సంచికల్లో ముద్రితాలైనప్పటికీ. తరువాత వాటన్నిటినీ ఒకచోట చేర్చి ఒక గ్రంథంగా పాఠకుల కందివ్వటం అనేది నారాయణరెడ్డికి ఉన్న పరిపాటి. అందుకు అతని అనేక ప్రచురణలను ఉదాహరణాలుగా చూపవచ్చు. హైదరాబాదు 'వంశీఆర్టు థియేటర్స్' సంస్థవారు నారాయణరెడ్డి 50వ జన్మదినోత్సవాలను నిర్వహించి ఆ సందర్భంలో ఆయన అప్పుడప్పుడు ఉపన్యసించిన వ్రాసిన వ్యాసాలను 'సమీక్షణం' అనే పేరుతో పుస్తకంగా రూపొందించి అతనికి 19.7.'81 నాడు జన్మదినోపాయనంగా సమర్పించుకున్నారు.

---

1. 'మావూరు మాట్లాడింది'లోని 'ఈ సంపుటిని గూర్చి'లో ప్రచురణ మార్చి 1980.

నారాయణరెడ్డి సహృదయవిద్వద్విమర్శకుడనడానికి మరో నిదర్శనం ఈ 'సమీక్షణం.' ఈసంపుటిలోని పదివ్యాసాల్లో మొదటిది 'పోతన; పునః పరిశీలన'. 1973లో 'యువభారతి' సంస్థ నిర్వహించిన 'వికాసలహరి' ఉపన్యాసమంజరీ కార్యక్రమంలో పోతన కవితావ్యక్తిత్వాలనుగూర్చి నారాయణరెడ్డి చేసిన మహోపన్యాసం ఇది.[1]

ఈ వ్యాసంలో వ్యాసపోతనల భాగవతరచనాహేతువులను విస్తరిస్తూ పోతన్న అభేదభక్తినీ సమన్వయదృక్పథాన్నీ చక్కగా విశ్లేషించి చూపినాడు నారాయణరెడ్డి. విరాటపర్వావతారికకు తోబుట్టువుగా భాగవతావతారికను పోతన ఎలా తీర్చిదిద్దినాడో సహృదయరమ్యంగా నిరూపించినాడు. పరిపక్వమైన పోతన చిత్తవృత్తి. ఆతని సత్వస్ఫూర్తీ శ్రీనాథపోతన వ్యక్తిత్వాలకు గల తారతమ్యమూ వాటి సమీక్షణం, భాగవత ప్రారంభ పద్యానికి చేసిన వ్యాఖ్యానం పరమరమణీయం. 'ఇమ్మనుజేశ్వరాధముల' అనే పద్యాన్ని పోతన్నశిష్యుడు సింగయ్యే వ్రాసి ఉంటాడనడానికి ఈ వ్యాసంలో చూపిన ఉపపత్తి ఎంతో బాగుంది. పోతనకవితాలక్షణాల, మధురభక్తిప్రాతిపదికల వివేచన చక్కగాసాగింది. పోతన్న ప్రజాకవి అని నిరూపించడంలో నారాయణరెడ్డి ప్రదర్శించిన విమర్శనాకౌశలం ప్రశంసనీయం.

'సమీక్షణం' లోని రెండవవ్యాసం 'జాషువా కవితావ్యక్తిత్వం'. 1975లో 'యువభారతి' సంస్థవారి "కవితాలహరి" ఉపన్యాసకార్యక్రమంలో 14.12.75 నాడు 'గుఱ్ఱం జాషువా' గూర్చి నారాయణరెడ్డి మధురగంభీరంగా ఉపన్యసించినాడు. ఆ ఉపన్యాసమే ఈ వ్యాసం.[2]

జాషువా వ్యక్తిత్వానికీ ఆతని కవిత్వానికీ గల పరస్పర సంబంధాన్నీ, జాషువా 'కవికోకిల' బిరుదు సార్థక్యాన్నీ, ఆతని కవిత్వంపై గల శ్రీనాథుని ప్రభావాన్నీ వివరించిచూపినాడీ వ్యాసంలో నారాయణరెడ్డి. జాషువా భావకవితా నిరసనాన్నీ, ఆతని అభ్యుదయకవితాభావననూ, సంఘసంస్కరణకవిత్వ

---

1. ఈ ఉపన్యాసం 'వికాసలహరి' గ్రంథం (1973) లో భక్తికవితాచతురానన 'బమ్మెరపోతన'గా ప్రచురితం.
2. 15, జనవరి 1976 నాడు ఆవిష్కృతమైన 'కవితాలహరి' సంపుటిలో ఈ వ్యాసం ప్రచురితం.

మర్యాదలనూ, ఆతని ఖండకృతుల విశేషాలనూ, శైలీ లక్షణాలనూ సోదాహరణంగా చూపినాడు. అంతేకాదు. జాషువా సాహిత్యాన్ని సమగ్రంగా సందర్శించిన నారాయణరెడ్డి ఆతని కవితలో ప్రముఖంగా ప్రజ్వరిల్లే రసం 'కరుణవీరం' అని నామకరణంచేసి ఒక వినూత్న వీరరసభేదాన్ని ప్రతిపాదించినాడు ఈ వ్యాసంలో. "జాషువా కవిత్వం చిందించే కరుణరసం ఉత్త కన్నీళ్ళది కాదు. ఉప్పెనలను దాచుకున్నది. జాలితో జావగారేది కాదు. జ్వాలలను ఎదలో ముడుచుకున్నది. ప్రార్థనాత్మకమైనది కాదు. ప్రతిఘటన పూర్వకమైనది"[1] అంటూ కరుణవీరలక్షణాలను వివరిస్తూ అందుకు జాషువా కృతులనుంచి లక్ష్యాలను ఎత్తి చూపినాడు. కరుణవీరప్రతిపాదనంలోనూ తన్నిరూపణంలోనూ నారాయణరెడ్డికి గల పరిశోధనాపాటవమూ విమర్శనా నైశిత్యమూ విదితమవుతున్నాయి.

'యెంకిపాటల్లోని 'కావ్యత్వం' ఈ సంపుటిలోని మూడవవ్యాసం. 1977లో 'యువభారతి' సంస్థవారు ఏర్పాటుచేసిన 'నవోదయలహరి' ఉపన్యాసమంజరీకార్యక్రమంలో 6.11.1977 నాటి సాయంకాలం ఆంధ్రసారస్వతపరిషత్తుప్రాంగణంలో 'నండూరి వెంకటసుబ్బారావు' గారిని గూర్చి నారాయణరెడ్డి చేసిన రసవదుపన్యాసమే ఈ వ్యాసంగా అవతరించింది.[2]

యెంకి పాటలను సృష్టించిన నండూరి వారి 'గీత్యాద్యవస్థ'నూ ఆతని సంగీతసాహితీవిశేషాలనూ ఆతణ్ణి ప్రభావితం చేసిన సాహిత్యాంశాలనూ యెంకిపాటల్లోని ప్రణయప్రస్థానాన్నీ ఆ పాటల్లోని భావచిత్రాలనూ మాండలిక పదప్రయోగాలనూ, శ్రీ మంచాల జగన్నాథరావుగారి సాహచర్యంలో నండూరి వారు సృష్టించిన కొత్తపాటల్లోని తీరుతెన్నులనూ యెంకి పాటలను గూర్చి ప్రముఖవిద్వాంసులు వర్షించిన ప్రశంసాపరంపరనూ సలక్ష్యంగా వివరిస్తుంది ఈ వ్యాసం. ఆంగ్ల కాల్పనికకవి 'రాబర్ట్ బర్న్స్' స్కాట్లండు

1. 'సమీక్షణం'— పుట 25.

2. ఈ వ్యాసం 'యువభారతి'వారి 'నవోదయలహరి' సంపుటి (1977) లో 'నండూరి వెంకటసుబ్బారావు' అనే శీర్షికగా ప్రచురితం.

భాషలో రచించిన గేయాల ప్రభావం నండూరి వారి కొన్ని పాటలపై ప్రసరించిన వైనాన్ని ఎత్తిచూపే సందర్భంలోనూ, యెంకిపాటల్లోని శృంగారం పూర్వరాగ - దాంపత్య - విప్రయోగ - పూర్ణయోగాలను క్రమంగా ఎలా సాధించిందో విశ్లేషించి చూపే ఘట్టంలోనూ నారాయణరెడ్డి ప్రదర్శించిన మౌలికత సహృదయవిమర్శనా ప్రతిభాశిఖరాలనధిరోహించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన డా॥ దాశరథి గారితో కలిసి నారాయణరెడ్డి మలేషియాదేశంలో సాంస్కృతిక పర్యటన చేసినాడు. ఆ పర్యటన సందర్భంగా మలేభాషావిశేషాలెన్నింటినో ఆతడు వివేచించినాడు. ఆతని ఈ వివేచనమే 'మలేభాషా పదజాలం—కొన్ని విశేషాలు' అనే వ్యాసంగా రూపుదిద్దుకున్నది.[1]

నారాయణరెడ్డి భాషాశాస్త్ర పరిజ్ఞానాన్ని ప్రస్ఫుటం చేస్తుంది ఈవ్యాసం. మలేభాషా కుటుంబాన్ని గూర్చి, మలేభాషాప్రాంతాన్ని గూర్చి, ఆ భాషాలిపి రూపాలను గూర్చి సంక్షిప్తంగా సూచిస్తూ సంస్కృతం అరబ్బీ పారసీ మున్నగు భాషాపదాలు పరివర్తనంచెంది మలేభాషలో ఎలా సంలీనమైపోయినవో, విశేషార్థద్యోతకాలుగా కొన్ని సంస్కృతపదాలు ఎలా ప్రయోగింపబడుతున్నవో సోదాహరణంగా చూపినాడు. మలేభాషా సమాస-వాక్య నిర్మాణ విశేషాలనూ సంస్కృతాంధ్రభాషా గంధసంవాసితాలైన కొన్ని వింత ప్రయోగాలనూ వివరించిచూపినాడు నారాయణరెడ్డి ఈ వ్యాసంలో. భాషాజిజ్ఞాసువులకు ఈ వ్యాసం ఎంతో తోడ్పడుతుంది.

ఆశ్చర్యార్థకాలుగా వ్యవహారంలో ఉన్న పదాల్లో ఆప్తసంబంధ వాచకాలే సర్వసాధారణంగా ఉన్నాయని నిరూపించే వ్యాసం 'ఆశ్చర్యార్థకాల్లో ఆప్తస్మరణం'.[2]

అమ్మో, అవ్వ, మాయురే, అబ్బో, అప్పా, అయ్యారే, బాపురే, అన్నన్న, అమ్మకచెల్ల వంటి ఆప్తసంబంధ వాచకాలను మాతృవర్గం పితృ

---

1. ఈ వ్యాసం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ప్రచురించిన పరిశోధన పత్రిక 'వివేచన' ప్రథమసంచిక (డిసెంబరు 1976)లో ప్రచురితం.

2. ఈ వ్యాసం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ప్రచురించిన 'వివేచన' (డిసెంబరు 1977)లో ప్రచురితం.

వర్గం సోదరసోదరీవర్గం అనే మూడువర్గాలుగా విభజించి, వాటి మూలస్వరూపాలను విశ్లేషిస్తూ అందుకు ప్రాచీనకావ్యాలనుండి ప్రమాణాలనెత్తి చూపినాడు. నారాయణరెడ్డి మౌలిక పరిశోధనకు ఈ వ్యాసం మరో నిదర్శనం.

పూర్వం తాళపత్ర గ్రంథాలనుఎత్తి వ్రాసే సందర్భంలో లేఖకులవలన కొన్ని దోషాలు దొరలితే, ఈనాడు ముద్రాపకుల వల్ల కొన్ని అచ్చుతప్పులు జరుగుతున్నాయి. ఇది సాధారణమే. ఆనాటి లేఖకప్రమాదాలు ఈనాటి పరిశోధకులకు పని కల్పిస్తే ఈనాటి అచ్చుతప్పులు కొన్ని చమత్కారార్థాలను ఇస్తుంటాయి. ఆ తప్పులు ఒక్కొక్కసారి మనం ఊహించలేని విశేషమైన అద్భుతమైన భావస్ఫూర్తిని అందిస్తూ వాటిని దిద్దకుంటేనే బాగుంటుందని అనే అభిప్రాయాన్ని కూడా సహృదయులకు కలిగిస్తాయి. నారాయణరెడ్డి ప్రూఫులు చూస్తున్నప్పుడు తన చూపులకు చిక్కిన కొన్ని అచ్చుతప్పుల్లో తన మతికి ఝుటితిగా భాసించిన విశేషార్థాలను తర్కరమణీయంగా వివరించి చూపినాడు. 'అచ్చుతప్పుల్లో మెచ్చుతునకలు' అన్న వ్యాసంలో.[1] 'అచ్చుతప్పులను మెచ్చు తప్పులు'గా నిరూపించడంలో వ్యాసకర్త ప్రదర్శించిన హేతువాదం, ఔచిత్యం, పాండిత్యం మెచ్చుకోదగినది. తనకు రమణీయమని తోచిన ఏ అంశాన్నైనా గాలికి వదలకుండ కమనీయరచనగా రూపొందిస్తాడు నారాయణరెడ్డి అనడానికి ఈ వ్యాసం కూడా ఒక నిదర్శనం.

ఈ సంపుటిలోని ఏడవ వ్యాసం 'మాత్రాచ్ఛందస్సులు'. ఛందశ్శబ్దానికున్న అర్థాన్నీ, వైదికచ్ఛందస్సులనూ, సంస్కృత ప్రాకృత కావ్యాల్లోని మాత్రాచ్ఛందస్సులనూ నామమాత్రంగా పేర్కొని, తాళబద్ధంగా చతురశ్రగతిలో నడిచే మానిని కవిరాజవిరాజితం మున్నగునవి, ఖండగతిలో నడిచే లయగ్రాహి లయవిభాతి వంటి అక్షరవృత్తాలూ మొదట మాత్రాచ్ఛందస్సులేనేమో అనే సందేహాన్ని వ్యక్తంచేసినాడు నారాయణరెడ్డి. "ప్రతిశ్లోకాన్నీ పద్యాన్నీ అక్షరగణాలుగా విడగొట్టే అలవాటు పడిన లాక్షణికులు మాత్రావృత్తాలపై కూడా అదే ముద్రవేశారు"[2] అని అన్నాడు. జాతులు ఉపజాతుల్లోని మాత్రాచ్ఛందస్సులను పరిశీలించినాడు.

---

1. ఈ వ్యాసం 'ఈనాడు' దినపత్రికలో ప్రచురితం,
2. 'సమీక్షణం' - పుట 75.

అప్పకవి పేర్కొన్న నవవిధరగడల్లోనే మాత్రాచ్ఛందస్సులన్నీ ఒదిగి పోతాయని చెపుతూ ఆ రగడలను ఆధునికగేయాలతో సమన్వయించి చూపినాడు. ఆధునికకవులు కొందరు మాత్రాచ్ఛందంలో కావ్యాలు వ్రాయడం ప్రశంసనీయమనీ, అయితే యతి ప్రాస అంత్యప్రాస వంటి ఏనియమమూ లేకుండా కొందరు యథేచ్ఛగా వ్రాయడం మాత్రం వాంఛనీయంకాదనీ, గేయానికి రససిద్ధి కలిగించే గుణం లేదనడం సమంజసంకాదనీ, జీవమున్న కవిత్వానికి ఛందస్సు ఒక ఆటంకం కాదని నిర్ధారిస్తూ ఈ వ్యాసాన్ని ముగించినాడు. మాత్రాచ్ఛందస్సులను తెలుసుకోవాలనే సాహిత్య విద్యార్థికి చక్కని అవగాహన కలిగిస్తుంది ఈ వ్యాసం.

ఎనిమిదవవ్యాసం 'సారసౌరభం'.[1] 'గతములోపలి' మంచియే సంప్రదాయమని నిర్వచిస్తూ, సంప్రదాయాల పునాదులమీదనే సరికొత్త ప్రయోగాలు నిర్మించవలసివున్నదనీ, సాహితీస్రష్టలపై సంప్రదాయబలముండవలసి మన్నది సార్వకాలిక సార్వదేశికసత్యమనీ ఈవ్యాసం నిరూపిస్తున్నది. వ్యక్తి తన భావాలను అక్షరరూపంలో ప్రకటించాలన్నా, తన ఆలోచనాపరిధులను విశాలం చేసుకోవాలన్నా, సత్యాన్నిసుందరంగా వ్యక్తీకరించాలన్నా ప్రాచీన సాహిత్యాధ్యయనం అనివార్యమనీ, ఆధునికయుగచైతన్యాన్ని ప్రతిబింబించటంలో పురాణాల్లోని పదబంధాలూ వ్యక్తులూ ఘట్టాలూ ఈనాడు ఎలా కవితాప్రతీకలుగా ప్రయుక్తములవుతున్నవో ఉదాహరణాలెత్తి చూపినాడు.

తొమ్మిదవ వ్యాసం 'ఆముఖం'[2]. మానవసమాజాన్ని మేల్కొల్పవలసి మన్నది పదునుగలకవితకు అదనెరిగిన కవితకు ప్రధానలక్షణమనీ, జనహృదయాల్లో చైతన్యాన్ని నింపడం కవితాసార్వకాలిక స్వభావమనీ చెపుతూ నారాయణరెడ్డి ఈ వ్యాసంలో చైతన్యశబ్దానికి ప్రాచీన - ఆధునిక కాలాలు చెప్పిన చెపుతున్న అర్థవిశేషాలను వివరించినాడు. తిక్కన, పాలకురికి

1. 1971లో 'యువభారతి' సంస్థ ప్రచురించిన 'కావ్యలహరి' ఉపన్యాస వ్యాససంపుటికి నారాయణరెడ్డివ్రాసిన పీఠిక ఇది. చిన్నమార్పులతో ఈ సంపుటిలో గ్రహింపబడింది.

2. యువభారతిసంస్థ 197లో ప్రచురించిన 'చైతన్యలహరి' పీఠిక ఈ 'ఆముఖం'. కొద్దిమార్పులతో ఈసంపుటిలో గ్రహింపబడింది.

సోమనాథుడు, కృష్ణదేవరాయలు, వేమన, గురజాడ, ఈ అయిదుగురు మహాకవుల్లోని చైతన్యమేమిటో, ఆ చైతన్యంతో తమతమ కాలంలో సమాజాన్ని వారు ఎలా ప్రభావితం చేసినారో చక్కగా చూపినాడు. భిన్నభిన్న కాలాలకు చెందినవారైనా ఈ అయిదుగురిలోనూ కనిపించే ఏకైకగుణం దేశీయత అని నిరూపించినాడు. తెలుగు పలుకుబడినీ తెలుగుతనాన్నీ తమ రచనలద్వారా ఉద్దీపింపజేసే విశిష్టలక్షణమే ఈ అయిదుగురినీ ఏకసూత్రంలో ముడివేసిందన్నాడు. నారాయణరెడ్డి విమర్శన ప్రతిభ బహుముఖమని నిరూపించే వ్యాసం ఆముఖం.

ఆనాడేనాడో ద్వాపరయుగంలో మహాభారతకాలంలో చెప్పబడిన విషయాలు ఈనాడు కూడా జరుగుతున్నాయని నిరూపించే వ్యాసం 'ఆనాడు అన్నది - ఈనాడు ఉన్నది'. మయసభాప్రవేశోత్సవ సందర్భంలో నారదుడు రాజ్యపాలనావిశేషాలనుగూర్చి రాజనీతిని గూర్చి కుశలప్రశ్నగా ధర్మరాజును అడిగినప్పటి విశేషాలూ, తన దీర్ఘోపన్యాసంలో ఆతడు పలికిన మాటలూ నేటికీ సత్యాలే అనీ, అవి ఈనాటి సమాజంలో రూపాంతరాలుగా అగుపిస్తున్నాయని నారాయణరెడ్డి ఈ వ్యాసంలో తార్కాణాలను చూపినాడు.

నారాయణరెడ్డి ఆదర్శాధ్యాపకుడు. ఆనాటి కార్యవిశేషాలు ఈనాడే రూపంలో కనిపిస్తున్నాయో వివరించిచెప్పడంలో ఆతని సరళసుందరబోధనా వివరణాలు ప్రత్యక్షమవుతాయి ఈ చిన్న వ్యాసంలో ఈ చివరి వ్యాసంలో.

ఈ సంపుటిలోని వ్యాసాలేగాక— 'శ్రీమతి సరోజినీనాయుడు కవితా ప్రతిభ' 'కవిత్వం-చైతన్యం' వంటి వ్యాసాలు నారాయణరెడ్డివి మరికొన్ని ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నిర్వహించిన శ్రీమతి ముత్యాల సరోజినీనాయుడు శతజయంత్యుత్సవసభలో నారాయణరెడ్డి శ్రీమతి సరోజినీనాయుడు కవితాప్రతిభనుగూర్చి ఉపన్యసించినాడు. ఆ ఉపన్యాసం వ్యాసంగా ప్రచురితమైంది.[1]

సరోజినీనాయుడు కవితావ్యక్తిత్వం ఈ వ్యాసంలో చక్కని శైలిలో వివరింపబడింది. సరోజినీనాయుడు ప్రణయకవిత్వంలోని సర్వసమర్పణ

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి 'సాహిత్యోపన్యాసములు 19'లో ఇది ప్రచురితం. ప్రచురణ 1981.

భావననూ, ఆమె ప్రకృతికవితల్లోని మానవీయస్పర్శనూ తాత్త్వికచ్ఛాయలనూ సౌందర్యదార్శనికతతో పెనవేసుకున్న వాస్తవికదృక్పథాన్నీ, హైదరాబాదు నగర పరిసరప్రభావంతో వెలువడిన కవితల్లోని దేశీయతనూ, జాతీయోద్యమ ప్రవాహంలో తరంగంగా ఆమె కలం పొంగించిన జాతీయ సమైక్యాన్నీ భిన్నమతసఖ్యాన్నీ దేశమాతృప్రబోధాన్నీ దేశనాయక ప్రశంసనూ, ఆమె కవిత్వంలోని దర్శనవర్ణనశక్తులనూ ఉదాహరణరమ్యంగా అనుశీలించినాడు ఈ వ్యాసంలో నారాయణరెడ్డి.

చైతన్యశబ్దవిచారం చేస్తూనే వ్యక్తిపరమైన సంవేదనకూ చైతన్యానికీ, సంఘపరమైన చైతన్యానికీ గల భేదాన్ని చక్కగా వింగడించి చూపే వ్యాసం 'కవిత్వం - చైతన్యం'[1] ప్రతిఘటన చైతన్యానికీ ప్రశ్నించే చైతన్యానికీ ఉదాహరణలు చూపుతూ చైతన్యం ఈనాడు సంఘపరంగా ఎలా మూర్తికట్టుకున్నదో ఈ వ్యాసంలో వివరించినాడు నారాయణరెడ్డి.

గభీరములైనభావాలను అందమైన పదాల్లో పొదిగిచెప్పడం నారాయణ రెడి సాహిత్యలక్షణం. పద్యంవ్రాసినా గద్యంవ్రాసినా వచనగేయంపలికినా కర్ణపేయమైన పదవిన్యాసాలూ మెదళ్ళనూ మనస్సులనూ ప్రభావితం చేసే లోతైన తలపులూ ఈ వ్యాసాల్లో అంతటా పరుచుకునిఉన్నాయి. అందుకే ఇవి పరిశోధకులకూ భాషాభిమానులకూ ఆమెతలిస్తుంటాయి.

---

1. 'చైతన్యభారతి (విజయవాడ) సంస్థవారి ద్వితీయవార్షిక సభలో నారాయణ రెడ్డి చేసిన ప్రసంగంఇది. వారి తృతీయవార్షికోత్సవ సంచిక (1974) లో వ్యాసరూపం దాల్చింది.



# పరిశోధన సాహితి



## ఆధునికాంధ్రకవిత్వము

సంప్రదాయములు :

ప్రయోగములు :

నారాయణరెడ్డి ప్రతిభా భాస్వంతుడు. ఆతని శిరస్సు ప్రభాకరబింబం. ఆతని మనస్సు సుధాకరబింబం. ఆతని ప్రజ్ఞాచక్షువులు కల్పనాజగత్తులోని హిమాలయోత్తుంగసౌందర్య శిఖరాలను ఎలా దర్శిస్తాయో, విమర్శనా విశ్వంలోని సాగరగర్భంలో అట్టడుగునున్న ఆణిముత్యాలను అలా స్పృశిస్తాయి. ఆతని లేఖినీవిన్యాసంతో సాహితీక్షేత్రంలో రసధ్వన్యలంకారాదులు ఎలా రమణీయాక్షరాకృతులను దాల్చి ఎదుట వెలుస్తాయో పరిశోధనా ప్రపంచంలో కూడా సత్యసమన్వయ నిష్పాక్షికతా నిర్మాణాత్మకతాదులు అలా

కమనీయ రూపాలతో కళ్ళముందు నిలుస్తాయి. ఆతని నిశితపరిశోధనా ఫలితంగా ఆతని అసామాన్యశేముషీసంకేతంగా వెలిసిన గ్రంథం 'ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు : ప్రయోగములు'. 1962లో నారాయణరెడ్డి పి. హెచ్.డి.పట్టంకోసం ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి పర్యవేక్షణంలో ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంతవ్యాసమిది. ఇది జనవరి 1967లో మొదటిసారిగా ముద్రితమైనది. ఈ పరిశోధన గ్రంథాన్ని నారాయణరెడ్డి తన తల్లిదండ్రులకు అంకితం చేసి ధన్యతనొందినాడు.

ఆదికవి నన్నయ యుగంనుంచి ఆధునికయుగం (1960) వరకూ వెలసిన కవిత్వస్వరూపాన్ని దానిలోని సంప్రదాయాలనూ ప్రయోగాలనూ ఎత్తి చూపే కరదీపిక ఈ గ్రంథం. ఆధునికాంధ్ర కవిత్వానికి పట్టిన అనర్ఘమణి దర్పణమిది. పరిశోధనకు కావలసిన గ్రంథాలను సేకరించడంలోనూ అధ్యయనం చేయడంలోనూ సునిశితమూ తర్కబద్ధమూ అయిన అభిప్రాయాన్ని ప్రకటించడంలోనూ నారాయణరెడ్డి ఈ గ్రంథంలో చూపిన శ్రద్ధాశక్తులు ఆయనను ఒక సమున్నతశ్రేణికి చెందిన పరిశోధకునిగా నిరూపిస్తాయి. ఆయన దృష్టిలో కవిత్వమైనా విమర్శ అయినా నూత్నాంశాన్ని తెలుపగలిగిందే ప్రతిభ కొత్తమాట కొత్తభావం చెప్పాలనే కుతూహలమే ఆయనతో కావ్యాలను వ్రాయించినట్లే ఈ పరిశోధన చేయించింది. కనుకనే ఇది ఒక వచన కావ్యంగా భాసిస్తుంది! ఉత్తమ పరిశోధనగ్రంథంగా నిలుస్తుంది.

ఈ గ్రంథంలో ఉన్నవి ఎనిమిదిప్రకరణాలు. దేనికదే సాటి. ప్రథమ ప్రకరణం సంప్రదాయ ప్రయోగాల స్వరూపస్వభావాలనూ వాటిసమన్వయాన్నీ వివరించగా ద్వితీయ ప్రకరణం కవితాస్వరూపహేతుప్రయోజనాలను విపులంగా ప్రకటిస్తుంది. కవిత్వాన్ని గూర్చి సంస్కృతలాక్షణికులుగ్గడించిన సిద్ధాంతాలనూ, పాశ్చాత్య విమర్శకులుప్రకటించిన సిద్ధాంతాలనూ ఉట్టంకిస్తూ వాటి సామంజస్యాన్నీ వాటిలోనిప్రధానాంశాలనూ పరిశీలించిన సందర్భంలో నారాయణరెడ్డి ప్రతిపాదించిన హేతువాదం ప్రశంసనీయం.

ఇక తృతీయ ప్రకరణం ప్రాచీనాంధ్ర కవిత్వంలోని నవీనరీతులను గూర్చిన వివరణం. దీనిలో రెండు ఖండాలు. ప్రథమఖండం నన్నయ్యనుంచి వేమన వరకున్న కవుల నవ్యప్రయోగాలను వివరించగా ద్వితీయ

ఖండం 19వ శతాబ్దంలోని సాహిత్య స్థితిగతులను అందులోని కొత్తరీతులను ఎత్తిచూపుతుంది.

చతుర్థప్రకరణం నవ్యకవితోదయానికి సంబంధించింది. నవ్యకవితా హేతువులూ దాని లక్షణాలూ ఇందులో సమగ్రంగా చర్చించబడినవి. వస్తు భావరచనలలో కొత్తబాటలు వేసిన గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు ఇద్దరినీ నవ్యకవితా యుగకర్తలుగా నిర్ణయించే సందర్భంలో నారాయణరెడ్డిఅసాధారణధిషణ నిష్పాక్షికదృష్టి నిశితపరిశీలనం ఆతనిని ఉత్తమపరిశోధకాగ్రశ్రేణిలో నిలుపుతున్నవి. ఆంగ్ల కవిత్వంలోని కాల్పనికోద్యమ స్వరూపాన్ని దాని విశిష్టలక్షణాలను కూడా ఈ ప్రకరణంలో విశదీకరించినాడు నారాయణరెడ్డి.

గురజాడ అప్పారావు రాయప్రోలు సుబ్బారావుల కవిత్వ వ్యక్తిత్వ క్రమవికాస పరిణామాలనూ వారి సాంప్రదాయికతనూ వస్తుభావరచనల్లో వారు సాధించిన నవ్యతనూ స్థాపించిన సిద్ధాంతాలనూ వారిపై ఇతరుల, ఇతరులపై వారి ప్రభావాలనూ సమగ్రసుందరంగా వ్యక్తచేస్తుంది పంచమప్రకరణం.

భావకవిత్వానికి సంబంధించిన విషయసర్వస్వాన్ని అందించేది-షష్ఠ ప్రకరణం. ఇందులో భావకవిత్వ నిర్వచనం, దాని స్వరూపం, భావకవిత్వానికీ ఆంగ్లకాల్పనిక కవిత్వానికీ గల సామ్యభేదాలూ భావకవిత్వ ప్రధాన శాఖలూ వాటిలోని వస్తుభావరచనల నవ్యతలూ విపులంగా వివేచింపబడినవి.

సప్తమప్రకరణం అభ్యుదయకవిత్వ స్వరూపస్వభావాలను వివరిస్తుంది. భావకవిత్వంపై తిరుగుబాటుచేసిన ముఖ్యులనూ అభ్యుదయ కవిత్వప్రయోక్త ప్రవక్త అయిన శ్రీ శ్రీ రచనాజీవితాన్నీ, మహాప్రస్థాన గేయాల్లోని వినూత్న ప్రయోగాలనూ, ఆ గ్రంథంపై మార్క్సిజం ప్రభావాన్నీ, అందలి ఛందోభావనవ్యతలనూ, శబ్దశక్తినీ, సాంప్రదాయిక

తనూ, శ్రీశ్రీపై ఇతరకవుల ప్రభావాలనూ, అభ్యుదయకవితోద్యమ వికాస విశేషాలనూ అందలి ధోరణులనూ సోదాహరణంగా వివరించి చూపినాడు నారాయణరెడ్డి ఈ ప్రకరణంలో.

అధివాస్తవికత, సెక్సుప్రాధాన్యం, ప్రతీకవాదం, నగరజీవనచిత్రణం వైచిత్రీప్రియత్వం, ఆరాజకవాదం, నిరాశావాదం అనే అతినవ్యకవితా ధోరణులను సోపపత్తికంగా నిరూపిస్తుంది అష్టమప్రకరణం. 1950 నుంచి 1960 వరకు ప్రచురితమైన కవితాస్వరూపాన్ని ఆవిష్కరించటంతో ఈ పరిశోధన గ్రంథం పరిసమాప్తమవుతుంది.

సంప్రదాయాన్నీ ప్రయోగగుణాన్నీ మేళవించుకున్న ప్రతిభయే ప్రస్ఫుటంగా రాణింపగలుగుతుందనే సత్యాన్నీ, కవిత్వానికి కొత్తపాతల మేలికలయికయే ఉపాదేయమనే స్వీయసమన్వయదృక్పథాన్నీ సహృదహృదయావర్జకంగా ఈ పరిశోధన వ్యాసంలో నిరూపించటంలో కృతార్థుడైనాడు నారాయణరెడ్డి.

ప్రాచ్యపాశ్చాత్యకవితాసిద్ధాంత ప్రతిపాదక బహుగ్రంథ పరిశీలనం, వివిధవిషయస్వరూప నిరూపణం నారాయణరెడ్డి పాండితీగరిమకు విమర్శనా పాటవానికీ నిదర్శనాలు.

నారాయణరెడ్డి వచనంలోకూడా కవిత్వం పరిమళిస్తుందనడానికి ఈ గ్రంథం లక్ష్యప్రాయం. కటువైన నగ్నసత్యాలను కమనీయంగా ప్రదర్శించే గుణం నారాయణరెడ్డి కలానికి సహజం. చక్కని జాతీయాలతో కవితాత్మను పుక్కిలించే సుందరపదబంధాలతో పదచిత్రాలను పొదుగుకున్న వాక్యవిన్యాసంతో సాగిన ఈ గ్రంథంలోని శైలి సహృదయరమ్యం, ఆలంకారికం, అనితరసాధ్యం. ఈ సందర్భంలో ఈ గ్రంథరచననుగూర్చి డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారి అభిప్రాయాలు పేర్కొనదగినవి— "కవిత్వాన్ని గూర్చి చదువుతున్నా కవిత్వం చదివినంత తన్మయత్వం కలుగుతుంది. ఈ గుణం ఉన్న పరిశీలనగ్రంథం నా ఎరుకలో ఇప్పటికిదొక్కటే. ఇది

సాహసోక్తి కాదు. సహజోక్తి..........ఈ గ్రంథం పఠనీయమేకాదు ఇందలి శైలి సమన్వయధోరణి అనుసరణీయాలు ఆస్వాదనీయాలు".[1]

"ఆధునికాంధ్రకవిత్వ మ
హాంభోరాశిని మథించి
సాధించిన నవామృత
స్వాదుఫలము"[2]

ఈ గ్రంథం.

ఆధునికాంధ్రకవితాస్వరూపసందర్శనాభిలాషులకు కల్పకం ఈ పుస్తకం.

---

1. 'నందిని'–'పఠనీయం' పుట 7. యువభారతి సాహితీ మాసపత్రిక సంచిక-10, అక్టోబర్ 1975.

2. 'ఆధునికాంధ్ర కవిత్వము'-'అంకితము'లో నారాయణరెడ్డి.




# గాంధీయం

‘గాంధీయం’ అన్న ఈ గ్రంథం హిందీలో వచనరూపంలో ఉన్న కొన్ని గాంధీజీ సూక్తులకు నారాయణరెడ్డి గేయానుసరణం. ఆంధ్రభాషా సాహిత్యాభ్యుదయానికి అంకితమైన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ గాంధి శతజయంతి సందర్భంగా 1969 లో ఈ కృతిని ప్రచురించింది.

జాతిపిత గాంధి మహోన్నతమానవతకెత్తిన పతాక ; విశ్వజనీన సత్యాలకు ప్రతీక. అహింసాసిద్ధాంతముతో మానవజాతి అంతరాత్మను మేల్కొల్పిన ప్రముఖవైతాళికుడు. విశేషించి భారతస్వాతంత్ర్యప్రదాత ; భారతభాగ్యవిధాత ; వినిర్మలశీలంతో విశిష్టనీతిబలంతో హృదయాలకు ఉత్తే

జం కలిగించిన నేత ; ప్రతిమాటా ఒక సూక్తిగా, జీవితసత్యంగా మలచ జాలిన మహారచయిత. అట్టి మహాత్ముని శతజయంతి సందర్భంలో ఆతని శతసూక్తులు గేయాలుగా అనూదితం కావడం అత్యంతౌచితీశోభితం.

సేవాగ్రాం ఆశ్రమవాసుల్లో ఒకడైన ఆనంద, టి. హింగోరానికి గాంధీజీ హిందీలో వ్రాసిపంపిన సూక్తులివి. జాతిపితసూక్తులు శతాధికంగా ఉన్నా వాటిలో డెందాలనువెల్గించే వందసూక్తులే గ్రహించి, వాటిని హిందీలో 'బాపూ కీ సూక్తియాఁ' అనే పేరుతో ఈ గ్రంథాంతంలో చేర్చి పుస్తకానికి నిండుదనాన్ని సంతరించింది సాహిత్య అకాడమీ.

నారాయణరెడ్డి సంస్కృతాంధ్రభాషాకోవిదులే కాక, హిందీభాషావిశారదులు కూడా. ఈ బహుభాషాపాండిత్యానికి ఆతని సహజకవితాహృదయం తోడుగానిలిచింది. అందుకే సూటిగా దూసుకుపోయే సూక్తులు ఈతనిచేతిలో సుందరంగా 'గాంధీయం'గా మాత్రాచ్ఛందోగంధబంధురంగా రూపుదిద్దుకున్నవి. ఇందలిగేయాలకు ముందు నారాయణరెడ్డి 'బాపూ నీ పుట్టినరోజు' అనే శీర్షికగల ఒక చక్కని గేయంతో మహాత్ముని స్తుతించినాడు.

'గాంధీయం'లోని వందగేయసూక్తుల్లో యాభైయారు నాలుగుపాదాలతో నడవగా మిగిలినవి రెండుపాదాలతో పూర్తియైనవి. గేయాలు త్ర్యస్ర చతురస్ర, ఖండ, మిశ్రగతుల్లో సాగినవి. సూక్తి ఎన్ని తక్కువపదాలతో ఒదిగితే అన్ని తక్కువపదాలు ప్రయోగించి సూక్తిలక్షణాన్నీ స్వభావాన్నీ భద్రంగా సంరక్షిస్తూ దానిని మాత్రాచ్ఛందస్సులో మలచినాడు నారాయణరెడ్డి. అందుకే గేయచరణాల్లో కొన్నిచోట్ల మాత్రలు ఎక్కువగా కొన్నిచోట్ల తక్కువగాను కనిపిస్తాయి. అయినా వాటినడకలో ఒడిదొడుకులుగానీ, ఛందస్సౌందర్యంలో లోపంగానీ కనిపించవు. భావానుగుణంగా గేయాన్ని సాగించి ఛందస్సులో ఔచిత్యాన్ని సాధించినాడు నారాయణరెడ్డి. ఈతడు తన ప్రతిభావిశేషంతో యతిప్రాసలను తొడిగి అంత్యప్రాసలను అలంకరించి సూక్తులను నాదమాధురీమహితంగా తీర్చిదిద్దినాడు. ఈగేయాల్లో ఎక్కడ కూడా యతిప్రాసలకోసమైన అతిప్రయాసలూ కృత్రిమయత్నాలూ కన్పించవు. గేయాలన్నీ ధారావాహికలుగా సాగి భావుకునిలో ఆనందసస్యాలను పండిస్తాయి.

ఇక ఈ సూక్తుల అనువాదసంవిధానాన్ని గూర్చి ఒక్కమాట. సాధారణంగా అన్యభాషలోని గద్యాన్ని గద్యంగా పద్యాన్ని పద్యంగా తెనిగించటంలో కొంత సౌలభ్యముంటుంది. కాని ఇక్కడ జరిగింది సూక్తులను గేయాలుగా మలచటం. ఇది కొంచెం కష్టమైె పనే. ఈ ఇబ్బందిని తన ద్విభాషావైదుష్యంచేత, అపారరచనావైశారద్యంచేత నారాయణరెడ్డి తొలగించుకున్నాడు. హిందీ సూక్తుల అంతరాత్మను భద్రంగా తెలుగురూపంలో ప్రతిష్ఠించినాడు. ఆంధ్రసాహిత్యంలోని అనువాదాల తీరుతెన్నులను జాగ్రత్తగా తిలకించిన విద్వత్కవితిలకుడు కాబట్టి ఈ అనుసరణాన్ని మాత్రాచ్ఛందస్సులో మధురంగా చేయగలిగినాడు.

నారాయణరెడ్డి నవ్యతాప్రయోక్త. కాబట్టి 'బాపూకీ సూక్తియాఁ' (బాపుజీ సూక్తులు) అని హిందీలో ఉండగా దానిని 'గాంధీయం'గా తీర్చి మొదటనే తన ప్రతిభను ప్రదర్శించినాడు. హిందీలోని—

"అంధా వహ్ నహీఁ జిస్ కీ ఆంఖ్ ఫూట్ గయీ హో. అంధా వహ్ హై జో అప్‌నే దోష్ ఢాంక్‌తా హై" అనే సూక్తినారాయణరెడ్డి—

"కనులను పోగొట్టుకున్న
మనుజుండా గ్రుడ్డివాడు ?
తన తప్పులు కప్పిపుచ్చు
కొనువాడే జాత్యంధుడు"

అని సమానంగా సహజసుందరంగా అనువదించినాడు.

మూలంలో సూక్తులు సుదీర్ఘంగా ఉన్నప్పుడు పునరుక్తి పొడసూపకుండ అనవసరమని భావించిన వాక్యాలను కొన్నింటిని వదలివేసి అనల్పార్థద్యోతకంగా అనుసరించినాడు నారాయణరెడ్డి. ఉదాహరణానికి- మూలంలో ఉన్న—

"జైసే బిందుకా సముదాయ్ సముద్ర్ హై ఇసీతరహ హమ్ మైత్రీ కర్‌కే మైత్రీ కా సాగర్ బన్‌సక్‌తే హైఁ. ఔర్ జగత్‌మేఁ సబ్ ఏక్ దూస్రోంసే మిత్ర్ భావ్‌సే రహేఁతో జగత్ కా రూప్ బదల్‌జాయ్"— అనే సూక్తి తెలుగులో

"బిందువులొకటిగ చేరిన
సింధువుగా రూపొందును
వ్యక్తులొక్కటైన స్నేహ
వారాశులు ఉప్పొంగును"

అనే గేయంగా రూపుదిద్దుకున్నది. ఇదే విధంగా మూలంలోని యాభైయొకటవ సుదీర్ఘసూక్తి అనుసరణంలో సంక్షిప్తతనూ సౌందర్యాన్నీ సంతరించుకున్నది. ఐదవసూక్తి మూలంలో 'రామ్' అని ఉంటే అనుసరణంలో 'మహావైద్యుడు' అని అన్నాడు ఈకవి అభిలషితార్థాన్ని ప్రతిపాదిస్తూ. అలాగే

"బడబాగ్నులెన్నిన్ని
ఎడదనుడికించినా"

అనే పంక్తుల్లోని 'బడబాగ్నులు' అనుదానికి మూలంలో 'తూఫాన్' అని ఉంది. ఇలా ప్రయోగించడంలో మూలాన్ని మించిన భావతీవ్రత దూసుకు వస్తున్నది.

మూలంలో లేకున్నా అర్థపుష్టికోసం శిల్పదృష్టితో ఈ అనుసరణంలో కొన్ని కొత్తపదాలను ప్రయోగించినాడు.

"తీగవోలె తరువునంటి
సాగుట పరతంత్రత
నిటారుగా నిలబడి పయ
నించుట స్వచ్ఛందత"

అనే గేయంలోని 'స్వచ్ఛందత' అటువంటిదే.

"అరిగిన ప్రతిక్షణము
తిరిగిరాదని తెలిసి"

అనే పంక్తుల్లోని 'అరిగిన' పదంలో శ్లేషపరిమళం గుబాళిస్తున్నది.

ఈ గ్రంథంలోని-

"నరుని గుండె నిబ్బరమును
పరీక్షించు గీటురాయి

మంచుకొండ అంచుకాదు
మానవసంఘమ్మోమ్మయి"
"సులభము దేశముల నడిమి
జలరాశుల నీదుట
అతికష్టము నరులనడిమి
అంతరాలు దాటుట"-

వంటిగేయాల్లో శబ్దార్థసౌందర్యాల సరససమ్మేళనం కనిపిస్తుంది. ఇవన్నీ రేఖా మాత్రంగా చూపినవే. సంపూర్ణస్వరూప సందర్శనం సహృదయులదే. ఈ 'గాంధీయం' మహాత్ముని వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటంగా వ్యక్తం చేస్తుంది. గాంధివిశ్వజనీన సత్యాలను ఘోషించిన సత్యమూర్తి.నారాయణరెడ్డి స్తుతిగీతిలో అన్నట్లు హరియే గాంధిగా అవతరించినాడేమో అనిపిస్తుంది.

అంతటి మహత్తరశక్తిసంపన్నుడాతడు. ఆతని సూక్తులన్నీ సమానత్వాన్నీ సమైక్యాన్నీ సత్యాన్నీ ఔదర్యాన్నీ ఆత్మబలాన్నీ ఇలా ఎన్నెన్నో విషయాలను బోధిస్తూ వ్యక్తులను ఉజ్జ్వల చైతన్యశక్తులుగా తీర్చిదిద్దేవే.

గాంధీజీ భగవద్గీతను క్షుణ్ణంగా చదివి అందలి సారాన్ని జీర్ణంచేసుకున్నాడు. జీవితంలో ప్రయోగపూర్వకంగా అనుభవించి చూచినాడు. ఆతని ముఖ్యగుణమైన అద్వేషాన్నీ గూర్చిన సూక్తితో ఈ 'గాంధీయం' ఆరంభమౌతుంది ఈ విధంగా-

"నిఖిలజీవులందు తానే
నెలకొని ఉన్నానని;
ఈశ్వరుడే తెలుపగ ఇం
కెవరిపైన మనపగ?"

శ్రీకృష్ణపరమాత్మకూడా అర్జునునికి భక్తియోగాన్ని గూర్చి చెపుతూ-

"అద్వేష్టా సర్వభూతానాం
మైత్రః కరుణఏవచ

నిర్మమో నిరహంకార
స్సమదుఃఖసుఖక్షమీ"

అని మొట్టమొదట ద్వేషం వదులుకొమ్మన్నాడు.

"జాతస్యహిధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మమృతస్యచ"

అనే గీతా సూక్తి ఈ గ్రంథంలోని-

"జననమరణములు నాణె
మ్మునకిరుప్రక్కలవంటివి"

అనే సూక్తికి జీవంపోసింది.

'విద్యావిహీనః పశుభిస్సమానః'

అనే భర్తృహరి సుప్రసిద్ధ సూక్తిసారాన్ని అందిస్తూనే అందులో కొంచెం హాస్యరసాన్ని కలిపినాడు గాంధి ఇలా—

"విద్యలేని మనుజుడు పశు
వే యన్నాడొకకవి
ఇంతకు ఆ విద్యయేదొ
ఎరిగించిన బాగుండును"

"ఈ తెనిగింపు నారాయణరెడ్డిగారు తమ సహజసుందరశైలిలో కొనసాగించి సొంతరచన అన్నభ్రమను కలిగింపజేస్తున్నారు" అని పలికిన సహృదయులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి 'తొలిపలుకు'లు వాస్తవాన్ని నొక్కివక్కాణిస్తున్నాయి. ప్రతిగేయంలో నారాయణరెడ్డి ప్రత్యేకశైలీముద్ర ప్రత్యక్షమవుతుంది. ఈ సూక్తుల్లో గాంధీజీవ్యక్తిత్వం మనకు ఎలా సాక్షాత్కరిస్తున్నదో అలాగే నారాయణరెడ్డి వ్యక్తిత్వం ఈ సూక్తులను ఎన్నుకున్న తీరులో కనిపిస్తుంది.

చదివినప్పుడల్లా మనస్సుకు ఆహ్లాదాన్నీ, బుద్ధికి వివేచనాన్నీ ప్రసాదిస్తాయి ఈ తెలుగు గాంధీసూక్తులు.

# మీరాబాయి

'మీరాబాయి' అనే గ్రంథాన్ని రచయిత్రి డాక్టర్ శ్రీమతి ఉషాయస్. నిల్సన్‌గారు ఆంగ్లంలో రచించగా నారాయణరెడ్డి దానిని ఆంధ్రీకరించినాడు.

ఈ పుస్తకాన్ని సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ సంస్థ 1972లో ప్రచురించింది. ఈ సాహిత్య అకాడెమీ 'భారతీయ సాహిత్య నిర్మాతలు' అనే శీర్షికక్రింద ఆంగ్లంలో చాలా పుస్తకాలను వెలువరించింది. వానిలో లక్ష్మీనాథ బెజ్జరువా, రాజారామమోహనరాయ్, కేశవసుత్, ఇళంగో అడిగళ్, ప్రేమ్ చంద్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కబీరు, వేమన, వీరేశలింగం, గాలిబ్, చండీదాస్ అనే గ్రంథాలుకొన్ని. వీనిలో లక్ష్మీనాథబెజ్జరువా. కేశవసుత్, ప్రేమ్‌చంద్, కబీరు, అనేవి తెలుగు చేయబడినాయి. 'మీరాబాయి' అనే గ్రంథంకూడా ఈ విధంగా వచ్చినదే. ఒకభారతీయ భాషలోని ఉత్తమ సారస్వతాన్ని అనువాదరూపంలో అన్యభారతీయభాషలవారికి అందిస్తూ భారతీయ భాషలలోని సాహిత్య కార్యక్రమాలను ప్రోత్సహించి సమన్వయ పరచాలనేది అకాడెమీ అభిప్రాయం. భారతీయసాహిత్యచరిత్రలోని ప్రధానఘట్టాలను సామాన్య పాఠకుడు తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఈ అకాడెమీ ప్రాచీన ఆధునిక భారతీయ సాహిత్య నిర్మాతల జీవిత చరిత్రలను వెలువరిస్తున్నది. అలాంటి వాటిలో 'మీరాబాయి' ఒకటి.

మీరాబాయి పేరు వినని వారుండరు. ఆమె ఉత్తమ రాజపుత్రక్షత్రియ వంశంలో 1498లో జన్మించింది. సంగరాణా జ్యేష్ఠపుత్రుడైన భోజరాజుతో 1516లో ఆమె వివాహం జరిగింది. కాని పెళ్ళయిన ఐదేళ్ళకే భోజరాజు చనిపోయినాడు. మీరాబాయి కృష్ణభక్తురాలు; చక్కని కవయిత్రి, తన భక్తి నంతా గీతాలలో వ్యక్తం చేసింది. మీరాబాయి జీవితంలో ఎన్నోకష్టాలను అనుభవింపవలసి వచ్చింది. ఆమె కృష్ణభక్తిని తెలిసికోలేని, ఆమె స్వచ్ఛంద శీలాన్ని అర్థం చేసికోలేని ఆమెబావ రతన్‌సింగ్ ఆమెను చంపడానికి ఎన్నో సార్లు యత్నించి విఫలుడైనాడు. పవిత్రమైన కృష్ణభక్తియే ఆమెను రక్షించింది. జీవితమంతా తన భక్తిగీతాలను గానంచేస్తూ మీరాబాయి 1546లో ద్వారకలో పరమపదించింది.

ఈ గ్రంథం మీరాబాయి జీవితాన్నీ, ఆమె భక్తిగీతాలను సుస్పష్టంగా, సుందరంగా పరిచయం చేస్తున్నది.

ద్విభాషాపాండిత్యంతోపాటు కవితాహృదయముంటేనేగాని కవితాను వాదం సాగదు. నారాయణరెడ్డి ఉర్దూలో, హిందీలో, ఆంగ్లంలో చక్కని పరిచయ పాండిత్యాలున్నవాడు. అందుకే ఈ అనువాదాన్ని ఇంత కమనీయంగా నిర్వహింపగలిగినాడు. 'మీరాబాయి' గ్రంథంలో ఎనిమిది విషయాలున్నాయి. అవి అవతారిక; మీరాబాయి జీవితం; మీరాబాయికి సంబంధించిన కట్టుకథలు; మీరాబాయి భక్తిభావన; మీరాబాయి గీతాలు; ఛందోరూపం; మీరాబాయి గీతాలలోని భాషాస్వరూపం; మీరాబాయి పదావళి (అనువాదాలు) వీనిలో మొదటి ఏడు మీరాబాయి జీవితాన్నిగూర్చి, కృతులనుగూర్చి వ్రాసిన ప్రకరణాలకు అనువాదమైతే, ఎనిమిదివదేమో మీరాబాయి పదాలకు గేయాను సృజనం. అనువాదంకన్నా అనుసృజనానికి ప్రతిభాబలం విశేషంగా కావలసి వుంటుంది. ఒక్కొక్కసారి ఈ అనుసృజనం మూలంతో తులతూగడమే కాక, మూలసౌందర్యానికే వన్నె చేకూరుస్తూ వుంటుంది. అందుకే అనువాదకుని శక్తిసామర్థ్యాలను పరీక్షించి ఆతని యోగ్యతను నిర్ణయించేదికూడా ఈ అనుసృజనమే.

ఈ పదాల అనువాదాన్ని గూర్చి నారాయణరెడ్డియే ఇలా అన్నాడు. "పదావళి అనువాదంలో సాధ్యమైనంతవరకు హిందీమూలాన్నే అనుసరించాను. మూలంలో పాఠభేదాలున్నప్పుడు ఆంగ్లానువాదాన్ని ఆశ్రయించాను. మూల పదావళిలోని ముఖ్యలక్షణమైన గానయోగ్యతను గుర్తుంచుకొని మాత్రాచ్ఛందస్సులో అనువాదం సాగించాను."

నారాయణరెడ్డి "మూలంలోని భావపుష్టి, శిల్పదృష్టి కొరవోకుండా, తెలుగు నుడికారానికి, ధారాశుద్ధికీ లోపం కలుగకుండా" అనువాదం చేసినాడు. ఉదాహరణానికి కొన్ని :

పల్లవి: "ప్రియ సఖీ! శ్రీహరికి
దయలేదు నాపైన

చరణం 1: ఎన్నొ బాసలు చేసి
ఎంతకూ రాడాయె

అతనికై వేచి నా
బ్రతుకెల్ల మ్రోడాయె" (16వ పదం)

పల్లవి: "కనులు తపియించెనిను
కనుగొనగ నా స్వామి

చరణం 1: దినము గడిచెను ఎదురు
తెన్నులను చూసీ,
అలసె నాకనులు విర
హపు బరువు మోసీ

చరణం 2: కొంమెకోయిల గీతి
గుండెలను కోసె,
నెనరు మాలిన జగతి
నను రవ్వ చేసె." (15వ పదం)

పల్లవి "కమలలోచనుని నా
కనులందు దాచితిని
అందుకే కనురెప్ప
లార్పగా వెరచితిని" (3వ పదం)

జీవితంలోవలెనే నారాయణరెడ్డి గేయరచనలో మాస్టరు. అనువాదాల్లో కూడ అతని ముద్ర కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. కవితాత్మను గ్రహించే హృదయం ఆతనిది. అందువలననే ఈ గీతాల అనువాదం అంత సహజ రమణీయంగా సాగింది. ఆతని అనువాదాలను చదివినపుడు మూలాన్నే మరిచిపోతాం. అంతటి అనువాద ప్రతిభ అతనిది.

ఈ గీతాలు తిశ్ర, చతురస్ర ఖండగీతులలో నడిచినాయి. దాదాపు అన్ని గీతాలలో యతి ప్రాసలలో ఏదోయొకటి కనిపిస్తుంది. ఈ పదాలలో పల్లవీ, చరణాలూ ఉన్నాయి. పాడడానికి వీలుగా ఒక్కొక్క చోట మాత్రలు తగ్గించినాడు ఈ కవి.

మీరాబాయి తన జీవితములో ప్రాణాంతక సంఘటనలను ఎదుర్కొన్న ట్లునూ, భక్తసులభుడైన భగవంతుడు వాటినుండి మీరాబాయిని కాపాడి నట్లునూ తెలుస్తుంది.

"సర్పపేటికను రాణా పంపగ
చల్లగ మీరా గ్రహియించె
స్నానమాడి ఆ పేటిక విప్పగ
సాలగ్రామమె అగుపించె"
"విషపాత్రను రాణా పంపగ అది
విమలామృతమై విలసించె
ఆ విషమును తానారగించగా
అమృతరూపమే సిద్ధించె"
"శూలశయ్యపై పవళించగ ఆ
సుదతిని రాణా శాసించె.
శూలశయ్యపై మీరా చేరగ
పూల శయ్యగా భాసించె".
"ఆశ్రితావనుడు మీరాప్రభువే
అంతరాయముల తొలగించె.
మేఘసుందరుని గానములోనే
మీరా నిరతము పులకించె".

మీరాబాయిలో శ్రవణకీర్తనాది భక్తిమార్గాలు కనిపించినా ఆమెలో మధురభక్తియే ప్రాధాన్యం వహించింది. కావుననే ఆమె గీతాల్లో ఎక్కువగా ప్రణయం కనిపిస్తుంది. ప్రణయంవల్ల కలిగే భావోద్వేగాలనన్నింటినీ మీరాబాయి అనుభవించినట్లు ఆమెగీతాలు సాక్ష్యమిస్తాయి. ఆత్మానుభూతులను మీరాబాయి హృదయంగమంగా వ్యక్తంచేసింది ఇలా-

"చిలిపికృష్ణ! బృందావనిలో నా
చేయి పట్టినావు.
చల్లద్రావి ఆ చల్లకుండకే
చిల్లి పొడిచినావు.
జన్మజన్మలకు హే మీరాప్రభు
సహచరుడవు నీవు!"

మీరాబాయి గీతాల్లో భావసౌందర్యం శతపత్రంలా విరిసి కనిపిస్తుంది.

మూఢులు గద్దెల నేలుచుందురు
బుధులేమో అడుగంటుచుందురు
కస్తూరి నదీజలమ్ములు ఔరా!
కడలి నీటితో కలుషితమౌను.

ప్రపంచలక్షణాన్ని ప్రకృతి సుందరంగా చెప్పింది మీరా.

"గాయపడినవాడె ఒరుల
గాయపులోతుల నెరుగును.
రత్నపరీక్షకునికె ఆ
రత్నపు విలువలు తెలియును".

ఎంతచక్కని దృష్టాంతం!

"నవ్వులేక నిలువలేను
రావోయీ నా ప్రియా
జలములేని నళినివోలె
నెలపొడుపని రజనివోలె
నీవులేక నా బ్రతుకే
నిష్ఫలమో ప్రియతమా"

ఎంతచక్కని ఉపమానము!

"విరహభుజంగము కాటువేయగా
విషలహరులలో పొరలితిని"
"అశ్రుజలముతో పెంచితినే నా
అనురాగ ద్రాక్షాలతను".
"నదులు పొంగెరా భాద్రపదమున
నాయెద విరహము నిండగా"

భావాలకు తగిన రూపకల్పనం.

నారాయణరెడ్డి మీరాబాయి పదాలలో ప్రధానాంశమైన సంగీతానికి లోపం కలుగకుండా ఔచితీస్ఫూర్తితో 50 గేయాలను తెలుగు చేసినాడు. మీరాబాయి "కవిత్వం వ్యక్తిత్వం, జీవితం, అచ్ఛమైన భక్తికి, స్వచ్ఛమైన

ప్రతిరూపాలు" అయితే నారాయణరెడ్డి తెనుగుసేత అచ్చమైన నుడికారానికి, అందమైన కవితాశక్తికీ, సునిశితమైన పాండిత్యానికీ నిదర్శనంగానిలుస్తుంది.

మీరాబాయి గేయాలన్నింటిని నారాయణరెడ్డి తెలుగువారికి ఇదేవిధంగా అందిస్తే, ఆమె కవిత్వం తెలుగు హిందీ భాషీయుల హృదయాలకు రస సేతువుగా రూపొందుతుందని ఆశించవచ్చు.

# శిఖరాలూ లోయలు

ఈ 'శిఖరాలూ - లోయలు' అన్న గ్రంథం మహాకవి మానవతావాది ఖలీల్‌జిబ్రాన్ ఆంగ్లంలో రచించిన కవితోక్తులకు నారాయణరెడ్డి చేసిన స్వచ్ఛందానుసరణం. తత్త్వాన్నీ కవిత్వాన్నీ రంగరించుకున్న జిబ్రాన్ మహితోక్తులు అనేకంగా ఉన్నా వాటిలో నూటాయాభై సూక్తులను మాత్రమే తీసుకున్నాడు నారాయణరెడ్డి. సమయం చిక్కినపుడల్లా పాశ్చాత్యసాహిత్యాన్ని పఠిస్తుంటాడు ఈకవి, ఆ విధంగా అప్పుడప్పుడు చదివి జీర్ణించుకున్న ఖలీల్ జిబ్రాన్ సూక్తులను కొన్నింటిని ఆంధ్రీకరించగా వాటిని ఒక్కచోట చేర్చి 'యువభారతి' అనే సుప్రసిద్ధసాహితీసాంస్కృతికసంస్థ 'శిఖరాలూ - లోయలు' అనే గ్రంథంగా 1974 లో ప్రచురించి ఆంధ్రదేశానికి అందించింది. ఈ సంపుటిలోని కొన్ని సూక్తులకు ప్రసిద్ధచిత్రకారుడు శ్రీ బాపు రేఖాచిత్రాలు గీయడం వల్ల మరింత హృద్యంగా రూపొందింది ఈ గ్రంథం.

ఖలీల్ జిబ్రాన్ లెబనాన్ దేశీయుడు. అతడొక విప్లవవాది. గొప్ప తాత్త్వికుడు. నిరంకుశభావాలను మూఢమతాచారాలను ఎదిరించి తిరుగుబాటు చేసి దేశంనుండి మతంనుండి బహిష్కృతుడైనాడు. తుఫానులతో నడిచే చైతన్యవ్రతుడు కాబట్టి జిబ్రాన్ పరదేశాల్లో ఉంటూనే స్వేచ్ఛను గూర్చి మానవతను గూర్చి తన మహోన్నతభావాలను చాటినాడు. 'కవిత్వం హృద

యజ్వాల' అనీ, 'పరిపూర్ణ పరిజ్ఞానమే కవిత్వ'మనీ తెలిసికొన్న జిబ్రాన్ తన భావాలను ప్రతిభావిశేషంతో కవితాసూక్తులుగా మలచి—

"హృదయంలో యుగయుగాల
మధువు తొణికిపోతున్నది
రండి పిపాసువులారా
గుండెనిండ తాగిపొండి"

అంటూ నిఖిలవిశ్వానికి వినిపించినాడు. సమస్తమానవజాతిని జాగరితం చేసినాడు.

"నా చేతులకు సంకెళ్ళు వేసినా
నా కాళ్ళకు గొలుసులు కట్టినా
చీకటి చెరసాలలో నన్ను నెట్టినా
స్వచ్ఛందమైన నా ఆలోచనను
చచ్చినా బంధించలేరు"

అంటూ స్వేచ్ఛాగళమెత్తినాడు.

జిబ్రాన్ చెప్పిన న్యాయం, సత్యం, సమైక్యం, ప్రణయం, కరుణ, చైతన్యం, స్వాతంత్ర్యం, ఆశావాదం, ఆత్మసౌందర్యం అన్నీ విశ్వజనీనతను వేనోళ్ళ ఘోషించేవే ; ప్రతిమనిషి అంతరంగాన్ని స్పృశించి మానవతవైపు నడిపించేవే. నారాయణరెడ్డి కూడా మానవతను ఎలుగెత్తి ఘోషించే మహాకవి. ఒక్కమాటలో చెప్పాలంటే ఆతని ఇతివృత్తిమే మానవత్వం. ఇందుకు ఆతని ఖండకావ్యాలే నిదర్శనం. ఖలీల్‌జిబ్రాన్ కవితోక్తులు నారాయణరెడ్డిని అంతగా ఆకర్షించడంలోనూ వాటిని ఆతడు స్వచ్ఛందంగా అనుసరించడంలోనూ ఉన్న ఏకైక హేతువు ఇద్దరికీసాధర్మ్యమైన ఈ మానవతా ప్రబోధమే.

ఇక అనువాదవిధానం గూర్చి ఒక్కమాట. నారాయణరెడ్డి ఖలీల్ జిబ్రాన్ కవితోక్తులలో కొన్నింటిని వచనకవితాపంక్తులుగానూ మరికొన్నింటిని మాత్రాచ్ఛందోబద్ధంగానూ తెలుగుసేసినాడు. జిబ్రాన్ మహాకవి సూక్తి దేనిలోకి సహజరమ్యంగా ఒదిగితే, దానిలోకే మలచినాడు. అది ఒకసారి వచనంగా నడిచిరావచ్చు; ఒకసారి గేయంగా సాగిపోవచ్చు. వచన పంక్తు

లైనా గేయచరణాలైనా మూలంలోని భావాన్నిబట్టే. అందుకే ఈ అనుసరణం లోని సూక్తులు రెండు పంక్తులనుండి ఆరుపంక్తులవరకు కనిపిస్తాయి. వచనం గేయం పంక్తి పరిమితీ ఇదంతా పైకి కనిపించే శరీరం. ఇక ఆత్మ ఒక టుంది. అదే కవితాత్మ. నారాయణరెడ్డి ఈ స్వచ్ఛందానుసరణం జిబ్రాన్ కవితాత్మను స్పష్టంగా చూపిస్తున్నది. అసలు నారాయణరెడ్డి కవితలో కాన వచ్చే ప్రధానగుణం మనోజ్ఞభావాన్ని సాధ్యమైనంత అందమైన పదాలతో అలంకరించటం. చక్కని భావాన్ని చక్కని శబ్దంతో వ్యక్తంచేయటం నారా యణరెడ్డి సహజగుణం. శబ్దాలకు ఉండే ఆత్మశక్తి, నాదపరిమళం, అంత ర్లయ ఆతనికి బాగాతెలుసు. యతివేసినా ప్రాసవేసినా, అంత్యప్రాసవేసినా, ఆమ్రేడితంవేసినా కవితాత్మను ప్రజ్వలింపజేయడానికే. కవిహృదయాన్ని అద్దంలోవలె కనిపింపజేయడానికే. అందుకే ఈ సూక్తులు స్వచ్ఛమౌక్తి కాల వలె మెరుస్తున్నాయి. జిబ్రాన్ కవితలలో కనిపించే సంక్షిప్తత, సౌందర్య నిబద్ధత నారాయణరెడ్డి పోనివ్వలేదు

మనం చూసే మామూలు వస్తువుల్లోనే మహితధర్మాన్ని చూపిస్తాడు జిబ్రాన్-

"మట్టితో మధుపాత్రను సృష్టించవచ్చు
వట్టి ఇసుకతో తీర్చేదేమిటి దిద్దేదేమిటి?"

జిబ్రాన్ సూక్తి మెదడుకు పదునుపెడుతుంది. అనుక్షణం ఆలోచింప జేస్తుంది.

"కట్టడంలోని గట్టిరాయి ఏది?
పునాది అట్టడుగున ఉండేది."

జిబ్రాన్ చెప్పిన-

"కవిత్వం ఒక మెరుపు
కాదది పొడిమాటలకూర్పు"

అన్న సూక్తిపరమార్థాన్ని అక్షరాలా ప్రతిభావంతంగా తనఅనుసరణంలో ప్రదర్శించినాడు నారాయణరెడ్డి.

"మహాశయులారా; మరచిపోతారెందుకని
గుహల్లో నివసించే మనుషులింకా ఉన్నారని

ఏవీ ఆ గుహలు?
ఇవిగో మనహృదయాలు."

ఎంత చక్కని కొసమెరుపు! ఈ మెరుపులోనే ఉంది కవితాత్మ చూపు.

జిబ్రాన్ ఉక్తి నిరంతరం మానవజాతిని వెలిగించే అఖండ జ్యోతి—

"అసలైన జాతీయసంపద
పసిడిలో లేనేలేదు
విద్యలలో ఉంది; వివేకంలో ఉంది.
అనవద్యమైన ఆర్జవంలో ఉంది."

నిజానికి ఆర్జవాన్ని మించిన ఆస్తి ఏముంది. అందుకే ఈ సూక్తి విశ్వజనీనంగా వెలుగుతుంది.

ప్రజాప్రభుత్వంలో ప్రతివాడూ 'వాక్ స్వాతంత్ర్యాన్ని' గూర్చి వాగుతుంటాడు. అందుకే జిబ్రాన్ ఇలా అన్నాడు-

"వచించేదీ ప్రచురించేదీ ఏమీలేకున్నా
వాక్స్వాతంత్రాన్ని గూర్చి వాగుడుమిన్న"

నవ్వును తెప్పిస్తూనే రవ్వలాంటి సత్యాన్ని చిమ్ముతున్నది.

"ఏ ఋతుసంగతిలేకున్నా వికసించే కుసుమం ప్రణయం"—

అని ప్రణయాన్ని జిబ్రాన్ వర్ణించింది రెండు పంక్తులైనా గుండెను నింపేస్తుంది కమ్మని కవితాప్రణయంతో. అలాగే జిబ్రాన్ మొదటి ముద్దును వర్ణించిన తీరు ఎంత ముచ్చటగా ఉందో చూడండి.

"మొదటి ముద్దు—వలపుపాటకు తొలకరి
జీవితతరుశాఖా శిఖపై విరిసిన తొలివిరి
నాలుగు పెదవులు పలికే మౌనమంత్రాక్షరి."

ముద్దును మూడే మూడు పంక్తుల్లో నారాయణరెడ్డి ఇంత ముద్దుగా అనుసరించడం ఆయనకే చెల్లింది. అంత్యప్రాసలలో కవితాత్మను అలంకరించి మూలానికి మెరుగులు దిద్దేవి ఇటువంటి పంక్తులే.

నారాయణరెడ్డి అనుసరణం ఎలా ఉందో మూలాన్ని చూస్తేగాని తెలియదు. ఉదాహరణకు ఒకటి–రెండు-

"The human soul is but a part of a burning torch
which God seperated from himself at creation."

అనే జిబ్రాన్ సూక్తి నారాయణరెడ్డి అనుసరణంలో–

"మానవాత్మ-ప్రజ్వలించే మహాజ్వాల
విడివడిందది పరమాత్మనుండి సృష్టివేళ"

అని రూపు దాల్చింది.

మూలంలోని–

"How many flowers
possess no fragrance from the day
of their birth : How many clouds
Gather in the Sky, barren of rain
Dropping no pearls"

అనే పంక్తులు నారాయణరెడ్డి లేఖినిలో ప్రవేశించి

"పుట్టినప్పటినుండి పరిమళాలేని
పూలెన్ని లేవు?
గగనాన మూగి వర్షించగాలేని మే
ఘాలెన్ని లేవు?

అనే చరణాలుగా కదలిసాగినవి. ఈ విధంగా ఈ అనుసరణంలో నారాయణ రెడ్డి ముద్ర, ఆతని ప్రతిభాతేజస్సు పదపదంలో ప్రత్యక్షమవుతుంది. అందుకే ఇది అనువాదం కాదు-అనుసృజనం.

మహాకవి ప్రతిభానేత్రం అంబరాన్ని చుంబించే శిఖరాలనూ అగాధాలకు పాకుతూపోయే లోయలనూ సమంగా స్పష్టంగా సందర్శిస్తుంది; ఆతని హస్తం ఆ దృశ్యాలను అందంగా సహృదయస్పందంగా అందిస్తుంది. ఈ మాట అటు జిబ్రాన్ సృజనకూ ఇటు నారాయణరెడ్డి అనుసృజనకూ సమంగా వర్తిస్తుంది. అందుకు ఈ సంపుటి నిదర్శనం.

ఒకభాషలోని మహనీయకవిత్వాన్ని మరోభాషలో అవతరింపజేయడం ఇంచుమించు అసాధ్యం. అయితే ఒకభాషలోని కవితాసంపదను మరొకభాషకు అందివ్వడానికి కేవలం భాషాపాండిత్యాలే చాలవు. వీటికి తోడుగా ప్రతిభా సముపేతమైన కవితాహృదయం, కవితారహస్యాలను తెలుసుకోగల్గిన వ్యుత్పత్తీ ఉండాలి. జిబ్రాన్ కవితలకు నారాయణరెడ్డి అనుసరణాన్ని పరిశీలిస్తే ఈ యాథార్థ్యం ప్రస్ఫుటంగా ప్రత్యక్షమవుతుంది.

# ముత్యాలకోకిల

'భారతకోకిల' శ్రీమతి సరోజినీనాయుడు ఆంగ్లంలో అల్లిన అనేక కావ్యాలలోని యాభై కవితాఖండికలకు తెలుగులో నారాయణరెడ్డి చేసిన 'అనుసృజనం' 'ముత్యాలకోకిల'. ఈ కవితాసంపుటిని 1979లో సరోజినీ నాయుడు శతజయంత్యుత్సవసందర్భంగా ఆంధ్రసహృదయలోకానికి అందించినాడు నారాయణరెడ్డి.

నారాయణరెడ్డి నిత్యకవితావ్రతశాలి. ఎప్పుడూ ఏదో సృష్టి జరగాలనే తపన ఆతనిలో జ్వలిస్తూ ఉంటుంది. ఆసృష్టి మౌలికం కావచ్చు లేదా అనుసరణాత్మకం కావచ్చు. ఏదైతేనేం, నూత్నసృష్టిజరగాలంటే కొత్తకొత్త గ్రంథాలను అధ్యయనంచేస్తూ ఉండాలి. అలా నిరంతరం సాగే ఆలోకనం వల్ల హృదయకేదారం సారవంతమౌతుంది. నవ్యభావోదయం జరుగుతుంది. ఆ భావసంపదే నూతనకావ్యావిర్భావానికి నాంది పలుకుతుంది. అందుకే నిరంతరరచనాశీలికి అనవరతగ్రంథావలోకనం ఆవశ్యకం. ఈ కారణం చేతనే ప్రాజ్ఞుడైన నారాయణరెడ్డి సరదాగా భిన్నభిన్నభాషల్లో వెలిసిన ఉత్తమ సృజనాత్మకగ్రంథాలను తిరగేస్తుంటాడు, ప్రసిద్ధకవయిత్రి శ్రీమతి సరోజిని ఇంగ్లీషులో వ్రాసిన కవితలను ఇలాగే తిరగవేసినాడు. వాటిని చదువుతూ ఆమె కవితాశక్తికి ఆనందతరంగితుడైనాడు. ముఖ్యంగా 'Indian

weavers' అనే కవిత ఆతణ్ని ముగ్ధుణ్ణి చేసింది ఇకనేం! ఆమె కవితలను అనువదించాలని సంకల్పించుకున్నాడు.[1] 'ఆరాధన' అన్న కవితతో ఆరంభించి సరోజినీ శతజయంతినాటికి యాభై కవితలను గేయాలుగా మలచినాడు. భారతకోకిల గానంలోని 'సువ్యక్తసముదాత్తరసావేశస్వరధుని'ని తెలుగు గుండెలలోకి ప్రవహింపజేసి ఆనందసస్యాలను పండించినాడు.

"సరోజినీకి 'భారతకోకిల' అనే బిరుదుంది. ఆమె ఇంటిపేరు ముత్యాలవారు. రెంటినీ కలిపితే ఆమె ముత్యాలవారింటి కోకిల. 'ముత్యాల కోకిల'—" అని ఈ సంపుటి నామకరణాన్ని గూర్చి నారాయణరెడ్డియే వివరించినాడు.[2] ఇందులో కోకిల శబ్దం సృజనాత్మకస్వేచ్ఛాగానమాధురికి సంకేతం. ముత్యాలపదం కోకిలకు విశేషణం. స్వచ్ఛతాధావళ్యాలు దీనివల్ల ప్రసరిస్తున్నాయి. ముత్యాలతెలుపు శారదాస్వరూపాన్ని తెలుపుతుంది. కవితాగానాలు దీనివల్ల ధ్వనిస్తున్నాయి. 'ముత్యాలకోకిల' అన్నపేరు విన్నప్పుడు నాకు ఈ భావాలు స్ఫురించినాయి.

మహాకవయిత్రిగా స్వాతంత్ర్యసమరనేత్రిగా వక్తృత్వమూర్తిగా దేశసేవాస్ఫూర్తిగా సరోజినీనాయుడు వ్యక్తిత్వం మనకు దర్శనమిస్తుంది. పదేళ్ళ పల్లవదశలోనే ఆమె మనోవనిలో కవిత పల్లవించింది ; వయసుతో పాటు ఆమె కవిత్వం మొగ్గలు తొడిగింది ; పూలు పూచింది ; పరిమళాలు వెద జల్లింది ; రసమహితములైన ఫలాలనందించింది. 'Thd Golden Threshold', 'The Bird of Time', 'The Broken Wing', 'The Sceptred Flute', 'The Feather of the dawn' అనే కావ్యాలు ఇలాంటి ఫలాలే. ఆంగ్లకవి ఎడ్మండ్ గాస్ (Edmond Gosse) హితోపదేశాన్ని అనుసరించి పాశ్చాత్యకవితావాతావరణచిత్రణాన్ని మానుకుని సరోజిని భారతీయసంస్కృతివికాసాన్నీ, దేశీయప్రకృతిసౌందర్యాన్ని సమకాలిక ప్రజాజీవనాన్ని పుక్కిలించే రచనలు కావించింది. ఆర్థర్ సైమన్ (Arthur Simon) వంటి సాహితీవేత్తల ప్రశంసలందుకున్నది. ఈమె కవితాప్రతిభ

---

1. 'ముత్యాలకోకిల'- 'కృతజ్ఞతలు' లో నారాయణరెడ్డి మాటలు పుట(IX)
2. 'ముత్యాలకోకిల'-'కృతజ్ఞతలు'లో నారాయణరెడ్డి మాటలు-పుట (X)

ఈమెకు-'కైసర్ ఎ హింద్' అనే సువర్ణపతకాన్నీ, 'Nightingale of India' అనే బిరుదునూ అంతర్జాతీయఖ్యాతినీ సంపాదించిపెట్టింది.

తెలుగుబిడ్డయైన డా॥ ముత్యాల గోవిందరాజులునాయుడుగారితో కందుకూరి వీరేశలింగం ఆధ్వర్యంలో ఆమెకు జరిగిన ప్రేమవివాహం వర్ణాంతర భాషాంతరవివాహాలకు ఆదర్శం.

దేశాభిమానం, సంస్కృతిప్రియత, వైదుష్యం, సత్యధర్మస్వేచ్ఛానురక్తివంటి గుణాలను సరోజిని, విజ్ఞానశాస్త్రనిపుణుడూ విద్యావేత్త అయిన తనతండ్రి అఘోరనాథచటోపాధ్యాయుని నుంచీ, కవితా సౌరభాలను మాతృమూర్తి శ్రీమతి వరదసుందరి నుంచీ వారసత్వంగా గ్రహించింది.

కవితామూర్తియైన సరోజిని గాంధీప్రభావంతో భారత స్వాతంత్ర్య సమరంలో దూకింది. అనేక కాంగ్రెస్‌మహాసభల్లో పాల్గొని తన వక్తృత్వాన్ని గళశంఖంలో పూరించి భారతీయుల హృదయాలను స్వాతంత్ర్యనినాదాలతో ప్రతిధ్వనింపజేసింది. కారాగారవాసాన్ని అనుభవించింది. స్వాతంత్ర్యానంతరం ఉత్తరప్రదేశ్‌కు 'గవర్నర్'గా దేశసేవచేసింది. ఆమె తన జీవిత పూర్వార్ధం కావ్యరచనకూ ఉత్తరార్ధం స్వాతంత్ర్యోద్యమానికీ అంకితం చేసింది.

నారాయణరెడ్డి ఈ సంపుటి 'అవతారిక'లో సహృదయులకోసం సరోజినీనాయుడు కవితా వ్యక్తిత్వాలనుగూర్చి సంక్షిప్తంగా శైలీరమ్యంగా వివరించినాడు.

నారాయణరెడ్డి మహాకవి. శబ్దార్థరహస్యాలూ, పదప్రయోగమర్మాలూ తెలిసినపండితుడు. ఛందస్సును మందహాసం చేయించగల ప్రతిభావంతుడు. అంతేకాదు—కవితాహృదయమున్న రసజ్ఞుడు. ఉర్దూ హింది ఆంగ్లంవంటి భాషలతో చక్కని పరిచయం గలవాడు. అన్యభాషాకవుల కవితాత్మను ఇట్టే కనిపెట్టగల కుశాగ్రధిషణ ఆతనిది. అందువల్లనే ఆతని అనువాదం అనువాదంలా అగుపించదు. ఆతని మౌలికసృష్టియే అన్నంత మనోహరంగా రూపు దాలుస్తుంది. ఇందుకు ఇప్పటిదాకావచ్చిన 'గాంధీయం', 'మీరాబాయి', 'శిఖరాలూ-లోయలూ' అన్న కావ్యాలే నిదర్శనం. ఇవి అనువాదాలు కావు.

అనుసృజనలు. 'అనుసృజనం' అన్నపదం నారాయణరెడ్డిగారి ప్రయోగమే.[1]

వేరేభాషల్లోని కవితాత్మను గ్రహించి తనభాషలో ఛందస్సుందరంగా స్వీయరచనయా అన్నంతమధురంగా అందించటానికి ఒక కవికి మౌలిక సృష్టికి కావలసినదానికంటె అధికప్రయాస, విశేషకృషి అవసరమవుతుంది. అంతకృషిచేసి అన్యభాషలోనుంచి మాతృభాషలోపునస్సృష్టిచేసిన రచనను కేవలం అనువాదం అనడం సమంజసంకాదు. ఔచితీమర్యాదావిదుడూ నవ్య పదప్రయోగదక్షుడూ అయిన నారాయణరెడ్డి అందుకే 'అనుసృజనం' అన్న పదాన్నిప్రయోగించి 'ముత్యాలకోకిల'ను 'అనుసృజనం' అని పేర్కొన్నాడు.[2] ఈసంపుటి ఆతని అనుసృజనాత్మకశక్తికి మరో అక్షర తార్కాణం.

ప్రతిభాసంపద, వ్యుత్పన్నత, భవ్యకవితావేశం, మధురగంభీర వక్తృత్యం, దేశాభిమానం, జాతీయభావపుష్టి వంటి గుణాలలో సరోజినీ నాయుడుకూ నారాయణరెడ్డికీ సాధర్మ్యంఉన్నది. ఏమైనా ఆతనిని ప్రబలంగా ఆకర్షించింది అనల్పప్రతిభామహితమైన సరోజినీకవితాశక్తియే.

ఇంగ్లీషులో ఛందోమర్యాదలతో సాగిన సరోజిని ఖండికలు నారాయణరెడ్డి దేశీయగేయచ్ఛందస్సుల్లోకి మలచి ఆమెగీతాత్మను పదిలంగా పరిమళం తరగకుండా తన సహజరమ్యమైనశైలిలో అందించినాడు, మూలంలోని కవితాచరణసంఖ్యతో నిమిత్తంలేకుండా భావం ఎన్ని పాదాలలో ఒదగ గలిగితేఅన్నిపాదాలలో తెలుగుతనం గుబాళించేలా పొదిగినాడు. ఉదాహరణకు కొన్ని— ఈ సంపుటిలోని మొదటి కవిత- 'పల్లకీబోయీలు' (Palanquin-Bearers). ఇందలి కొన్ని పంక్తులకు ఆంగ్లమూలం ఇది-

"Lightly, O lightly, we bear her along
She sways like a flower in the wind of our song

1. 'శిఖరాలూ-లోయలు' పుటలు 6-7 ప్రచురణ 1974.

2. 'ముత్యాలకోకిల' - పుటలు I & X

She skims like a bird on the foam of a Stream
She floats like a laugh from the lips of a dream
Gaily, O gaily we glide and we sing
we bear her along like a pearl on a string"

ఈ పంక్తులు నారాయణరెడ్డి 'అనుసృజన'లో ఇలా ఆకృతి దిద్దుకున్నాయి త్రిశ్రగతిలో-

"మోస్తున్నాము మెల్లగ మోస్తున్నాము
ముదిత ఉన్న పల్లకీని మోస్తున్నాము
పాట పైరగాలిలోన ఊగె నామె పువ్వులా
ఏటినురగచాలులోన తేలెనామె గువ్వలా
విరబూసిందామె కలలపెదవుల చిరునవ్వులా
మోస్తున్నాము ఆమెను ముచ్చటగా
మోస్తున్నామాముదితను ముత్యంగా"

మూలంలోని మొదటి పంక్తి తెలుగులో రెండుపాదాలుగా పల్లవిగా పల్లవించింది. ఆంగ్లంలోని 'her' అన్నమాటకు 'ముదితఉన్న పల్లకీని' అన్న తెలుగురూపం ఎంతసమర్థంగా ఎంత ఔచితీమంతంగా ఉందో సహృదయులు గ్రహించగలరు. అలాగే 'wind'ను వీచేగాలి అనకుండా 'పైరగాలి' అనీ, 'Bird'ను పక్షి, లేదా పిట్ట అనకుండా 'గువ్వ' అనీ, 'floats' తేలియాడు అనకుండ 'విరబూసింది' అనీ మార్చి తన కవితామతిని ఆవిష్కరించినాడు, తెలుగుతనాన్ని ఒలికించినాడు నారాయణరెడ్డి.

మూలంలోని ఐదవ ఆరవ పంక్తుల్లోని మాటలన్నింటిని పిండి సారాన్ని మాత్రం సహృదయుల కందించినాడనడం సమంజసం. 'Pearl on a string' లో Stringను వదిలేసి ఆ అర్థాన్ని ధ్వనింపజేసినాడు ఈకవి. ఈ పాటలో

"మోస్తున్నాము మెల్లగ మోస్తున్నాము
ముదిత ఉన్న పల్లకీని మోస్తున్నాము"

అన్న పంక్తులు అందంగా పల్లవిలా పలుకుతున్నాయి. జానపదుల గానమక రందాన్ని చిలుకుతున్నాయి. ఇందుకు కారణం నారాయణరెడ్డిగారి శీలం. ఆతడు అసంఖ్యాకగేయకర్తయేకాదు మధురగాయకుడు కూడా. ముత్యంలాంటి పాట వ్రాసి ముచ్చటగా పాడగలడు. సరసంగా గేయమల్లి స్వరకల్పన చేయ గలడు. రచనాప్రతిభతో పాటు రమ్యగానఫణితీ కల్గినవాడు కనుకనే ఈ 'అనుసృజనం'లోని గేయాలు కొన్ని తీయని పల్లవులతో చదువరుల ఉల్లా లను కొల్లగొడుతున్నాయి.

ఇంకొక ఉదాహరణ—

'Indian weaves' అన్న కవిత ఇలా ఉంది-

'Weavers, weaving at break of day
why do you weave a garment so gay?'
'Blue as the wing of a halcyon wild
we weave the robes ot a new-born child'
'weavers, weaving at fall of night
why do you weave a garment so bright?'
'like the plumes of a peacock, purple and green
we weave the marriage-veils of a queen.'
'weavers weaving solemn and still
why do you weave in the moonlight chill?'
'white as a feather or white as cloud
we weave a dead man's funeral shroud.'

దీనిని 'ఎందుకు నేస్తున్నారు' అన్న శీర్షికతో మూలంలోవలెనే పన్నెండు పంక్తులుగా— ప్రశ్న సమాధానములుగా - ఇలా తెనిగించినాడు—

'ఈ ప్రభాతవేళ ఇంత మురిపెంగా
ఈ వలువలు మీరెందుకు నేస్తున్నారు?'
నీలి హంసరెక్కలనే తలపించే
నెరవలువలు పసిబిడ్డకు నేస్తున్నాము.'
'ఈ మలిసందెలో ఇంత అందంగా

ఈ వలువలు మీరెందుకు నేస్తున్నారు?'
'పలువన్నెల నెమలికనులు తలపించే,
పట్టుచీర కల్యాణికి నేస్తున్నాము.'
ఈ చలి వెన్నెల్లో ఇంత మౌనంగా,
ఏమిటిదీ? మీరేదో నేస్తున్నారు?'
'వెలిమబ్బుల తెలి కల తలపించే
వలువ శవాలంకరణకు నేస్తున్నాము.'

'Halceyon' అనగా లకిముకిపిట్ట. ఇది నారాయణరెడ్డి కలంలో 'హంస'గా మారింది. అలాగే - 'We weare the marriage-veils of a queen' అన్న చరణం -- 'పట్టుచీర కల్యాణికి నేస్తున్నాము'గా ఆకృతిదాల్చింది. ఇందలి 'కళ్యాణి' శబ్దం అర్థసంక్షిప్తతనూ ప్రౌఢినీ గర్భీకరించుకున్నది. 'Dead man's fueneral shroud'ను 'వలువ శవాలంకరణకు' అని అనడంలో చేయి తిరిగిన పనితనం కనిపిస్తుంది.

అనుసృజన విధానాన్ని చూడడానికి మచ్చుకు మరికొన్ని పంక్తులు 'Bangle-sellers' (గాజులవాళ్లు) లో నుంచి—

"Bangle-Sellers are we who bear
our shining loads to the temple fair
who will buy these delicate, bright
Rainbow-tinted circles of light?
Lustrous tokens of radiant lives
For happy daughters and happy wives."

అనుసృజనంలో పైపంక్తులు ఇలా అవతరించినాయి—

"గాజులవాళ్లం మేమండీ
గాజులవాళ్లం మేము
మూపున మెరిసే గాజుల మోపులు
మోసుక్కువెళుతున్నాము
ఇవిగివిగో! ఈ సింగిణిరంగుల
చివురువెలుగు చక్రాలు

ముద్దుబిడ్డలకు ముద్దుగుమ్మలకు
ముంపెపు బ్రతుకుల గురుతులు"

జానపదులు పాడుకునే పాటల తీరునెన్నులు ఈ గేయం మొదట్లోనే పాఠకులను ఆకర్షిస్తుంది. మూలంలోని 'Temple fair' అనుసృజనంలో అదృశ్యమైంది. అయినా గేయం అచ్చపు వన్నెలను చిమ్ముతూనే ఉన్నది. గాజుల వాళ్లు temple fairకే కాదు అన్నిచోట్లకూ వెళ్లుతారు. అందువల్ల స్థలనిర్దేశం లేకున్నా ఏమీ అనిపించడంలేదు తెలుగులో. 'చివురు' అన్నమాట delicate అనే పదంవల్ల రాని ఒక కొత్తశోభను రూపింపజేస్తున్నది.

మూలంలో ఇరవైనాలుగు పంక్తులున్న ఈ కవిత తెలుగులో ముప్పైరెండు చరణాలమూర్తిగా సాక్షాత్కరించింది. ఈ అనుసృజనంలో మూలంలో వలె ఉన్నవిఉన్నట్లుగా గాక కొన్ని కవితాపంక్తులలోని మాటలనే గ్రహించి కొన్ని శీర్షికలకు ఆకర్షణీయంగా నామకరణం చేసినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు—

'ఎందుకు నేస్తున్నారు' (Indian weavers), లెండిసోదరులార (Coromandal Fishers), యా అల్లా యా అల్లా (wandering beggers), విధీ (A Challenge to Fate), నాగినీ (The Snake Charmer)، అసూర్యంపశ్య (The Pardanashin) వంటి వాటిని చూడవచ్చు. ఇలా ప్రతిభామూర్తి అయిన నారాయణరెడ్డి సరోజినీనాయుడు కవితామూర్తిని తనలో నిలుపుకుని తెలుగుతనం ఉట్టిపడేలా ఈ అనుసృజనం సాగించినాడు.

సరోజినీ కావ్యాలు ఆంగ్ల కాల్పనికకవితా మధువును చిందిస్తూనే భారత జాతీయభావ పరిమళాలను పుక్కిలిస్తాయి. ఆమె కావ్యప్రపంచంలో వినిర్మల ప్రణయావేశం ప్రవహిస్తుంది. విశాలప్రకృతిసౌందర్యం వేయిరేకులతో విప్పారికనిపిస్తుంది. పల్లెల్లోని పైరగాలి ప్రసరిస్తుంది. హైదరాబాద్ నగరం నిగనిగలు మెరుస్తాయి. గోరింటాలూ అడవిమల్లెలతోపాటు, గుల్‌మొహర్లూ గులాబీలూ గుబాళిస్తాయి. ఉడుతలూ నాగులతోపాటు, చిలుకలూ కోకిలలూ విహరిస్తాయి. పల్లకీబోయీలూ పాములవాళ్లూ, చేనేత వాళ్లూ చేపలవాళ్లూ ఫకీర్లూ పాటగాళ్లూ గాజులవాళ్ళూ సహజ సుందరంగా కనిపిస్తారు,

ఈ 'ముత్యాలకోకిల' చదివితే సరోజినీనాయుడు మహనీయకవితా వ్యక్తిత్వం ఆమె బహుముఖప్రతిభా వైభవం ద్యోతకమవుతాయి. ఆమెకావ్య హృదయనిధిలో ఒదిగిన 'అక్షరానంతసువర్ణ శోభ'ను ఈ అనుసృజనం అందిస్తుంది.

సరోజినీ కవితామూర్తి రసోజ్వలమైనది. ఆమె ప్రతిభాచక్షువులు-

'రవిదీప్తాద్రులపై తా
రాఖచితాభ్రముపై'

విహరించి వస్తాయి. ఆమె అంతరాత్మ—

"మ్రోగేలోయల పరిణయరాగాలను
గతవర్షోత్సవరసమయ కావ్యాలను
ఆందోళిత సమీరాల
అపరాజిత సాగరాల
స్వరియించే గీతికలను
తరగెత్తే రాగిణులను"

వినగలదు. ఆమెది మనోభాష. రసోగ్రహృదయం ఆమెది. ఆమె స్వేచ్ఛా భావం 'వానరెక్కలెక్కి' సాగగలదు. ఆమె జైత్రమతి-'పవనజవప్రత్యర్థి'. శోకాలనూ సుఖాలనూ సంత్రాసాలనూ విషాదాలనూ లెక్కపెట్టదామె.

సరోజినీనాయుడు భావనాబలం, వర్ణనాపటిమ ఆశ్చర్యానందాలను కలిగిస్తాయి. ఉదాహరణకు-

"పెండ్లినాటి హోమాగ్నివంటివివి
పెంట్లిపడుచు తలపు వన్నెసిరులివి
కిలకిలలాడే ఆమెనవ్వులివి
జలజలకురిసే ఆకన్నీళ్ళివి"

అన్న గాజులవర్ణనమూ

"............ఇప్పుడిప్పుడే
ఇలపైనపడిన చుక్కలతునకలేమొ"
"మదమత్తమధుమాస పదకింకిణులో"
"తనకన్నెతనమునే తలపోసి ఒకపెండ్లి
పడుచుచిందిన రుచిరబాష్పకళికలో"
"తరలిపోయినస్వప్నతరళాత్మల విధాన
పొడచూపినారు"

అన్న అడవిపూలవర్ణననూ

ఓ సరోవరమా!
ఓ సజీవమదాత్మబింబమా"

అనే హుసేనుసాగర వర్ణననూ

"........నాయెద పా
దునపూచిన గాయాలకు
అనుకరణలుకావా మరి"

అని ఎఱ్ఱపూలవర్ణననూ చదివిన సహృదయులు రసానందతరంగితులై సరోజినికి హృదయాంజలులు సమర్పించకపోరు.

"శయనించె తెమ్మెర ఉ
షాదేవి ఒడిలోన
రేయెల్లయేడ్చి ని
ద్రించు పసిపాపవలె"
"మలిసందె వాలింది మబ్బుపైన, విషాద
హృదయాన ఆనందరేఖవోలె"
"ఆమె తప్తజీవనం ని
రంతర పరిరక్షితం గ
వాక్షాల తెరలమాటున
మకుటశిఖా సమలంకృత
మణులవోలె

ప్రియునిగుండెలో దాగిన
ప్రేమరహస్యాలవోలె"

అని—తెల్లవారుజామున వీచే తెమ్మెరనూ- మలిసందెనూ, అసూర్యంపశ్యనూ వర్ణించే పై పంక్తుల్లోని ఉపమాలంకారములు ఎంత రమణీయములో రస హృదయు లెరుగుదురు.

"తీసుకో నా మేనికండలను
వేసుకో నీ యింటి కుక్కలకు
తలపుంటె నా నెత్రుచేదుకొని
తడుపుకో నీ తోటమొక్కలకు"
"ఓ ప్రియా నేను నీ యెదలోనె
ఒదిగివుంటాను సుమలీలగా
కాకుంటె రగిలిపోతానులే
నీకొరకు నరకాగ్నికీలగా"

వంటి పంక్తుల్లో సరోజినీనాయుడు వినిర్మలప్రణయం ఆత్మార్పణాన్ని అభి లషిస్తుందని చెపుతూనే అద్వైతత్త్వాన్ని వ్యంగ్యమనోహరంగా ఆవిష్కరిం చింది. ఇలా ప్రవిమలావిభాజ్యప్రణయాన్ని ప్రపంచించే ఖండికలు ఈ సంపుటిలో అనేకం.

దేశభక్తిప్రపూరితమైన సమైక్యభావప్రఫుల్లమైన సరోజినీ హృదయాన్ని 'ఒకే హృదయం'(An Anthem of love), మేలుకోమాతల్లి (Awake) అన్న ఖండికలలో దర్శించవచ్చు. మానవదేహానికి చేతులూ కాళ్లూ, కళ్లూ చెవులూ రెండేసి ఉన్నా హృదయం మాత్రం ఒకటే అయినట్లు, భారతీయుల లక్ష్యం ఒకటే అనీ, వారంతా మంచిపనులే చేస్తారనీ తన ఆత్మవిశ్వాసాన్ని ధ్వనిమనోజ్ఞంగా వ్యక్తంచేసింది 'ఒకే హృదయం' కవితలో.

ఈదేశంలోని హిందువులు 'పూజాసుమా'లతో మహమ్మదీయులు 'ప్రేమఖడ్గం'తో, క్రైస్తవులు 'విశ్వాసగీతి'తో భారతజననిని అభిషేకిస్తూ

రక్షిస్తూ కీర్తిస్తారనీ, వారంతా అచంచలదేశభక్తులనీ ఆతల్లి మహాత్మకు వారు వారసులనీ ఘోషించింది 'మేలుకోమాతల్లి' ఖండికలో.

'ఒంటరిపాప' (The lonely child), జోలపాట (cradle song) అన్న ఖండికలు సరోజినీ సుధామధుర మాతృహృదయానికెత్తిన వైజయంతి కలు. విసురాత్రిపాట (corn-grjnders) 'ఒంటరిపాప' కవితలు కథా కథనంలో, బాలల మనస్తత్త్వ చిత్రణంలో ఆమెకు గల చాతుర్యాన్ని చాటు తున్నాయి. కాలవిహంగం (The Bird of Time) గభీరమైన ప్రతీకాత్మక రచన. 'కాలవిహంగం' కమనీయమైన రూపకం.

సరోజినీనాయుడు తన ఆత్మను అమృతగీతాలలో భద్రపరచి వాటిని—

"నేను మరణించగాలేనులే
నిలువవే మృత్యువా! నిలువనే"

అంటూ మృత్యువుకు కూడా వినిపించింది. ఇంకమృత్యువు ఆమెను ఎలా సమీపిస్తుంది? అందుకే పైపంక్తులు ఇప్పుడేకాదు- ఎప్పటికీ అలాగే విని పిస్తుంటాయి ఆమె అమృతాత్మనుంచి.

ఈ 'ముత్యాలకోకిల' కావ్యాన్ని చదువుతుంటే సరోజినీదేవిని తన హృదయంలో నిలుపుకొని నారాయణరెడ్డి గానం చేస్తున్నాడా లేక సరోజినియే నారాయణరెడ్డి ముఖతః తెలుగులో పలుకుతున్నదా అనిపిస్తుంది. అంత సహజధారామధురంగా రసవంతంగా ఉన్నాయి కవితలన్నీ. ముఖ్యంగా 'పల్లకీబోయీలు', 'గాజులవాళ్ళు', 'ఒకే హృదయం', ఆరాధన', 'విసు రాత్రిపాట', 'ఒంటరిపాప', 'నాగినీ'. 'ఆగవేమృత్యువా'— అనే ఖండి కలు నారాయణరెడ్డి 'అనుసృజనం'లాలేవు. ఆతని 'సృజనం'లాగానే ఉన్నాయి. ఇంత ఫలవంతమైన 'అనుసృజన'కుకారణం గేయరచనలో, గాన శైలిలో జానపదులపదాల విన్యాసంలో శబ్దపరిమళగ్రహణంలో నవ్యతా ప్రయోగశీలంలో నారాయణరెడ్డికిగల బహుముఖీనప్రతిభయే.

ఇంత రసరమ్య గీతాలలోనుంచి కొన్నింటిని-'పల్లకీబోయీలూ, 'గాజుల వాళ్లు'వంటివాటిని, ఇటీవలే చిత్రీకరించి నయనశ్రవణ తర్పణంగా ప్రసారం చేసినారు హైదరాబాదు దూరదర్శన్ కేంద్రం వారు.

'ముత్యాలకోకిలా!' అని సరోజినీ నాయుడు ప్రతిభను ప్రశంసిస్తూ తన ఈ 'అనుసృజనం' గూర్చి ఇలా చెప్పుకున్నాడు నారాయణరెడ్డి-

"నీ గీతి చదివి
నిన్నెదను పొదిగి
పలికితిని నీ వాణి
తెలుగులా ఎదిగి"

ఈ 'ముత్యాల కోకిల'ను చదివిన సహృదయులంతా ఆ మహాకవి చెప్పిన మాటలను ఆమోదిస్తారనీ, సరోజినీ అమృతవాణిని తన అంతరంగంలోనే దాచుకోకుండ మరింత ఎదిగి, ఆమె వాణిని 'తెలుగులా' పలికి తెలుగు గుండెల్లో నిలిపినందుకు ఆతణ్ణి అభినందిస్తారనీ ఆశిస్తున్నాను.

ఆంగ్లభాషానిష్ణాతులైన అదృష్టవంతులను చూసి నావంటివాడు అసూయపడనక్కరలేకుండా నారాయణరెడ్డి సరోజినీదేవి కవితాత్మను తెలుగులో ఇలా అందించి కృతజ్ఞతాపాత్రుడైనాడు.




# మందార మకరందాలు

బమ్మెర పోతన్న భాగవతంలోని మన్నికైన యాభైయారు పద్యాలకు నారాయణరెడ్డి వ్రాసిన కమనీయ వ్యాఖ్యానమే "మందారమకరందాలు".[1] 'యువభారతి' అనే ప్రసిద్ధ సాహితీసాంస్కృతికసంస్థ సమాజంలో సాహిత్య చైతన్యాన్ని కల్గించే ఉద్దేశంతో తెలుగు సాహిత్యంలోని ప్రసిద్ధ కవుల కావ్యాల్లోని కొన్ని మంచి పద్యాలను కవితాత్మగల సహృదయ విమర్శకుల చేత చక్కని వ్యాఖ్యానం వ్రాయించి ప్రజానీకానికి అందించాలని 'సాహితీ వాహిని' పేర ఒక కార్యక్రమం ఆరంభించింది. ఈ 'సాహితీవాహిని'లో మొదటి తరంగంగా బమ్మెర పోతన్న భాగవతంలోని కొన్ని పద్య మందా

1. 'యువభారతి' సంస్థవారి ప్రచురణ (అక్టోబరు 1973)

రాలను మకరంద వ్యాఖ్యానం వ్రాయాలని నారాయణరెడ్డిని కోరింది. ఆ కోరిక మేరకు నారాయణరెడ్డి ఈ వ్యాఖ్యానం రచించినాడు.

నారాయణరెడ్డి ఎంతకవియో అంత పండితుడు, ఎంత పండితుడో అంత విమర్శకుడు. ఆంధ్రభారతం మొదలుకొని ఆధునికయుగంవరకూ ఉన్న ఆంధ్ర భాషాసాహిత్యాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి విద్యార్థులకు పాఠాలు చెపుతున్న ఆదర్శాధ్యాపకుడు. ఆతని కలంలో ఎంత బలముందో ఆతని గళంలోనూ అంత బలముంది. ఆంధ్రాభ్యుదయోత్సవాలు మొదలు అనేక సభల్లో పాల్గొని ఆతడు చక్కని వ్యాఖ్యాతగా ప్రఖ్యాతికెక్కినాడు. ఈ 'మందారమకరందాలు' ఆతని వ్యాఖ్యాన రచనాశక్తికి అక్షరసాక్ష్యంగా అగుపిస్తుంది.

భాగవతంలోని పద్యాలను ఎన్నుకోవడంలో కూడ ఎంతో జాగరూకత ప్రదర్శించినాడు నారాయణరెడ్డి. ఎన్నుకున్న పద్యాలన్నీ ప్రజలకు చిరపరిచితాలే ; పోతన్న రచనాశక్తికి నిలువుటద్దాల్లాగా నిలిచేవే ; తెలుగుల 'నోటికీ హృదయకోటికీ' ఎక్కినవే.

కవితాత్మనూ, కవితాసౌందర్యాన్నీ పట్టి చూపడంలోనే ఉంటుంది వ్యాఖ్యాతృప్రతిభావిశేషమంతా. ఈ గ్రంథంలో ఎన్నుకున్న ప్రతిపద్యం ఎందుకు ప్రాచుర్యాన్ని పొందిందో, ఆ పద్యంలో దాగివున్న వశీకరణశక్తి ఏమిటో, ఎక్కడుందో చెప్పడానికి ప్రయత్నించి అందులో కృతకృత్యుడైనాడు వ్యాఖ్యాత.

ఈ వ్యాఖ్యానంలో అక్కడక్కడా నారాయణరెడ్డి పోతన్న స్వచ్ఛంద వ్యక్తిత్వాన్నీ, నిరాడంబర జీవితాన్నీ ఆతని ఆత్మవిశ్వాసాన్నీ చక్కగా చూపించినాడు. పద్యాల్లో నిగూఢంగా వినిపించే ధ్వనినీ, అందలి రమణీయ రహస్యాలనూ వివరించినాడు. ఛందస్సులో పాత్రల అంతఃకరణం ఎలా ప్రతిఫలించిందో నిరూపించినాడు. వ్యాసభాగవతంలో కనిపించని, పోతన్న గీసిన కొత్త బొమ్మలనూ, వేసిన విశేషణాలనూ, తీసిన రంగురంగుల చలన చిత్రాలనూ ఎత్తిచూపినాడు. పరమగభీరమైన బ్రహ్మజిజ్ఞాసనూ తాత్త్విక విషయాలనూ చిన్నచిన్నమాటల్లో ఎలా పోతన్న వ్యక్తం చేసినాడో, వ్యాఖ్యానించినాడు. పోతన్న పద్యాల్లో వినిపించే శబ్దాలంకారాలను, అంత్యప్రాసల

క్రీడలను, అవి చేసిన గారడీలను కళ్ళకు కట్టించినాడు. పోతన్న పద్యాల ఎత్తుగడల్లో, ఆతని పచ్చపచ్చని అచ్చమైన తెలుగు పలుకు బళ్ళలో, సాభిప్రాయపదప్రయోగాల్లో తర్వాతి కాలాన నవనవలాడే నానుడులుగా వికసించిన పద్యపాదాలలో తొంగిచూచే కవితాత్మ ఏమిటో, కవితా సౌందర్యమేమిటో అది సాధించిన రసాభ్యుదయమేమిటో రమణీయంగా వివరించినాడు నారాయణరెడ్డి.

'అల వైకుంఠపురంబులో నగరిలో' అన్న పద్యానికి నారాయణరెడ్డి చేసిన ఆ మకరంద మధుర వ్యాఖ్యానాన్ని చవిచూడండి–

"గజేంద్రుడు మొరపెట్టుకునే సమయంలో ఆ దేవుడు ఏ స్థితిలో ఉన్నాడో వర్ణించడం ఈ పద్యంలోని చిత్రం. ఒక్కమాటలో చెప్పాలంటే ఆ మహావిష్ణువు అప్పుడు రమాసాంగత్యంలో తేలియాడుతున్నాడు.

కాని, మూడు ముక్కల్లో ముడిచి చెప్పడం పోతన్న పద్ధతి కాదు. రసకేళీపరవశుడైన ఆ రమాధవుని స్థితికి ఒక చలనచిత్రాన్ని రూపొందించినాడు; కనులముందు అతని ఉనికి కదలాడేటట్టు చూపినాడు.

అలవైకుంఠపురం; ఆ పురంలో అంతఃపురం; అందులో ప్రధాన సౌధం; ఆ సౌధ సమీపంలో అమృత సరోవరం; అక్కడ చంద్రకాంత వేదికపై కలువల పాన్పు; ఆ పాన్పుపై క్రీడిస్తున్న నారాయణుడు – ఇదీ పోతన్న కట్టిన చిత్రతోరణం.

ఇంత వివరంగా ఎందుకు చిత్రించినట్టు? ఎవరు మొరపెట్టినా ఎంతగా తలుపుతట్టినా లెక్కించని స్థితి అది. ఎక్కడో గజేంద్రుడు ఆక్రందిస్తుంటే ఇక్కడ ఇంతటి రసపారవశ్యంలో ఉన్న స్వామి సంరంభించడం సామాన్యం కాదు. జీవాత్మ పరమాత్మల మధ్య ఉన్న అంతులేని అఖాతాన్ని, అపార వ్యత్యాసాన్ని ఎంతో మెలకువతో చిత్రించినాడు. అతడు రమావినోదియైనా ఆర్తుని మొరవిని పరుగెత్తడానికి కారణం ఒక్కమాటలో సూచించినాడు కవి. అదే 'ఆపన్న ప్రసన్నుండు' అనేది. ఎక్కడున్నా జనార్దనుడు ఆర్తత్రాణపరాయణుడే. గజేంద్రుడున్న కరుణావస్థకు, ఉపేంద్రుడున్న శృంగారస్థితికి మధ్య ఆర్తి ఒక సేతువైంది. అదే ఈ పద్యంలోని కొసమెరుపు.

ఇక ఈ వ్యాఖ్యానశైలిని గురించి ఒకమాట — నారాయణరెడ్డి జన బాహుళ్యానికి పోతన కవితా సౌందర్యమాధుర్యాలను అందించాలనే దృక్ప థంతో అలంకారశాస్త్ర పారిభాషిక పదాలను ప్రయోగించక ఉన్న భావాన్ని వెన్నముద్దలా అందించినాడు వ్యావహారిక భాషలో.

పోతన్న భాగవత పద్యాల్లో ప్రతిపదాన్ని తూచితూచి వేసినట్లుగానే నారాయణరెడ్డి ఈ వ్యాఖ్యానంలో ఒక్కొక్క పదాన్ని ఎంతో జాగ్రత్తగా ప్రయోగించినాడు. పోతన్న పద్యాలవలెనే నారాయణరెడ్డి ఈ వ్యాఖ్యానం చెవులకు చవులూరిస్తుంది. చిత్తాలను ఉద్దీప్తం చేస్తుంది.

"మందార మకరందాలను చదివే పఠితకు ఈ వ్యాఖ్యానం చదువు తున్నట్లనిపించదు. నారాయణరెడ్డి మధురంగా మాట్లాడుతుంటే వింటున్నట్లుం టుంది" అన్న డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి పీఠికలోని మాటలు గమ నార్హములు.

అతి నవ్వులక్కు కూడా ఆస్వాదనీయంగా ప్రాచీన కావ్యసౌందర్యాలను సరళ మధురంగా, చిత్తాకర్షకంగా వివరించడంలో నారాయణరెడ్డి చూపిన వ్యాఖ్యానకౌశలం ఇంతకు ముందెన్నడూ కనివిని ఎరుగనిది.




## ముచ్చటగా మూడువారాలు

### మలేషియాలో తెలుగువాణి

ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు విచ్చేసిన మలేషియా ఆంధ్ర ప్రతినిధివర్గం ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు తమ దేశంలో జరుపవలెననే గాఢాభిలాషను వ్యక్తం చేయగా తెలుగుజాతి అందుకంగీకరించింది. తరువాత మలేషియా ఆంధ్ర సంఘం ఆహ్వానాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం డా॥ నారాయణరెడ్డి డా॥ దాశరథిగార్లను మలేషియా పర్యటనకై పంపించింది. "మలేషియాలో జరుగనున్న తెలుగు మహాసభలకు తొలిమజిలి"గా వీరి పర్యటన సాగింది. 30-6-'76 నుంచి 20-7-'76 వరకు—మూడు వారాలపాటు సాగిన పర్యటనవిశేషాలను వివరిస్తూ ఒక

చక్కని వ్యాసం వ్రాసినాడు నారాయణరెడ్డి. వ్యాసమే "ముచ్చటగా మూడు వారాలు-మలేషియాలో తెలుగువాణి". ఇది ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 8-9-76, 15-9-76 సంచికలలో వరుసగా ప్రచురితమైనది. మలేషియాలో జరిపిన సాహితీయాత్రావిశేషాలను ఈ వ్యాసంలో తేదీల వారీగా వివరించినాడు నారాయణరెడ్డి. భిన్నభిన్నస్థలాలనూ అచ్చటి సుందర ప్రకృతి దృశ్యాలను సందర్శించినప్పుడు, అనేక స్వాగతాభినందన సభల్లో పాల్గొన్నప్పుడు, సాహితీవైభవాన్ని గూర్చి ప్రసంగించినప్పుడు, కావ్యగానాలు కరళ్లెత్తినప్పుడు, ప్రముఖులతో భాషించినప్పుడు, మలేషియా మధుర హృదయాల మాటలు విన్నప్పుడు, విందుల్లో వినోదాల్లో-ఇలా రకరకాల సందర్భాలలో తాను పొందిన అనుభావాలనూ అనుభూతులనూ ఈ వ్యాస దర్పణంలో పరమరమణీయంగా ప్రతిబింబింపజేసినాడు నారాయణరెడ్డి.

మలేషియాదేశ భౌగోళికాంశాలు - వైశాల్యం వాతావరణం, నదులూ ఉదధులూ గనులూ గిరులూ తరులూ రేఖామాత్రంగా ఈ వ్యాసంలో సూచింపబడినవి. మలేషియాలో స్థిరపడిన జాతులూ వాటి జనాభా, ఉత్తరమలేషియా దక్షిణ మలేషియాలోని ప్రధానపట్టణాలూ వాటి విశేషాలూ ఇందులో చోటుచేసుకున్నాయి. అక్కడి చిలకపచ్చని చెట్లూ, కోకో మాకులూ, తైలతరువులూ, చేలూ పూలూ ఫలాలూ అన్నీ కన్నులముందు నిలుస్తాయి ఈ వ్యాసం చదువుతూంటే. తైలతరువులన్నది 'oil palm trees'కు నారాయణరెడ్డి చేసిన ఆంధ్రీకరణం. తాను అనుభవించిన డొరియా, మాంగోస్టీన్, రంబూ వంటి పసందైన ఫలాలనూ, 'బుంగరాయ' అనే జాతీయ పుష్పాలనూ ఈ అక్షర చషకంలో ఉంచి వాటి మాధుర్యసౌరభాలను సహృదయులకు పంచినాడు ఈ యాత్రికుడు.

ఉత్తరమలేషియాలోని బాగన్‌దత్తో, సబాక్‌బెర్ణం,సింపాంగ్ అంపాట్, సిత్యవాన్, గోపింగ్, సుంగైసిపుట్ ఇపో, పినాంగ్, పెరాక్, తంజమాలిం నగరాలను, దక్షిణమలేషియాలోని సెగమత్, క్లువాంగ్, బహేవ్ పట్టణాలను దర్శించినాడు నారాయణరెడ్డి. ఆయా సందర్భాలలో తొక్కిన రోడ్లు, ఎక్కిన రైళ్ళ పడవల, చూసిన విద్యావైద్యశాలల, బసచేసిన హోటళ్ళవిశేషాలను గూర్చి సంక్షిప్తంగా సరళ మధురంగా వ్యాఖ్యానించినాడు. కొన్ని నగరాలలో కోవెలలను దర్శించినాడు నారాయణరెడ్డి. మారియమ్మ

కోవెల, అష్టాదశ భుజమహాలక్ష్మి దుర్గాదేవ్యాలయం విశేషాలూ వాటిలో జరిగే పూజాదికాలూ త్యాగరాయ కృత్యాలాపనాది సంగీత సంగతులూ ఈ వ్యాసంలో కనిపిస్తాయి వినిపిస్తాయి.

మలేషియాదేశజనాభా 1970 లెక్కలప్రకారం ఒకకోటి నాలుగులక్షల యాభైరెండువేలట. పదకొండు శాతమున్న భారతీయుల్లో తెలుగువాళ్లు నాలుగు శాతం. వీరంతా విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళంనుంచి రాయల సీమప్రాంతంనుంచి కొన్ని ఏళ్ళ - కొన్ని తరాలక్రితమే తరలివెళ్ళినవాళ్ళనీ, వీరిలో కొందరు విశాఖజిల్లాయాసను భద్రంగా కాపాడుకున్నారని తెలిపి నాడు నారాయణరెడ్డి. ముఖ్యులైన ఆంధ్రసంఘసభ్యుల వ్యక్తిత్వాలను, తెలుగుభాషా సాహిత్యసంస్కృతులపట్ల వారికిగల ఆదరాభిమానాలను, ఉత్సాహాసక్తులను వ్యక్తంచేస్తూ కోలాలంపూర్‌లో ద్వితీయప్రపంచతెలుగుమహాసభానిర్వహణసందర్భంగా నిర్మింపబోయే ఆంధ్రభవననిర్మాణంకోసం విశాలహృదయంతో నిండుసభలోనే వారందించిన విరాళాల విశేషాలనూ, తెలుగుభాషాప్రాచుర్యంకోసం వారు వ్యక్తీకరించిన అభిప్రాయాలనూ అభిలాషలనూ, వారికోసం మనదేశం నిర్వహించవలసిన బాధ్యతలనూ కలిగించవలసిన సౌకర్యాలనూ ఈ సందర్భంగా సూచించినాడు. వివిధ సభల్లో చేసిన ప్రసంగాలకు స్వీయకవితాగానాలకు జానపదగేయాలకు సంబంధించిన కొన్ని ప్రధానాంశాలను దిఙ్మాత్రంగా ఈయాత్రాచరిత్రలో పొందుపరచినాడు. తమిళం తెలుగు అక్కచెల్లెళ్లు అన్న అంశాన్ని సద్యస్ఫూర్తితో నారాయణరెడ్డి వివరించినతీరు సరళమధురం; సత్యసుందరం. ఈ వ్యాసంలో ఇవన్నీ ఒక ఎత్తు. పర్యటన సందర్భంలో భిన్నభిన్నప్రదేశాలలో తాను విన్న కన్న మలేభాషాపదాల - వాటి వ్యుత్పత్తుల తీరుతెన్నులనుగూర్చి నారాయణరెడ్డి చేసిన పరిశీలనం ఒకఎత్తు. రోమన్ లిపిలో ఉండే మలేభాషలో సంస్కృతం అరబ్బీ ఫారసీ ఇంగ్లీషు తమిళం హిందీభాషాశబ్దాలు ఎలా కలిసిపోయినవో, సంస్కృతం అరబ్బీభాషాపదాలు యథాతథంగా — వ్యస్తంగానమస్తంగా ఎలా ప్రయుక్తాలైనవో ఈ వ్యాసంలో చతురంగా సతర్కంగా వివరించి నాడు.

అరబ్బీభాషాసంప్రదాయానుగుణంగా రూపుదిద్దుకునే మలేభాషా సమాసాలవిశేషాలను పరిశీలిస్తూ ఇంగ్లీషుతమిళ పదాలూ, అరబ్బీఇంగ్లీషుపదాలూ, సంస్కృతం అరబ్బీశబ్దాలూ ప్రకృతులుగానైనా వికృతులుగానైనా పరస్పరం కలిసిపోయి సమాసపదనంలో సరసంగా కాపురంచేస్తున్న సంవిధానాన్ని నిరూపించినాడు నారాయణరెడ్డి. మలేషియా తెలుగువాళ్ళ వాడుకలో ఉన్న కొన్ని వింతపదబంధాలను పలుకులనూ స్థాలీపులాకన్యాయంగా చూపినాడు. మలేభాషలోని వింతలనూ అందలి అన్యభాషలపాలపుంతలనూ విహంగదృష్టితో చూపించే ఈ రచన నారాయణరెడ్డి బహుభాషాభిజ్ఞతకు నిదర్శనం.

'శ్రీవాణీగిరిజాశ్చిరాయ' అంటూ నన్నయ్య, 'దేశభాషలందు తెలుగు లెస్స' అంటూ శ్రీనాథశ్రీకృష్ణదేవరాయకవిరాజులు, 'మధుర మధురమైన తెలుగుమాతృభాష' అంటూ రాయప్రోలువారూ ప్రవచిస్తున్నట్లు ఆ పరపర్షుల వాక్కులు ఎయిరిండియావిమానంలో ఎగిసిపోతున్న తనమదిలో ధ్వనిస్తున్నట్లు కల్పించి ప్రతిభామూర్తియైన నారాయణరెడ్డి ఈ రచనారంభంలోనే నవ్యతనూ స్వీయప్రత్యేకతనూ ప్రదర్శించినాడు.

కొన్ని సుందరపదబంధాలను ప్రయోగించినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు — చైనీయతేనీయం. సాహితీచైత్రయాత్ర, పుడమిపుడక వంటి వాటిని చూడవచ్చు.

"విమానంకిటికీలోంచి క్రిందికి తొంగితొంగి చూస్తుంటే విశాల సాగరం,వినీలవిహాయసంనడుమనడుమ ఎక్కడో ఒకపుడమిపుడక. అంతలో కంటిమసక. పైకి చూసినా క్రిందికి చూసినా పరచుకున్ననీలిమ. చూపులో శూన్యంలాంటి నీలిమ ఉన్నా, మనసులో సౌజన్యంలాంటి మలేషియాతెలుగు హృదయాలమధురిమ."

"అప్పుడు నాలోని కవి అన్నాడు - ఈ తైలతరువులు ఈతచెట్టూ కొబ్బరిచెట్టూ కాపురంచేస్తే పుట్టినబిడ్డల్లా ఉన్నాయని ఎంతబాగున్నాయి, కొంత ఎత్తుగా, కొంత ఒత్తుగా అప్పుడే అభ్యంజనమాడిన అంగనామణి జుత్తులా"— వంటి పంక్తులు యాత్రాకథనచాతురికి మచ్చుతునకలు.

'ముచ్చటగా మూడువారాలు మలేషియాలోతెలుగువాణి' రచనా పరిశీలనను మలేషియాలో నారాయణరెడ్డి పలికిన మధురవాణితోనే ముగిస్తాను.

"మలేషియా తిలకించితి
మరీమరీ పులకించితి
తెలుగువారి యెదలోని
తీపిని ఆస్వాదించితి

తెలుగుపదం విన్నచాలు
అలలెత్తును హృదయాలు
తెలుగుతనం కన్నచాలు
అలరులెత్తు వదనాలు

.... .... .... .... .... ....

ఎక్కడ మనవిశాఖ; మరి
యెక్కడిదీ ద్వీపశాఖ
తెలుగుతల్లికిచ్చుట ది
ద్దిరి సౌహృదతిలకరేఖ"[1]

## సోవియట్ రష్యాలో పదిరోజులు

నారాయణరెడ్డి రెండవ విదేశ పర్యటన సోవియట్ రష్యా. ఇండో సోవియట్ కల్చరల్ సొసైటీ ('ఇస్కస్') ఆంధ్రశాఖ డా॥ నారాయణరెడ్డి గారిని డా॥ గోర్కి గారిని రష్యాపర్యటనకై ఎన్నికచేసింది. ఇస్కస్ సాంస్కృతిక ప్రతినిధివర్గం నాయకుడుగా నారాయణరెడ్డి 25-8-1979 నుంచి 4-9-1979 వరకు సోవియట్ రష్యాలో పర్యటించి వచ్చినాడు. ఆ దేశాన్ని దర్శించినప్పటి తన అనుభవాలను అనుభూతులనూ వివరిస్తూ 'సోవియట్

---

1. 'మలేషియామధురిమలు' — 'ఇంటిపేరుచైతన్యం' కవితాసంపుటిలో పుటలు 57,58. (ప్రచురణ 1976)

రష్యాలో పదిరోజులు' అన్న శీర్షికతో ఒక సుదీర్ఘవ్యాసం వ్రాసినాడు నారాయణరెడ్డి. అది ఆంధ్రప్రభ వారపత్రికలో ఐదు వారాలపాటు ప్రచురింపబడింది. ఆ వ్యాసాన్ని లెనిన్ 110వ జయంతి సందర్భాన్ని పురస్కరించుకొని భారత సోవియట్ సాంస్కృతిక సంఘం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసమితి ఏప్రిల్ 1980లో పుస్తకరూపంలో ప్రచురించింది.

ఈ గ్రంథంలో నారాయణరెడ్డి తన మైత్రీపర్యటన విశేషాలను తేదీలవారీగా తెలుపుతూనే ప్రధానాంశ సూచికగా వాటికి చక్కని శీర్షికలుంచినాడు. మలేషియా యాత్రా విశేషవివరణం తేదీలవారిగానే సాగింది కాని అందులో శీర్షికలు లేవు. ఈ శీర్షికలు ఒకసారి కృతికర్త దర్శించిన స్థలాలనూ వాటి సంజ్ఞలను లేదా అందలి విశేషాలను తెలుపుతాయి. మరొకసారి ఆతని అనుభవాన్నీ అనుభూతినీ కవితాత్మకంగా ఛందస్సుందరంగా పరిమళింపజేస్తాయి. ఉదాహరణకు— 'ఆర్మీనియాకు పయనం', 'మతస్వేచ్ఛ', 'గాలిలో పురాతన మందిరం' 'మాస్కోలో పర్యటన' — వంటివి కొన్నైతే, 'శిథిలాల్లోనుంచి జీవనగరం', 'రాళ్లతో దారాలు', 'విందులూ-చిందులూ', 'నదీనగరం', 'కన్నీటిగిన్నెలు', 'గులాబీలలో గుండెలు', 'ఒక అద్దం; రెండు ముఖాలు'— వంటివి మరికొన్ని.

పదిరోజుల పర్యటనలో తాను దర్శించిన తాష్కెంట్, ఎరెవాన్, కిరోవాకాన్, లెనిన్‌గ్రాడ్, మాస్కో వంటి మహానగరాల భౌగోళికాంశాలతోపాటు నారాయణరెడ్డి ఈ నగరాలలోనూ వాటి దరిదాపుల్లోనూ ఉన్న చారిత్రక ప్రదేశాల, సాంకేతిక నిలయాల, సాంస్కృతిక సదనాల, భాషాసాహితీ సంస్థల, శిల్పకేంద్రాల, చిత్రశాలల, కర్మాగారాల, వైద్యాలయాల పుట్టుపూర్వోత్తరాలనూ వాటి నిర్మాణ నిర్వహణ ప్రయోజనాది విశేషాలను హృద్యమైన శైలిలో వివరించినాడు. రష్యా ఎదుర్కొన్న విదేశ దండయాత్రల గూర్చి, యుద్ధాలలో అది ప్రదర్శించిన ధైర్యసాహసాలను గూర్చి, సాధించిన విజయపరంపరలను గూర్చి, స్థాపించిన వీరావతారుల విప్లవవీరుల కళాకారుల మహాకవుల భాషా సాహితీవేత్తల స్మారకచిహ్నాలను గూర్చి సందర్భోచితంగా సంక్షిప్తంగా తెలిపినాడు.

రష్యాప్రజల ఆహారపానీయాలు ఆరోగ్యాలూ ప్రేమలూ పెళ్ళిళ్లూ, అక్కడి నాగరనాట్యాలూ జానపద నృత్యాలూ, మసీదులు క్రైస్తవమంది

రాలూ ఆసుపత్రులూ చిత్రశాలలూ రైళ్లూ రహదారులూ హోటళ్లూ సర్కసులూ మున్నగువాటిని గూర్చి కూడా దిఙ్మాత్రంగా ఈ పుస్తకం పరిచయంచేస్తుంది.

రష్యాలో మతస్వేచ్ఛ ఏ స్థితిలో ఏ పరిమితిలో ఉన్నదో, సమతా భావం బ్రతుకుల్లో ఎలా ప్రతిఫలిస్తున్నదో అక్కడ విమర్శలు ప్రగతికి ఎలా బాటలు వేస్తున్నవో ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది.

అనేక విషయాల్లో ఆర్మేనియాకు ఆంధ్రప్రదేశ్‌కూ ఉన్న సారూప్యాన్నీ, అక్కడి తౌమాన్యాన్ మహాకవికీ ఇక్కడి గురజాడ మహాకవికీ ఉన్న సాదృశ్యాన్నీ ఈ గ్రంథంలో ఎంతో చక్కగా వివరించినాడు నారాయణరెడ్డి.

ఆ దేశాన్ని ఆదర్శంగా గ్రహించి కొన్ని రంగాలలో మనం నిర్వహించవలసిన విధులను కూడా ఈ గ్రంథంలో అక్కడక్కడా సూచించినాడు నారాయణరెడ్డి. ఉదాహరణకు ఒకటి. తౌమాన్యాన్ మహాకవి పేరిట మ్యూజియం నిర్మించిన సోవియట్ రిపబ్లిక్కును అభినందిస్తూ "మన మహాకవి గురజాడకు మచ్చుకైనా ఒక స్మారకచిహ్నం నెలకొల్పని మన పరిస్థితి తలచుకొని" చింతించినాడు. గురజాడ ఉపయోగించిన వస్తువులూ పుస్తకాలైనా సేకరించి భద్రపరచాలని అంతర్జాతీయ తెలుగుసంస్థకు సూచించి తన కర్తవ్యాన్ని నిర్వహించినాడు.

లెనిన్ మహిత సాహితీ వ్యక్తిత్వాన్ని గూర్చి అనేకాంశాలను పేర్కొన్నాడు. ఇంకా లిఖితప్రతుల గ్రంథాలయాలను గూర్చి రచయితల సంఘాలను గూర్చి ప్రాచ్యభాషాధ్యయన సంస్థలను గూర్చి ఎన్నెన్నో అమూల్య విషయాలను ఈ గ్రంథంలో తెలిపినాడు నారాయణరెడ్డి.

సహృదయపాఠకుల హృదయాలను స్పందింపజేసే ప్రశంసార్హములైన అంశాలు కొన్ని ఉన్నవి రష్యాలో. వాటిలో ఒకటి 'సృజననిలయాలు' అన్నది. "రచయితలు అప్పుడప్పుడూ నగరాలకు దూరంగా వెళ్లిపోయి తాము రచనలు చేసుకోవడానికి వీలుగా" నిర్మించుకున్న నిర్మాణాలే ఈ సృజననిలయాలు. ఈ సృజననిలయాల్లో ఉన్నప్పుడు పట్టే ఖర్చులో ముప్పైశాతం రచయితలు, డెబ్బైశాతం రచయితల సంఘాలు భరిస్తాయట. సమాజవికాసానందాలకు కావలసిన రచనలు వీరు చేస్తారని చదివినప్పుడు నాకు కలిగిన

ఆనందం అంతాఇంతా కాదు. మనకు కూడా ఇలాంటి సృజననిలయాలు ఉంటే ఎంత బాగుంటుందో ! ఎన్ని రసహృదయాలు వసంతవాటికలై కావ్యకుసుమాలను అందించేవో ! ఈ గ్రంథం చదివైనా రచయితలు ఇందుకు పూనుకోవాలని ఆశించటం అత్యాశాఅనౌచిత్యం ఏమీ కాదు. 'ఎరెవాన్' నగరానికి సమీపంలోని 'సెవాన్' సరస్తీరంలో ఉన్న సృజన నిలయాలలో రచనలు చేస్తున్న కవులను రచయితలను తాను కలిసి సంభాషించిన సన్నివేశాన్ని ఈ గ్రంథంలో నారాయణరెడ్డి వివరిస్తున్నప్పుడు నా మనస్సు 'సెవాన్' సరస్సై తరగెత్తింది.

మరచిపోకుండా ఎప్పుడూ గుండెలను వెల్గించే అమృతాంశం-స్మారక చిహ్నాలవద్ద నిలిపే అమరజ్యోతులు. ఇవి గ్యాస్‌తో నిరంతరం జ్వలించే శాశ్వతజ్వాలలు. ఈ జ్వాలలు రష్యాదేశీయుల త్యాగార్చనాదృక్పథానికి సంకేతాలు. ఈ గ్రంథం చదువుతుంటే అక్కడక్కడా ఈ జ్వాలలు కనిపిస్తుంటాయి. సహృదయస్వాంతాలలో చైతన్యకాంతులు నింపుతుంటాయి.

సోవియట్ రష్యాలోని 76 భాషల్లో సాహిత్య ప్రచురణ జరుగుతున్న దన్న విషయం చదివినప్పుడు నాడెందం స్పందించింది.

అంతర్జాతీయ సుహృద్భావనను పెంపొందించే యత్నంలో, మానవతకు మకుటం పెట్టే కృషిలో భాగంగా-పదిహేడు దేశాల బాలబాలికలకు వేసవిలో మూడుమాసాలపాటు శిక్షణనిస్తున్న 'అంతర్జాతీయ పాయనీర్ కాంప్'ను గూర్చి చదువుతున్నప్పుడు పాఠకుల హృదయాలు పాలసంద్రాలు కాకపోవు.

లెనిన్‌గ్రాడ్ నగరంలో సుమారు నలభైరెండు నదులు, ఐదువందల వంతెనలు ఉన్నవట! ఎంత వింత! అందుకే దానిని 'నదీనగరం' అన్నాడు నారాయణరెడ్డి.

వైజ్ఞానికంగా సాంకేతికంగా పారిశ్రామికంగా ముందడుగువేస్తున్నా, గతంలో మంచికై పోరాడుతూ ప్రాణాలర్పించిన మహితవ్యక్తులపట్ల, విప్లవ వీరులపట్ల, కళాకారుల ఎడల, సోవియట్ రష్యాకున్న గౌరవాభిమానాలు ఎంత సముజ్జ్వలములో, చారిత్రకావశేషాలమీద సాంస్కృతిక నిధులమీద వారికున్న ఆదరమెంత సమున్నతమో ఈ గ్రంథం చదివితే విదితమౌతుంది.

భారతదేశం పట్ల భారతీయ సాహిత్యాలపట్ల వారికి గల గౌరవాకాంక్షలు ఎలాంటివో ఈ పుస్తకం నిరూపిస్తుంది.

తాను కలుసుకున్న రచయితల సంఘాలనూ, వాటిలోని సభ్యుల వ్యక్తిత్వాలను, ఆయాసమావేశాల్లో తానుచేసిన ఉపన్యాసాలనూ, వాళ్ళుచేసిన ప్రసంగ పాఠాలసారాన్నీ నారాయణరెడ్డి ఈ గ్రంథంలో జాగ్రత్తగా పొందు పరచినాడు. 'రష్యన్ రచయితల మధ్య' అన్న శీర్షిక భాషాసాహిత్యాలపట్ల వాళ్లకున్న సదభిప్రాయాన్నీ, అక్కడ జరుగుతున్న సాహిత్యసృష్టిని ప్రకటిస్తుంది.

ఈ గ్రంథంలో నారాయణరెడ్డి భాషాసంబంధమైన చర్చకూడా చేసినాడు రేఖా మాత్రంగా. ఉజ్బెక్‌బాషపైన పారసీ అరబ్బీబాషల ప్రభావం ఎలాఉందో చవిచూపినాడు. కొన్నిరష్యాభాషాపదాలకు ఆయాచోట్ల తెలుగు అర్థాలనుసూచిస్తూ వాటిలోతుల్లో సంస్కృతాంధ్రాలసౌరభాలున్నవేమో అని తొంగిచూసినాడు.

నారాయణరెడ్డి సుకవితాగంధం ఈగ్రంథంలో ఆయాతావుల్లో గుప్పుమంటుంది. ఉదాహరణకు కొన్ని—

"ఎరెవాన్‌నగరసమీపంలో ఉన్న పర్వతపంక్తులమీద పెద్ద అద్దంలా ఒక సరస్సు అగుపించింది. అది ఆకాశం తన ముఖాన్ని చూసుకోవడానికి అమర్చినంత అందంగా ఉంది"— అంటూ సుప్రసిద్ధమైన 'సెవాన్' సరస్సును సుందరంగా వర్ణించినాడు.

ఆర్మీనియాలోని 'అర్‌గత్స్' 'అరారత్' పర్వతాలనూ, వాటి మధ్యనున్న ప్రభుత్వవ్యవసాయకేంద్రాన్నీ ఇలా వర్ణించినాడు.- "ఈరెండుకొండలు ఎన్నెన్నియుద్ధాలకు హత్యలకు సాక్షులుగా నిలిచాయో? అవిపోట్లాడుకోలేదు ఏనాడూ మౌనంగా మాట్లాడుకోవడంతప్ప. వీటి మధ్యలో వ్యవసాయక్షేత్రం, మానవత ఎదుగుతున్నంత పచ్చగా".

'రాత్రులు తల్లిస్పర్శలాచల్లగా', 'పగళ్ళుప్రేయసి స్పర్శలా వెచ్చగా' ఉన్నాయంటూ కిరోవాకాన్‌నగరవాతావరణాన్ని వర్ణించినాడు.

ఎరెవాన్‌నుండి లెనిన్‌గ్రాడ్‌కు విమానంలో ఎగిరిపోతూ అష్టమిరాత్రి అర్ధచంద్రుణ్ణి ఇలా వర్ణించినాడు- "ఆకాశంలో అష్టమిచంద్రుడు పాపం

ఒక్కడే విక్కి విక్కి ఏడుస్తున్నాడు. చుట్టూ ఒక్క చుక్కయినా లేదు. చీకటికి ఆకలేసి ఉన్న చుక్కల్ని తెల్లద్రాక్షలనుకుని తినేసిందేమో. చంద్రుణ్ణి సగానికి కోసి 'పీచ్' పండనుకుని తినబోయి కాస్తకొరికేసి చిరుపులుపు సహించలేక వదిలేసిందేమో ఆకాశంప్లేట్‌లో. ఇంతలో మబ్బుకమ్మేసింది. అర్ధచంద్రుణ్ణి సగంమిగిలిన ఆ పీచ్‌పండుముక్కని ఏరేసి ఏబుట్టలోనో పారేసినట్టనిపించింది."

చిన్నచిన్న పదాలలో మహోన్నతార్థాలను పొదిగే శబ్దశక్తి నారాయణరెడ్డిది. పదాలను నవనవంగా నాట్యం చేయించగల పండితుడు అతడు. ఈ గ్రంథంలోని—

"లెనిన్ గొప్ప సత్యాగ్రహి మాత్రమేకాదు, సత్యగ్రాహి కూడా."

"బద్ధకం ఈ దేశానికి బద్ధశత్రువనిపించింది."

"ఇక సహృదయ పాఠకులే చెప్పాలి ఆ మాటలో పలికిన మువ్వలెన్నో, రగిలిన నిప్పురవ్వలెన్నో."

వంటి పంక్తులు ఆతని శబ్దశక్తికి సంకేతాలు.

విమానిని, వెన్నెలకళ్లు, చెట్ల చిరునామాలు, జనోద్యానం, ఉన్నిబంటి, సౌందర్యభాగి, నానారాజమార్గ సందర్శనం వంటి వినూత్న పదబంధాలు ఈ గ్రంథంలో ప్రయోగించినాడు నారాయణరెడ్డి.

ఈ గ్రంథంలోని కొన్ని విషయాలు మువ్వల్లా మ్రోగుతూ, మరికొన్ని సంఘటనలు నిప్పురవ్వల్లా రగులుతూ కనిపిస్తాయి.

రష్యాను తిలకించి పులకించిన ఒక తెలుగు మహాకవి హృదయస్పందనను అందంగా వినిపిస్తుంది ఈ గ్రంథం.

నారాయణరెడ్డి 'నా మాట'లోని పంక్తులతో ఈ గ్రంథావలోకనానికి భరతవాక్యం పలుకుతాను.

"అక్కడ అగుపించేది నడకకాదు
అభ్యుదయానికి లయలునేర్పే పరుగు
అక్కడ వినిపించేది పలుకుకాదు
ఆత్మధృతికి ధ్వనులు కూర్చే వెలుగు."

# పాశ్చాత్యదేశాల్లో 50 రోజులు

'తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా', 'తెలుగు అసోసియేషన్ ఆఫ్ గ్రేటర్ చికాగో' అనే సంస్థలు అందించిన ఆహ్వానాన్ని అందుకొని నారాయణరెడ్డి 1981 మే 23, 24 తేదీలలో చికాగోలో జరిగిన తృతీయ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో పాల్గొన్నాడు. ఆ సందర్భంగా నాలుగు వారాలపాటు అమెరికాలోని వివిధ రాష్ట్రాల్లోని అనేకనగరాలలో పర్యటించినాడు. అనేకసాహిత్యసాంస్కృతిక సభలలో ఉపన్యసించి, కావ్యగానాలుచేసి అక్కడి తెలుగుహృదయాలను పులకింపజేసినాడు. అమెరికాలోని డెట్రాయిట్ నుంచి కెనడాకువెళ్ళి ఒక్కరోజు విండ్సర్ టొరాంటొ నగరాలనూ నయాగరాజలపాతాన్నీ సందర్శించి వచ్చినాడు. నెలరోజుల అమెరికా పర్యటనానంతరం యు. కె. ఆంధ్ర సాంస్కృతిక సంఘం వారి ఆహ్వానం మేరకు రెండువారాలపాటు బ్రిటన్‌లో పర్యటన సాగించినాడు. లండన్‌లో ఉన్నప్పుడే ప్యారిస్ నగర సందర్శనాన్ని మూడు రోజుల్లో ముక్తసరిగా ముగించుకొని తిరిగి లండన్ చేరుకున్నాడు. తర్వాత బ్రిటన్‌లోని వివిధ నగరాలను దర్శించి, పెక్కు సమావేశాలలో తెలుగుభాషా సాహిత్యాలనుగూర్చి ఉపన్యాసాలుచేసినాడు. కావ్యగానామృతాన్ని అందించినాడు. 19-5-1981 నాడు బయలుదేరిన నారాయణరెడ్డి 7-7-1981 నాడు హైద్రాబాదు నగరం చేరుకున్నాడు. అమెరికా బ్రిటన్‌ల సుదీర్ఘ పర్యటనంలో కెనడా ఫ్రాన్సుల సందర్శనంలో తాను పొందిన అనుభవాలను అనుభూతులనూ 'దినదినజ్ఞాపికలు'గా కూర్చి, 'పాశ్చాత్య దేశాల్లో 50 రోజులు' అనే శీర్షికతో వాటిని వరుసగా ఆరు ఆంధ్రప్రభసచిత్ర వారపత్రిక సంచికల ద్వారా పాఠకులకు అందించినాడు.[1]

---

1. ఆంధ్రప్రభ వారపత్రిక—19-8-'81 మొదలుకొని వరుసగా 23-9-'81 వరకు గల సంచికలలో 'పాశ్చాత్యదేశాల్లో 50 రోజులు' ప్రచురితం.

పాశ్చాత్య దేశాల్లోని నగరాలను శీర్షికలుగా నిలుపుతూ తేదీలవారిగా తాను దర్శించిన నగరాల విశేషాలను క్రమంగా వివరంగా తెలపడమన్నది ఈ యాత్రాసాహితిలో నారాయణరెడ్డి సాధారణంగా పాటించిన ప్రణాళిక. ప్రపంచాద్భుతదృశ్యాలలో ఒక్కటయిన 'నయాగరా' జలపాతం మాత్రం 'టొరెంటో' నగరానికి బదులు తానే శీర్షికగా నిలిచింది. నారాయణరెడ్డి కెనడా నుంచి నయాగరాను దర్శించినందువల్ల 'కెనడా వైపు' అనే శీర్షిక కూడా కెనడా దేశం దర్శనాన్ని సూచిస్తూ సామంజస్యాన్ని పులుముకున్నదే. ఇందలి నగరశీర్షికాప్రణాళికలో ఇవి రెండు మాత్రం అపవాదాలు.

అమెరికా కెనడా బ్రిటన్ ఫ్రాన్సులలో తాను చూసిన నగరాల చారిత్రక సాంస్కృతికవాణిజ్యప్రాధాన్యాన్ని ఉగ్గడిస్తూనే ఆయా నగరాల్లో ప్రధానమైన దర్శనీయమైన స్థలవిశేషాలనెన్నింటినో ఈ యాత్రాసాహితిలో సులభశైలిలో వివరించినాడు నారాయణరెడ్డి. ఆయాదేశాల్లోని సరస్సులను గూర్చి జలపాతాలను గూర్చి నదులనుగూర్చి చదువుతుంటే మనలో ఉత్సాహ తరంగాలు ఉవ్వెత్తుగా లేస్తాయి. శతాదికమైన అంతస్తులతో అంబరాన్ని చుంబించే సౌధశిఖరాలూ రకరకాలైన రమణీయాలైన జాతీయకళావైజ్ఞానిక సాంకేతిక చారిత్రక ప్రదర్శనశాలలూ నక్షత్రశాలలూ వస్తుప్రదర్శనశాలలూ మన కళ్ళముందు నిలిచి మనలో అద్భుతభావోల్లసనాన్ని కలిగిస్తాయి- ఈ యాత్రాకథనాన్ని చదువుతూ పోతుంటే. అనేక రంగాలలో పాశ్చాత్యులు సాధించిన ప్రగతిని ఈరచన నిరూపిస్తుంది. ఇంకా అక్కడి ఉద్యానవనాలూ పార్లమెంటు భవనాలూ మహాకవుల నాయకుల స్మారకసదనాలూ విశ్వవిద్యాలయాలూ చర్చిలూ చర్చావేదికలూ వాణిజ్యకేంద్రాలూ స్టూడియోలూ థియేటర్లూ హోటళ్లూ క్లబ్బులూ అన్నీ మన కన్నులముందు కదులుతుంటాయి రంగులఫిల్ములా చారిత్రకనేపథ్యసహితమైన రసవద్ వ్యాఖ్యానంతో మహాకవుల మహితోక్తుల ఉట్టంకింపులతో.

ఈ యాత్రాకథనంలోని—"ఇంగ్లీషు మహానది. తెలుగేమొ పిల్లకాలువ. ఇక్కడున్నప్పుడు తప్పదుకదా ఆ మహానదిని అనుసరించక"- అనే మాటలు అమెరికాలోని తెలుగుభాషాస్థితిని తెలియజేస్తున్నాయి. అయినా అక్కడి తెలుగువాళ్లు తమపిల్లల తెలుగుభాషాభ్యసనం కోసం ప్రత్యేకించి బళ్ళు నిర్వహించుకుంటున్నారనీ, అనేకులు హరికథ, జానపదనృత్యాలు, శాస్త్రీయ

నాట్యాలూ పల్లెపాటలు వంటి ఆంధ్రకళావిశేషాలెన్నింటినో నేర్చుకుంటూ వాటిని నిలుపుకుంటున్నారనీ, విశ్వవిద్యాలయాలలో తెలుగువిషయాలపై పరిశోధనను చేస్తున్నారనీ తెలియజేస్తూ ఆ దేశాల్లోని తెలుగువాళ్ళకు తమ మాతృభాషాకళాసాహిత్యాలపట్ల ఉన్న ప్రగాఢమైన అనురక్తికీ అభిమానానికీ దర్పణం పట్టుతున్నది.

చికాగో, మాడిసన్, పిట్స్‌బర్గ్, లాస్ ఏంజిలస్, సాన్ ఫ్రాన్‌సిస్కో, డెట్రాయిట్, న్యూజెర్సీ, వాషింగ్టన్, బాస్టన్, ఫిలడెల్ఫియా, టొరంటో. లండన్ కావెంట్రీ, స్టాన్లీవంటి మహానగరాల్లో నారాయణరెడ్డి తెలుగు భాషా సాహిత్యకళా విశేషాలను గూర్చి అనేకోపన్యాసాలు చేసినాడు. తెలుగుభాష పుట్టుపూర్వోత్తరాలు, ద్రావిడభాషాకుటుంబస్వరూపం, తెలుగుభాషలోని అజంతత్వం, అర్ధానుస్వార ప్రాచీనతా నవీనతలు, మూత్నాక్షర సంకేతావశ్యకత, తెలుగుపద్యప్రాధాన్యం, గేయవైవిధ్యం, అష్టావధాన-నాట్యావధానాలూ సినీమా సాహిత్యంలో వాణి-బాణీల సమన్వయం, కూచిపూడి, పేరిణి, శివతాండవం వంటివెన్నో నారాయణరెడ్డి ఉపన్యాసాలకు వస్తువులైనాయి. అంతేకాదు అనేక స్వీయకవితలనూ వాటి ఆంగ్లానువాదాలనూ సభల్లో వినిపించినాడు. తన పర్యటన సందర్భంలో కొత్తగా కొన్ని గీతాలను గానం చేసినాడు. అమెరికాలోని తెలుగువాళ్ళ ప్రగతిని నుతిస్తూనే 'తెలుగుపరువు'ను నిలబెట్టాలని వారికి సందేశాన్ని అందించినాడు.

"ఎన్ని మొక్కులు చెల్లించినా
ఎన్నెన్ని డాలర్లు అర్పించినా
మంచినే దీవించవయా"[1]

అంటూ పిట్స్‌బర్గ్ కొండలపైన వెలిసిన వెంకన్నను అర్థించినాడు.

"అయామ్ గీత యు ఆర్ తాత
లెట్ మి లెర్న్ భగవద్గీత"[2]

---

1. పిట్స్‌బర్గ్‌లోని ఒక సభ్యుని కోరికపై నారాయణరెడ్డి వ్రాసిన గీతంలోని ఒక చరణం ఇది.

2. హ్యూస్టన్‌లో గీత అనే పాపకోసం ప్రత్యేకంగా వ్రాసిన గీతంలోని మొదటి రెండు పంక్తులివి.

అనే పల్లవితో తెలుగు మాట్లాడాలని ఉన్నా మాట్లాడలేని అమెరికా తెలుగు పసిపాపలకు ఒక గీతాన్ని వ్రాసి పాడినాడు. పెక్కు ఇంటర్వ్యూలలో ప్రశ్నలకు సమాధానాలిచ్చినాడు. అంతేకాదు. అక్కడివాళ్ళ అనుభవాలను విన్నాడు. ఈతని కావ్యగానాలను అక్కడివారు టేపు చేసుకున్నారు. ఒక సారి వీడియోఫిలిం కూడా తీసుకోవడం జరిగింది. ఇవన్నీ ఒక ఎత్తు. న్యాష్ వెల్ నగరంలో ఆతని కర్పూరవసంతరాయలు కావ్యగానం ఎల్.పి.రికార్డుగా అవతరించడం మరో ఎత్తు. 42 నిముషాల ఎల్.పి. రికార్డును సరిపోయే సన్నివేశాలను మధ్యమధ్య సంధివచనాలతో గానం చేసినాడు నారాయణరెడ్డి. ఆతడు 'ఊహించలేని సుమధుర సంఘటన' ఇది. ఆతని జీవతంలో అపూర్వ సన్నివేశమిది. కవిలోకం గర్వించదగిన సన్నివేశమిది. ఆంధ్రజాతి అభినందించదగిన అంశమిది.

మహాకవులపట్ల మహాపురుషులపట్ల ఆదరాభిమానాలను హృదయంలో పదిలపరచుకున్న ఆదర్శమూర్తి నారాయణరెడ్డి. పాశ్చాత్యదేశాల్లోని మహాకవుల జన్మస్థలాలను దర్శించాలనే కుతూహలం ఆతనికి కల్గడం సహజం. బైరన్, కీట్స్, జాన్సన్, షేక్స్పియర్, వర్డ్స్వర్త్, షెల్లి, వాల్టర్స్కాట్ రాబర్ట్బర్న్సు సాహితీమూర్తుల స్మారకసదనాలను సందర్శించిపులకించినాడు. అంతేకాదు, స్వామివివేకానంద పురాభారతీయ సాంస్కృతిక సముజ్జ్వలతను గూర్చి ఉపన్యసించిన చికాగోఆర్ట్ఇన్స్టిట్యూట్ను, చికాగోలో లాయర్గా ఉన్నప్పుడు అబ్రహాం లింకన్ నివసించిన భవనం 'వాటర్టవర్'ను దర్శించడం తన జీవితంలో 'స్మరణీయఘట్టాలు'గా పేర్కొన్నాడు. ఇది ఆతని సంస్కారోన్నతికి నిదర్శనం.

రష్యాపర్యటనంలో తొమాన్యాన్ మహాకవిపేరిట మ్యూజియమును దర్శించినప్పటివలెనే ఈ పర్యటనంలో నారాయణరెడ్డి ఎడింబరానగరంలో స్కాట్లండ్మహాకవి రాబర్ట్ బర్న్సు శిలావిగ్రహాన్నీ ఆవిగ్రహంచుట్టూచెక్కిన కవితాపంక్తుల్నీ చూసినప్పుడు ఆతని మనస్సులో మహాకవి గురజాడ మెరుస్తాడు. ఆతని "శిలావిగ్రహాన్ని విజయనగరంలో రాజధానీనగరంలో ప్రతిష్ఠించేదెప్పుడో!" అంటూ గాఢాభిలాషనూ ఆవేదననూ వ్యక్తంచేసినాడు. ఇది ఆతని చిత్తసంస్కారానికి మరో ఉదాహరణం.

ఆయా సన్నివేశాలను చూస్తున్నప్పుడు తనకు కలిగిన అభిప్రాయాలను స్వేచ్ఛగా, తనకు నచ్చిన అనేకాంశాలను వివరంగా ఈ రచనల్లో తెలియజేసినాడు నారాయణరెడ్డి. ఆతనికి నచ్చిన అనేకాంశాలలో ఒకటి న్యాష్‌వెల్‌లోని 'హాల్ ఆఫ్ ఫేమ్' అనే సంగీతప్రదర్శనశాలలో ప్రసిద్ధ గీతరచయితలు పాటపుట్టుకనుగూర్చి తమ అభిప్రాయాలు తెలుపడం అనేది. సాహిత్యాభిలాషులందరికీ ఇది నచ్చేవిషయం. "ముందుగీతం - ఆతరువాత సంగీతం" అని వారి అభిప్రాయాన్ని తెలిపినాడు. న్యాష్‌వెల్‌లోని గీత రచయితలసంఘంలో 1100 మంది సభ్యులున్నారని చదివినప్పుడు ఆశ్చర్యానందాలతో పొంగిపోయినాను. మన దగ్గర గీతరచయితలు ఉన్నా సమైక్యమేది? అందుకు ప్రతీకగానిలిచినసంఘమేది? అని ప్రశ్నించుకుని మరుక్షణం కుంగిపోయినాను. అందమైన దృశ్యాలను అక్షులతో చూసిన నారాయణరెడ్డి వాటిని అక్షరాలుగా వ్రాస్తున్నప్పుడు ఆతనిలోని కవి మనకు కనిపిస్తాడు. ఉదాహరణకు—

సాయంకాలం పసిఫిక్ మహాసముద్ర దృశ్యాన్ని గూర్చిన వర్ణనఇది- "పసిఫిక్ మహాసముద్రం పరమశాంతంగా చలికాగుతూ ఉంది సాయం సంధ్యాకిరణాల్లో......... అస్తమయసూర్యబింబం మొదట మండుతున్న హారతిపళ్ళెంలా సముద్రంనీటి అంచుమీద నిలిచిపోయింది. క్రమంగా సైజు తగ్గి కుంగిపోయి చివరికక్షణాన ఒక చిన్న నిప్పుగీతలా కనిపించింది. ఆ తరువాత ఆవరించింది ఒకే నీలిమ. ఆకాశానికీ సముద్రానికీ మధ్యనున్న ఎల్ల ఒట్టి కల్ల అనీ, చీకట్లో లోకం సరిహద్దులన్నీ తల్లి కోడిరెక్కలమాటున ఒదిగే పిల్లల్లా ఒదిగిపడిఉంటుందని మరోసారి నా మనసు పలికింది".

నయాగరా జలపాతాన్ని గూర్చి— "ఇన్నాళ్ళుగా నా ఊహల్లో ఉవ్వెత్తుగా ఎగిరిదూకుతున్న నయాగరా - చైతన్యానికి నిరంతరం మ్రోగిస్తున్న నగారా. ముందు ఎడమవైపు తెల్లని నురగల జలపాతం కనిపిస్తుంది. కాస్త నడిచేసరికి నీలిమలూ ధవళిమలూ కలగలుపుకుని, సమతలంలో కదులుతూ అక్కడి నుంచి ముదురుపచ్చగా మారిపోయి ఉరవడితో దూకే జలపాతం— అలావచ్చి ఇలా మలుపు తిరిగిన మహాస్వరపాతం కనిపిస్తుంది. ఏమి దూకుడది ! అడుగంటిందో లేదో ఏడు తాటిచెట్లఎత్తున నీటిపొగలు. అటుహోరూ, ఇటు పొగలు లేచేతీరూ కర్ణనయనాలకు రసేంద్రజాలాలు. ఎక్కడిదీ నయాగరా ?

కాలానికి తోబుట్టువు..........క్షణం ఆగదు ఈ జలపాతం కాలంలా..........
చూసిన ప్రతికంటిలో సువర్ణదృశ్యకావ్యాన్ని చిత్రిస్తున్నది"

ఇంకా– "ద్రవపదార్థంతోనే గడగడలాడిస్తున్నారుఘనీభవించిన అగ్ర దేశాలను", "ఈలలూ కామసూచక కీచకస్వరలీలలూ" వంటి చమత్కార గర్భితమైన పంక్తులూ, తైలాయుధులు, జలబంధం వంటి నూత్నపద బంధాలూ ఈ రచనలో చోటుచేసుకున్నాయి. రసాత్మకమైన ఇలాంటి వాక్య విన్యాసం వల్లనే రచనలు సాహితీపరిధిలోకి ప్రవేశిస్తాయి.

స్వకీయవిదేశీయపర్యటనలను పురస్కరించుకుని నారాయణరెడ్డి చేసిన విశిష్టరచనలు యాత్రాకథనసాహిత్యాన్ని పరిపుష్టం చేస్తున్నాయనడంలో సందేహం లేదు. 'యాత్రాకథనవాఙ్మయం' తెలుగులో అరుదే. నారాయణ రెడ్డి ఈ శాఖలో కూడా తన కృషిని ఫలవంతం చేసి సాహిత్యరసికులకు ఆనందానుభూతిని కలిగించినాడు. అయితే ఆతని యాత్రాచరిత్రలు భాషా పరంగా ఎంత అందాన్ని సంతరించుకున్నాయో విజ్ఞానపరంగా అంతేప్రయో జనాన్ని సాధించుకున్నాయి.




# పగలే వెన్నెల

ఆధునికయుగంలో శ్రవణదర్శనసాధనాలన్నింటిలో అతిశక్తిమంతమైన ప్రచారసాధనం సినిమా. సమస్తకళాసౌందర్యాన్నీ సాంకేతిక పరిజ్ఞానాన్నీ తనలో మేళవించుకుని మానవుని మనస్సుపై బలమైన భావముద్రవేసే ప్రక్రియ సినిమా. మనిషికి విజ్ఞానాన్నీ వినోదాన్నీ ఒకేసారి చాలా స్వల్పకాలంలో అందించే చిత్రమైన సాధనం చలనచిత్రం. జాగ్రత్తగా వాడుకున్నట్లయితే సామాన్యమానవుణ్ణి సమగ్రపౌరునిగా మనీషిగా తీర్చిదిద్దాలన్న ప్రజాస్వామ్యాదర్శాన్ని ఆచరణలో నిర్వహించి చూపగలదు సినిమా.

చలనచిత్రసాహితి ఒక వినూత్న సాహిత్య ప్రక్రియ. ఈ ప్రక్రియలో కూడా ప్రతిభామూర్తియైన నారాయణరెడ్డి అనంతవైవిధ్యాన్ని ప్రదర్శించి

నాడు. సమున్నత శిఖరాలధిరోహించినాడు. చక్కని భాషలో ప్రజలయాసలో గీత రచనచేసి, కవితాపరిమళాలను పంచిపెట్టి ప్రజాబాహుళ్యం గుండెల్లో చోటుచేసుకున్నాడు. ఇరవైఏళ్ళుగా వ్రాస్తున్నా ఇరవై యైదు వందలకుపైగా పాటలు వ్రాసినా ఆతని శబ్దానికి పాతదనం లేదు-పచ్చదనం తప్ప. పాటలెన్నో వైవిధ్యమంత. రాశి ఎంతో రమ్యత అంత. ఇందుకు కారణం ఆతని సహజ గేయకవితాప్రవృత్తి. సంగీతప్రియత. హరికథా భాగవతనాటకాదుల శ్రవణ దర్శనాలవల్ల చిన్ననాడే ఆతనిలో గానగుణం పాదుకున్నది. పల్లె ఒడిలో పెరిగిన ఆతని హృదయం ఆనాడే జానపదులపదమాధురినీ, ఆ పాటల్లోని లయనూ శైలీవిన్యాసాన్నీ తనలో రంగరించుకున్నది. విద్యార్థి దశలో నారాయణరెడ్డి ఉర్దూపాటలను తెలుగులో అనువదిస్తూ గానంచేసేవాడు. ఆ కాలంలోనే 'సినీకవి' అనే నాటికవ్రాసి ఏ భావాన్నైనా చక్కని పాటగా జనరంజకంగా మలచగలవాడే సినీమాకవి కాగలడనే యాథార్థ్యాన్ని చాటుతూనే తనకాశక్తి గలదని ధ్వనింపజేసినాడు. "నవ్వని పువ్వు" వంటి గేయనాటికలనూ, "నాగార్జున సాగరం" వంటి గేయకావ్యాలనూ రచించి సభల్లో గానం చేసి శభాష్ అనిపించుకున్నాడు. "కర్పూర వసంతరాయలు" కావ్యం ఆతని కీర్తిని అఖిలాంధ్రంలో పరిమళింపజేసింది. సహృదయులు 'నటరత్న' డా॥ ఎన్. టి రామారావుగారు అందించిన ఆహ్వానాన్నీ అవకాశాన్నీ అందుకుని నారాయిణరెడ్డి 1961లో 'గులేబకావళి కథ' చిత్రానికి పాటల గులాబీలను అందించినాడు. సహృదయ ప్రేక్షకుల గుండెలను గుబాళింపజేసినాడు. నాటినుంచినేటికి అన్నిరకాల పాటలపూలను అందిస్తూనే ఉన్నాడు నిత్యసురభిళంగా.

ప్రముఖసాహితీసాంస్కృతికసంస్థ 'యువభారతి' నారాయణరెడ్డి చిత్రసాహితిని అందరికీ పంచాలనే దృష్టితో ఆతని సినీమాగీతాలనుండి రెండువందల యిరవైయైదింటిని ఎన్నుకుని 'పగలేవెన్నెల'గా 1976లో సహృదయలోకానికి అందించింది. ప్రస్తుతం ఆ గ్రంథాన్నీ, ఇంకా ఇతర చిత్రాలలోని కొన్నిరచనలను ఆధారంగా గ్రహించి నేను నారాయణరెడ్డి చిత్ర సాహితీ విశేషాలను గూర్చి సమీక్షిస్తున్నాను.

నారాయణరెడ్డి అన్నిరకాలపాటలనూ - అవి ప్రణయగీతాలైనా, విషాదగీతాలైనా, జావళులైనా, జానపదగేయాలైనా, ప్రబోధగీతాలైనా, ప్రకృతి

గీతాలైనా భక్తిగీతాలైనా బాలలగేయాలైనా అతిసమర్థవంతంగా వ్రాయ గలడు. ఒక పాటయొక్క గొప్పదనం కేవలం అందలి సాహిత్యంపైనే కాదు- సంగీతంపైనా సన్నివేశంపైనా దానినిపలికే పాత్రలచిత్రీకరణపైనా దర్శకనిర్మాతల ఛాయాగ్రాహకుల విలక్షణదృక్కోణాలపైనా ఆధారపడి వుంటుంది. అందుకే పాటరచన ఒకఎత్తు. దాని చిత్రీకరణ మరో ఎత్తు. నారాయణరెడ్డి పాటలు అటు—నిర్మాతల చిత్రనేతల దర్శకుల సంగీతదర్శకుల ఇటు- లక్షలప్రేక్షకుల అంతరంగాలను దోచుకున్నాయి. "నన్నుదోచుకొందు వటే" పాటతోనే ఆరంభమైనది ఈ దోచుకోవడం.

"నాపేరే సెలయేరు
నన్నెవ్వరాపలేరు"

అన్నాడాతడు. ఇంక ఎవరాపుతారు? అందులోనూ మనసులను గిలిగింతలు పెట్టి దోచుకోవడంకదా! 'సెలయేరు' నిత్యచైతన్యానికీ ప్రజాహితదృక్ప థానికీ సంకేతం. అంతేకాదు- అతని మొట్టమొదటి ఖండకావ్యం 'జల పాతం' వెంటనే గుర్తుకువస్తుంది.

"తోటలో నారాజు
తొంగిచూసెనునాడు
నీటిలో ఆరాజు
నీడనవ్వెను నేడు"

అన్నప్రణయగీతం సహృదయహృదయకమలాలలో తుమ్మెదలా మ్రోగే రసరమ్యగీతం.

"ఎలనాగ నయనాల కమలాలలోదాగి
ఎదలోన కదలే తుమ్మెదపాటవిన్నాను"

ఖండగతిలోసాగిన ఈ గీతంలోని ఊపు 'సమత'తో హృదయాలనూయెల లూపుతుంది.

"ఈనాడు కట్టుకున్న బొమ్మరిల్లు"

పాటలోని

"ఆశలే తీవెలుగా - ఊసులేపూవులుగా
వలపులే తావులుగా - అలరారు ఆపొదరిల్లు"

అన్నపంక్తులు సహృదయహృదయంగమాలు.

"కనులముందు నీవుంటే
కవిత పొంగిపారదా
తొలిచిగురుల చూడగానే
కలకోకిల కూయదా"

పాటలోని పల్లవినివింటే ఎదఎదలో ఆనందరసాలం పల్లవిస్తుంది.

చిగురులువేసిన కలలన్నీ
సిగలో పూలుగ మారినవి
మనసునపొంగిన అలలన్నీ
మమతలతీరం చేరినవి"

అనే పాటలో శబ్దార్థాలు రెండూ సరసంగా సంగమించాయి.

'ఏ పారిజాతమ్ము లీయగలనో సఖీ!' అనే గేయంలో 'రమణికి బదులుగా ఆకారం ధరియించాలని' ప్రకృతిని ప్రార్థించటం రమణీయం. కాంతల కన్నులను కలువలతో, ముంగురులను మబ్బులతో ముఖబింబాన్ని పూర్ణచంద్ర బింబంతో పోల్చటం కవి సంప్రదాయం. 'ప్రేయసి నల్లని వాల్జడ సందుల మల్లియలై మొలవాలని' చుక్కలతో సూచించటం బాగుంది. ప్రబంధకవిత్వం పరిమళిస్తుందీ పాటలో. ఈ గేయంలోని ఆరు పంక్తులు నారాయణరెడ్డి ఎప్పుడో 1953-55 మధ్య రచించినవి. వీటిని 'నారాయణరెడ్డి గేయాలు' (1955) అనే ఖండకావ్యంలోని 'ప్రకృతిలోని ప్రణయిని' అన్న శీర్షికలో చూడవచ్చు. ఒక కవి తాను ఒకచోట రచించిన పంక్తులను ఆయా సందర్భాలలో ఔచితీ దృష్టితో మరొకచోట గ్రహించవచ్చు కదా!

కురులను వర్ణించే ఈ పాట ఎంత బాగుందో, ఈ కవి పాండితీ సంస్కారం ఈ గేయదర్పణంలో ఎంత అందంగా అగుపిస్తుందో చూడండి.

పల్లవి :

ఈ నీలినీలి ముంగురులు
-అందాల మబ్బుల దొంతరలు

ఈ కురుల నీడచాలు
ఇంకెందుకు వేరే సిరులు

చరణం :

ఈ కురులే పగలంతా పారాడునీడలై
ఈ కురులే రాతిరిలో నడయాడు చీకటులై
ఈ కురులే వెన్నెలలో విరబూయు కలువలై
ఇవి కురులేనా - కావు
నా గుండెలోని మరులు.

చరణం :

నీ నుదుట యీ కురులే కదలాడు తుమ్మెదలై
నా మదిలో యీ కురులే పలికేను కోకిలలై
నీ జడలో యీకురులే ఒడిగేను యమునలై
ఇవి కురులేనా - కావు
తరుణరాగమంజరులు*

"పాలరాతి మందిరాన
పడతిబొమ్మ అందం
అనురాగ గీతిలోన
అచ్చతెలుగు అందం"

అనే పాట ఉంది. ఇందులోని చరణాలు—

"రతనాల కోటవుంది
రాచకన్నె లేదు
రంగైన తోటవుంది
రామచిలుక లేదు"

ఇలా సాగినాయి. అచ్చతెలుగు మాటలే ఇందుండడం గమనించదగిన అంశం. అచ్చతెలుగు అందాలను ఇందులో పొదిగినాడు నారాయణరెడ్డి.

"పలకరించితేనే ఉలికి ఉలికి పడతావు"
"చెలికాడు నిన్నే రమ్మని పిలువ"
"పుత్తడిబొమ్మ మా పెళ్ళిపడుచు"

వంటి పాటలమూర్తులు వాణినీ బాణినీ తమ రెండు కళ్లుగా చేసుకుని చూస్తున్నాయి.

"మేలుకో కవిరాజ మేలుకోవయ్యా
మేలుకొని పదకవిత లేలుకోవయ్యా"

అనే అష్టవిధనాయికల వర్ణనాగేయం రమ్యాతిరమ్యం. ఈ పాటలోని ఒక్కొక్క చరణం శృంగార రసఝరీరంగత్తరంగం. సాహిత్యశాస్త్రం కవితగా పొంగులువారిన అపూర్వ చిత్ర సన్నివేశం. సంగీతంలోని సరిగమలు సాహిత్యంలోని మధురిమలు రెండూ గుండెలు కలుపుకున్నాయి ఈ పాట తోటలో. చిత్రీకరణం నయనహృదయతర్పణంగా రూపొందడానికి ఇందులోని రచనా సౌందర్యం ఎక్కువగా తోడ్పడిందని చెప్పవలసి వుంటుంది. నారాయణరెడ్డి పదకవితాశక్తికి ఎత్తిన పతాక ఈ గీతిక. ఇలా నారాయణరెడ్డి లేఖినీవనిలో ప్రణయవల్లరికి పూచిన ప్రసూనాలు అసంఖ్యాకం. వాటి వన్నెలూ వాసనలూ సహృదయహృదయైకవేద్యాలు.

నారాయణరెడ్డి ఊహలకు కళ్ళున్నాయి. ఆ కళ్ళకు 'పగలే వెన్నెల'గా 'జగమే ఊయెల'గా, 'పూచిన ప్రతితరువాక వధువు'గా కనిపిస్తాయి. ఆ చిత్రమైన ప్రకృతినంతా ఆతని గీతాలు చూపిస్తాయి.

'కృష్ణవేణీ తెలుగింటి విరిబోణీ' అన్న పాటలో నదీనాయికల సమన్వయం హృదయంగమం. నారాయణరెడ్డి ఉక్తి చమత్కృతి, ఊహాశాలిత పందెం వేసుకున్నాయి ఈ పాటలో.

"పసుపుపూయకనే పూసినట్టుండు
పసిడిలో జలకాలాడినట్టుంఃడు
ముత్తైదువులా ముంగిటనిలుచుండు
ఉన్నంతకాలం ఊరంతతానుండు"

అన్న ముద్దబంతి పువ్వు వర్ణనం ముద్దుగా ఉంది. పూలను 'తొణకని వలపులదూతలు'గా, 'మాయలు తెలియని మనసులు'గా, 'దేవుని పదముల దివ్వెలు'గా వర్ణించటం ఎంతో బాగుంది. 'ఉదయకిరణాలలో' అనే పాటలోని—

"జగమే కమలమై వికసించినది
మనసే భ్రమరమై రవళించినది"

అనే చరణాలు చరణాలు కావు. అవి కవితామూర్తి దరహాస కిరణాలు. 'తొలికోడి కూసింది' పాటలోని ఈ పంక్తులు అంతరంగాలను ఆకట్టుకుంటాయి.

"దూరాల ఆకాశతీరాల బంగారు
హారాలు వేసెను కిరణాలు"

ఆకాశానికి హారాలు వేయగలిగే సామర్థ్యం రవికిరణాలకే ఉందని కవికి మాత్రమే తెలుసు. ఈ పంక్తుల్లోని దూరాలతీరాలహారాలు అనే శబ్దాల్లోని దీర్ఘాక్షరం తర్వాతి రేఫపునరావృత్తి నాదసౌందర్యాన్నీ ఛందస్సౌభాగ్యాన్నీ అందిస్తున్నాయి. నారాయణరెడ్డి నాదపరిమళం ఎరిగిన శబ్దవేది.

'ఆడవే మయూరీ', 'జోహారుశిఖిపింఛమౌళీ', 'ఎవ్వడు నినుమించువాడు', 'సరిలేరు నీకెవ్వరు' వంటి జావళుల రచనలో కవితాశారదాచరణ కింకిణుల ఘలంఘలలూ ఆమె కరకంకణాల గలగలలూ వినిపిస్తాయి.

ఈయన భక్తిగీతాలను కూడా బాగుగా వ్రాయగలడనడానికి—

"నీపేరు తలచినచాలు - మది
లో పొంగు శతకోటియమునాతరంగాలు"
"శరణన్న వారిని కరుణించే
తిరుమలవాసా ! జగదీశా !"
"శ్రీగౌరి శ్రీగౌరియే"

వంటి పాటలు ఉదాహరణాలు. "అణువూ అణువున వెలసినదేవా" అనేపాట అణువణువునూ కదలించి కరిగించి మనసుల్లో త్యాగనిరతినీ సేవాభావాన్నీ నింపుతుంది.

"మల్లియలారా! మాలికలారా
మౌనముగా ఉన్నారా"
"మురళీలోలుడు—మదులను పొంగించి
మోము చూపడాయె"

"పెదవులపైన సంగీతం
హృదయములోన పరితాపం"
"కనులుండి చూడలేను
గళముండి పాడలేను"
"ఒక దీపం వెలిగింది"—

వంటి గీతాలు కరుణ రసాత్మకాలు. ఒక్కొక్క గీతం వేదనాజలపాతం.

ఈతడు వ్రాసిన హాస్యగీతాలు కొన్నే అయినా వన్నెవాసీ ఉన్నాయి వాటికి. 'పేరయ్యతాతా' నాంపల్లిస్టేషన్ కాడ - జాంపండ్లు బాగుంటాయే'- వంటివి కొన్ని. 'అంగట్లో అన్నీవున్నాయ్', 'ఏయ్ మనిషీ ! ఏహేయ్ మనిషీ !' 'తాగితె తప్పేముంది' వంటి పాటలు పైకి నవ్వు తెప్పించినా లోన అధిక్షేపాన్ని పొదుగుకున్నాయి. సామాజిక సమస్యలను చిత్రికపడుతూ ఎద లను రగిలిస్తాయి. 'ఝూంపిల్లో', 'రింజిం' 'రింజిం' 'ఝుంపలజయ్యా' 'జంబియా' వంటి వింత మాటలను ప్రయోగించి హాస్యసృష్టిచేసినాడు ఈ కవి.

జానపదుల పాటలనూ వాటి తీరుతెన్నులనూ చిన్ననాడే ఒంటపట్టించు కున్న ఈ కవి సినీమాపాటల్లో జానపదమాధురిని చవిచూపించినాడు సహృదయప్రేక్షక శ్రోతలకు.

"బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో
బంగారు గౌరమ్మ ఉయ్యాలో"
"ఆకూపచ్చనిచేలు అల్లోనేరెళ్లో
ఆపైన పైరగాలి అల్లోనేరెళ్లో
"గోగులుపూచె గోగులుపూచె
ఓ లచ్చ గుమ్మడి"

ఇలా తెలంగాణా జానపదగేయాలపల్లవితోనే కొన్ని పాటలపూలను కిలకిలా నవ్వించినాడు.

"మాయదారిసిన్నోడు - నా
మనసేలాగేసిండు"
"సంకురాతిరి అల్లుడు
సంక లెగురేసికొచ్చిండు"

వంటి పంక్తుల్లో తెలంగాణాయాసలోని క్రియాపదాలను ప్రయోగించినాడు. కొన్నిపట్టణాలపేర్లనూ హైదరాబాద్‌నగరంలోని కొన్ని వీధులపేర్లనూ స్థలాల పేర్లనూ ప్రయోగిస్తూ లలితహాస్యాన్ని జానపదశృంగారంతో రంగరించి అందించినాడు కొన్నిగీతాల్లో-

"సింతపూల రైకతొడిగి
సింహాచలం నేనుబోతే
గుంటనక్క గుర్రుమన్నది"

సింహాచలంలో సింహాలకు బదులు గుంటనక్కలే గుర్రుమనడంవల్ల నవ్వు వస్తుంది.

"రంగురంగులకోకకట్టి
ఒంగోలుకు నేనుపోతే
పొట్లగిత్త ఎదురుపడ్డది"

ఒంగోలుగిత్తలు ప్రసిద్ధంకదా! అందుకేఅలా అన్నాడుకవి.

"వంకసిగలో పూలుపెట్టి
వరంగల్‌కూనేనుపోతే
కోడెకాడే కన్నుగొట్టెనే
వాడవాడా నవ్వబట్టెనే"

వరంగల్ తెలంగాణాజిల్లా. అందుకే 'నవ్వబట్టెనే' అని తెలంగాణాయాసను ప్రయోగించటం సహజసుందరంగా ఉంది. అలాగే-

"నాంపల్లిస్టేషన్‌కాడ
జాంపండ్లుబాగుంటాయి"
"గుంటూరుసీమలోన
గుత్తొంకాయలు బాగుంటాయి."
"గుంతకల్లు సెంటరులోన"
కూరగాయలకరువుందట"
"చెయ్యిముట్టుకుంటె ఒట్టు
చిక్కడపల్లి ఎంకటి"

"ఆబీషాప్ సెంటర్లో అద్దాలరైకగాని
సుల్తాన్ బజార్‌లో గద్వాలచీరగాని
సారథి స్టూడియోకు పోదమంటివి.
హీరోనాగేశ్వరరావును చూపిస్తనంటివి
ఎన్టీఆర్ ఎస్టేటుకు పోదమంటివి
రంగుల యింగిలీసుసినిమ చూపిస్తనంటివి"

యతిప్రాసలను చూసుకుంటూనే బహుమతులను నవ్విస్తాడు కవితామతియైన నారాయణరెడ్డి. ఒకసారి శబ్దం మరోమారు అర్థం చమత్కారాన్ని చవి చూపిస్తాయి.

నారాయణరెడ్డి కవేకాదు ఉత్తమాధ్యాపకుడుకూడా. అందువల్ల లోక కల్యాణాకాంక్షతో ఎన్నెన్నో రచనలు చేసినాడు. ప్రతివాడు ప్రజోపకారిగా బ్రతికి మంచిని పెంచాలని మానవతా దృక్పథంతో ప్రబోధంచేసినాడు. ఆతని ప్రబోధగుణం ఆతని ఖండకావ్యాల్లోవలెనే సినిమాగీతాల్లో కూడా బహుళంగా చోటుచేసుకున్నది.

సాహిత్యం సాధించలేని అనేకాంశాలను చలనచిత్రాలు ఫలింపజేస్తాయనడం సత్యదూరం కాదు. నిజానికి వ్యావహారికభాషోద్యమప్రధాన ధ్యేయం ప్రబోధమే. సినీమాల్లోని మాటలూ పాటలూ వ్యావహారికభాషలో సరళంగా సుబోధకంగా ఉంటాయి. వాడుకలో జీవంతో తొణికిసలాడే మాటలే ఈ ప్రక్రియలో విశేషంగా ప్రయోగింపబడతాయి. వేషం, సన్నివేశం, సంగీతం వీటికి తోడుగా నిలిచి ప్రబోధాన్ని మరింత శక్తిమంతంగా అందిస్తాయి. యాంత్రిక జీవితంతో విసిగే సామాన్యులు వినోదంకోసం సినీమాలకు పోతారు. తెలియకుండా ప్రబోధాన్ని పొందుతారు. అందువలన సినీమాలు ప్రజానీకాన్ని ప్రబోధితుల్ని చేయగలుగుతాయి. అయితే ఈ ప్రబోధం మంచికి సంబంధించిందా చెడుకు సంబంధించిందా అన్నప్రశ్న ప్రయోక్తలపై ఆధారపడివుంటుంది. మంచినీ చెడునూ ప్రచారం చేయవచ్చు. సినీమా కత్తిలాంటిది. కుత్తుకలను ఉత్తరించడానికైనా కూరగాయలను కోయడానికైనా కత్తి పనికివస్తుంది. సినీమా ద్వారా ఉత్తమ గుణాలను ఉదాత్త భావాలను సామాన్యునికి అర్థమయ్యేలా అందించవచ్చు లేదా ఆతనిలోని పాశ

వికశక్తులను ప్రకోపింప చేయవచ్చు. నారాయణరెడ్డి సినీమాపాటల ద్వారా ఉదాత్తాశయాలను మానవతా భావాలను ప్రబోధించి నిజమైన కవిగా సాహితీ వేత్తగా సమాజంపట్ల తనకుగల బాధ్యతను జాగ్రత్తగా నిర్వహించినాడు. అతడు సమైక్యవాది. తెలంగాణా వేర్పాటు ఉద్యమం తలెత్తిన రోజుల్లో తెలుగుల సమైక్యాన్ని ప్రబోధిస్తూ కవితలు వ్రాసి పత్రికల్లో ప్రచురించినాడు. ఈ కవితలు అతని 'మరో హరివిల్లు', 'మనిషీ-చిలక' అనే ఖండకావ్యాల్లోకి ఎక్కినాయి. కాని అవి సామాన్యులకు అందకుండా పోయినాయి. అవే భావాలను లయాన్వితంగా సంగీత మధురంగా మలచి సినీమాపాటలుగా అందించి సామాన్యులను కూడా ప్రబోధితుల్ని చేసినాడు.

"తెలుగుజాతి మనది - నిండుగ
వెలుగుజాతి మనది"

అనే పల్లవితో ఒక దీర్ఘగీతాన్ని వ్రాసినాడు.

"ప్రాంతాలు వేరైనా - మన
అంతరంగమొకటేనన్నా
యాసలు వేరుగవున్నా - మన
బాస తెలుగు బాసన్నా
వచ్చిందన్నా వచ్చాడన్నా
వరాల తెలుగు వొకటేనన్నా"

అంటూ ఉభయప్రాంతాల సమైక్యాన్ని ఉద్బోధించినాడు.

"ఆడవే ! జలకమ్ములాడవే
కలహంసలాగ - జలకన్యలాగ"

అనే పాటలో తరతరాల తెలుగుసంస్కృతిని చాటినాడు. అక్షరజ్ఞానం లేని వాళ్ళకు కూడా తెలుగు సంస్కృతిచరిత్రలను తెలిపినాడు కమ్మనిసంగీతంలో కలగలిపి.

"పాడవోయి భారతీయుడా
పాడవోయి భారతీయుడా

భరతావని వృక్షానికి
ప్రాంతాలే కొమ్మలనీ
సమభావం మూలమని
సమైక్యతే ఫలమని
ఎవరు హిందువెవరు ముస్లి
మెవరురా కిరస్తానీ ?
ఎవరిది తెలుగెవరిదాంగ్ల
మెవరిది హిందుస్తానీ ?
ఒకేచోట వికసించిన
రకరకాల పువ్వులురా
ఒకేవాణి గుడిలో వెలు
గొందిన మణిదివ్వెలురా"

అంటూ భరతజాతి ఒక్కటని చాటినాడు. ఇదేగీతంలో వర్ణవర్గకులమతాల భేదాలు వద్దని— "మానవతను నిర్మించని మతం మృతమని" ఘోషించినాడు.

"ఇదికాదు మాసంస్కృతి
ఇదికాదు మా ప్రగతి"

అనే పాటలో

"ఒక కన్నెకు ఒకే కోరిక
ఒక సీతకు ఒకే రాముడు"

అంటూ భారతీయ సంస్కృతిని ప్రదర్శించినాడు.

సినీమాలలో నారాయణరెడ్డి హరికథలు, బుర్రకథలు గేయనాటికలు వంటి ఇతర సాహితీప్రక్రియలను కూడా సమర్థవంతంగా నిర్వహించి చిత్ర సాహితికి ఎనలేని అందాలను సమకూర్చినాడు.

ఒక చిత్రంలోని కుచేలోపాఖ్యానం హరికథ ద్వారా కుటుంబనియంత్ర ణను వ్యంగ్యంగా ప్రబోధించినాడు. ఈ హరికథలోని-

"కాశ్మీరు శాలువైనా తేలేదా
గాద్రేజి బీరువా అయినా తేలేదా
ప్రెషర్‌కుక్కర్ కొనితేలేదా

కుట్టుమిషనునైనా మోసుకురాలేదా
దండైనా-ఆపిల్ పండైనా
ఆంధ్రా ఫేమస్ బందర్ లడ్డైనా"

వంటి పంక్తులద్వారా సంఘంలో పెద్ద హోదాలో ఉన్నవారికి కట్నాలూ కానుకలూ సమర్పించుకునే ఆశ్రయింపు ధోరణులను శ్రీకృష్ణుని మాటల్లో వ్యంగ్యంగా పరిహసించినాడు.

"పాతరవేసిన నల్లడబ్బు
పైకిలాగే రోజులురా
వంచనతో కబళించిన భూములు
పంచిపెట్టే రోజులురా
కలిగినోళ్లు కులుకుతువుంటే
యేడంతస్తుల మేడల్లోన
దిక్కులేని పేదా సాదా
ఎక్కి కూచునే రోజులురా
భళానోయి భళి తమ్ముడా"-

అంటూ బుర్రకథల ద్వారా సామాజిక ప్రగతిని ప్రదర్శించినాడు.

సమాజంలోని వివిధ రంగాలలో విలయతాండవం చేస్తున్న అవినీతిని అనేక కవితా ఖండికలద్వారానే గాక చిత్రగీతాలద్వారా కూడా ఎత్తిచూపినాడు. ఈ చరణాలను చూడండి-

"ఎక్కడికెళుతూందీ దేశం
ఏమైపోతుంది?
హిమశైలశిఖరం పైకా?
పాతాళకుహరంలోకా?"

అని ప్రశ్నిస్తూ స్వార్థంతో రంగులు మారుస్తూ పార్టీలను ఫిరాయించే అవకాశవాదులను దుయ్యబట్టినాడు. వర్ణభేదాలను వడ్డించే మతోన్మాదులనూ, వ్యక్తులహత్యలతో వ్యవస్థమారుతుందని విశ్వసించే ఉగ్రవాదులనూ విమర్శించినాడు.

"ధాన్యంలోనేకాదు
సౌజన్యంలోనూ కల్తీలు
నేతిలోనేకాదు
నీతిలోనూ కల్తీలు
మైమరపించే మద్యంలో
మనుషులచంపే కల్తీలు
ప్రాణంపోసేమందుల్లో
ప్రాణంతీసే కల్తీలు
పరీక్షరాసే చేతుల్లో కాపీ కల్తీలు
ఉప్పెనలాంటి యువతరంగంలో హిప్పీకల్తీలు"

అంటూ మనసులలోని దినుసులలోని కల్తీలను ఎత్తిచూపినాడు. రకరకాల అవినీతిని ఎత్తిచూపి జాతికి రాహువు పట్టిందని రక్తం చచ్చిందని విచారించినాడు. ఇప్పటికైనా ఈదేశం తప్పుతెలుసుకుని మంచిగా వర్తించాలని ఉపదేశించినాడు. లేకుంటే-

"ఈదేశాన్ని
కణకణమండే నిప్పులతో
కల్తీలేని నిప్పులతో"

ఈతరం కడిగేస్తుందని హెచ్చరించినాడు.

"హరిజనులూ గిరిజనులూ
అందరునేడు పురజనులే"

అని సమతను ప్రబోధించినాడు.

"జీవితమే ఒక వైకుంఠపాళి
నిజం తెలుసుకోభాయీ
ఎగరేసే నిచ్చెనలే కాదు
పడదోసే పాములు వుంటాయి"

అంటూ జీవితాన్ని వ్యాఖ్యానించి చూపినాడు.

పిల్లల పాటల్లో కూడా ఈ ప్రబోధం తీవెలు సాగింది.

"అ—అమ్మ
ఆ-ఆవు
అమ్మవంటిదే ఆవు
అది తెలుసుకో నీవు
ఇ—ఇల్లు
ఈ—ఈశ్వరుడు
ఇంటిని ఇలనూ కాచేదెవడు?
ఈశ్వరుడూ పరమేశ్వరుడు"

అనే పాటలో అక్షరమాలతో పాటు బ్రతుకులను కూడా దిద్దుకోవాలని చిన్న చిన్న మాటల్లో మిన్నగా చెప్పినాడు.

"గున్నమామిడి కొమ్మమీద
గూళ్లు రెండున్నాయి"

అనే పాటను చిగురుమాటలతో కథాకథనశైలితో రచించి సమైక్యాన్ని నూరి పోసినాడు. రామచిలుకలా అందంగా కోయిలస్వరంలా తీయగా ఉంది ఈ పాట.

"తండ్రిమాటకై కానకు తరలిపోయె రాఘవుడు
అందుకే ఆ మానవుడు ఐనాడు దేవుడు
తల్లిచెరను విడిపించగ తలపడె ఆ గరుడుడు
అందుకె ఆ పక్షీంద్రుడు అంతటి మహనీయుడు
ఓబాబూ నువ్వు ఆ బాట నడవాలి
భువిలోన నీ పేరు ధ్రువతారగ వెలగాలి"

అంటూ మహనీయులను పరిచయంచేసినాడు - చిరుచిరు పలుకుల్లో చిన్నారి పాపలకు.

"బాలల్లారా! రండి!
భావిపౌరుల్లారా! రండి!
తరతరాల తెల్లదొరల నేల
తీరూతెన్నూ చూడండి"

అంటూ మాటల బొమ్మలుకట్టి ఏకశిలానగరాన్నీ, నాగార్జునసాగరాన్నీ, అమరావతినీ చూపెట్టి పిల్లల హృదయాలను పులకింపజేసినాడు.

"పండిత నెహ్రూ పుట్టినరోజు
పాపలందరికి పుట్టినరోజు
మమతా సమతా పుట్టినరోజు

మంచికి కోవెల కట్టినరోజు"–

అంటూ ఒకే పాటలో నెహ్రూ జీవిత చరిత్రసారాన్ని బోధించినాడు.

నారాయణరెడ్డి బంగారు మనిషి, మొనగాడు, నిండుదంపతులు రంగేశిరాజా, మాయనిమమత, మనుషుల్లో దేవుడు, ఆరాధన అనే సినిమాలకు గేయనాటికలు కూడా రచించినాడు. వాసవదత్త, శాకుంతలం, వరూధిని, లైలామజ్ను, విద్యార్థులు నవసమాజ నిర్మాతలు వంటివి కొన్ని గేయనాటికలు.

కావ్యాల్లో కూడా ప్రయోగించనంత దీర్ఘప్రౌఢ సమాసాలను సినీమా పాటల్లో ప్రయోగించి సన్నివేశానికి వన్నెలు దిద్దినాడు నారాయణరెడ్డి. "ఆడవే మయూరీ" పాటలో

"హిమగిరీంద్ర శిఖరాగ్రతాండవత్
ప్రమథ గణము"
"ప్రమథనాథ కరపంకజ భాంకృత
డమరుధ్వని"
"ప్రళయకాల సంకలిత భయంకర
జలధరార్భటుల"
సహస్ర సంజనిత ఫూత్కృతుల"

ఇలా రసానుగుణంగా జటిల సమాసాలు తాండవం చేసినాయి.

"నిజభుజకంపిత రజతాచలాగ్రశేఖరా! సురభీకరా!
అసదృశవిక్రమ చకచ్చికిత విషకంధరా! దశ కంధరా!

వంటి దీర్ఘసమాసాలు రావణ పరాక్రమాన్ని ధ్వనింపజేస్తున్నాయి. నారాయణరెడ్డి ధ్వనిమర్మజ్ఞుడు,

"మృదుసమీర కంపిత మనోజ్ఞకుంతల తమాల పల్లవజాలా"
వంటి మృదుసమీరం లాంటి సమాసాలు కూడా జాలువారినాయి.

"భువనమోహినీ" గీతంలో సమాసాలూ వాటి అంత్యప్రాసల విలాసాలూ చూడండి ఎలా లలితంగా లాస్యంచేసినవో—

"నీల నీల కుంతలా! వి
లోల మృదుల చేలాంచల!
తరళ తరళ భావగగన
సురభిళ నవచంచలా!
మదమరాళ గామిని
మంజుల మధుయామిని
ఝళం ఝళిత మణినూపుర
లలిత లయ విలాసినీ"

రాగ తాళ భావాలు త్రివేణిలా రమణీయంగా సంగమించిన సన్నివేశమిది. మెరపుతీగకు పరిమళాన్ని అద్దిన కవి హృదయం ప్రశంసనీయం.

నారాయణరెడ్డి ప్రతిభకు ఆతని పాండిత్యం దాస్యం చేస్తుంది. ఛందస్సు మందహాసం చేస్తూన_ర్తిస్తుంది.

జోహారు శిఖిపింఛమౌళీ! ఇదె
జోహారు రసరమ్య గుణశాలీ! వనమాలి

అనే పాటలోని—

"చకిత చకిత హరిణేక్షణా వదన
చంద్రకాంతు లివిగో
చలిత లలిత రమణీ చేలాంచల
చామరమ్ము లివిగో
ఝళం ఝళిత సురలలనా నూపుర
కలరవమ్ము లివిగో"

వంటి చరణాలలోని సమాస చాలనానికి సహృదయులు తలలూపక మానరు. "వందే జననీ" గేయంలోని—

"కమలాసన కమనీయ హృదయ నవ
కమలకర్ణికా వాసినీ
సకల చరాచర నిఖిల నరామర
చైతన్య కళాదాయినీ"
"చందనశీతల మంద మంద మక
రంద మధుర సంభాషిణీ !
నవ్య దివ్య సంగీత సాహితీ
నయన యుగళ సంశోభినీ !
రాజస తామస భంజనీ !
రసమయ మానసరంజనీ !"

ఇలా కవితా రూపిణియైన శారదను కమనీయ సమాసాలతో అందాల అంత్య ప్రాసలతో స్తుతించిన నారాయణరెడ్డి కవితా విశారదుడే. ఈ సమాసాలు జావళులలోనే భక్తిగీతాలలోనే కనిపించటం గమనించదగిన విశేషం.

"కదిలింది కదిలింది గంగ
కదిలి ఉప్పొంగింది గంగ"

అనే వ్యాఖ్యానగీతం నారాయణరెడ్డి గేయరచనాశక్తికి రమ్యోదాహరణం. ఇందలి ధార గంగలాగే తరగెత్తింది. భగీరథుని ప్రార్థనను విని స్వర్గం నుంచి గంగ కదలడం, ఉద్ధృతంగా సాగే ఆ గంగా ప్రవాహగర్వాన్ని విరువనెంచి హరుడు తన సంకీర్ణ జటాచ్ఛటల నుప్పొంగించి దుర్గంగా మలచి గంగను బంధించడం, భగీరథుని ప్రార్థనను విన్న పురహరుడు కరుణాళువై సురధుని చెరను విడిపించడం, జహ్నుముని ఆశ్రమాన్ని గంగ ముంచడం, ఆ తరువాత సాగరులకు సద్గతులిచ్చి గంగ భాగీరథి కావడం—ఇలా గంగ కళ్ళముందు కదలాడేటట్లు రచించినాడు. ఈ కవికి గల దృశ్య ప్రత్యక్షీకరణ సామర్థ్యానికి చక్కని తార్కాణం ఈ గేయం. గంగను బంధించినప్పుడు గేయం ఖండగతి నుండి చతురస్రగతిలోకి దూకించటం—

"జడయను అడవిని
వడివడి అడుగిడి"

అంటూ డకార బాహుళ్యంతో అఘ్వక్షర ప్రయోగంతో గంగ తడబాటును సూచించటం కవి ప్రదర్శించిన శిల్పం.

"అష్ట భార్యలతో అలరేరాజును
చెంగున ముడిచిన చెలువవులే
చెలువవులే చెంగలువవులే"
"తమ్ములు ఎవరో - తుమ్మెద లెవరో"

వంటి చరణాలలో అవకాశమున్నంతలో విరుపులనూ శ్లేషలనూ ప్రయోగించి చమత్కారాన్ని ప్రదర్శించినాడు. కొన్ని చిత్రాలలో సన్నివేశానికీ పాత్రకూ అనుగుణంగా ఇంగ్లీషు శబ్దాలనూ వాక్యాలనూ ప్రయోగించినాడు. ఏమన్నా ఎలా అన్నా ఆతని దృష్టి అంతా రసమయమే.

నారాయణరెడ్డికి సన్నజాజులంటే చాలా ఇష్టం. ఆతడు హనుమాజి పేటలో తన ఇంటిలో అల్లుకున్న సన్నజాజి సన్నిధిలో కూర్చుని ఎన్నో కావ్యాలల్లుకున్నాడు. ఆతని ఈ ఇష్టం చిత్రగీతాలలో స్పష్టంగా కనిపిస్తుంది ఈ క్రింది చరణాలలో—

"సన్నజాజి తీగలాగ - నిన్ను చేరుకున్నాను"
"కన్నతల్లి ఆశలన్ని - సన్నజాజులై విరిసినరోజు"
"సన్నజాజిసొగసుంది - జున్నులాంటి వయసుంది"
"కన్నెమనసు ఏనాడూ - సన్నజాజితీగ
తోడులేని మరునాడు - వాడిపోవుగదా"
"చిన్నోడి వాలకం చిత్రంగా ఉందనీ
సన్నజాజులంటేనే సరదా పెరిగిందనీ"

సంప్రదాయంగా వచ్చే ఉపమానాలతో బాటు కొన్ని కొత్త ఉపమానాలను ప్రయోగించినాడు చిత్రగీతాల్లో. ఉదాహరణకు కొన్ని—

"నీ లేత బిడియాలు
దానిమ్మపూలు"

అని బిడియాన్ని దానిమ్మపూలతో పోల్చడం బాగుంది. బిడియం వల్ల ముఖంలో అరుణిమ ఏర్పడుతుంది. దానిమ్మపూలు ఎర్రనివి కదా!

"చిక్కనిమీగడ తరకల్లాగా
చక్కనైన చెక్కిళ్ళు"

చెక్కిళ్ళను మీగడతరకలతో పోల్చడం కొంత కొత్తగానే ఉంది. చెక్కిళ్ళను అద్దాలతో పోలుస్తారు సాధారణంగా.

"ఏమి కోపమది
చంద్రతాపమది"

కోపాన్ని ఎర్రదనంతో సంకేతించటం సంప్రదాయం. ఇక్కడ వెన్నెలతో పోల్చటం అపూర్వం. వెన్నెలకు కోపమే రాదని ధ్వని. పాత్రయొక్క మనస్తత్వాన్ని ఇందులో ధ్వనింపజేసినాడు కవి.

నారాయణరెడ్డి తాను వ్రాసిన కావ్యాలనూ ఆకావ్యాల్లో తాను చిత్రించిన పాత్రలనూ ఆయా చిత్రాల్లోని గీతాల్లో పొదిగినాడు సందర్భశుద్ధితో—

"ఆ కృష్ణవేణియే గుండెపెంచుకొని
నిలిచెను సాగరమై
నాగార్జునసాగరమై"
"నా హృదయం నాగార్జునసాగరం"
"లలితభావ కర్పూరవాటిలో
లకుమ అందెలే రవళించెలే"
"రామప్పగుడిమోమున విరిసిన
రాగిణివై నాగినివై"

కిన్నెరసాని, ఎంకిపాటలు వంటి అన్యకవుల కావ్యాలపేర్లను కూడా గీతాల్లో రసోచితంగా వాడుకున్నాడు ఇలా—

"ఎన్నడు చూడని వెన్నెలకన్నెలు
కిన్నెరసానులై కులికేనులే
ఎన్నో జన్మల మూగరాగాలు
ఎంకిపాటలై పలికేనులే"

ఈ కవి కావ్యాలలో ప్రయోగించినట్లే చిత్రగీతాల్లోకూడా చక్కని సూక్తులను కొత్త పదబంధాలనూ ప్రయోగించినాడు.

"చెలిమి విలువతెలియదు - విడిపోయేవరకు
కలలవిలువ తెలియదు - కరిగేవరకు"
"చలికాలం సూరీడు చల్లన
కలకాలం అనురాగం వెచ్చన"
"వలపురీతులూ మనసులోతులూ
తెలపలేవు ఏ గ్రంథాలూ"
"కత్తులు దూసి జడిపించువాడు
మెత్తని ప్రేమను సాధించలేడు"
"పూలపైన రాలవాన తగదురా"

వంటివి ముత్యాల్లాంటి సూక్తులు.

ఈ చిత్రగీతాల పూదోటలో— గోరువెచ్చని కలలు, మబ్బుకోట, పున్నమిరెమ్మ, పెదవులభరణి, వెన్నెలగూడు, కోర్కెలకొరడా, వెన్నెల రేకులపాకిళ్లు, వలపులసాంబ్రాణి, మల్లెపూలజాతర, వెన్నెలకూన, మేఘాల పల్లకి- వంటి వన్నెవన్నెల పదబంధపుష్పాలు నవ్వుతూ కనిపిస్తాయి,

రెండురెండు పాదాలకు సాధారణంగా ఈ కవి యతిప్రాసలను సహజ సుందరంగా పాటిస్తాడు. ఆతని హృదయం ఛందస్సులోనే పలుకుతుంది. యతియో ప్రాసయో వాటంతట అవే వచ్చినిలుస్తాయి సహజరమ్యంగా. అయితే ఈ కవి అక్కడక్కడా ఈ చిత్రగీతాల్లో యతిప్రాసలను పాటించని సందర్భాలుకూడా లేకపోలేదు. బలవంతంగా కృత్రిమంగా నిరర్థకంగా యతి ప్రాసలను తెచ్చిపెట్టడం ఆతనికిష్టముండదు. కాబట్టే కొన్నిచోట్ల యతి ప్రాసలను పాటించలేదు. ఉదాహరణకు కొన్ని—

"చైత్రపూర్ణిమల కళలన్ని—నీ
చిరునవ్వులలో విరబూయాలి".
"వెన్నెలలెంతగ విరిసినగానీ
చంద్రుణ్ణి విడిపోలేవులే"
"భక్తికి రక్తికి లొంగనిస్వామిని
కొంగున ముడుచుట మధురం"

"మొగిలిపువ్వులా బ్రతకాలంటే
చుట్టూ పాములు తప్పవా"

వ్రాసే గీతాలు అసంఖ్యాకమైనందువలన కొన్ని గీతాలలోనిభావాలు మరి కొన్నింటిలో కనపడడం అసహజమేమీకాదు. ఉదాహరణకు ఒకటి-

" i) నెలవంక పెరిగితే - నింగికే ఒకఅందం

ii) నెలవంకదీపం - నింగికే వెలుగు"

నారాయణరెడ్డి మొదటిసారిగా వ్రాసిన 'గులేబకావళికథ' చిత్రంలో నిపాటల్లోనే ఆతని చిత్రగీతాల వైవిధ్యమంతా బీజప్రాయంగా కనిపిస్తుంది, అందలి "నన్నుదోచుకొందువటే" అనే గీతం తరువాతి ప్రణయగీతాలకూ, 'మదనా! సుందర! నాదొర' గీతం జావళులకూ, 'సలామ్ వాలేకుమ్' అనే పాట హాస్యగీతాలకూ ఉర్దూపద ప్రయోగవైచిత్రికీ, "కలలఅలలపై తేలెను— మనసు మల్లెపూవై, అనే గీతం ప్రశ్నోత్తరాల పద్ధతిలోసాగే ఆతని విలక్షణ గేయరచనకూ భూమికలుగాకనిపిస్తాయి. పూర్వకవులు పద్యరచనలో ఎంతెంత వైవిధ్యాన్ని వైచిత్రినీ ప్రదర్శించినారో ఈకవి గేయంలో అన్నన్నిపోకడలు పోయినాడు. యతిప్రాసలలోకూడా అప్పకవిచెప్పినరీతులన్నీ కనిపిస్తాయి. చిత్రగీతాల్లోకూడా ఆతని గుసుగుగేయలక్షణం కనిపిస్తుంది. అంటే—యతి ప్రాసల దగ్గరచరణం విరుగక సహజంగా చొచ్చుకొని (మరోచరణంలోకి) సాగిపోవడం. ఉదాహరణకు—

"నన్నుదోచుకొందువటే"

అనేపాటను చూడవచ్చు.

"పూలదండవోలె క
ర్పూరకళికవోలె" (యతి)

గీతాలలోనిభావాలు మరి
హరణకు ఒకటి-

కే ఒకఅందం

లుగు"

కథ' చిత్రంలో నిపాటల్లోనే
కనిపిస్తుంది, అందలి
ణయగీతాలకూ, 'మదనా!
మ్ వాలేకుమ్' అనే పాట
"కలలఅలలపై తేలెను—
పద్ధతిలోసాగే ఆతని విలక్షణ
ులు పద్యరచనలో ఎంతెంత
గేయంలో అన్నన్నిపోకడలు
ప్పినరీతులన్నీ కనిపిస్తాయి.
కనిపిస్తుంది. అంటే—యతి
ప్పకొని (మరోచరణంలోకి)



"కలకాలమువీడని సం
కెలలు వేసినావు" (ప్రాస)

'మదనాసుందర నాదొర' పాటలో

"రసకేళితేలి పర
వశమౌదమీవేళ" (ప్రాస)

ఈతడు కావ్యాలలోవలెనే చిత్రగీతాలలోనూ క్రమాలంకారశిల్పాన్ని ప్రదర్శి స్తాడు. ఉదాహరణకు-

"మెరిసే మేఘమాలిక
ఉరుములు చాలుచాలిక"

పాటను గ్రహించవచ్చు. ఇందలి చరణాలివి--

"కమలాలే నా రమణి-నయనాలై విరిసె
అద్దాలే నా చెలియ చెక్కిళ్లై మెరిసె

ఆ నయనాల కమలాలలోన
నా జిలుగుకలలు చూసుకోనీ
ఆ అద్దాల చెక్కిళ్ళలోన
నా ముద్దులే దాచుకోనీ"

"మధుమాసం చెలిమోవిని
దరహాసంచేసె
తెలిజాబిలి చెలిమోమున
కళలారబోసె
ఆ దరహాస కిరణాలలోన- నను
కలకాలం కరిగిపోనీ

ఆ కళల పండువెన్నెలలోన నా
వలపులన్ని వెలిగిపోనీ"

ఈ క్రమాలంకారశిల్పంవలన ఒకభావంతో ఒకపాటను పూర్తిచేయవచ్చు. చరణాలకు అంతస్స్వూత్రత ఏర్పడుతుంది. భావచంక్రమణానికి తావుండక స్పష్టత కుదురుకుంటుంది పాటలో. ఈ క్రమాలంకారశిల్పాన్ని ఇంకా "చంద మామ వీణియపైన" వంటి పాటల్లో చూడవచ్చు.

నారాయణరెడ్డి ప్రణయగీతాల్లో ప్రశ్నోత్తరాలపద్ధతి కనిపిస్తుంది. ఉదాహరణకు-

"కలల అలలపై తేలెను - మనసు మల్లెపూవై"
"మబ్బులో ఏముంది? నా మనసులో ఏముంది?"
"ఎవరన్నారివి కన్నులని"
"అడగాలని ఉంది"

వంటి పాటలను గ్రహించవచ్చు. పొడుపు కథలాగా ప్రశ్నలతో సమాధానా లతో సాగడం 'అడగాలని ఉంది' పాటలోని విశేషం.

ఈ కవి పొడిపొడి క్రియలను వాడడు. వాటిని కళాత్మకంగా ప్రయోగిస్తాడు. ఉదాహరణకు— 'ఉదయించిన కలలు' అనడు. 'చిగురులు వేసిన కలలు' అంటాడు. ఆ కలలు నెరవేరినవి అనడు— 'సిగలో పూలుగ మారినవి' అంటాడు. సహృదయునిలో రసాత్మను పులకింప జేస్తాడు.

ఈతడు గీతాలలో జాతీయాలను ఎక్కువగా ప్రయోగిస్తాడు.

నారాయణరెడ్డికి తనదైన ఒక శైలి - సొంతముద్ర ఉంది. యతి ప్రాసలవల్ల, ప్రశ్నోత్తరాల పద్ధతివల్ల, గునుగు గేయరచనవల్ల, క్రమా లంకార శిల్పం వల్ల, జాతీయపద ప్రయోగంవల్ల, లలిత మంజుల పద రచనా రీతివల్ల అందమైన పదబంధాలవల్ల ఇంకా చెప్పలేని ఒక విశిష్టమైన సహృదయైకవేద్యమైన భావనా రచనా వైశిష్ట్యం వల్ల పాటను వినగానే—ఇది

నారాయణరెడ్డి పాట అని చెప్పగలుగుతాం. చెప్పలేకపోయిన సందర్భాలున్నా అవి విరళంగానే ఉంటాయి. ఒక్కొక్కసారి ప్రతిభావంతుడు పోయిన కొత్తకొత్త పోకడలను గుర్తించటం కష్టమే. వైవిధ్యం లేకపోతే ప్రతిభ రాణించటానికి అవకాశముండదు. ఈ కవి చిత్రగీతాల్లోని వైవిధ్యమే ఆతని సంపూర్ణ ప్రతిభా వికాసానికి అవకాశాన్ని కలిగించింది.

"శివరంజనీ ! నవరాగిణీ !' 'వస్తాడు నారాజు ఈరోజు' 'అభినవ తారవో', 'ముద్దుల మాబాబు నిద్దరోతున్నాడు'— అనే ఆతని పాటలు విశేష ప్రజాదరణకు పాత్రమై బహుమతులందుకున్నాయి.

ఈతనికి సహజంగా అబ్బిన ఆశుకవితాగుణంవల్ల స్వల్పకాలంలోనే ఈతడు పాటను వ్రాయగలుగుతాడు. "చరణ కింకిణులు ఘల్లుఘల్లుమన' 'పూజకు వేళాయెరా' వంటి పాటలు అరగంటలో వ్రాసినాడని తెలిసింది. 'స్వరములు ఏడైనా రాగాలెన్నో' అనే పాటకూడా చాలాతక్కువ కాలంలో వ్రాసిందే.

నారాయణరెడ్డి వ్రాసిన పాటల పల్లవులను, పాటల్లోని మాటలను కథానికలకు శీర్షికలుగా సినిమాపేర్లుగా కార్టూన్లుగా నిలుపుకున్నారు కొందరు. 'ఒకనాటి మాట కాదు' పేరుతో గతంలో ఒక కథానిక వచ్చినట్లు జ్ఞాపకం.

నారాయణరెడ్డి సినీమాలకు పాటలేగాక- 'ఏకవీర', 'అక్బర్ సలీం అనార్కలి' అనే చిత్రాలకు మాటలుకూడా వ్రాసినాడు. ఆ మాటల్లో కూడా ఆతని కవితాంశయే పరిమళిస్తుంది.

నారాయణరెడ్డి చిత్రసాహితిని గూర్చి ప్రత్యేకంగా ఒక పరిశోధనా గ్రంథం వ్రాయవచ్చు. ఈ వ్యాసంలో నాశక్తిమేరకు ఆతని పాటల వైవిధ్యాన్ని వైశిష్ట్యాన్ని సమీక్షించడానికి ప్రయత్నించినాను. ఈ చిత్ర సాహితీ సమీక్షను సహృదయుల మాటలతో ముగిస్తాను.

"చలనచిత్రగేయరచనలో వారి స్థానము నిర్ణయించుటకొక్క అనన్వయాలంకారమే శరణ్యము."-

—ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు

"ఫిలిం ప్రపంచంలోనూ ఏ భాషల్లో ఇన్నిపాటలు వ్రాసినవారు అరుదేమో........ప్రతిపాటను ఒక ముత్యాల మూటగా సంతరించడం ఈయనలో గల ప్రత్యేకత."-

—కళాప్రపూర్ణ శ్రీరావూరు వేంకటసత్యనారాయణరావు గారు

"ఈ ప్రక్రియాసాధనలో ఉన్నత శిఖరాలధిరోహించిన వారిలో డాక్టరు సి. నారాయణరెడ్డి గారు అగ్రేసరులని చెప్పడంలో అత్యుక్తిలేదు."-

—డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు




# విశ్వంభర

సమకాలిక సమాజంలో ప్రతి సంఘటనకు స్పందిస్తూ ప్రగతి శక్తులకు బాసటగా హృదయంగమమైన శైలిలో మేధను కుదుపుతూ సహృదయులలో ఆలోచనాతరంగాలను లేపుతూ కావ్యసృష్టి చేస్తున్న మహాకవి నారాయణరెడ్డి.

వచనకవితా ప్రక్రియలో నారాయణరెడ్డి మొట్టమొదటిసారిగా అందించిన కావ్యం 'విశ్వంభర'. ఇది 1980 డిసెంబరులో ప్రచురితం. వచనకవితాప్రక్రియలో సంపూర్ణఖండకావ్యాన్ని (మంటలూ - మానవుడూ) అందించిన ఒక దశాబ్దం తర్వాత నారాయణరెడ్డి ఇదే ప్రక్రియలో ఒక కావ్యాన్ని అందించగలిగినాడు. ఈ కావ్యాన్ని నారాయణరెడ్డి తన ప్రియమిత్రులు శ్రీ రమణయ్య (రాజా) గారికి అంకితం చేసినాడు.

వచనకవితాప్రక్రియలో 'విశ్వంభర' కావ్యరచనాసంకల్పం నారాయణరెడ్డి హృదయంలో ఐదారు సంవత్సరాలుగా కదులుతూనే ఉంది. మథనం

జరుగుతూనే ఉంది. ఈ ఘర్షణలో ఉదయించిన మెరుపులు కొన్ని 'తేజస్సు నా తపస్సు' సంపుటి మొదటి ఖండికలో తళుక్కుమంటాయి. అందులో సమస్త'ధరాగోళం'లో జరిగే ప్రతిచర్యనూ తపస్సుగానే దర్శించి సమన్వయించినాడు. ఆ తర్వాత 'ఇంటిపేరుచైతన్యం' కవితాసంపుటిలోని మొదటి ఖండికలో విశ్వగోళాన్ని ఆక్రమించే తన వ్యక్తిత్వాన్ని ప్రకటించి నాడు. ఆత్మాశ్రయరీతిలో విశ్వంభరను విలోకించినాడు.

'నా శ్వాస - అలనాడె
విశ్వంభరా వధూ
పదములకు పారాణి పూసింది'

వంటి పంక్తులు ఈ అభిప్రాయాన్ని పోషిస్తాయి.

నారాయణరెడ్డి 'విశ్వంభర' కావ్యరచనాసంకల్పం 'భూమిక' లోని ఖండాలలో ప్రత్యక్షమవుతుంది. అయితే ఆ కావ్యం కేవలం మానవతా మూర్తికి అలంకరించిన సువర్ణకిరీటం. వస్తువులో, భావాలలో కొంత సాదృశ్యమున్నా ప్రక్రియలో, అభివ్యక్తిలో భేదం అగుపిస్తుంది.

నారాయణరెడ్డి 'విశ్వంభర' కావ్యసంకల్పమథనం రేఖామాత్రంగా 'మృత్యువు నుంచి' కావ్యంలోని 'మృత్యువు నుంచి' అనే దీర్ఘ కవితలో కనిపిస్తుంది. మానవుని ఆధ్యాత్మికప్రస్తారంలో ప్రకృతిశక్తుల తత్త్వవిచార సందర్భంలో దీనిని సందర్శించవచ్చు. ఇలా నారాయణరెడ్డిలో ఐదేళ్ళుగా సాగిన మథనం ఫలితంగా ఈ 'విశ్వంభర' కావ్యం ప్రభవించింది.

'విశ్వంభర' వచనకవితాప్రక్రియలో వెలసిన ప్రబంధం. కవి పండితహృదయైకవేద్యం. కవి నారాయణరెడ్డిలోని ఉదాత్తభావప్రపంచం, శబ్దం, అలంకారం ఔచిత్యం, ఔజ్జ్వల్యం, కల్పనం, రచనా శిల్పం మానవ తత్త్వం అన్నీ సముచిత నిష్పత్తిలో కలిసి ఈ కావ్యంగా అవతరించినాయి. ఆధునిక కవితా ప్రపంచంలో వెలసిన ప్రతీకాత్మక కావ్యం. విశాలవిశ్వంభరా మండలాన్ని తమ వ్యక్తిత్వాలతో ఆశ్చర్యపరచిన, చైతన్యవంతం చేసిన మహాపురుషుల పూర్ణ పురుషుల రేఖామాత్ర జీవితసన్నివేశాలకు కవితారూపం ఈ మహాకావ్యం. 'ఆదిమదశ నుంచి ఆధునిక దశవరకు' కళాత్మకంగా, వైజ్ఞానికంగా, ఆధ్యాత్మికంగా సాగిన మానవప్రగతిప్రస్థానాన్ని ఐతిహాసిక,

పౌరాణిక పద్ధతిలో వ్యంగ్యమహితంగా ప్రపంచించిన మహోజ్జ్వలకావ్యమిది. నారాయణరెడ్డి తత్త్వస్ఫూర్తి వేయిరేకులతో వికసించిన కావ్యపద్మం ఇది. ఆతని కవితా చైతన్యకిరణాలు విశ్వతోముఖంగా ప్రసరించిన కావ్య మిహిరబింబం ఇది. సహృదయ పాఠకులను ఆలోచింపజేసే ప్రశ్నోపనిషత్తు ఇది. నారాయణరెడ్డి ముఖతః ప్రసరించిన మానవజీవనతత్త్వగీత ఇది. 'కవిత్వం నా మాతృభాష' అని ఉద్ఘాటించిన నారాయణరెడ్డి తన భాషలో రచించిన మహాకావ్యం ఇది.

సర్వతోముఖమైన మానవవికాసానికి ఈ ప్రకృతి ఎలా ఆలంబనంగా, ప్రేరణంగా నిలిచిందో ఈ కావ్యం ధ్వనిమంతంగా నిరూపిస్తుంది.

నానారుచిరార్థసూక్తినిధి ఈ కావ్యం.

'విశ్వంభర'ను మహాకావ్యం అనకుండా 'మగ్ర కావ్యం' అని నారాయణరెడ్డి అనడం ఆతని సౌజన్యానికి నిదర్శనం.

'ప్రస్తావన'లో ఈ కావ్యానికి మానవుడే నాయకుడని, మనిషి కథే ఇతివృత్తమని, 'విశాలవిశ్వంభర' రంగస్థలమని, 'ఈ కథకు నేపథ్యం ప్రకృతి' అని 'మనిషి ధరించే వివిధ భూమికలకు మూలధాతువులు మన శక్తులు' అని అన్నాడు నారాయణరెడ్డి.[1] విశ్వంభర కావ్యం ఐదు ఖండాలుగా పరుచుకుంది. ఈ కావ్యాన్ని ఐదు భాగాలకే పరిమితం చేయడంవల్ల ఒకవైపు పంచభూతాలూ, మరోవైపు పంచేంద్రియాలూ స్ఫురిస్తాయి. ఈ కావ్యానికి నిజంగానే ఈ అయిదు పంచభూతాలూ పంచేంద్రియాలూ.

ప్రథమభాగంలో మానవసృష్టికి ముందటి ప్రకృతినీ, ఆదిమానవదంపతులు ఆడమ్ ఈవ్ (Adam & Eve)ల ప్రణయం, దైవం నిషేధించిన ఫలాన్ని వారు భక్షించటం, శాసనధిక్కారఫలితంగా శప్తులై ఆ మిథునం భూమిపై అవతరించి కాలం గడపటం, అద్భుతావహంగా కనిపించే ప్రకృతి తత్త్వాన్నీ, ఋతుకాల ప్రభావాన్నీ దర్శించి మానవుడు ఆశ్చర్యపడి ఆలోచనా ప్రపంచంలో మునగటం, చెట్టుపై వర్షంపడితే చెట్టుక్రిందకు చేరి - పిడుగు

1. 'విశ్వంభర' ప్రస్తావనలో.

పడితే గుహలోకి దూరి, గుహలో పులిపైన పడితే ఏటిగట్టుకు పారి, గుడిసె నిర్మించుకోవడం - పులివంటి క్రూరమృగాలను ఈటెలతో, కత్తులతో ఎదుర్కొని ఆత్మరక్షణ చేసుకోవటం - తర్వాత వరుసగా మానవుడు గృహనిర్మాణ - వస్త్రధారణ - దేశాక్రమణ - జలప్రయాణ - పర్వతభేదన - అగ్న్యుత్పాదన - వ్యవసాయజంతుపోషణ - వాహననిర్మాణ - జలసద్వినియోగాద్యనేక కార్యాలను నిర్వహిస్తూ మానవుడు విశ్వమంతా విస్తరించిన వైనాన్ని సంక్షిప్తంగా తెలిపినాడు.

రెండవఖండం మానవుని కళాత్మకసాధనకు పట్టిన మణిదర్పణం, మానవుడు సాధించిన లలితకళావిశ్వసౌందర్యాన్నీ మాధుర్యాన్నీ చైతన్యాన్నీ వైవిధ్యాన్నీ కవితాత్మకంగా వివరించినాడు కవి. ప్రకృతి తత్త్వాన్ని సందర్శిస్తూ మానవుడు సంగీతనృత్యకవిత్వచిత్రలేఖన శిల్పకళలలో ఆతడు ప్రదర్శించిన అపారవైదుష్యాన్నీ, అనంతప్రతిభనూ ధ్వనిరమ్యంగా చిత్రించినాడు.

మానవుని వింత మనస్తత్త్వాన్నీ, ఆతని అగాధ మనశ్శక్తినీ సన్నివేశ సుందరంగా, తత్త్వవ్యాఖ్యానమహితంగా వివరించినాడు నారాయణరెడ్డి మూడవఖండంలో. కామక్రోధలోభాదిప్రవృత్తులకు గురియై మానవుడెలా జా[illegible]పడతాడో - సత్యసత్త్వభూతదయాదిగుణాలవల్ల మానవుడెలా ప్రకాశిస్తాడో ప్రతీకాత్మకంగా ఈ ఖండంలో వివరించినాడు.

మరో స్వర్గసృష్టి చేయగలిగిన అనంతమైన, మహాతపస్సునా అది కామానికి కరిగినప్పుడు ఎలా పతనమవుతుందో విశ్వామిత్రుని మేనకా ప్రణయోదంతం ద్వారా నిరూపించినాడు. అన్ని బంధాలు తెంచుకొని ఎన్ని తుఫాను లొచ్చినా చలించకుండా తపోవిజయాన్ని సాధించినందుకు నిదర్శనంగా గౌతమబుద్ధుని జీవితాన్ని ఎత్తిచూపినాడు. వీరిద్దరిదీ తపస్సే. కాని భేదం గమనార్హం.

మనిషిలోని ధరాలోభానికి ప్రతీకలుగా అలెగ్జాండరునూ, అశోకుణ్ణీ గ్రహించి, ఒకరి వికటత్వాన్నీ మరొకరి వివేకాన్నీ ఎత్తిచూపి అవి సాధించిన పతనోత్థానాలను ప్రదర్శించినాడు. అలాగే సత్యప్రకటనకై ప్రాణాన్ని విషపాత్రకు విసిరేసిన సద్గుణానికి సోక్రటీసును, మనీషిగా మనిషిని తీర్చిదిద్దే

జ్ఞానానికి సంకేతంగా ఏసుక్రీస్తును ఎత్తిచూపినాడు. ఇలా ఈ ఖండం మానవుని ప్రవృత్తులనూ, మనశ్శక్తులనూ ప్రదర్శిస్తుంది.

మానవుడు ఆధ్యాత్మికంగా సాధించిన సిద్ధులనూ, వైజ్ఞానికంగా అధిరోహించిన ప్రగతిశిఖరాలనూ ఆతని నిరంతరోద్యమశీలాన్ని దర్శింపజేసేది నాలుగవ ఖండం. ఆధ్యాత్మిక సంబంధమైన భక్తిమార్గాలూ, వివిధ మతసిద్ధాంతాలూ అన్నీ ఇందులో వ్యంగ్యంగా భాసిస్తాయి.

విశ్వమానవజాతిసంక్షేమం కోసం మహాపురుషులు ప్రపంచించిన సాంఘికసిద్ధాంతాలూ, అందుకు సాగించిన ఉద్యమాలూ ఐదవఖండం వివరిస్తుంది. ఇందులో వర్ణాహంకారాన్ని నిరసించి సాటిమానవుని స్వేచ్ఛనూ సామ్యవాదాన్నీ చాటిన అబ్రహాంలింకన్, పెత్తందార్ల దోపిడిని నిరసించి శ్రామికసంక్షేమాన్ని ఘోషించిన కార్ల్‌మార్క్స్, అందుకై విప్లవం సాగించిన లెనిన్, సహన శాంత్యహింసలతో భారతస్వాతంత్ర్యం సాధించిన మహాత్మాగాంధీ,వీరందరూ ఈ ఖండంలో ప్రతీకాత్మకంగా కనిపిస్తారు.

'సహమానవహననం' కోసం మానవుడు తన వైజ్ఞానిక సంపదను ఎలా దుర్వినియోగం చేస్తున్నాడో చెపుతూ నారాయణరెడ్డి ఎదురు దెబ్బలు తింటూనే, ఎగుడుదిగుళ్ళు దాటుతూనే మానవుడు నిత్యప్రయోగాలు చేస్తూ పురోగతిని సాధిస్తున్నాడని చెపుతూ ఈ కావ్యాన్ని ముగించినాడు.

"సృష్టికి మూలం జ్ఞానబీజం
విశ్వంభరా భ్రమణానికి మూలం
శాశ్వతచైతన్యతేజం"

అనీ,

"నిద్రించదు జ్ఞానం
నీరసించదు తేజం"

అనీ,

"ఆ తేజం విశ్వచరితకు
అభినవ భూమిక
ఆ జ్ఞానం నవ్యమానవతకు
అఖండ దీపిక"

అనీ, కావ్యం చిట్టచివరకు

"ఋషిత్వానికీ పశుత్వానికీ
సంస్కృతికీ దుష్కృతికీ
స్వచ్ఛందతకూ నిర్బంధతకూ
సమార్ద్రతకూ రౌద్రతకూ
తొలిబీజం మనస్సు
తులారూపం మనస్సు
మనస్సుకు తొడుగు మనిషి
మనిషికి ఉడుపు జగతి
ఇదే విశ్వంభరా తత్త్వం
ఇదే అనంతజీవితసత్యం"

అనీ ఈ కావ్యతత్త్వాన్ని నారాయణరెడ్డి ప్రకటించినాడు. ఈ తత్త్వాన్ని నారాయణరెడ్డి 'భూమిక' కావ్యంలోనూ చెప్పినాడు ఇలా

"ఆ మనసే మానవునికి మూలధాతువై
అది ఇంద్రియ విగ్ధర సంధాన సేతువై
ప్రగతికి తిర్యగ్గతికీ
పతనోత్థాన స్థితికీ
మౌలిక భూమికగా రూపొందుతుంది
మానవతకు నికషంగా విలుస్తుంది."

ఈ పంక్తులు చదువుతుంటే బంధానికీ, మోక్షానికీ కారణం మనస్సే (మనయేవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః) అన్న వేదాంతసూక్తి, "ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా" అన్న భగవద్గీతా సూక్తి స్ఫురిస్తాయి. నారాయణరెడ్డి మనస్సుకు చేసిన వ్యాఖ్యానం మానవ ప్రగతి దృక్పథంతో అత్యాధునికంగా ఉంటుంది. సత్కార్యానికీ, దుష్కార్యానికీ మానవుని మనస్సే కారణం. ఆ మనస్సుకు 'తొడుగు' మనిషి. ఆ మనిషికి 'ఉడుపు' ఈ జగత్తు. అందుకే మనస్సు ప్రస్థానించే తీరునుబట్టి ప్రపంచం నడుస్తుంది. అందుకే ఈ కవి ఆ మనస్సు తెల్లగా నవ్వితే 'జ్యోత్స్నసరిత్తులు' ప్రవహిస్తాయనీ నల్లగా నవ్వితే 'విషమరాత్రులు' పడగ

లెత్తుతాయనీ, పచ్చగా నవ్వితే 'పల్లవజయంతులు' వెలుస్తాయనీ అన్నాడు. మానసికపరిణతిపైనే మానవుని ప్రగతీ, సంస్కృతీ ఆధారపడి ఉంటాయనే సత్యాన్ని సందర్శింపజేసినాడు.

మానవుడు విశాలవిశ్వంభరలోని వింతలను దర్శించియే ఆలోచనలో పడి జ్ఞానవంతుడైనాడు. ఈ విశ్వంభరయే మానవునికి 'వినూత్నమతి'ని ప్రసాదించింది. ఈ కావ్యం మొదటి ఖండం ఇందుకు లక్ష్యం.

"ప్రకృతిలోని మూలనాదమే
పెకలి వచ్చిందా తనలోకి"
"ప్రకృతిలోని చలన శీలానికి
పరిణామం మనిషి"
"ప్రకృతి పలికింది కృతిగా
కృతి నిలిచింది మానసాకృతిగా"
"కదిలివచ్చింది ప్రకృతి సర్వస్వం
కలలు కనే మునివేళ్ళలోకి"
"పరవశించింది శిలాప్రకృతి
పల్లవించింది స్వప్నాకృతి"

అని ద్వితీయఖండంలో ప్రకృతి మానవుని హృదయంలో లలితకళా విర్భూతికీ, ఉన్నతికీ ఎలా దోహదం చేసిందో సూక్తిప్రాయంగా చెప్పినాడు. మూడవ ఖండంలో మానవుని మనస్సును రోదసిగానూ, వృక్షంగానూ, మహాసాగరంగానూ రూపిస్తూ విశ్వంభరకూ మానవునికీ గల సంబంధాన్ని మానవుని మనశ్శక్తి దీప్తికి అది ఎలా ఆలంబనంగా నిలిచిందో వ్యంగ్యంగా చెప్పినాడు.

ఇక మానవుని ఆధ్యాత్మికసిద్ధులకూ, వైజ్ఞానికప్రగతికీ ప్రకృతియే ప్రేరకమన్న తత్త్వాన్ని నాల్గవఖండంలో నిక్షేపించినాడు. ఎన్ని గిరులెదురైనా సాగిపోయే ప్రవాహంలా జీవితం సాగిపోతూనే ఉంటుందన్న తత్త్వాన్ని చివరిఖండంలో తెలిపి విశ్వంభరకూ మానవునికీ గల అవినాభావసంబంధాన్ని ఈ కావ్యం ద్వారా చాటినాడు. నాయకుడైన మానవునికి 'రంగస్థలం విశాల విశ్వంభర' అనీ ఆతని కథకు 'నేపథ్యం ప్రకృతి' అని నారాయణరెడ్డి

అనడం ఇందువల్లనే. విశ్వంభర– అంటే విశ్వాన్ని భరించేది అని. విశ్వం అంటే అంతటా ప్రవేశించేది అని అర్థం. 'విశ్వంభర'లో మనిషి ఉదయించినాడు. మనిషి మనస్సులో 'విశ్వంభర'తత్త్వం ఇమిడిపోయింది.

'విశ్వంభర' కావ్యతత్త్వం 'భూమిక' కావ్యంలో ఉంది. ఆ అంశం కావ్యనామాలు కూడా చెపుతున్నాయి. 'విశ్వంభర' అంటే భూమి. భూమికి అల్పార్థంలో 'క' ప్రత్యయం. కాబట్టి 'భూమిక'. 'విశ్వంభర' గోపురం– 'భూమిక' పునాది. 'భూమిక' మొక్క. 'విశ్వంభర' మహావృక్షం. 'భూమిక'లో మానవత– ఈ 'విశ్వంభర'లో మనిషి కథ. 'భూమిక'లో మానవుని చైతన్యసంస్కృతులు భూమికలైతే ఇందులో మానవుని సర్వమనశ్శక్తులు భూమికలు. 'భూమిక' గేయంగా సాగింది. విశ్వంభర వచనకవితగా వెలిసింది. 'భూమిక'లో పేర్లు వాచ్యంగా ఉన్నాయి. 'విశ్వంభర'లో ప్రతీకాత్మకంగా ఉన్నాయి. 'భూమిక'లో నారాయణరెడ్డి స్వీయవ్యక్తిత్వచిత్రణకు అవకాశం కలిగింది కొన్ని ఖండాల్లో. 'విశ్వంభర'లో ఆ అవకాశం లేదు. కవిత్వం విశాల విశ్వానికి మాతృభాష అని ప్రతిపాదించినందువల్ల నారాయణరెడ్డి భూమికలో సాహిత్యమూర్తులైన వాల్మీకి వ్యాస కాళిదాస షేక్స్పియర్ పోతన్న వేమన్నల సాహిత్యవ్యక్తిత్వచిత్రం నిర్వహించినాడు ఒక్కొక్క ఖండంలో. మానవుని లలితకళల్లో కవిత్వం ఒకటి మాత్రమే. అందులోనూ విశ్వస్థాయికి నిలిచే కళాఖండాలు కొన్నే. అందుకే - 'విశ్వంభర' రెండవ భాగంలో ఇరవైరెండుపంక్తుల్లో విశ్వసాహిత్యాన్నంతా ధ్వనింపజేసినాడు. 'భూమిక'లో కవిత్వంతప్ప వేరే కళల ప్రసక్తిలేదు. ఇందులో మానవుడు కావ్య నాయకుడైనందువల్ల లలితకళలన్నీ ఉన్నాయి. వ్యక్తికి ప్రాధాన్యం 'భూమిక'లో. శక్తికి ప్రాధాన్యం 'విశ్వంభర'లో. భూమిక కావ్యాంతంలో ఆదిమానవ మిథునం (ఆడమ్ ఈవ్) ప్రసక్తి. 'విశ్వంభర'లో ఆదిఖండంలోనే. ఇలా ఈ రెండు కావ్యాలకు బీజప్రాయంగా స్థూలంగా సామ్యమున్నా సూక్ష్మంగా భేదం ఉంది.

నారాయణరెడ్డి 'మంటలూ–మానవుడు' 'మనిషీ–చిలక' 'మథనం' 'మృత్యువునుంచి' వంటి కావ్యాల్లో ప్రతీకాత్మకరచన బహుళంగా సాగింది. ఈ 'విశ్వంభర'లో ఆతని అన్నికావ్యాలలో కంటె మించిన ప్రతీకాత్మకత చోటు చేసుకున్నది. అవి ఖండకావ్యాలు కాబట్టి కొన్ని ఖండికలలో

మాత్రమే ప్రతీకలు అగుపిస్తాయి. ఈ కావ్యంలో వ్యక్తులకు కాక ప్రవృత్తులకు, మనశ్శక్తులను ప్రాధాన్యం. ప్రవృత్తులకు ప్రతిరూపాలు వ్యక్తులు కదా; ప్రవృత్తులకు ప్రతీకలుగా గ్రహించి వ్యక్తులకు విశ్వజనీనతను సాధించినాడు. జర్మన్‌దేశవాగ్గేయకారుడైన 'బీథోవన్' పేరుండదు. 'రాగాత్మ' అని ఉంటుంది. 'తపస్సు' విశ్వామిత్రునికీ, 'పెత్తనం' ఇంద్రునికీ, 'మెరుపుతీగ' మేనకకూ, 'మనస్సు' బుద్ధునికీ, 'లోభం' (ధరాలోభం) అలెగ్జాండర్‌కూ అశోకునికీ, 'ప్రశ్న' సోక్రటీసుకూ, 'కాంతి' ఏసుక్రీస్తుకూ, 'అడుగు' లింకన్‌కూ, లెనిన్‌కూ, మహాత్మాగాంధీకీ ప్రతీకలు. ఇంకా ఎన్నెన్నో ఘట్టాల్లో అనేకప్రతీకలను గ్రహించి ఈ కావ్యాన్ని నడిపి విశ్వజనీనతను సాధించినాడు.

నారాయణరెడ్డి ధ్వనిమర్మజ్ఞుడు. ఏ విషయాన్నైనా వ్యంగ్యంగా చెప్పే కళ ఆతని సొమ్ము. ఈ కావ్యంలో నుంచి అనేక సందర్భాలను ఉదాహరణగా చూపించవచ్చు. ఉదాహరణకు ఒకటి.

'కనిపించింది ప్రతివృక్షం
కప్పుకున్న పచ్చని రెమ్మలతో
పలకరించింది ప్రతి పక్షి
మలచుకున్న జిలుగు రెక్కలతో
కదలాడింది ఆకాశం
కట్టుకున్న వలువ మబ్బులతో" (పుట 8)

నిషిద్ధ ఫలాన్ని భక్షించిన ఆదిమానవ మిథునానికి ఫలభక్షణ కారణంగా వారికి నగ్నంగా ఉన్నామనే జ్ఞానం సిగ్గూ-స్త్రీ పురుషభావం కలిగింది. ఆ భావంతో ప్రకృతిని చూసేసరికి వారికి సిగ్గుతో చెట్లు రెమ్మలనూ, పక్షి రెక్కలనూ, ఆకాశం మబ్బులనూ కట్టుకున్నట్లనిపించింది. వారు వెంటనే సిగ్గుతో తుళ్ళిపడి 'పొదలను' కప్పుకున్నారు.

"అయితే వెళ్ళిపో మట్టిమనిషీ! ఆ మట్టిలోకి"
"అలాగే వెళ్ళిపొంగిస్తాను ఆ మట్టిని నింగిపైకి"
"అందాకా వచ్చిందా నీ అహంకృతి?"
"అక్కడే మొదలవుతుంది మానవ సంస్కృతి"

వంటి పంక్తులు యుగయుగాల మానవజాతివికాసచరిత్రను గర్భీకరించు కున్నాయి. మొదటి ఖండంలో కనిపించే ఈ పంక్తులు మానవప్రగతిని చిత్రించే కావ్యశేషభాగాన్నంతటినీ ధ్వనింపజేస్తున్నాయి. ఇలా ధ్వనిమంతాలైన అనేక సందర్భాలు ఈ కావ్యంలో దర్శనమిస్తాయి. అనేక పంక్తులు 'లక్షణావృత్తి'తో పరుగెత్తినాయి. లక్ష్యార్థాన్ని అందించినాయి.

'కవిత్వం నా మాతృభాష' అన్న నారాయణరెడ్డి మాటలు అక్షరసత్యాలు. 'మథనం', 'మృత్యువునుంచి' కావ్యాల పరిశీలనలో ఆతని మాటలకు లక్ష్యాలను చూపినాను. ఈ కావ్యారంభపంక్తులతోనే ఆరంభమవుతుంది ఈతని కవిత్వభాష. ఈ భాషనే ఆలోచింపజేస్తుంది; ఆనందింపజేస్తుంది సహృదయ పాఠకులను. ఆతని కవిత్వభాషలో చెట్లముఖాలు, చెట్లచెక్కిళ్లు, చెట్లశ్వాసలు, దిశలనొసళ్ళు, గిరులవేళ్ళు, కాట్లువేసే నదులు, కాళ్ళు విరిగిన మబ్బులు, ముళ్ళను ప్రశ్నించే పూలు, కోటికళ్ళున్న గుడ్డిచీకట్లు, పులకలు పూచే గోళ్లు, తరగలు వీచే వేళ్ళు ఎన్నెన్నో కనిపిస్తాయి. ఎదలను కదిలిస్తాయి. కవిత్వభాషాపారంగతుడు నారాయణరెడ్డి. అందుకు ఈ కావ్యంలోని ప్రతిపుట నుంచి లక్ష్యాలను చూపించవచ్చు.

"పలికే ఈ గొంతులో
ప్రతిశబ్దం ఇద్దరిది"
"తన చూపుడువేలు నీడలో
ధరాగోళం ఒదగాలని
తన కత్తుల తళతళలు
ఇనకాంతులై కదలాలని"
"పతాక తెగిపోయి
పట్టికర్ర మిగిలిందని"
"ప్రతి మకుటం తన కాలిగోటిలో
ప్రతిఫలించాలని"
"ఏమయింది తన ఆజ్ఞాపత్రం
ఏ అర్భకుడు గాలిపటంగా చేసుకున్నాడు"
"నా శవం నా పైపే నడచి వస్తున్నది"

"ప్రేమసస్యం పండాలంటే
ద్వేషం దుక్కి దున్నాలా?"

వంటి ధ్వని మనోజ్ఞాలైన చరణాలు అసంఖ్యాకం. ఇట్టి పంక్తులే కవిని శాశ్వతంగా నిలిపేవి.

ఈ కావ్యంలో మెరపుతీగల, మిణుగురు పురుగుల వర్ణనలు (పుట-3) సూర్యవర్ణన (పుట-12) మానవుని మనస్తత్వవర్ణన (పుటలు 34, 35, 36, 37), ఇంద్రుని ఆందోళన వర్ణన (పుట-40), మేనకా ప్రభావ వర్ణన (పుట-41) గౌతముని సుఖైక జీవనవర్ణన (పుటలు 42, 43), అలెగ్జాండర్, అశోకుల దండయాత్ర వర్ణనలు (పుటలు-47, 50), రష్యా విప్లవవర్ణన (పుటలు-88,89,90) భారత స్వాతంత్ర్య సమరగాథ వర్ణన (91 నుండి 95) —నారాయణరెడ్డి వర్ణనాశక్తికి ఎత్తిన పతాకలు. ఈ వర్ణనలన్నీ ఔచితీ మర్యాదలను దాటకుండా వస్తుపోషకాలై భాసిస్తున్నాయి.

ఈ కావ్యంలో నారాయణరెడ్డి ప్రయోగించిన ఉపమానాలలో రెండు లక్షణాలు కనిపిస్తాయి. ఒకటి అవి అపూర్వతను సంతరించుకోవటం, రెండవది— వస్తు—సన్నివేశ పాత్ర మనస్తత్వాలే ఉపమానాలుగా నిలవటం. ఇందుకు అనేకోదాహరణలను చూపవచ్చు. మచ్చుకు ఒక్కొక్కటి, "పసిపాపల్లా ఎదలపై పారాడే పడవలెప్పుడొస్తా"యని పొంగి సముద్రాలు 'సింగి తండ్రిని' అర్థించేవట. సముద్రముపైని పడవలను తల్లిఎదలపైని పసిపిల్లలతో ఉపమించటం అపూర్వం.

'సహచరి గుండెలో ఒక కోరిక
సర్పంలా తిరిగింది మెలిక" (పుట 7)

'సాటన్' సర్పరూపం ధరించి 'ఈవ్'లో దైవనిషిద్ధమైన ఫలాన్ని తినాలన్న కోరిక కలిగిస్తుంది. ఈ సన్నివేశంలో 'సర్పంలా' అని అంటాడు. కావ్యంలో సాటన్-సర్పం ఏమీ ఉండవు. ఉపమానం మాత్రమే ఉంటుంది. బైబిల్‌లోని ఆ పాత్రను గ్రహించి దానినే ఉపమానంగా గ్రహించి—మూల కథను ధ్వనింపజేసినాడు. విజ్ఞుడైన పాఠకునికి అదంతా భాసిస్తుంది. ఆ తర్వాత "ఈల వేసింది ఫూత్కారంలా" అంటాడు అందుకోసమే.

నారాయణరెడ్డి అన్ని కావ్యాల్లో వలెనే ఈ కావ్యంలోనూ క్రమాలంకారశిల్పాన్ని ప్రదర్శించినాడు. ఉదాహరణకు పుటలు 1, 37, 50, 57, 68, 82 చూడవచ్చు.

ఇక కావ్యరచనాశిల్పాన్నిగూర్చి కొన్ని విశేషాలు. మానవుడు తన కథను చెపుతున్నట్లే కావ్యారంభం చేసినా, తర్వాత నారాయణరెడ్డి తాను చెపుతున్నట్లే కావ్యాన్ని నిర్వహించినాడు. అక్కడక్కడ కొన్ని సన్నివేశాలలో ప్రత్యక్షసంభాషణలను ప్రయోగించినాడు. కథాకథనంలో ప్రశ్నలను ప్రయోగించటం కూడా ఒక మెలకువే. దీనివల్ల పాఠకుల్లో ఆలోచనా తరంగాలు లేస్తాయి. ప్రశ్నలతో "ఊరుకోకుండా సమాధానాలిస్తాడు. అది చదువగానే పాఠకుడు ముందుకు సాగుతాడు. ఇలా ఆలోచింపజేస్తూ రచన సాగిస్తాడు. కొంతకథను చెప్పి సారాన్ని వ్యాఖ్యానిస్తాడు తాత్త్వికంగా. ఒక సన్నివేశానికి ముందు ప్రస్తావనను వ్యాఖ్యానిస్తాడు సారభూతంగా. ఈ శిల్పాన్ని మూడవభాగంలోని విశ్వామిత్ర గౌతమాశోక సోక్రటీసు ఏసుల జీవితసన్ని వేశ చిత్రణలో చూడవచ్చు.

ఇది వచనకవిత కాబట్టి వాక్యవిన్యాసంలో నారాయణరెడ్డి వైవిధ్యాన్ని ప్రదర్శించి పాఠకులకు విసుగురాకుండా జాగ్రత్తపడ్డాడు. భావాలకనుగుణంగా చరణాలను కూర్చటం, వాక్యం క్రియ లేకుండా వ్రాయటం, క్రియలను కొన్ని చోట్ల పంక్తికి మొదట, కొన్నిచోట్ల పంక్తికి మధ్య, మరికొన్ని చోట్ల చివరకు కలపడం, భావాన్నిబట్టి ఊపు, ఊపును బట్టి పంక్తిసంఖ్యలు పెంచటం, నాల్గుపాదాలు వరుసగా వ్రాసి తర్వాత నాలుగు పాదాలలో నాలుగు క్రియలను పాటించటం, ఉపమానాలతో పంక్తులను ముగించటం, పంక్తులను శత్రర్థకాలంతో (వ్యావహారిక భాషలో తూ, స్తూ, ఉంటూ, లతో) ముగించటం, 'అని'తో వాక్యాలు పూర్తిచేయటం, అసమాపక క్రియలతో కొన్ని పంక్తులను వాడి, చివరి పంక్తుల్లో సమాపక క్రియలు వాడడం— ఇలా ఎన్నో వాక్యవిన్యాసాలు.

నారాయణరెడ్డి పద్యగేయచ్ఛందస్సులను వశీకరించుకున్న కవి. కాబట్టి అతనికి అప్రయత్నంగా వచనకవితలో కూడా యతో, ప్రాసో, అంత్యప్రాసో పడుతూ ఉంటాయి. ఏ నియమం లేక అతని ఊపిరిసాగదు.

ఆతని ఊపిరిలోనే లయ ఉంది. అది ఒక ఊపుతో బహిర్గతమవుతుంది. ఒకే ఊపుతో కొన్ని పంక్తులు సాగుతాయి. ఇట్టి పంక్తుల్లో అనుకోకుండా మాత్రలు లెక్కిస్తే సమానంగా పడతాయి. ఇందుకు ఈ కావ్యంలోని ఉదాహరణలు చూపవచ్చు.

"వేయి తోటలను నరికిన చేయి
పూయిస్తుందా ఒక్క పువ్వును"
"మనిషి జీవితం
అనుభవాంకితం"
"దేహాన్ని తిప్పలేని ప్రాణి
సోహం అంటాడెందుకని?"

వంటి సూక్తులు ఈ కావ్యానికి విశ్వజనీనతను సంతరిస్తున్నాయి. నారాయణరెడ్డి కవిత్వం నానారుచిరార్థసూక్తులకు నిధానం.

పవనతరంగిణులు, పరిమళాల మంటలు, చిగురాకుల జేబురుమాళ్ళు, పల్లవజయంతులు, గిరిపదాలు, సస్యాలయాలు, బాల్యకుల్యలు వంటి చక్కని కొత్త పదబంధాలు ఈ కావ్యాన్ని అలంకరిస్తున్నాయి.

ఎన్నెన్నో అంశాలను చెప్పాలనే తహతహను సహృదయాలలో సృష్టించే మహాకావ్యం 'విశ్వంభర'.

శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను చదివి ఉద్దీప్తులై శ్రీ నార్లవెంకటేశ్వరరావుగారు 'ఆంధ్రప్రభ'లో సంపాదకీయమే వ్రాసినారు ఆ పుస్తకంమీద. నాకు తెలిసినంతవరకు ఒక పుస్తకం మీద సంపాదకీయం రావడం, ఇది రెండవసారి. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు 'నందిని' యువభారతి సాహిత్య త్రైమాసిక సంచికలో 'విశ్వంభర' గూర్చి సంపాదకీయం వ్రాసినారు.[1]

---

1. 'నందిని' యువభారతి త్రైమాసిక సంచిక-జూలై 1981.

ఈ కావ్యానుశీలనాన్ని ప్రసిద్ధ విద్వద్విమర్శకులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారి మాటలతో ముగిస్తాను.

"ఆధునికుల దృష్టిలో ఎన్నుకొన్న వస్తువునుబట్టే కావ్యం విలువకట్టటం విశేషంగా కనబడుతున్నది. ఆ దృష్టితో చూస్తే ఆధునిక సాహిత్యంలో మహా ప్రస్థానంలాగా విశ్వంభర మరో శిఖరం."[2]

2. నారాయణరెడ్డి '50'వ జన్మదినోత్సవ అభినందన సంచిక'లో 'సువర్ణ తిలకం'

ప్రచురణ : వంశీ ఆర్ట్ థియేటర్స్—హైద్రాబాద్. 1981.




వర్షించే మేఘం. గలగల సాగే జలపాతం, వికసించిన వసంతం, ఘోషించే సముద్రం, భాసించే సూర్యేందు బింబాలు, గళమెత్తే కలకంఠం, పురివిప్పిన మయూరం ఈ అన్నింటి అంశాలను సముచితనిష్పత్తిలో మిశ్రంచేసి ప్రాణంలా ఒక మూర్తిలో పోస్తే ఆ మూర్తి ఎలా ఉంటాడో తెలుసా? నారాయణరెడ్డిలా ఉంటాడు. అందుకే అతనికి నవ్వని పువ్వుల భాషా, దివ్వెలమువ్వల ఘోషా తెలుసు. అంబుధిలోని రత్నాలనూ, అంబరంలోని హరివిల్లునూ అందుకునే పండితుడు, ప్రతిభావంతుడు. చైతన్యం, సౌజన్యం, నవత, మానవత, సంప్రదాయం, ప్రయోగం అతని వ్యక్తిత్వంలో అనివార్యాలైన అంశాలైనాయి. పల్లెలో పుట్టి భాగ్యనగరం చేరి అఖిలభారతదేశంలోనే కాదు అంతర్జాతీయ కీర్తిని ఆర్జించినాడు నారాయణరెడ్డి. ఇంతటి మహనీయవ్యక్తిత్వం అప్రయత్నంగా కలుగలేదు. దీనివెనుక అపారమైన కృషి ఉంది. మొక్క మహావృక్షం కావడానికి, చుక్క సుధాంశుబింబం కావడానికి, మొగ్గ పుష్పం కావడానికి, గుడిసె మేడ కావడానికి, శిల శిల్పం కావడానికి ఎంతో శ్రమ, ఎంతో తపన, ఎంతో మథనం, ఎంతో సాహసం అవసరం.

నారాయణరెడ్డి తెలంగాణా కరీంనగరం జిల్లా సిరిసిల్లా తాలూకాలోని అచ్చమైన పల్లీయ వాతావరణానికి ఆదర్శమైన హనుమాజిపేట గ్రామంలో కర్పూరమూర్తులు బుచ్చమ్మ మల్లారెడ్డి దంపతుల అనురాగఫలంగా ప్రజోత్పత్తి సంవత్సరంలో నిజాషాఢ పౌర్ణమి బుధవారం (29 జూలై 1931) ఉదయం 4-5 గంటల మధ్య ఉదయించినాడు. నారాయణరెడ్డికి తల్లిదండ్రులు పెట్టిన పేరు సత్యనారాయణరెడ్డి.[1] ఆతని పేరులోని సత్యం బయలుదేరి కవిత్వంలో సౌందర్యంగా రూపుదాల్చింది. ఆతనిలోని స్నేహశీలం, అభినివేశం, ప్రతిభ, విద్వత్తు, భాగ్యం ఇవన్నీ ఆతని జాతక విశేషాలను నిజమని నిరూపిస్తున్నాయి.

నారాయణరెడ్డి ప్రాథమిక పాఠశాలా విద్యను హనుమాజి పేటలోనూ, మాధ్యమికవిద్యను సిరిసిల్లలోనూ, ఉన్నతపాఠశాలావిద్య కరీంనగరంలోనూ పూర్తి చేసినాడు. 1948లో హెచ్.యస్.సి. ఉత్తీర్ణుడైనాడు. ఉన్నత పాఠశాలా విద్యాభ్యాసం కాలంలోనే నైజాం రాష్ట్రానికి స్వాతంత్ర్యం రావాలని జరిపిన విద్యార్థుల సత్యాగ్రహంలో పాల్గొన్నాడు. "సైనికులం మేం సేవకులం - జాతీయభారత సైనికులం - స్వచ్ఛంద భారత సేవకులం"[2] అంటూ గానం చేసినాడు. పోలీసుల లాఠీచర్యలకు గురి అయినాడు. నారాయణరెడ్డి 1949లో హైదరాబాద్ చేరి చాదర్‌ఘాట్ కళాశాలలో ఇంటర్మీడియట్‌ను, 1952లో ఆర్ట్సు కాలేజీలో బి.ఏ. ను 1954లో ఎం ఏ. ను పూర్తిచేసినాడు. 1954-55లో కొంతకాలం సికింద్రాబాద్ ఆర్ట్సైన్సు కాలేజీలో పార్ట్‌టైం లెక్చరర్‌గా పనిచేసి, అదే కాలేజీలో 1955లో ఆంధ్రోపన్యాసకులుగా ఉద్యోగమారంభించినాడు. 1958-59లో నిజాంకళాశాలలో పనిచేసినాడు. 1957 నుంచి 1962 వరకు ఆచార్య శ్రీ లక్ష్మీరంజనంగారి పర్యవేక్ష

---

1. ఒక మగపిల్లవాడు పుట్టిపోవడమూ, మళ్ళీ ఆరేళ్ళవరకూ కాన్పుకాకపోవడంతో బుచ్చమ్మగారు సంతానం కలిగితే సత్యనారాయణవ్రతం చేయిస్తానని మొక్కుకున్నారు కొడుకు పుట్టడంతో సత్యనారాయణరెడ్డి అని పేరు పెట్టుకున్నారు.

2. ఈ గేయం అద్లూరి అయోధ్యరామకవి వ్రాసినారని నారాయణరెడ్డి నాకు చెప్పినాడు.

ణలో పరిశోధన సాగించి పి.హెచ్.డి పట్టాను పొందినాడు 1962లో. 1963లో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో రీడర్ అయినాడు. 1976లో ఆచార్యుడైనాడు. మొన్ననే 50వ జన్మదినం సందర్భంగా అధికార భాషా కమీషన్ అధ్యక్షపదవిని ఆతనికి కానుకగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అందించింది. ఇదీ ఆతని ఉద్యోగదశాక్రమం.

నారాయణరెడ్డికి ఆదినుంచి సహజంగా ఆశుగుణం, గానశీలం అధికం. ఆయన తన చిన్నప్పటినుంచి మట్టిలో పుట్టిన జానపదగీతాలను ఆలపించేవాడు. ఆ గీతాల పరిమళాలు ఈనాటి వరకు ఆతని హృదయపేటికలో భద్రంగా ఉన్నాయి. అప్పుడప్పుడూ గుబాళిస్తాయి కూడా. హరికథలంటే, జంగం కథలంటే చెవికోసుకునేవాడు. హరికథాకథనాన్ని అనుకరించేవాడు ఆశుగుణంతో సంగీతాత్మకంగా. వేములవాడ వాస్తవ్యులు శ్రీ చౌటి నరసయ్యగారి హరికథాగానం నారాయణరెడ్డికి గేయచ్ఛందస్సు పట్ల మక్కువా, అభిరుచీ కలగటానికి ప్రేరకమైంది. ఆతడు ఆరవతరగతినుంచే కవితలు వ్రాయనారంభించినాడు. ఛందస్సు అంటే ఏమిటో అప్పుడు తెలియదతనికి. ఎనిమిదవ తరగతి వాచకంలోని నక్క కథ ఆతని నుండి అప్రయత్నంగా—

"ఒకనాడు ఒకనక్క ఒక అడవిలోపల
పొట్టకోసరమెటో పోవుచుండె"

అంటూ సీసపద్యంగా వెలువడింది. తర్వాత పదవతరగతిలో చాలాపద్యాలు వ్రాసినాడు. హనుమాజిపేటలో వేసవి సెలవుల్లో జామచెట్టుక్రింద కూర్చొని పద్యాలువ్రాస్తుంటే—తండ్రి "మెదడు పాడైతది బిడ్డా బట్టోళ్ళమా – బాపనోల్లమా" అనేవారట.

"వెన్నవంటి మనసున్నవానికి
అన్నమేమొ కరువాయె
ఉన్నవానికింతన్న పీడుదా
మన్న గుండె లేదాయె"

వంటి పాటలు పదవతరగతిలో వ్రాసినాడు.

కరీంనగర్ విద్యార్థి మహాసభలో

"విజయంబు సాధించినావా విద్యార్థి
నీ వీరభావాలు నింగి వ్యాపించగా
నీ వైరి చిత్తాల నేల కంపించగా"

వంటి గేయాలు రచించి పాడినాడు.

1948 లోనే గాంధీజీపైన పద్యాలూ గేయాలూ వ్రాసినాడు.

"మారాలి మారాలి మారాలిరా
కరడుగట్టిన నేటి కరకు సంఘపురంగు
మారాలి మారాలి మారాలిరా"

వంటి గేయాలు ఎన్నో వ్రాసినాడు.

నారాయణరెడ్డి గళంలో పాటలు మారుమోగుతున్నా ఆతని కవితాజీవితంలో మొదట పద్యాలే ప్రకాశించినాయి. తర్వాత గేయాలు సాగినాయి. ఇంటర్మీడియట్‌లో ఉండగా నారాణయరెడ్డి మొదటి కవిత 'జనశక్తి' పత్రికలో మొదటిసారిగా ప్రచురితమైనది. 1952లో పెద్దగేయం వ్రాసినాడు పార్టీలను విమర్శిస్తూ. బి.ఏ. ద్వితీయ సంవత్సరంలో ఉస్మానియ విశ్వవిద్యాలయ ఆర్ట్సు కళాశాల విద్యార్థుల సాహితీసంచిక 'శోభ'కు సంపాదకత్వం నిర్వహించినాడు. తర్వాత 'స్రవంతి' పత్రికకుకూడా సంపాదకత్వం నిర్వహించినాడు. ఇప్పటికీ నిర్వహిస్తున్నాడు. 'శోభ' పత్రికలో నారాయణరెడ్డి 'రోచిస్' 'సింహేంద్ర' అనే మారుపేర్లతో రచనలు చేసినాడు. ఎం. ఏ. విద్యార్థిగా ఉన్నరోజుల్లోనే 'నీనీకవి' అనే నాటిక వ్రాసి 'మకరందమూర్తి' అనే పాత్ర ధరించి, నాటికకు దర్శకత్వం తానే వహించి ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ప్రదర్శించి ఉత్తమనటుడుగా బహుమతినందుకున్నాడు. నారాయణరెడ్డి కేవలం కావ్యకర్తగానేగాక కార్యకర్తగా కూడా తన పాత్రను నిర్వహించినాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగువిద్యార్థి సమితికీ, తర్వాత తెలంగాణా రచయితలసంఘానికి కార్యదర్శిగా ఉన్నాడు. నారాయణరెడ్డి ఎంత బాగా వ్రాయగలడో అంత బాగాపాడగలడు. ఆతని పాట వినడానికి విద్యార్థులు విరుచుకుపడేవారు. నారాయణరెడ్డి అంటే ఆనాటినుంచీ గ్లామర్ ఏర్పడింది శ్రోతల్లో. 'పూలపాటలు' 'నవ్వని పువ్వు' నాటికలను

గానం చేసేవాడు శ్రవణపేయంగా. ఈ గేయరచనమూ గానమూ నారాయణ రెడ్డి కథాకావ్య సినీమా గీతికా రచనకూ ప్రాతిపదికలుగా నిలిచినాయి.

ఉన్నత పాఠశాలా విద్యార్థిగా ఉన్నప్పుడు కరీంనగర్‌లో శేషాద్రి రమణ కవుల్లో ఒకరయిన శ్రీదూపాటి వెంకటరమణాచార్యులుగారు నారాయణ రెడ్డికి ఛందోవిశేషాలను బోధించి ఒక మార్గాన్ని చూపినారు అధ్యాపకులుగా.

నారాయణరెడ్డికి కవితాగురువులు లేరు. ఆతని కవిత్వాన్ని ప్రశంసించిన వాళ్ళల్లో మొదట్లో విద్యార్థులే ఎక్కువ. వారి ప్రోత్సాహం, స్ఫూర్తితోనే అనేకం వ్రాసేవాడు. ఎం.ఏ. విద్యార్థిగా ఉన్నరోజుల్లో మహాకవి డా॥ దాశరథిగారి సాహచర్యం ఆతని కవితారచనకు దోహదం కల్పించింది.

నారాయణరెడ్డి కవితావ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన ప్రాచీన కవులు ప్రధానంగా కాళిదాసు, శ్రీనాథుడు. ఆధునిక కవులు రాయప్రోలు, జాషువా, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ.

నారాయణరెడ్డిలో సంప్రదాయబలం అతివేలంగా ఉన్నందువల్ల అత్యున్నతంగా పెరుగుతున్నాడు ప్రయోగాలు చేస్తూ. ప్రతిభావంతుడైన కవి ఏ ప్రక్రియలోనైనా సమగ్రకావ్యరచన చేయగలడనీ, శిల్పసౌందర్యాన్నీ ప్రదర్శించగలడనీ ఋజువుచేసిన ప్రయోగశీలి.

నారాయణరెడ్డి సహృదయుడు. ఏ తోట పూచిన పువ్వైనా ఎదకు హత్తుకునే సౌజన్యమూర్తి. దూది పరుపుల్లో పడుకున్నా సూది పోడుపులను తలచుకునే చైతన్యమూర్తి. ఆతని నిఘంటువులో ఉదయాలూ ఉగాదులూ తప్ప అస్తమయాలూ అమవాస్యలూ అగుపించవు. అతడెందరినో ప్రోత్సహించినాడు సాహిత్యరంగంలో.

ఆతని హృదయ పరిణతిని దర్శించిన సమకాలికకవులూ రచయితలూ అనేకులు ఆతనికి తమ గ్రంథాలను అంకితం చేసినారు సౌహార్దంతో. డా॥ ముకురాల రామారెడ్డిగారి 'దేవరకొండ దుర్గం', శ్రీ జె. బాపురెడ్డిగారి 'చైతన్యరేఖలు', శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి 'తెలుగువారి చలన చిత్రకళ', శ్రీ శశాంకగారి 'స్వరలహరి', శ్రీ ఎం. కె. రాముగారి 'గీతారామం', శ్రీ కనపర్తిగారి 'దీపశిఖలు', శ్రీ వద్దెపల్లి కృష్ణగారి 'అంతర్మథనం', డా॥ సి. ఆనందారామంగారి 'తపస్వి', శ్రీ 'విరించి'గారి 'నా కవ

నం', శ్రీ వసునందన్‌గారి 'గురుకులము', డా॥ ఎస్. గోపిగారి 'తంగెడు పూలు' శ్రీ ఎల్లూరి శివారెడ్డిగారి 'సురవరం ప్రతాపరెడ్డి - జీవితము సాహిత్యము', శ్రీ అమ్మంగి వేణుగోపాల్‌గారి 'మిణుగురు', శ్రీ రేగులపాటి కిషన్‌రావుగారి 'వాణిశ్రీ', శ్రీ మామిండ్ల రామగౌడుగారి 'రసతరంగిణి' ఇలా అనేక గ్రంథాలు నారాయణరెడ్డికి అంకితమైనాయి.

నారారాయణరెడ్డి తన కవితాప్రతిభను ప్రదర్శించి 'దివ్వెల మువ్వలు' కావ్యానికి నవ్యసాహితీ సమితివారి అవార్డు నందుకున్నాడు. ఆ తర్వాత 1965లో 'ఋతుచక్రం' కావ్యానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డును, 1974లో 'మంటలూ- మానవుడూ' కావ్యానికి కేంద్రసాహిత్య అకాడమీ అవార్డును అందుకున్నాడు.

నారాయణరెడ్డి ప్రతిభామహితమైన సాహిత్యవ్యక్తిత్వాన్ని మీరట్ విశ్వవిద్యాలయం 1076లో గౌరవ 'డాక్టరేట్' (డి. లిట్)తోనూ, ఆంధ్ర విశ్వవిద్యాలయం 1978లో 'కళాప్రపూర్ణ' బిరుదుతోనూ, 1977లో భారత ప్రభుత్వం 'పద్మశ్రీ' బిరుదుతోనూ గౌరవించినాయి.

నారాయణరెడ్డి సినిమాకవిగా అఖండయశస్సును ఆర్జించినాడు. ప్రజల గుండెల్లో భద్రపీఠాన్ని స్థాపించుకున్నాడు. 'గులేబకావళి కథ' (1961)తో ప్రారంభమైన ఆతని సినిమాగేయసాహితీతరంగిణి ఈనాటికి ధారామధురంగా ప్రవహిస్తున్నది. దాదాపు మూడు వేల పాటలు వ్రాసినాడు.

నారాయణరెడ్డి కొన్నిచిత్రాల్లో కావ్యసంబంధమైన పాత్రల్లో కనిపించినాడు. 'మూగజీవులు', 'శబాష్‌పాపన్న', 'మొగుడా-పెళ్లామా', 'తూర్పు పడమర' ఆ చిత్రాలు. ఆతని అనేక గేయాలు బహుమతులందుకున్నాయి.

నారాయణరెడ్డి రసవత్ కవితలూ, కావ్యాలూ అన్యభాషల్లోకి అనూదితాలైనాయి. డా॥ ప్రభాకర్, డా॥ అరిపిరాల విశ్వం, డా॥ అమరేంద్రగారలు ఆంగ్లంలోకి ఈతని కవితలను అనువదించినారు. ఈతని 'దివ్వెలమువ్వలు' వంటి అనేక కవితలను 'దీప్ కే నూపుర్'గా హిందీలోకి అనువదించినారు ఆచార్య శ్రీరామశర్మగారు. శ్రీ శ్రీనివాసగారు 'కొత్త ముఖం తొడుక్కో' వంటి ఇరవైయైదు కవితలను 'హొస ముఖ తొట్టుకొ'గా కన్నడంలోకి అనువ

దించినారు. 'మంటలూ-మానవుడూ' కావ్యాన్ని శ్రీ ఇళం భారతిగారు 1977లో 'అనల్‌కాట్రు' అన్నపేరుతో తమిళంలోకి అనువదించినారు.

నారాయణరెడ్డి మహాకవే కాదు మహోపన్యాసకుడు కూడా, అతని ఉపన్యాసం శబ్దమాధురినీ, భావగాంభీర్యాన్నీ కవితాపరిమళాన్నీ ఒలికిస్తుంది. ఆతని ఈ శక్తికి అసంఖ్యాకశ్రోతలే ప్రబల సాక్ష్యాలు.

నారాయణరెడ్డి ఆశుగుణం ఆతణ్ని గొప్ప వ్యాఖ్యాతగా తీర్చిదిద్దింది. ప్రపంచ తెలుగుసభలూ, అనేక చలనచిత్రశతదినోత్సవాలూ, ఘంటసాల రజతోత్సవాలూ ఇందుకు రేఖామాత్ర నిదర్శనాలు.

ఆయాదేశాల సంస్థల ఆహ్వానాలందుకొని నారాయణరెడ్డి మలేషియా, రష్యా, అమెరికా-ఇంగ్లాండు, ఫ్రాన్సు, కెనడా వంటి దేశాలను పర్యటించినాడు. ఆ అనుభవాలనూ, అనుభూతులనూ అక్షరబద్ధం చేసి సహృదయ లోకానికి జ్ఞానానందాలను ప్రసాదించినాడు.

గుంటూరు, మదరాసు, ఢిల్లీ, జంషెడ్‌పూర్, షోలాపూర్, బొంబాయి, బరంపురం, బెంగుళూరు, పూనా, మలేషియా,రష్యా, అమెరికా, ఇంగ్లాండు ఇలా ఆంధ్రదేశం మొదలుకొని అంతర్జాతీయస్థాయి వరకు అతణ్ని అనేక సంస్థలు సన్మానించి తమ సార్థకతను చాటుకున్నాయి.

షామంజిల్‌లో నాటి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు సమక్షంలో నాగార్జునసాగర్ కావ్యగానం (1955), శివరంజని గీత శ్రవణం, ప్రపంచ తెలుగు సభావ్యాఖ్యానం, రష్యాలో లెనిన్ మృతదేహ దర్శనం, తన కూతురు గంగ వివాహ సందర్భంగా విశ్వనాథగారు అడగకుండానే వ్రాసి పంపిన పద్యాలను చూసినప్పటి మధురానందం, 'కర్పూర వసంతరాయలు' కావ్యగానం ఎల్. పి రికార్డుగా అవతరించడం నారాయణరెడ్డి జీవితంలో మరిచి పోలేని కొన్ని ముఖ్యఘట్టాలు.

నారాయణరెడ్డి మానవతావాది. అభ్యుదయ దృక్పథంతో సాగే పురోగామి. సాయుధసమరాన్ని సమర్థించకున్నా ఆతడు ఆ విధానం వెనుకనున్న

త్యాగశీలాన్ని ప్రశంసించే గుణపక్షపాతి. సిద్ధాంతప్రచారస్వేచ్ఛలో విశ్వాస మున్న ప్రజాస్వామ్యహృదయం ఆతనిది.

నారాయణరెడ్డి మహితవ్యక్తిత్వాన్ని ఎందరో ప్రశంసించినారు. 'నవ్య గేయ మహాకవి', 'గేయకవి సమ్రాట్' 'పుంభావ సరస్వతి'. 'అభినవ కవి జలపాతం' 'ఆధునిక కవితా మహాప్రభువు' 'గేయ చక్రవర్తి' 'అభినవ కవి సార్వభౌముడు' 'గేయ భగీరథుడు' 'ఆంధ్ర రవీంద్రుడు' 'ధ్వని చక్రవర్తి' 'ప్రజాకవి' 'నవకవితా సమ్రాట్' 'చలనచిత్రకవి చక్రవర్తి' 'గేయ గంగాధరుడు' 'అభినవ జయదేవులు' 'రసజగన్నాథులు' 'నవరసాలమూర్తి' వంటి బిరుదులతో, ప్రశంసలతో సన్మానించినారు. అయినా బిరుదులకు పొంగిపోయే, బిరుదులకు పరిమితమయ్యే వ్యక్తిత్వం కాదాతనిది. స్తుతు లెన్ని చేసినా మతిపోగొట్టుకోక ప్రశంస భవిష్యత్ ప్రగతికార్యసాధనకు హెచ్చరికఅనీ ప్రాతిప క అనీ భావించి సాగిపోయే చైతన్యమూర్తి.

నారాయణరెడ్డి సాహిత్యాన్ని గూర్చి శ్రీ గురప్ప చౌదరిగారు సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసి పిహెచ్.డి పట్టా పొందినారు. నారాయణరెడ్డిగారి 'భూమిక'నుగూర్చి శ్రీ రావికంటి వసునందన్‌గారు ఎం.ఫిల్ పట్టం కోసం సిద్ధాంతవ్యాసాన్ని సమర్పించినారు. ఇంకా ఆతని సినిమాసాహిత్యాన్నిగూర్చి, 'విశ్వంభర' గురించి పరిశోధనలు జరుగుతున్నాయి.

కవిగా, పండితుడుగా, ప్రయోగశీలిగా, మేధావిగా, ఉపన్యాసకుడుగా, పరిశోధకుడుగా-చైతన్యమూర్తిగా-ఔచితీ విజ్ఞుడుగా—కార్యదక్షుడుగా ఆతని వ్యక్తిత్వం బహుముఖీనం.

నారాయణరెడ్డిసాహితీ మూర్తిని దర్శించి నా హృదయాన్ని ఆవిష్క రిస్తూ ఈ గ్రంథం వ్రాసినాను. ఇంకా ఆయనను గూర్చి నాకు తోచని నేను చెప్పని అనేకాంశాలు ఉంటాయనటంలో అసహజమేమీ లేదు. ఈతని గ్రంథం నారాయణరెడ్డి సాహిత్యవ్యక్తిత్వాలపట్ల ఒక అవగాహనను కలిగి స్తుందని భావిస్తున్నాను.

నారాయణరెడ్డి వ్యక్తిత్వసందర్శనాన్ని ఆతని గూర్చి మహాకవులు చేసిన ప్రశంసలతో ముగిస్తాను.

"నవరసాలమూర్తి నారాయణరెడ్డి కీర్తి"

డా॥ దాశరథి

"నీవు సుకవి జాతికెల్ల నిండు గర్వకారణము
నీ సాహితి తెలుగమ్మకు నిచ్చపచ్చతోరణము
నీ లేఖిని దౌష్ట్యముతో నిత్యము సేయును రణము"

డా॥ వానమామలై వరదాచార్యులు.

"ఇతడహంకృతిదూరజీవితము వలచి
నాఁచికొానె నాంధ్రజాతి మానసమునెల్ల
నితని మెచ్చుట తెలుఁగు భారతిని మెచ్చు
టని తలంతురు సత్యధర్మాభిరతులు"

-తెనుఁగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి

# సవరించి చదువుకోండి

| పుట | పంక్తి | ముద్రితమయినధోరణి | సవరణ |
|---|---|---|---|
| 3 | 19 | త్రస్త్రిగతులు | త్ర్యస్రగతులు |
| 5 | 1.7 | ప్రధమ | ప్రథమ |
| 8 | 23 | దాననత | దానవత |
| 9 | చివరిది | సంహింపలేకపోయిరి | సహింపలేకపోయిరి |
| 24 | 15 | భామాకలపాలతో | భామాకలాపాలతో |
| 27 | 7 | గార | గార్ల |
| 31 | 5 | అభ్వుదయ | అభ్యుదయ |
| 31 | 16 | వక్షస్థతి | వక్షస్థ్సలి |
| 32 | 7 | తెలంగాణమ్మ తమః | తెలగాణమ్మ తమః |
| 32 | 8 | మహోల్లాసము | మహోల్కాసము |
| 43 | 12 | యీ | ఈ |
| 43 | 13 | ప్రౌఢమను | ప్రౌఢిమను |
| 45 | 18 | మధనం | మథనం |
| 51 | 6 | తొడగి | తొడిగి |
| 52 | 25 | మనశ్శైస్శవం | మనశ్శైశ్శవం |
| 53 | 7 | అసమాన్య | అసామాన్య |
| 55 | 12 | కేవెలు | కేమొ |
| 69 | 22 | దృకధం | దృక్పథం |
| 72 | 8 | వచనాకవితలో | వచనకవితలో |
| 72 | 27 | మూకుళ్ల | మామిళ్ల |
| 72 | 27 | పశువుగా | పరశువుగా |
| 73 | 2 | పై భవాన్నే | పై భావాన్నే |
| 73 | 5 | నారాయణరెడ్డియోమో | నారాయణరెడ్డియేమో |
| 84 | 16 | ఆసఫీరు | ఆఫీసరు |
| 241 | 21 | కూఢా | కూడా |
| 249 | 16 | పాత్రు | పాత్రలు |
| 376 | 17 | హెదరాబాథ్ | హైదరాబాద్ |
| 376 | 19 | పికింద్రాబాద్ | సికింద్రాబాద్ |